పూసెజ్జ కర్తుఁబోనుగాఁ గనుపట్టు • రాతిరి మృత్యుపురాణ నెపఁగుఁ
బగలన్నఁ బగవాని పగిది వీరము చూపు • గీతాదికంబన్న భీతి పుట్టు

గీ. విడె మడలుగొల్పు పూఁదోఁట వెట్టిఁజేయుఁ
జెలులపైఁ గోపమొదవుఁ జాపలము హెచ్చుఁ
దల్లిదండ్రుల కిదిచెప్పఁ దప్పు, చెప్ప
కున్న సేగతినబ్బు నవ్వన్నెలాఁడు. 404

మ. అమరాగం బది కన్నుగానదు మనంబా! మిఱ్ఱుపల్లమ్ములన్
గన కెచ్చోటకునైన నేగు నిఁక వేడ్కల్ మించియుం జెడ్డయుక్
మునుపే నేరవు మన్మథుండు చపలాత్ముం డెంతయున్ మూర్ఖుఁ డం
గనలన్ లోఁకువఁజేసి మీఁదఁబడు శక్యంబే నివారింపఁగక్? 405

మ. మదనుం దిట్టఁగ రాదు కోయిలలతో మాఱొడ్డఁగా రాదు నె
మ్మది వారింపఁగ రాదు కోర్కెలపక్ మర్దింపఁగా రాదు దు
ర్మదముక్ గ్రిందుగఁ జేయ రాదు తనకామం బన్యులౌ వారితో
మొదలే చెప్పఁగ రాదు కష్టమకదా! పూఁబోఁడియై పుట్టుటల్. 406

క. కులకాంతనైన కతనం, గలుగదు స్వాతంత్ర్య మేమిగానున్నదొ! నె
చ్చెలి! వెలవెలఁబోక లేనో, ములునోఁచిరొ! వెట్టిమాటపోనీఁగదవే. 407

ఉ. అతఁడు రాజ్యహీనుఁడు వనాంతరవాసియు నంచు వింటిఁ బ్ర
ఖ్యాతులు రాజ్యసంపద లఖండముగాఁ గలరాజపుత్రు లీ
భూతలమందు లేరొ! వమబోటికి వారలు తగ్గవారు కా
రో! తరుణీ! యదేమొ యతఁడొక్కఁడ నామదిఁజిక్కిపొక్కెఁడున్. 408

క. అనృపుఁ డుండినయెడ నా, కానతి యిడె నొక్కవిప్రుఁ డట కేగుటకున్
మానసము తొట్రుపడు న, వ్వానికి నావంతఁ దెల్పునా రెవ్వరొకో? 409

చ. అలరెడివేడ్కఁ దండ్రియు స్వయంవరముం బొనరింపఁ డాయె నె
చ్చెలు లోకరైన బిట్టెనయుచింత వడంపఁగఁ జాలరైరి నా
కలఁ గనుపట్టి చెప్పినజగత్ప్రసు వాపరదేవియైన బా
ము లెసఁగఁజేయు నాకుఁగలమోహముమేర యెఱుంగ దక్కటా. 410

వ. ఇట్లు తదధీనచిత్తయై యక్కన్నెమిన్న యుండె, నట సుదర్శనుండు స్వప్నాదృ
వస్థల దన్మహామాయాసందర్శనం బొనర్చుచుఁ దదేకధ్యానపరాయణుండై కాలమ్ముఁ

బమ్ముచుండె వతనికడ కొక్కనాఁడు శృంగిబేరపురాధ్యక్షుండగు నొక నిషాదపతి యేతెంచి సర్వోపస్కరయుతంబును జతుస్తుంగయుక్తంబును బతాకాదిశోభితంబును నగు నొక్కరథం బుపాయనంబుగా నొసంగిన మిత్రభావమ్మునం గారవించి యయ్యెడి గైకొనియె. అట్టియెడ, 411

క. భారద్వాజాశ్రమగతు, లై రాజిలుమునులు వల్కి రాతనిఁ గని యో
వీరాగ్రేసర ! యిఁక భూ, భారధురంధరుఁడవగుమఁ బ్రబలెదవు గడున్. 412

ఉ. ఏ పరదేవతామహిమ మించుక గల్గినవారు పాపముల్
తాపము లాపదల్ గడచి ధన్యులు మాన్యులునై జగజ్జను
వ్యాప్యతులై చెలంగెదరొ ! భద్రవిధాయిని యామె ముఖ్యమౌ
ప్రాపని మట్టినీకు దురవాపము గల్గనె యుజ్జగమ్మునన్ ? 413

వ. అని మనోరమం గాంచి, 414

క. ఓ పీఠమాత ! విను పా, రావారపరీతమౌ మహారాజ్యశ్రీ
కేవల దేవీకృపచేన్, దావలమగు నీకుమారునకు సంధిల్లున్. 415

చ. అనిన మనోరమాసతియు నట్టులె మీవచనంబు నిక్క మౌ
ననఘచరిత్రులార ! యొకఁడైన సహాయము లేని నాతనూ
జున కెటు రాజ్యభారమది చొప్పడుఁ జెప్పుడనె మీనుడుల్ మహా
జనులగువారి దీవనలె సర్వము నిర్వహణం బొనర్చెడిన్. 416

క. ఈరదశదిశ లోకమైనను, మేదిని రజమైన జలధి మిత్తైన నగున్
భూదేవత లిడు నాశీ, ర్వాదములకుఁ దిరుగులే దవార్యము లగుటన్. 417

క. అని నెమ్మది యుబ్బఁగ నా, మని పేమముఁ గోరి యామనోరమయుండెన్
మనుఁడు సుదర్శనుఁడు జగ, జ్జననికటాక్షంబు తనకు సంతస మొసఁగన్. 418

ఆ.వె. అరథుఁ డు నెక్కి యలరెడివేడ్క వెం, దేనిఁ జనెడివేళఁ గానుపించు
దక్షమై తనర్చు నక్షౌహిణీసైన్య, మధ్యమం దెలర్చు మహిపుమాడ్కి. 419

ఉ. శోభనదాయియై సకలశోకవినాశకమైన కామరా
జాభిధబీజమున్ గురుదయావశతన్ దగ సంగ్రహించి శ్ర
ద్ధాభరితంబు గా నెపుఁడు తద్దయుఁ దజ్జప మాచరించు వాఁ
డాభగవత్యనుగ్రహము నంది పురందరవిన్నుతుం డగున్. 420

సీ. అంబార్చనాసక్తులగు వారలకుఁ గలు • గని శుభమ్ములు లేవు, కావరమున
నెవ్వ రంబార్చన నీసడింతురొ వారు • మాతృకాద్రోహులు మందమతులు
దుష్టులు రోగులు దుఃఖపీడితులును • గా నెఱుంగుము దేవమాననీయ
యై యాదిశక్తియై యపరు నాయంబయై • యఖిల జీవులయందు నలరుచుండు

గీ. బుద్ధి ధృతికీర్తి లక్ష్మిసమృద్ధి శక్తి • శ్రద్ధ స్మృతి లోనుగాఁగల సకలమగుచు
నామె నెఱుఁగనివారల యజ్ఞులనఁగ • నెఱుఁగువారల పండితు లెఱుఁగు మధిప!

ఉ. బ్రహ్మ మొదల్ పిపీలికలు పారముగాఁ గల జీవసంతతుల్
బ్రహ్మవచోభిధేయము నపార మనాద్య మమేయమౌ పర
బ్రహ్మము గాఁగ నే పరమపావని నే జగదంబఁ గొల్తు రా
బ్రహ్మముఁ దానెఱింగె నొకపాటి యనందగునే సుదర్శనున్? 422

శా. దేవారాధితయై మహామహిమయై దివ్యస్వరూపాఢ్య వి
ద్యావిద్యాకృతియై జగం బఖిలమున్ వ్యాకీర్ణమున్ జేసి స
ద్భావాతీతుఁ బురాణపూరుషుని సంభావించు నేదేవి యా
దేవిన్ గొల్చి సుదర్శనుండు సుఖమందెన్ రాజ్యమున్ బాసియున్. 423

క. శశికలయు నా సుదర్శన, వశగతహృదయ యయి వలపు పడ్డికిఁ బాలన్
గృశయయి భృశచింతనయై, యశనాయాదికము మఱచె నధిప వతంసా! 424

చ. కొమిరె విచారణాంశమును గొంత యెఱింగి సుబాహుఁ డాపెతం
డ్రి మురువుమీఱఁ బుత్రిపయి నెమ్మి దలిర్ప స్వయంవరం బొన
ర్ప మదిఁ దలంచి యెల్లనరపాలురకున్ దెలియంగఁ జేసె, న్యా
యమకద రాజపుత్రులు స్వయంవరమందు వివాహ మాడుటల్. 425

వ. స్వయంవరమ్ము నిచ్ఛాస్వయంవరంబు పణస్వయంవరము శుల్కాస్వయంవరము
నా మూఁడు తెఱంగులందు శ్రీరాముండు శివధనుర్భంగం బొనర్చి సీతం గైకొన్నది
పణస్వయంవరంబు తక్కఁగల రెండును బ్రసిద్ధమ్ము లందాద్యమగు నిచ్ఛాస్వయం
వరంబు చాటం బంచుడు, 426

ఉ. మాళవచోళమద్రవరమాగధవంగకళింగసింధుబం
గాళకరూశలాటకురుకాశమరాటవరాటగౌళనే
పాళవిదర్భబర్బరనృపాలకుమారకు లాసుబాహుభూ
పాలుని పట్టణంబునకు వచ్చి రనేకు లుదంచితస్థితిన్. 427

వ. అంతకు మున్న యన్నలినాక్షి తద్వృత్తాంతం బెఱింగి సఖింగాంచి కుంచితాస్యయై కమ్రగొనల నశ్రుబిందువుల మంతనంబున నిట్లనియె. 428

ఉ. నెచ్చెలి! నా మదిం గలుగు నెవ్వగ నెవ్వగ నాఁపికొందు? నా నచ్చిన చెల్మికాఁడు జననాథ శిరోమణి నాఁటిరాత్రి భూ భృచ్ఛయరాజపుత్త్రి కడుఁ బేరిమి నాకిడినట్టికోర్కె యు ద్యచ్చరితుండునై తగు సుదర్శనుఁదక్క నొరుణ్వరింతునే? 429

మ. ధనముల్ కాల్పనె? రాజ్యసంపదలు కాంతారమ్మునన్ జేర్పనే? గొన మందంబును జాతురీగరిమయుణ్ గూలంకషప్రజ్ఞ యె వ్వనికిం జొప్పడు వానిఁ గోరఁదగు నవ్వాఁడెన్నఁగా నా సుద ర్శనుఁడే యింతకు నొక్కొకండొకతెకుణ్ జక్కంగఁ గన్పట్టెడిణ్. 430

క. అని త్రిప్పరాని పేర్మిని, దనతోడం బల్కు రాజతనయవచనముల్ వనిఁగొని జననికిఁ దెల్పఁగఁ, జని యావైదర్భితోడ సఖి యిట్లనియెన్. 431

వ. అమ్మా! మన శశికల సుదర్శనుండను రాజపుత్త్రుండక్క నన్యుని వరింపనని నిశ్చయించుకొని యున్నయది 432

క. భారద్వాజాశ్రమమున, నారాజ తనూజువాసమఁట! యాతనికిన్ ధారాళముగఁ ద్రికుద్ధిగ, ధారాదత్తంబుజేసెఁ దననెమ్మనమున్. 433

వ. అనుడు వైదర్భియు నయ్యుదంతంబు తన పతికెఱింగించిన నతం డమ్మగువ కిట్లనియె. 434

ఉ. వాని నెఱుంగుదే చెలియ! వాఁడన రాజ్యముఁ గోలుపోయి య న్నావకు లేక కాననమునన్ మునిపల్లె వసించుఁ దల్లితోఁ బూని యుధాజిదాహ్వయుఁడు పోరునఁ జంపెను వీరసేను న వ్వానికతమ్మునన్ గడు నభాగ్యుఁడు వానికిఁ బుత్త్రి నిత్తునే? 435

క. కావున నచ్చఁగఁ జెప్పుము, నీవేగి తనూజ కిపు డనింద్యచరిత్రుల్ కోవిదులు భాగ్యవంతులు, వేవేలు స్వయంవరమున విడిసిరి నృపతుల్. 436

వ. అని భర్తపల్కిన పల్లెయని యావైదర్భి పుత్త్రికడ కరిగి బుజ్జగించి శిరమ్ము మూర్కొని తొడపై నిడుకొని యల్లన నిట్లనియె. 437

మ. ఫలమూలాశి వనప్రవాసి కృశుఁడున్ బంధువ్రజత్యక్తుఁడున్ బలకోశాదివియుక్తుఁ డెంతయును నిర్భాగ్యుం డతం డున్నతుల్

గలవా రూర్జితు లార్జితోత్కటయశః ఖ్యాతుల్ నరేంద్రాత్మజుల్
దలఁప న్నీకయి వచ్చిరందఱును సౌందర్యమ్మునన్ మన్మథుల్. 438

తరల. అల సుదర్శను తమ్ముఁడుంగా గడునందగాఁడు మహాబలుం
డలఘుఁ డాతఁడు శత్రుజిత్తు ధరాధిపత్యము గల్గు వాఁ
డెలమి నీకనుకూలుఁడై తగు నేతదర్థము కాదె తాఁ
గలన నీతనితాత చంపెఁ బగన్ గళింగధరాధిపున్. 439

క. అదియును గాక యుధాజి, త్తదనగు నెడ నితనిఁ జంపు నాకతమునసే
కద ! భారద్వాజునికడ, సుదర్శనుండుండు టరయ సుదతీ ! వినుమా ! 440

క. నీతండ్రి సుదర్శనునక, పేతవిభవుఁ డనుచు నిన్నుఁ బెండిలిసేయంగా
జేతోగతి వాంఛింపం, డాతలఁ పిఁక విడిచి పెట్టుమమ్మ కుమారీ ! 441

వ. అనుడు నక్కోమలి తల్లి కిట్లనియె. 442

చ. వనమున నుండుఁగాక తఁడు పట్టణమందు వసించుఁగాక ని
ర్ధనుఁడగుఁగాక మేటిధనధాన్యములం దులఁదూఁగుఁగాక నా
మన సలవానిఁ దక్క పెఱమానిసి నొల్లదు ధాతయైన పా
లవిహితమైన వ్రాఁతలకు లాఁతిగతుల్ పొసగింపనేర్చునే ? 443

క. శర్యాతి వచనమున మును, వార్య సుకన్యాభిధాన చ్యవనునిఁ గొని వ
ట్లార్యావచనమ్మున శుభ, చర్యు సుదర్శను వరింతు సత్యవ్రతనై. 444

క. కైతవ మెఱుఁగక భర్తకుఁ, జేతోమోదమున సేవఁ జేసెడి సతికిన్
బ్రీతియు స్వర్గము మోక్ష వి, భూతియునుం గలుగు నిక్కముగ నోతల్లీ ! 445

క. మచ్చిత్తభిత్తి భగవతి, విచ్చలవిడి వ్రాసె వానివిధమంతయు నా
నచ్చినవాఁ డతఁ డొక్కఁడ, పొచ్చెములేదిందుఁ గూర్మి పొసఁగె నతనిపై. 446

క. అని శశికల వివిధ విద, ర్శనములు చూపించి తనకు రమ్యుండు సుద
ర్శనుఁ డొక్కఁడ యని చెప్పిన, జననియుఁ బతి కెఱుఁగఁజేసెఁ జని సకలంబున్.

వ. అంత స్వయంవర మహోత్సవం బాసన్నం బగుడు శశికల సుదర్శనురామికిఁ జింతించి యత్యాప్తుండగు నొకవిప్రునింబిలిపించి రహస్యమ్ముగ నిట్లనుః నోయయ్యా ! మాయయ్య యెఱుంగకుండ భారద్వాజాశ్రమమ్మున కరిగి సుదర్శనుం గాంచి నా వచనమ్ములుగా నిట్లనుము. 448

ఉ. అంబ నినున్ వరింపుమని యానతి వాకిడె నామనంబు స
త్యంబుగఁ జిక్కె నీపయి స్వయంవరమౌ నిఁక నెల్లి; రాజసం
ఘంబు పురంబునన్ విడిసెఁ గాని త్వదాగమనంబు లేదు న్యా
యంబె యనాదరంబు విషమాంబకదర్శన! యో సుదర్శనా! 449

ఉ. నే నినుఁ దక్క నన్యుని గణింప వరింప మదిం దలంప నా
మేను నిజంబు నీయదిసుమీ వినుమీ! నను మానితేని నిన్
గానమి వహ్నిలోఁ బడుదుఁ గానియెడన్ విషమాహరింతుఁ బ్రా
ణానకు వెన్కఁజూతునని నన్ దలపోయకు ప్రాణవల్లభా! 450

చ. మనకుఁ బరాంబికాకృప సమస్తశుభమ్ములు గల్గు దైవమున్
మనమున నమ్మి రావలెఁ జుమా! శివకేశవముఖ్యు లేజగ
జ్జననికి వశ్యు లాజనని సత్యము దప్పనితల్లి యాపె వా
క్కును వితయౌనె నాథ! కయికొమ్ము ననుం బ్రతికించి పుణ్యమున్. 451

చ. అని వచియింపు మా నరవరాగ్రణి కిట్టులె యంచు శాస్త్రమా?
యనఘ! సమస్తమున్ దెలిసినట్టిమహాత్ముఁడ వీవు కార్య మే
యమవునఁ జక్కనౌనొ యటు లాతనితోవచియించి పున్నెమున్
గొనుము పరోపకారమునకున్ సమమైన విశేషమున్నదే? 452

ఉ. అక్కరుణాకరున్ గడు రహస్యమునం గను మట్లు కాంచి నా
చక్కఁదనం బొకింత వరసంబుగఁ జెప్పుము చెప్పి నాదు పె
న్మక్కువ మేరలేని దని మాటికిఁ దెల్పుము చేతు లెత్తి నే
మ్రొక్కితినంచుఁ బల్కుమిక ముంచినఁ దేల్చిన నీవ నావుడున్. 453

వ. తద్దత్తంబగు దక్షిణన్ గ్రహించి యాతండును సుదర్శను కడ కేగి సకలమ్మును వచియించి యతనిచే స్వయంవరమ్మున కేతెంచెదనని యనిపించుకొని తత్క్షణమ వచ్చి యక్కన్నెతో నంతయు నుడివె, నట సుదర్శనుండు స్వయంవర గమనోన్ముఖుండగుటయు, 454

క. తల్లి మనోరమ శోకం, బుల్లమ్మునఁ గడలుకొనఁగ నొగి గుండియలున్
జల్లన వల్లన నశ్రులు, వెల్లివిరియఁ బల్కె నిట్లు విహ్వలమతియై. 455

చ. పలువురు రాజు లున్నెడకు బాసట లేకయ పోఁ దలంచె ద
ప్పలుగు యుధాజిదాఖ్యుఁ డతివైరి నినుం గడతేర్ప నెంచి తా

వలయెడ కేగుదెంచు, నను నాత్మజశోకపరీతఁ జేయఁగాఁ
దలఁపకుమయ్య! నాపలుకు దబ్బఱసేయకు మయ్య నాపుడున్. 456

ఉ. అంబికయానతిన్ శిరమునం దిడి యేగెడి నాకు నెందు న
ద్దం బొకడుండునే? యొరులధాటకు జంకుమనే? మదంబ శో
కం బుచితంబె క్షత్రియకుఁ! గాఁదగుకార్యము కాకపోదు దుః
ఖంబును సౌఖ్యముం జగతిఁ గావడికుండలు ప్రాణికోటికిన్. 457

వ. అని తల్లికి ధైర్యంబు చెప్పి విషాదవత్తంబగు రథం బధిష్ఠించి చన నుద్యుక్తుం డగు కుమారుంగాంచి మనోరమ యిట్లనుఁ నోయన్నా! విజయార్థం బేగెడి నిన్ను నగ్రమ్మున నంబికయు వెనుకఁ బార్వతియు విషమమార్గమ్ముల వారాహియు దుర్గమ్ముల దుర్గయు ఘోరకలహమ్ములఁ బరమేశ్వరి యగు కాళికయు స్వయంవరిష్టున సౌమ్యయగు మాతంగియు భూపమధ్యమ్మున భవానియు గిరిదుర్గంబుల గిరిజయుఁ జత్వరమ్ములఁ జాముండయుఁ గాననముల సనాతని యగు కామగయు వివాదమ్ముల వైష్ణవియు శత్రుసమాగమమ్మున భైరవియు సర్వదేశంబుల జగద్ధాత్రియగు భువనేశ్వరియుఁ గంటికి ఱెప్పచందమ్మున రక్షింతురుగాత మని దీవించి మఱియును. 458

శా. అన్నా! విన్విడనాడి యియ్యెడ క్షణంబైనన్ వసింపంగఁ జా
లన్నిన్నున్ గనులారఁ గాంచికద కాలంబెల్ల హేలాగతి
న్విన్నాణంబుగఁ బుచ్చుచుందు నదియున్ విష్పంబుగావింప నీ
కు న్యాయంబె? రథంబుపై నిడి ననుం గొంపొమ్ము నీతోడుతన్. 459

వ. సుదర్శనుండు వల్లెయని ధాత్రేయీసహితంబుగఁ దల్లిని రథం బెక్కించుకొని శీఘ్రగమనమ్మునఁ గాశీపురమ్ము చేరిన సుబాహుం డెదుర్కొని తగినవిడిది యొసంగి యుపచారమ్మునకుఁ దగువారి వియోగించె దౌహిత్రసహితుండగు యుధాజిత్తును దక్కుఁగల రాజన్యులును సుదర్శనుంగాంచి తమలో నిట్లు ప్రశంసించుకొనిరి. 460

## సుదర్శనుండు స్వయంవరమున కేగుట.

ఉ. తా నిట కేగుదెంచెను సుదర్శనుడుం దగువానిభంగి రా
ట్సూనుల రాజరాజసుత సుందరు లందఱినిం దృణించి త
న్నీనళినాక్షి కోరునవియే మనమందుఁ దలంపఁ బోలు నే
మో! నగినట్టియూరు లగు నొక్కెడఁ బట్టణముల్ గ్రమమ్ముగన్. 461

క. అనిన యుధాజిత్తిట్లనుఁ, గనుఁడీ! మీరెల్ల నామకడిమి నిట సుద
ర్శనుఁ గడతేర్చెద ననవుడుఁ, బనిఁగొని యనుఁ గేకయాధిపతియాతనికిన్. 462

మ. ఇది యిచ్ఛావరణార్థ మేర్పడియె నయ్యేణాక్షి యిందొక్కరున్
మది కింపై తగువాని నంగభిపుసామ్రాజ్యమ్మునం గూర్చు న
య్యది తక్కుంగల యస్మదాదుల కపార్యం బట్లు కాదేని దు
ర్మదు లీరాజులటందు రెల్లరును మర్యాదావినాశంబుగన్. 463

చ. అది యటులుంచు న్యాయ్యమగు నాతనిరాజ్యము దుర్నయమ్మునన్
మొదల హరించి యిచ్చితివి ముద్దులమున్మని; కాతనిన్ వరిం
పఁదగదె? యీ సుదర్శనుఁడె పట్టముగట్టెనె! బేలరీతి నె
మ్మది నిటు కుందనేల వినుమా! యితఁడే వినుఁ జక్కఁ జేసెడిన్. 464

క. వినుమెన్నఁడేని ధర్మ, మ్మునకున్ జయమబ్బు సత్యమునకగు వృద్ధుల్
చనకుముదౌర్మార్గ్యమునకు, ఘనుఁడందఱి నేలువాఁడు గలఁడో! లేఁడో! 465

ఉ. అందఱిసిన్ వరింపదు కదా! యొకరాజతనూజ యిందఱున్
సుందరు లిందఱున్ మిగుల శూరు లుదారులు వీరిలోన నా
సుందరి యొక్కనింగొన నసూయమెయిన్ మనమెల్లఁ బోరినన్
వెందకు మూలమౌ నిది యనీతియొ! నీతియొ! నిర్ణయింపుమా. 466

క. అనఘ యుధాజిత్తను నీ, వనిన ట్లిచ్ఛాకృతస్వయంవర మిది యొ
క్కని ననవద్యచరిత్రుని, ననఘుని వరియించెనేని హర్షము మాకున్. 467

చ. వలువురఖండతేజులు నృపాలకుమారకు లుత్తమోత్తముల్
గలయెడ నెవ్వఁడో యొకఁ డగణ్యుఁడు కన్యఁ బరిగ్రహింప యో
గ్యులుగని యూరకుండుటదియున్ గడుయుక్తమె! సింహభోగ్యమౌ
పలలము నక్కకున్ విడువఁబాడియె! మేదని! నీతివాక్యముల్! 468

గీ. అగ్రజాతికి వేదమ్ము లధికబలము, చాపమెక్కుడుబలమగు క్షత్రియులకు
బలము గలవానిరాజ్య మీపడఁతిమిన్న, బలమ శుల్కంబు రాజవివాహములకు. 469

వ. అయ్యది సుదర్శనునకుం గలిగెనేని యతండు పరిగ్రహించు నితరులకుఁ గలదేని యితరులు వడయుదు రని యన్యోన్యకలహమ్ము లొనర్చు నవనీపతులకడకు సుబాహుం డాహూతుండై వచ్చుటయు. 470

క. అవనీపాలుర కెల్లను, వివాదము తటస్థమాయె వింటివికద ! యో
యవనీవర ! నీవియ్యెడ, వ్యవస్థనేర్పంచి వీరివా దడఁపఁదగున్. 471

వ. అన నతం డిట్లనియె. 472

చ. జనవరులార ! నాకొమిరె చాల సుదర్శనునిన్ వరింపఁగా
నవయము నెంచుచున్న దతఁ డర్హుఁడు గాఁడని యెంతచెప్పినన్
విన దతఁడున్ స్వయంవరపువేడుక వచ్చె బహూక్తు లేల దై
వనియతి కన్యథాకరణపాటవ మేరికినైనఁ గల్గునే. 473

వ. అనుడు నాతని చిత్తవృత్తి నెఱింగి సంపన్నులగు రాజన్యులందఱును సుదర్శనుం
బిలువంబంచి యిట్లనిరి. 474

ఉ. ఓయి నృపాలపుత్ర ! యిటకొక్కరుఁడై చనుదెంచి తీవు పే
నాయుతు లెందఱో నృపతినందను లాహవమాచరించి య
బ్జాయతనేత్ర నీశశికలాబ్జముఖిన్ గ్రహియింప మున్నవా
రీయెడ నీకుఁ జేయగల దించుకయున్ గనుపట్టనేర్చునే ? 475

శా. నీకుం దమ్ముఁ డఖండశౌర్యనిధి వర్ణింపంగ యోగ్యుండు లో
కైకస్తవ్యుఁడు శత్రుజిత్తును సహాయీభూతుఁడై తాతయున్
వీఁక న్నిన్ను వధింప నియ్యెడ కొగిన్ విచ్చేసియున్నారు నీ
రా కత్యంతము శోచనీయము కదా ! రాజన్యవంశాగ్రణీ. 476

గీ. ఎవరు పిల్చిరొ విన్ను ! నీ వేకతమున, వచ్చియుంటివో కలిగిన వాస్తవంబు
చెప్పితిమి మీఁద నీదగుచిత్తవృత్తి. కర్హ మగున ట్లొనర్పు మటన్ననతఁడు. 477

ఉ. వారలఁ గాంచి యిట్లను నృపాలకులార ! కృపాళులార ! మీ
పేరిమి యింతయొప్పునొకొ భీతిలియిప్పుడు లాభమేమి, నా
భారము దేవదేవి దిటఁ బంపిన దాజగదంబ నాకు నై
క్షీరమొ నీరమో యొకటి చేయదె శత్రులచేతి కిచ్చునే ? 478

చ. ఎలమి సమస్తమందుఁ బరమేశ్వరినే కనుఁగొందు నాకు శ
త్రులనుచు మిత్రు లంచుఁగలరో ! యలరారెడివేడ్క నంబ నా
కలఁగనుపట్టి పొమ్మనిన గన్గొన వచ్చితి నీస్వయంవరం
బలుక నెవండు వన్నెదురు నాతని కంబిక శత్రు వయ్యెడున్. 479

మ. బలమిచ్చుఁగా యశమిచ్చు సంపదలిడుఁగా బాలించుఁ దేలించు దు
ర్బలులం జేయు దరిద్రులం బొనరుచుం ఖండించు గుంజించు నే
యలఘుప్రాభవ యేజగజ్జనని యేయార్యామహాదేవి త
ద్బలమే నాకు బలంబు తక్కుబలమున్ బాటింప నే నెన్నఁడున్. 480

క. శక్తు లశక్తులు గలరే, శక్తియనుగ్రహము గల్గు జనులే శక్తుల్
శక్తికృపలేనివార ల, శక్తులు బ్రహ్మాదులైన జనవరులారా! 481

చ. జయమయినం బరాజయము సంభవమైనను నాకుఁ గాదు త
జ్జయ మజయమ్మునున్ యశ మనద్యశమున్ జగదంబ, కట్టి నా
కయి వగవంగఁ బోకుఁడు మహామహులార! దయాళులార! ని
శ్చయముగ నేను శక్తుఁడ నశక్తుఁడ నేమిటి కీవిచారముల్. 482

వ. అను నాతని వచనమ్ములకు సంతసించి కొందఱు రాజు లిట్లనిరి. 483

క. నీపల్కులెల్ల నిక్కము, భూవకులవతంస! నీవు పుణ్యాతుఁడ వెం
తో వగఁ బూని యుధాజి, ద్భూపతి యున్నాఁడు మఱచి పోయెదుసుమ్మీ! 484

వ. నావుడు సుదర్శనుండు రాజేంద్రులారా! మీకు నాయం దనుగ్రహం బింత యొప్పి నకతనం గదా యింతపట్టు నాకెఱిఁగించితిరి. దైవాధీనం బగు నీచరాచరాత్మక ప్రపంచంబున మృత్యువనునది తనంతన సంఘటించునుగాని యొకని నొకఁడు చంపువాఁడు లేఁడు. జీవుండు కర్మాధీనుండుగాని స్వతంత్రుండుగాఁడు. కర్మంబును సంచితవర్తమాన ప్రారబ్ధభేదమ్మున మూఁడుదెఱంగులై యొప్పుఁ గాలకర్మస్వభావ వ్యాప్తంబగు నీజగంబునఁ గాలంబాసన్నంబుఁ గాదేని దేవునకైనఁ జంపఁనశక్యంబు. కాలవశంబున మృతులగుప్రాణులకు యముండు నిమిత్త మాత్రంబుగా నెఱుంగునది. సింహంబు కతన మజ్జనకుండును యుధాజిత్తు కారణంబున మన్మాతామహుండును మృతులగుటయు నిట్టిదకా తెలియుఁడు. తానెంత ప్రయత్నం బొనర్చినను దైవయోగంబు మూఁడినఁ జావక తీరదు. 485

గీ. ఎవ్వఁడో తన్ను రక్షింపనేల? దైవ, బలమొకటి తప్పకుండిన వాఁడు శత్రు
భయము రోగాదిభయమును బాపి వేయి, వత్సరమ్ములు జీవించు నంత తగునె?

క. శుభమును నశుభమును నీ, యుభయమును బురాకృతమున నొదఁగూడును దా
ను భయంబందినఁ దప్పద, మభవించియ తీరవలయును నరుల కెల్లన్. 487

గీ. తా నొనర్చిన కర్మంబు తనకుఁ గష్ట, మొసఁగుతఱి తెల్విగలవాఁడు వ్యసనపడఁడు
అన్యు లపకారమును దన కాచరించి, రనుచు నజ్ఞుండు వైరమ్ముఁగొని కృశించు.

ఉ. దైవము నమ్మి వచ్చితిని దైవమ సైన్యము తోడు నీడయున్
దైవమ తల్లిదండ్రులును దైవమ వైరియునాకు సర్వముం
దైవమ తద్బలంబు సుఖదాయియొ కష్టము నిచ్చునట్టిదో
భావిఫలం బెఱుంగ మనపాటి మనుష్యుల కర్హ మెట్లగున్ ? 489

గీ. అయ్యుధాజిత్తు సుఖములనందుఁ గాక, యతఁడు శత్రుండుగాఁడు నే నతనికైన
నగుదుఁ గాక మఱేమి, లోకైక జనని, కలదు నా పాలిటికిఁ గల్పకంబు పగిది.

వ. అనుడు నెల్లరు నంతసించిరి. సుదర్శనుండును దన యెడ కరిగి సుఖంబుండె. మఱునాఁడు సుబాహునిచే నాహూతులై రాజన్యులందఱును దదాస్థానమ్మున విమాన సంగతు లగు నమరులంబోలె మంచంబుల నధిష్ఠించి శశికలాగమనమ్మున కెదురు చూచుచు నక్కలికి యెవ్వని వరించునో యని సందేహించువారును సుదర్శనుం దక్క నొరుల వరింపదను వారలును నట్లైన నన్యోన్య కలహంబు దప్ప దనువా రును నై యుండునెడ, 491

ఉ. మంగళ వాద్యముల్ సెలఁగ మజ్జనమాడి విభూషితాంగియై
యంగజుపూవు బాణమన నా లలితాంగియుఁ బట్టు పుట్టమున్
రంగుగఁ గట్టి యొప్పుగఁ గరంబునయందు మధూకమాల వ్రే
లంగ నృపాలపుత్రులు కలంగఁ జెలంగి సఖీసమేతయై. 492

వ. తత్ప్రభాసితమ్మున నొక మణిస్తంభంబు చాటునఁ దలవంచుకొని చింతించుచున్నం గని స్మితపూర్వకంబుగ సుబాహుం డిట్లనియె. 493

శా. అమ్మా! కన్గొనుమమ్మ! రాజసుతు లత్యంతోన్నతుల్ మేటిరూ
పమ్మందుం మదనుల్ యశోన్వితు లతిప్రౌఢుల్ వినుం గైకొన
న్నెమ్మి న్నేఁడిట వచ్చియుండి రొకరుం బీకిష్ట మౌవాని నే
ర్కొమ్మా! రూపవయఃకులోన్నతి కలాకూలంకషాలంకృతుం. 494

వ. అనుడుఁ దండ్రికి నక్కుమారిక యిట్లనియె. 495

ఉ. కాముకు లున్మదుల్ శఠులు కశ్మలచిత్తులు పాతకుల్ జగ
త్స్వాములు వీరియగ్రమున సాధ్వులు వర్తిలరాదు "సాధ్వియా

భామిని భర్తఁ దక్క నొరుఁబాలుఁగఁ జూడఁగ రా" దటంచు వి
ద్యామహితుల్ వచింతు రిది ధర్మ విరుద్ధ మొనర్ప నేర్తునే ? 496

క. పలువుర దృగ్విషయంబై, కులకన్యక చనిన దానికొఱ కెల్లరుమం
దలపోయుదు రెల్లిదమగు, వెలపొలఁతుకభంగి దానివిభవంబెల్లన్. 497

ఉ. మాలిక చేతఁ బూని తగుమానినిభంగి స్వయంవరస్థలం
బేలలితాంగి త్రొక్కు నదియే వెలభామిని వేఱ యున్నదే
చాలగనున్న యానృపతిసంఘములోఁ జొఱఁబాఱ నాకుసుం
బోలునె తండ్రి! యేను వెలబోటినె యిప్పని నాచరింపఁగన్ ? 498

క. ఏను సుదర్శను సొమ్మౌ, దానన కద! సభకు నేగి తక్కొరుఁ జూడం
గానేమి మానమున కవ, మానం బొనరింపఁ దగునె మానిని నయ్యున్. 499

మ. వసుధల్ పట్టిన భూమి ప్రక్కలయినన్ భాస్వంతుఁ డస్తాచల
మ్మున నావిర్భవమందినన్ శశికుహూస్ఫూర్తిన్ బ్రవర్తించినన్
నేను మే నల్లసుదర్శనున్ విడిచి పృథ్వీనాథు వేఱొక్కనిన్
గన మద్దానిఁ బేర్కొనన్ మనమునన్ గాంక్షింప ముమ్మాటికిన్. 500

క. కావున నాతనికి నను, న్నీవిచ్చి వివాహ మెల్లి నేఁటఁ దగు గతిన్
గావింపుము కాదేనిన్, జీవితమున కిపుడ విడుతుఁ జేరెఁదునీటన్. 501

## సుబాహుఁడు చింతించుట.

వ. అనువచనంబు లాలించి సుబాహుం డితికర్తవ్యతామూఢుండై తనమనమ్మున, 502

ఉ. వచ్చినవారు రాజు లనవద్యచరిత్రులు వేనవేలు వీ
రిచ్ఛకమాడినన్ వెడల రేమియొనర్తు ? మదాత్మజాతకు
న్నచ్చిన యాసుదర్శనుఁడనన్ బలహీనుఁడు, నాకు వీరిచేఁ
బచ్చుట సంభవించె నిది శత్రువు పుత్రిక గాదు గా! తుదిన్. 503

వ. అని గొండొకసేపు విచారించి ధైర్యమ్ము దెచ్చుకొని పలువురతో గలహించుట
యెట్టిబలవంతునికేనిఁ దగదని వారినొప్పించువాఁడై వినయవినమితుండై బద్ధాం
జలిపుటుండై దీనుండై దగ్గఱఁ జని యిట్లనియె. 504

ఉ. ఓనరపాలురార! కరుణోదధులార! మహాత్ములార! నా
పై నెనరుంచి నాదుపొరపాటు క్షమించి యనుగ్రహించి నా

మానముఁ బ్రాణమున్ మిగుల మన్ననఁ జేసి యొసంగి కూర్చున
న్మానముల౯ గ్రహించిచనుమానమునన్ దయసేయు టొప్పగున్. 505

ఉ. ఎన్నివిధంబులన్ వినిచి యే బతిమాలిన వారిఁ దక్క మా
కన్నియ యన్యునొల్ల నని గట్టిగఁబట్టుమ బట్టియున్న దే
మన్నను మాఱువల్క దది యన్నెముఁ బున్నె మెఱుంగనేర ద
న్నన్న ! మదర్థమై శ్రమమునందితి రిందఱున౯ వృథాగతిన్. 506

మ. కరులన్ రత్నములన్ దురంగమముల౯ గ్రామంబులన్ గాంతలన్
సిరుల౯ సౌధములన్ మహాంబరములన్ శ్రీమించుపూఁదోఁటల౯
ధరణీరాజ్యమునెల్ల నిచ్చెదను నాతప్పొప్పులన్ సైఁచి కూఁ
తురుగా నాదుకొమార్తనెంచి నను విద్విష్టున్ బొనర్పందగున్. 507

స. అని బహుభంగులం బ్రార్థించు నాసుబాహున కొక్కరును మాఱాడక మిన్నకుం
డిరి. యుధాజిత్తు క్రోధతామ్రాక్షుండై పండ్లు పటపటఁ గొరుకుచు నిట్లనియె. 508

ఉ. ఏమివచించెదీవు మది నింతవివేకము లేక పుత్రిక౯
సోమరివై సుదర్శనుని సొమ్ముగఁ జేయఁదలంచి యోగ్యుల౯
భూమివరేణ్యులన్ వెడలిపొమ్మనలేకిటు నక్కజిత్తులన్
వేమఱు పన్నినన్ దెలియనేరమె తక్కొరు లంత మూర్ఖులే. 509

చ. మొదలన నందియుం బయిన మూర్ఖుఁడవై యిటులెల్లర౯ వృథా
విధిమెయిఁ బిల్వఁబంచి పలవించినఁ బోవునె ! నన్నుఁ జూడు నీ
మదమడఁగించి చక్కడఁచి మందుని నింద్యుని నీసుదర్శనున్
బదిలము చేసి మన్మనికిఁ బట్టముగట్టెద నీకుమారికన్. 510

క. అనిలో నాకొక్కసుద, ర్శనుఁ డుబ్బో ! యూరుఁగాయొ ! సకలనరేంద్రుల్
పసిగొని యెదురుకొనిన నొ, క్కనిమిషమునఁ జక్కడంపఁ గలనెఱుఁగవొకో.

శా. భారద్వాజ ఋషిం గణించి మును తత్త్రాణం బుపేక్షించితి
న్వీరుల్ వీరలుమెచ్చ నేఁడడఁతు నీనేర్పింకఁ జాలించి యా
వీరేజాక్షిని నాదుమన్మనికిఁ బెండ్లిం జేసి రక్షించుకొ
మ్మీ ! రాజ్యంబు మదాశ్రయంబుకలిమి౯ మేలెంచి కీలెంచుమీ. 512

తే.గీ. రాజ ! 'పిత్రాశ్రయోవకర్తవ్య' యనఁగ. వినవొ ? యేమని యీ సుదర్శనుని కిత్తు
నాత్మజాతను; మహదాశ్రయంబు గోరి, తేని నామనుమని కిమ్ము మానవేంద్ర !

క. ఒక్క సుదర్శనుఁ దక్కఁగఁ, దక్కొరుల వరించెనేనిఁ దగులాటంబుల్
పొక్కవు మంటపమునకున్, జక్కఁగ నీతనయఁ బిలువఁ జనుము నృపాలా!

వ. అని పల్కినయ్యుధాజిత్తున కుత్తరం బీనేరక కాశీరాజు చింతాక్రాంతుండై తలవంచుకొని యంతఃపురమ్మున కరిగి భార్యం గాంచి యిట్లను "నోతరుణీ! యెట్లైన సుదర్శనున్ విడిచి మనకన్నియ యన్యుని వరించు నట్లొనరింపవలయుఁ గాదేని మానంబు దక్క" ననవుడు వల్లెయని యామె శశికల పాలికిం జని మెల్లన నిట్లనియె. 515

ఉ. అమ్మరో! యీసుదర్శనునికన్న బలాఢ్యులు రూపవంతులున్
సొమ్ములు గల్గువారలును జూడఁగ వేలకొలంది వచ్చి ర
ర్థమ్మును బ్రాణమానములు దక్కవిఁ గాతవిఁ గోరితేని మా
యమ్మ! వినంగదమ్మ! పదవమ్మ! స్వయంవర రంగభూమికిన్. 516

క. వినుము సుదర్శనుఁ గోరిన, ఘనుఁడు యుధాజిత్తు వానిఁ గడతేర్చి క్షణం
బున నిన్ను నన్ను నీ జన, కుని నట్లొనరించు నంత క్రూరుఁడుఁ గలఁడే. 517

క. అని నయమున భయమున న, వ్వనజముఖికిఁ దెల్పి నా యవసరంబునఁ ద
జ్జనకుఁడు సుబాహు భూపతి, చనుదెంచి మఱియును జెప్పెఁ జనువున బలిమిన్. 518

క. విన నా శశికలయును దా, నసిధారావ్రతము పూని యగ్ని నుఱికెదన్
విసమున్ మెసవెద నన్యుఁడు, విషమాంబకుఁడైన నొల్ల వేయేమిటికిన్. 519

చ. వినుము నృపాల! నా మనవి వీరలకున్ మది జంకెదేని న
న్నమపుగ నా సుదర్శనున కర్పణఁజేసి రథమ్మునందు మ
మ్మునిచి మహోత్సవం బలర నూరికి నావల విడ్వు మట్లొన
ర్చిన నెదిరించు శత్రుల హరింపఁ గలాఁ డతఁ డాహవమ్మునన్. 521

వ. అను పల్కుల కతం డిట్లను. 521

చ. పలువురితో విరోధమది బ్రహ్మకునైనఁ దరంబుగాదు నా
పలుకు గణించి పంతమును బట్టకు మెవ్వరికైన సాహసం
బలవడ దన్ని కార్యములయందును "వెఱ్ఱి యడంగె రోఁకలిన్
దలకును జుట్టుమం" చనువిధమ్మునఁ బల్కెదురమ్మ పుత్రికా! 522

చ. వదలుమటంచుఁ జెప్పెదవు వారలు వీరలు వైరయుక్తులు
న్మదులు నృశంసు లెల్ల నరనాయకులన్ మిముఁజుట్టి యేకమై

కదిసిన మీరొనర్పఁగల కార్య మొకించుకయేని లేదు నా
మది యెటులొప్పు దుర్మదులు మానక యెంతకునైన నొప్పరే ? 523

వ. నా కొక్క యుపాయంబు దోఁచుచున్నయది. మున్ను సీతావివాహమ్మున జనకుం బలెఁ బణం బేర్పఱతు నట్లైన నిర్వివాదంబుగ సమర్థుఁడగు వేరొకడుగాని సుదర్శనుండుగాని విన్నుం గైకొను ననుడు శశికల యిట్లను నోయయ్యా! సమర్థుండైనఁ గాకున్న నాకు సుదర్శనుండ భర్త కాని యన్యుండు గానేరఁడు. 524

ఉ. ఈవు పణంబు నేర్పఱచితేని ధనాంగనరీతి నేనునుఁ
గావలె వీరికిఁ సమముగా వశనై; యొకఁడెవ్వఁడో నను
జేవ గలాఁడొ వేఱొకఁడొ చేకొను నప్పుడుమాత్ర మెల్లరుఁ
భూవిభు లూరకుందురె ? సముద్ధతు లెంతురె ధర్మపద్ధతుల్. 525

క. ఏవిధినైనను గలహము, భావియ లోకైకజనని భావించి నను
దేవేరిగ నొవరింపు య, థావిధిగ సుదర్శనునకుఁ దలఁకకుమింకన్. 526

వ. స్వయంవర మంటపమ్మున కరిగి రాజులం గాంచి యుపాయమ్ముగ నిట్లనుము. "నేటిదినమ్మున కీ సభం జాలింత మెట్లైన నీ కార్యంబు నెల్లి సమర్థించెద నిది నిక్కువ" మని యవ్వారిని విడిదల కంపించి యీరేయి గుప్తంబుగ నాతని రావించి విధివిధానంబుగ నన్ను సమర్పింపుము. మీఁద నాతండు నన్నుఁ దన రథంబునం దిడికొని వోవనేర్చు రాజులు సంగరోన్ముఖులై దుర్మదమ్మున నడ్డుపడి రేని యస్మదుపాసితయగు శక్తియ నివారించుఁగాక. కాదేని సుదర్శనుతోడి లోకంబ నాకును జేకుఱునింత నిశ్చయంబని మఱియును, 527

క. ఒసఁగిన నొసఁగుము విధిగా, నొసఁగంగా నేరవేని యొగి నాయంతన్ బ్రసవశరుఁడు సాక్షిగ దే, వి సహాయగ నతని వెంట వెడలెద ననుడుఁ. 528

## శశికలావివాహము.

వ. సుబాహుండును గుప్తంబుగా సుదర్శనునకు వివాహంబు సేయం దలంచి చని సభ్యుల కిట్లను. నేఁటి కీ సభ చాలింతము రేపు భవదిచ్ఛామ సరణంబుగ స్వయంవరంబగుఁ దడవొనరింపక ప్రకృతము విడుదులకు దయసేయుం డనుడు వందీకరించి రాజమ్యులందఱును శిబిరమ్ముల కేగి పురంబు వల్గడల రక్షకుల నియోగించి సుఖంబుండి రంత నతండును వివాహంబునకుఁ దగు సంభారం బొనరించి

యార్ఘ్యల రావించి యొరులెఱుఁగకుండ సుదర్శనుని బిలిపించి మంగళ స్నానాది కృత్యంబులు నిర్వర్తించి యరుపుర నేకవేదిఁ గ్రే పేయఁ జేసి యాచమనీయార్ఘ్య పాద్యమ్ము లావరించి యనర్ఘవస్త్రద్వయం బొసంగి మధుపర్కంబిడి గోవును సమర్పించి కుండలమ్ము లలంకరించి విధివిధానమ్ముగఁ గన్యాదానం బొనరించె.

ఉ. అంత సుదర్శనుండు దగ నాలలితాంగి సుధాకరాస్య సు
స్వాంత ననంతరమ్యగుణ నంబుజపత్రవిశాలనేత్ర ని
శ్చింత రమానమజా హరి శచీపతిఁ బోలె గ్రహించె మేదినీ
కాంతుఁడు గాశిరాజు పలుకానుకలన్ దనియించె నల్లునిన్. 530

ఉ. పిమ్మట నెచ్చెలుల్ గదిసి పేర్మి మెయిజా దళుకొత్తు బంగరుం
బొమ్మయుఁ బోని యానృపతిపుత్రిక నెత్తి యలంకరించి పొం
కమ్మగు యానమందు నెసకమ్మున నుంచి యు మంటపమ్ము మ
ధ్యమ్ము నలంకరించిన సుదర్శనుపాలికిఁ దెచ్చి రిమ్ముగజా. 531

వ. అంత పురోహితుండు నగ్న్యాధానం బొనరించి లాజావిసర్గంబు నిర్వర్తింపఁజేసి ప్రదక్షిణాదికం బొనరింపఁ జేయుచుఁ గాశీరాజు సంతుష్టాంతరంగుఁడై సర్వోప స్కరయుతంబు లగు రెండువందల రథమ్ములను నానాలంకారయుతంబులగు ననే కసహస్రమ్ములను విహంగమరాజవేగమ్ములగు తురంగాయుతమ్ములును గ్రమేళక శతంబులును కాంచన భూషితంబులగు దాసీశతంబులును వివిధచిత్రవిచిత్రంబు లగు వాసగృహమ్ములను పూఁదోటలను బ్రకటమ్ము లగు శకటమ్ములను తక్కుం గలుగు నానావిధవిశిష్టపదార్థమ్ములను సుపాయనంబుగా నొసంగి యల్లునిఁ గారవించి వియ్యపురాలగు మనోరమం గాంచి విహితాంజలిపుటుండై యిట్లనియె. 532

క. అమ్మా ! యీసుత నీసుతు, బొమ్మయి నప్పు డిఁక నీదుసొమ్మననేలా
నెమ్మిగలిగి యెంతయు గా, రమ్మున నేలొమ్మ నే గరములు మొగుడ్తుజా. 533

వ. అనుడు మనోరమ సంతోషపూర్వకంబుగ నిట్లను. 534

గీ. ఇంతకన్నను వృద్ధిచే నెవఁగుమయ్య, రాజ్యహీనుండవక మహారాజవయ్యు
విచ్చితివి మత్కుమారున కిగురుఁబోఁడి, రత్నపుంబొమ్మవోని గారాపుఁబుత్రి. 535

ఉ. ధీరులయందు సత్తముల ధీవరులందుఁ గృపాళులన్ మహో
దారుల వీరులన్ మఱియు ధర్మ్యుల మాన్యుల సభ్యులందు నిం

కేరు భవత్సమానులు ? మహీంద్రమహేంద్ర ! సుబాహుభూప ! మా
కారము నీది నీ కొమరెకారము మాయది నేటివారమే. 536

ఉ. ఏరికినైనఁ బుత్రికలనిచ్చెడిచో ధనధాన్యసంపదా
ధారవిహార పుష్పవనతల్పము లాదిగఁ గల్గుభాగ్య వి
స్తారము నెంతు రెంతటి వదాన్యశిరోమణు; లట్లుఁ గాక సా
ధారణు మత్కుమారకు సుతాపతిఁ జేసితి వింత యొప్పునే. 537

మ. ధనధాన్యంబులు గల్గి యెక్కుడగు విద్యాబుద్ధులం బొల్చి వ
ర్తనలం బెద్దలమెప్పుఁ గాంచిన మహాధన్యాత్ములో రాజనం
దనులన్ జూడక నీకుమారి తనయంత న్నాతమూజాతు వి
ర్ధనునిం గోరుట కేను మెచ్చ నిమ నాంతర్యమ్మునవ్ మెచ్చెదన్.

538

వ. అనవుడుఁ బ్రీతుండై సుబాహుండు "దోయమ్మా ! నీకొమరుండు రాజ్యవిహీనుండని
విచారింపనేల ? మద్రాజ్యం బఖిలం బతనిది కాదే" యని మరియును, 539

శా. నారాజ్యం బఖిలంబు నిచ్చెదను సేనానీత్వముం బూనెదన్
నీరాజ్యం బిది యేను సేవకుఁడ నా నీభేదమేలా ? పయో
నీరన్యాయమునన్ వసింపుదము మన్నీలున్న వారింకఁ ద
ద్వైరం బెట్టులొ సామదానములనో వారింతు భేదాననో. 540

క. ఆమాఁట బక్కఁబడరే, వేమాయెన్ సంగరంబె యే నొనరింతున్
బో ! మానిని ! జగదంబిక, యే మన కన్నిఁటికిఁ గలఁ ది కేటికిఁ జింతల్. 541

వ. నావుడు మనోరమ యిట్లను. 542

ఉ. నీవచనంబుచేతవ జనించె ముదంబు మదంబ నీకు సౌ
ఖ్యావహయయ్యెడున్ సుఖములందుము పుత్రులతోడఁగూడి యీ
భూవలయంబు నీవ తగుపోషిమి నేలుకొనంగదయ్య ! మ
ద్దేవియ మత్కుమారునకుఁ దెచ్చి యొసంగును దండ్రిరాజ్యమున్. 543

చ. కరమున మన్నుపట్టి నది కాంచనమౌఁ దనయత్న మింతయుం
బొరయకయే సమస్తము బూర్ణమగున్ బ్రజలందఱున్ మహా
దరము వహింత్రు నెమ్మది ముదమ్మునఁ బొంగు సమస్త కార్యమున్
వరిపడు నొక్కపెట్టి గ్రహచారము చాలిన యప్పుడేరికిన్. 544

ఉ. చింత యొకింత లే దఖిలజీవులకున్ సుఖవేళఁ గష్ట మొ
క్కింతయు రాదు కష్టమున నించుకయుఁ గా సుఖమబ్బఁ బోదు లె
మ్మింతకు నాతనూజునకు నిప్పటికాలము మంచిదౌట నా
వంతయు నంతరాదిఁకఁ బ్రియోత్సవ మొనర్పుము కూఁతు నంపఁగన్. 545

వ. అని యన్యోన్యకష్టసుఖప్రచారమ్ముల నారేయిఁ గడపుచున్నంత నగరమ్మున విడిసి యున్న రాజకుమారులు మంగళతూర్యాదినిస్వనమ్ము లొక్కింత యాలించి, 546

ఉ. కొందఱిదేమి హేతువనుకొందురు కొందఱు పెండ్లికాల మీ
చందమునం జెలంగు నని సందియమందరు కొంద ఱీనృపుం
డందఱ మోసపుచ్చి తనయాత్మజ నాతనికిచ్చి పెండిలిం
దొందరగా నొనర్చె నీవినోదము గాఁదగు నందు రిమ్మెయిన్. 547

ఉ. అంతటఁ గాశిరాజు వినయమ్మున రాజులఁ బిల్వ నేగ భూ
కాంతులయుం దొకండయిన గౌరవమున్ బొనరింపఁ డంతయున్
స్వాంతమునం దెలింగియు సుబాహుఁడు వెళ్ళెలఁబోక "యో ధరా
కాంతులు! పెండ్లి విందునకుఁగా దయసేయుఁడు మీర లెల్లరున్. 548

క. నాపుత్త్రి యెంత చెప్పిన, మావలుకుల వినక తనదు మది కెక్కిన యా
భూపతిసూను సుదర్శను, నే పెండిలియాడెఁ జెప్ప దేమి యొనర్తున్? 549

తే.గీ. మిమ్ము నియ్యెడ దయఁజూపి మించుపేర్మి, నించి నా గౌరవము దక్కించుపొంచె
వేడుకొనియెద" నావుడు వేఁడుచెల్లఁ, దలఁచి శంకించి యీరీతిఁ బలికి రతని. 550

క. భోజనములాయె నౌ కరుణ, రాజా! రాఁజాల రకట! రాత్రి వివాహ
శ్రీ జరపి బడలియుంటివి, భోజనమున కేమి! పొమ్ము పోదుము మేముఁగా. 551

వ. నావుడు సుబాహుండు వారలభావంబు గ్రహించి శంకయించుచు, నగరికరిగె నంత నారాజులలోఁ గొందఱు సుదర్శనుం జంపి కన్యకన్ గైకొందమనువారును నది న్యాయంబుగాదు మిన్నక యుత్సవంబు నాలోకించి పోవుదమనువారును మఱియు నానాప్రకారంబులఁ బ్రసంగించువారునునై యాయామార్గమ్ములం గాచియుండిరి. సుబాహుండు తక్కుఁగార్యంబుల సలక్షణమ్ముగా నెఱవేర్చి యల్లుని సతీసమేతమ్ముగా సంపువాఁడై పారిబర్హం బొసంగుచున్నంత. 552

## సుదర్శన యుధాజిత్తుల యుద్ధము.

క. దూతలువచ్చి సుబాహున, రాతలపతి కిట్టులనిరి రాజా! నీ జా
మాత విభుఁ జంపఁబోకు మ, రాతులు గలరయ్య త్రోవ రక్కసుల క్రియన్. 553

వ. నాపుడు సుబాహుం డంతకుమున్ను రాజులచందం బెఱింగిన వాఁడగుటం జేసి సంశయించుచుండ సుదర్శనుం డిట్లనియె. 554

చ. నృపవర! వారలేమి యొనరింపఁగలా రొవరించిరేవి స
త్కృపగల తల్లి యా జగదధీశ్వరి నాకు సహాయభూతయై
రిపుల వధింపకున్నె తగురీతిఁ బ్రయాణమొనర్పుమయ్య మా
తపసుల యాశ్రమమ్మున ముదంబున నుండెదమయ్య! తద్దయున్. 555

మ. తగువాసం బిది గాదటంచు మదిఁ జింతం జేయఁగాఁబోకు మొ
ప్పగు మా యాశ్రమమందు దివ్యమణి దీవ్యత్కందరాజాతమా
సొగసుం గుల్కెడి బావులా చెఱువులా సొంపారుపూఁదోఁటలా
నగరుల్ మీనగరంబులుం దగవు విన్నాణంబునన్ దానికిన్. 556

వ. అవ్వుడుఁ గాశిరాజును నసంఖ్యమ్ముగా ధనం బొసంగి సతీసమేతంబుగా నంపుచుఁ దాను బలసమేతంబుగాఁ బిఱుందన వెడలె. 557

ఉ. అంత సుదర్శనుండు దనయంకమునందలి కాంతతో రతీ
కాంతుఁడు వోఁగ నిర్భయముగాఁ జనుదెంచెడివేళ రాజు ల
త్యంత "మదే రథం బదె సుదర్శనుఁ డేగెడుఁ గాంతఁ గూడి మీ
పంతములెల్లఁ జెల్లఁ జని పట్టుఁడు కొట్టుఁ" డటంచు రేఁగినన్. 558

వ. సుబాహుండు వారల కడ్డపడియె నంత సుదర్శనుండు నిశ్చలచిత్తమ్మున నేకాక్షరమ్మగు కామరాజమహామంత్రంబు జపించుచు నంబాపదసరసిజంబులు మనంబున గుఱి కొల్పియుండె వాలోనన యుధాజిత్తును శత్రుజిత్తున్ దాఁకిన. 559

ఉ. వీఁక సుబాహుఁ డాత్మభుజవీర్య మెలర్పఁగ శంఖదుందుభి
ప్రాకటరావముల్ చెలఁగ బాణపరంపరలన్ యుధాజిదా
ఖ్యాకు నెదిర్చె నిర్భర కబంధముగాఁ బొనఁగెన్ రణంబు! వి
శ్రీకృత వంబపై మనము వెట్టె సుదర్శనుఁ డప్పు డొప్పుగన్. 560

ఉ. దారుణరీతిగా రణము తద్గతి నొప్పుచునుండ దీవ్యదా
కారముతో మహాయుధనికాయముతోఁ దగువల్వతో నలం

హారముతోడఁ గల్పసుమకాండ పరీవృత దివ్యమాలికా
భారముతో మృగాధిపతివాహనయై జగదంబ గ్రక్కునన్. 561

వ. ప్రత్యక్షం బగుడు సుదర్శనుండు హర్షపులకితగాత్రుండై మామకుం జూపుచు, 562

ఉ. ఇంక భయమ్ము చెంద మన కేమిటి కంచు రథమ్ము డిగ్గి యే
ణాంకముఖీ లలామ యగు నంగనతోఁ దనమామతోడ ని
శ్శంకఁ దదంబికాంఘ్రి జలజమ్ములకుం బ్రణమిల్లె నేన్గులా
తంకము చెంద సింగము మహాధ్వాన మొనర్చె నమానరీతిగన్. 563

వ. మఱియు ఘోరవాయువులు వీచె దిక్కులు మిక్కిలి దారుణప్రకారంబులయ్యె దానంజేసి రాజులందఱును భీతిల్లి విశ్చేష్టులై మహాశ్చర్యపర్యాకులులై చూచుచున్నంత సుదర్శనుండు సేనాధిపతి కిట్లను. అస్మదుపాసితయగు జగదంబ శరణమై యేతెంచె నింక నీ వారులకుఁ దలంకక రాజసంకులమ్మగు పథమ్మున నవర్గళమ్ముగ సైన్యమ్ముఁ బోనిమ్మనవుడు నతం డట్లచేసె యుధాజిత్తు భయగ్రస్తులై మ్రాన్పడి చూచుచున్న రాజులం గని యిట్లనియె. 564

ఉ. సింగముమీఁద నెక్కి యొక చేడియ వచ్చినయంత భీతులై
క్రుంగగనేల? రాజు లధికుల్ గలవో యొక దుర్బలుండు త
ద్వ్యంగని జేకొనంగ నదియారసి యూరకయుండఁ జెల్లునే?
వెంగలి వీనిఁ జంపి బృథివీపతిపుత్రికఁ దెత్త మిత్రజిన్. 565

క. అని తాను శత్రుజిత్తును, గినిసి సుదర్శనుని వంకఁ గిలించె శరా
సనమాకర్ణాంతంబుగ, ననేక బాణముల వాని నాతఁడు ముంచెన్. 566

వ. అంత నంబికయు, 567

చ. కమలను మిణ్గుఱుల్ పెదరఁగా నృపులందఱు కన్నిరూపులై
కనలి యనేకబాణముల గాఁడఁగనేసిన సంకులక్రమం
బునఁ దగె యుద్ధరంగము సముజ్జ్వలదేతదనూనబాణమ
ర్దనమున శత్రుజి త్తతనితాతయుఁ గూడఁ బరేతులైరాగిన్. 568

వ. తక్కుంగలవార లందఱు సద్దానికిఁ బరమాద్భుతం బందిరి. సుబాహుండు పరమప్రీతుండై యానందబాష్పములు వెల్లివిరియ నవ్వరశక్తి నిట్లని వినుతించె. 569

ఉ. పేరిమి సద్భక్త జనపీడ నడంచెడి తల్లిరో! నమ
స్కారము. శాంతి విద్య శివ కామద వాణివి తల్లిరో! నమ

స్కారము, కొల్చువారలకు సంపద లిచ్చెడి తల్లిరో! నమ
స్కార, మకారణంబ యుపకార మొనర్చుట నీక చెల్లెడిన్. 570

పంచచామరము. సమస్త జంతుజాలముల్ ప్రశస్త సత్కృపాకటా
క్షమంగళోజ్జ్వలత్తరంగ సంగతిం బొసంగఁ జే
సి మేలుఁగూర్చి ప్రోచుతల్లి! శ్రీకరీ! నిమన్ సదా
నమస్కరింతుఁబ్రోవుమమ్మ! నన్నుఁ బేర్మిమీఱఁగన్. 571

క. అగుణవగు నిన్నుఁ గొలియా, దఁగలనె? మూఢుండ సగుణుఁడన్ దుష్టుండన్
భగవతి! నీ యాథార్థ్యం, బు గనం జాలరు విరించి ముఖులగు సురలున్. 572

గీ. ఈవ వాగ్దేవతవు, బుద్ధి వీవ మతివి, నీవ జంతువులకు గతి నీవ, నిన్ను
నుతి యొనర్పంగఁ దరమె? మనోనియంత్రి, వగుచు నెల్లెడ వర్తింతు వఖిల జననీ!

ఉ. తావకభక్తముఖ్యుఁడు సుదర్శను సంగతిఁ జేసియేకదా!
భావుకమై యశేష జనపావనమై యజముఖ్యదుర్లభం
బై వెలుగొందు త్వత్పదనవాంబురుహద్వయి సూడఁగంటి నీ
సేవకకోటిలో నొకనిఁ జేసి నను గరుణించు మమ్మరో! 574

ఉ. అంబ! రిపున్ హరించి భవదంఘ్రి రజోలవలేశధారి బా
లుం బలహీనునిన్ విజయలోలు ననాథు సుదర్శనున్ గృపా
లంబితచిత్తవై శశికలాసతితోఁ గరుణించి యింత పూ
ర్ణం బగునమ్మ! నెమ్మి నిను నమ్మి భజించెడి భక్తకోటిపై. 575

గీ. మంత్రతంత్రమ్ము లెఱుఁగ నీ మహిమ యెఱుఁగ
మూఢభక్తిని వినుతింతు మొఱకు నన్నుఁ
బాలనము సేయుమమ్మ! నీవాఁడ నమ్మ!
కిల్బిషమ్ము లడంచి రక్షింపుమమ్మ! 576

వ. అని బహుభంగుల నుతించు మహాహూ గరుణించి యంబ భవదభీష్టం బేమనుడు
బద్ధాంజలిపుటుండై యానంద పులకితగాత్రుండై యిట్లనియె. 577

శా. తల్లీ! నీదగు దర్శనంబుకతనన్ ధన్యుండనై యున్న నే
నొల్ల న్వేఱొండుఁ దేదియేని కరుణాయోగమ్మునం జేసి నా
యుల్లమ్మందు వసించు టొక్కటియు లోకోత్తంస మీకాశి ను
ద్యల్లీలన్ వసియించు టొక్కటియ వి న్నర్థింతు నత్యంతమున్. 578

క. దుర్గమ మగు రిపువర్గ మ, నర్గళకృప సంహరించి న న్నేలిన యో
సర్గవిధాయిని! నా పురి, దుర్గాభిఖ్య నివసింపు ద్రుంపుము రిపులన్. 579

గీ. ఈపురం బెంతదనుకఁ దా నిల వెలుంగు, నంబ! నీవంతదనుక మా కభయధాత్రి
వగుచు వసియింపవలయు మహానుకంప, దనర నిచ్చోట; నిదియ నాకును వరంబు.

వ. నాపుడు జగదంబిక యంగీకరించెఁ బిమ్మట సుదర్శనుం డామె నిట్లు వినుతింపఁ
దొడఁగె. 581

గీ. సృష్టిరక్షావిలయములు సేయఁ జాలె, దంబ! యొక్కింతయివ్వ నీకమరెనేని
యట్టినీ విట్టిదీను న న్నాదరించి, కాచితి వటన్న నిదియు దుష్కరమె నీకు? 582

గీ. ఏమికార్య మొనర్తు? నే నెచటి కేగు, వాఁడ? మూర్ఖుఁడనయ్యు భవత్ప్రసాద
బలముచే సర్వ మొనరింపఁ గలను దేవి!, కృప దలిర్పంగ నా కానతి మ్మనవుడు.

ఉ. చేసెడిదేమి నాకు నృపశేఖర! యీ లలితాంగితోడ మ
చ్ఛాసనముల్ వహించి విలసన్మతివై చని మీయయోధ్య సిం
హాసన మెక్కి వమ్మలవ కంచితరీతిని రాజ్య మేలుకో
మ్మా! సురనాథవై భవుఁడవై నిను నేఁ బయి నుండి కాచెదన్. 584

క. బలిదాన విధానం బది, యలరఁ జతుర్దశిని నవమి నష్టమిని ననున్
గంకాలమ్మును శ్రద్ధా, కలితుఁడవై పూజ సేయఁగా వలెఁ జుమ్మీ. 585

క. అదిగాక, శరత్కాలము, మదభీష్టం బెంతయేని మత్పూజలు నె
మ్మది నవరాత్రవిధానము, పొదలఁగఁ దత్కాలమందుఁ బొనరుపు వత్సా. 586

గీ. మాఘ చైత్రాశ్వినాషాఢ మాసములను, నొప్పుగాఁ జేయుమయ్య మహోత్సవములు
కృష్ణపక్ష చతుర్దశి కేవల నవ, రాత్రములు నష్టమియును బాత్రములు మిగుల. 587

చ. అని వివరించి యంతటఁ బరాంబ యదృశ్యతఁ గాంచె నాసుద
ర్శనుదరిఁ జేరి యెల్లరును రాజులు భక్తియు నమ్రభావముం
దనర సురల్ సురాధిపు నిధమ్మున మ్రొక్కి నుతించి రంబికన్
మనమున నమ్మువారు జనమాన్యత గాంచుట కేమి శంకయా. 588

క. మామయగు సుబాహుండును, భూమీపాలకులతోడఁ బోయి యతనికిం
జేమోడ్పుఘటించెను దే, జోమూర్తులయందు వయసు చూడంబడునే. 589

వ. పిమ్మట రాజన్యులందఱును సుదర్శనుం గాంచి మహాత్మా! నీవిఁక నయోధ్యాపుర
మ్మునఁ బైతృకంబగు సింహాసనమ్ము నధిష్ఠించి మమ్మందఱఁ బాలించుచు మాచే
వలయుపచారం గొనుచు నింతకు మున్నజ్ఞానవశమ్మున నొనర్చిన యస్మదపచార

మ్ముల నైరింపవలయు సంసారకూపమ్మునం బడి సారాసారవివేకంబు దక్కి పశువులగతిఁ దిరుగు మాకు నీయనుగ్రహమ్మునం గదా! జగదీశ్వరీసందర్శనంబు గలిగె నిట్టి నీకేమి యాచరింపం గలవార మని బహువిధముల ననునయించి మఱి యును. 590

చ. అడిగెద మొక్కమాట వినయమ్మున; నర్వ మెఱుంగునట్టియో
యొడయఁడ! దేవి నాఁగ నెవరో! యిట కెచ్చటనుండి వచ్చెనో!
కడుముద మయ్యె మా కెఱుఁగఁగా నొనరింపు మనన్ సుదర్శనుం
డెడపక వారి కిట్టులనియెన్ జగదీశ్వరి నాత్మ నెంచుచున్. 591

ఉ. చెప్పెడిదేమి యోన్నృపతిశేఖరులార! త్రిమూర్తులాత్మ నె
ల్లప్పుడు నేజగజ్జనని నంబిక నెమ్మి భజింతు రాపె యే
యిప్పరశక్తి సాత్త్వికి మహీముఖలోకములెల్లఁ బ్రోచుఁ ద
న్నెప్పుడుఁ గొల్చువారలకు నిచ్చు నిరామయభాగ్యసంపదల్. 592

గీ. చెలఁగుచు రజోగుణమ్మున సృష్టిసేయు, సత్త్వగుణమునఁ బాలించు పంహరించు
నఖిలము తమోగుణంబూని; యక్షతమున, నగుణయననొప్పు నీశక్తిజగమునందు.

క. ఈ సగుణ శక్తియే యగు, దాసులకెల్లరకు సౌఖ్యదాయినియును పే
వాసక్తులకున్ సేవ్యయు, నీసంబునెఱుంగ నగుణవిధ మే ననుచుణా. 594

ఉ. చిన్నతనమ్మునంద ఎనపీమకు వెల్వడి భీతి గ్రమ్మ బల్
విన్నఁదనంబుదోఁప నొకవిద్దెయు బుద్ధియు లేనిప్రాయమం
దెన్నఁగ నిట్టి శక్తికృప యేగతిఁగల్గెనటంచు మాకు న
న్నన్న! కడుణావిచిత్రమగు నాతెఱఁగుణా వివరించి చెప్పుమా. 595

గీ. అమడు నతఁ డిట్టులను బాల్యమంద నాకుఁ, బట్టువడె నొక్క బీజంబు భాగ్యవశతఁ
బేర్మి వయ్యదియే కామబీజ మయ్యె, నదియవాకు నొనంగె విద్యాదికంబు. 596

క. మునులకతన నప్పప్పుడు, వినియుంటిని దేవినాఁగఁ బిదవ నదియె యం
బను జూడఁగ సాధనము, య్యేను బీజావృత్తి కెంతయేనియుఁ దోడై. 597

వ. నావుడు రాజులందఱును బరశక్తి ప్రభావమ్మునకును సుదర్శను నదృష్టమ్మునకును సంతసించి తమతమపురమ్ముల కేగి సుఖంబుండిరి. సుబాహుండు నల్లు నంపించి తనపురమ్మున కరిగి యయ్యెడ దుర్గాలయమ్ముగట్టించి ప్రతిష్ఠాదికంబొనర్చి విశ్వేశ్వరుతోఁబాటు పూజాదులు జరపుచుండె. సుదర్శనుండు పరమోత్సాహమునఁ గోసల దేశమ్మున కరిగి యయోధ్యానగర సమీపమ్మున విడిసె. 598

## సుదర్శనుఁ డయోధ్యకరుగుట.

ఉ. సంగతి యంతయున్ దెలిసి సంగతులై సచివుల్ మృదంగ స
న్మంగళరావముల్ సెలఁగ నాగరకాంతలు లాజ లొప్పువే
డ్కం గురియింప వందులు గడంగి నుతింప నెదుర్కొనన్ జయా
ఖంగురుఁడై సుదర్శనుఁడు పత్నియుఁ దాను నేగెఁ బ్రోలికిన్. 599

వ. ఇట్లు పౌరజనసమర్పితనానోపాయనగ్రహణ పురస్సరంబుగ నంతఃపురంబు సొచ్చి పుత్రశోకమ్మునం గుందుచున్న సవతితల్లిం గాంచి నమస్కరించి వినయమ్మున నోదార్చుచు నిట్లనియె. 600

క. నీతనయుని నీతండ్రిని, నీతివిహీనుండ నగుచు నేఁ జంపఁగ లే
దో తల్లి! భవత్పదకం. జాతమ్ములు సాక్షి శక్తి చంపె నిరువురన్. 601

గీ. ఒకరుచేసినకర్మంబు నొకరు పొంద, నేర్తురే యిందులకు నింత యార్తియేల
తగ నవశ్యంబు కాఁదగుతంత్రములకు, శోకమంద రొకింత తద్జ్ఞులు నిజంబు.

ఉ. దానుని నన్ను నీసుతునిఁగ నమ్మనఁ జూడఁగదమ్మ! శోకముం
జేసి కృశింపనేల? దయచేసి మనోరమకన్న నెక్కుడై
వాసియు వన్నెయుం గలిగి వర్తిలవమ్మ! యొకింతభేదమున్
జేసెడివాఁడఁ గాను జననీ! పరిచర్య యొనర్తు నిచ్చలున్. 603

క. తన చేసిన కర్మముచేఁ, దన కాపద సంభవింప దైవము దూఱన్
జన దన్యుల నిందింపన్, జన దయ్యది యనుభవమునఁ జక్కంబడెడిన్. 604

గీ. దారుమయకాంత నర్తకప్రేరణమునఁ, జేసి నటియించు విధమున జీవుఁడాత్మ
కర్మవశమున సుఖదుఃఖములను జెందు, నందుఁదద్జ్ఞులు దుఃఖించు టనుచితంబు.

గీ. చిన్నతనమున నీతండ్రి చెట్టఁదలఁచి, నన్ను రాజ్యవిహీను నొనర్చునప్పు
డేను గర్మానుభవమని యెంచుకొంటిఁ, గాని శోకింపలేదు నిక్కంబు తల్లి. 606

క. నీతండ్రి వీరసేనున్, నాతాతన్ జంప నాజనని నన్ఁగొని దుః
ఖాతురయై కాంతారం, బేతెంచెడి త్రోవ దొంగలేతెంచి వడిన్. 607

క. కట్టినపుట్టము మొదలుగ, నెట్టన హరియింప దుఃఖనీరనిధికిఁ దాఁ
గట్టెఱుఁగక పడుకష్టము, లెట్టి రిపునకైనఁ గూడ నెప్పటికైనన్. 608

వ. అట్టియెడ నిదల్లిందును ధాత్రేయియు మమ్మును విడువక కష్టసుఖమ్ములకోర్చి వెంటన్ జనుదెంచిరి. 609

ఉ. పిమ్మట నెట్టకేలకుఁ దపించితపించి సురాపగానమీ
పమ్ముననున్న యొక్కముని పల్లెకుఁ జేరితి మామునీంద్రులున్
మమ్ముల గారవించియుఁ గ్రమమ్మున వింతకుఁ దెచ్చిరమ్మ! నా
కమ్మెయి దుఃఖ మిమ్మెయి ననంతముదమ్మును లేదు తల్లిరో! 610

వ. ఇప్పటికైన నేరియందు మాత్సర్యంబుగాని వైరంబుగాని లేదు. రాజ్యభోగంబు కన్న నీవారాన్నభక్షణం బొనర్చుచు నింద్రియజయమ్మొనరించి ధర్మాచరణంబు కర్తం బవి తోచెడి. సకలజన్మంబుల మనుష్యజన్మంబు దుర్లభం బదియును భారతఖండం బున నగుటెక్కుడగు. నట్టి జన్మంబునొంది సర్వసాధారణంబులగు నాహారాది సుఖంబులందుచు మందుఁడై వర్తించుటకన్న స్వర్గమోక్షప్రదంబగు ధర్మసాధనం బొర్చుట లెస్సగాదె! యను సుదర్శనువచనమ్ములు విని లీలావతి లజ్జితయై పుత్ర శోకంబు పరిత్యజించి యిట్లను, 611

చ. వినుమ విటుచేయునప్పు డవినీతి యొనర్చకు మన్న నన్ను మ
జ్జనకుడు లెక్కపెట్టక యపత్కృతి నీకొనరించి తాను జ
చ్చినయదిగాక మత్సుతువిజీవముఁగూడ హరించెఁ దా నొన
ర్చినకృతి దన్నడంచె నొకరిన్ జెఱుపన్ విధి తన్ను మాపదే. 612

క. నీతాత వీరసేనుం, డే తాదృశుఁడే తలంప వితవిని నాకై
నాతండ్రి చంపెనకటా!, యోతండ్రీ! తప్పునాది యొరు లెవ్వరిటన్. 613

క. నీ తల్లి నాకు సోదరి, నాతనయుఁడ నీ వకారణంబుగ దుఃఖా
న్వితవయి కుందనేల! మ, హీతల మేలుకొమమీ మహేశ్వరికరుణన్. 614

గీ. వారొనర్చినకర్మంబు వారిఁ జంపె, విన్ను నిందింపఁ బాపంబు నేనెఱుఁగనె
చచ్చినకుమారునకు నేద్వ సజ్జనుండ, నైన విన్నలయించుట కరల వలదె. 615

వ. అని యాపె యూవతిచ్చుటయు నతండు మంత్రులం బిలిచి దైవజ్ఞ నిర్ణీతంబగు శుభముహూర్తమ్మున హేమసింహాసనంబు నిర్మింపంజేసి మణిమండితంబగు నొక్క ప్రాసాదమ్మునమంచి తత్సింహాసనమ్మున యథావిధిగ జగదంబిక స్థాపించి, సర్వకాల మ్ముల నీయంబిక నర్చింపుఁడని పౌరులకాజ్ఞాపించి పిమ్మటఁ బట్టాభిషిక్తుండై సుఖ మ్ముగ రాజ్యభారమ్ము వహించె. 616

గీ. ఆ సుదర్శనకథ మున నంబ జగద, ధీశ్వరి కృపావలంబ లోకైకజనని
యలరి కోసలదేశమ్మునందు నిలిచి, యెల్లవారికి శుభముల నిచ్చుచుండె. 617

సీ. ధర్మజ్ఞుఁడై నీతిఁ దప్పక ప్రఖ్యాతిఁ • బొందిన యలదిలీపునివిధమున
ప్రజలఁబిడ్డలరీతిఁ బాలించి యశముచేఁ • బ్రబలిన రఘుమహారాజు పగిది
సత్యంబు దప్పక జగతిఁ బాలించి ప్ర • శస్తి కెక్కిన హరిశ్చంద్రుమాడ్కి
శిష్టరక్షణదుష్టశిక్షావిశేషముల్ • సలిపి యేలిన రామచంద్రుపోల్కి

గీ. శుద్ధవర్ణాశ్రమాచార పద్ధతులును • ప్రతిగృహమ్మున నంబాసపర్యలును నె
సంగ శశికల సౌఖ్యంబొసంగ సంగ • తముగ రాజ్యం బొనర్చె సుదర్శనుండు.

క. మామయు నల్లుఁడుఁ దమతమ, సీమల నంబాసపర్య చేయు కతమునన్
గ్రామాదులలోఁ బండిత, పామరసాధారణముగఁ బ్రబలెఁగా బూజల్. 619

## నవరాత్ర పూజావిధానము.

క. అన జనమేజయుఁడనుఁ గ్ర, న్నన శరదాగమమునందు నవరాత్రమ్ముల్
చనుదెంచిన నేవిధి నం, బను బూజింపంగ వలయుఁ బరమమునీంద్రా. 620

క. నరపతి జనమేజయుఁ డా, దరమున విటులకుగ పౌరాణికల్లజుఁ డనియెన్
శరదాగమ మందు వసం, తఋతువునందును యజింపఁదగు జగదంబన్. 621

మ. అరయన్ సర్వజనౌఘనాశకములై యత్యంతఘోరమ్ములై
పరమవ్యాధికరమ్ములయ్యుఁ గడు శోధాపూర్తి నొప్పారి శాం
కరికిన్ బ్రీతికరమ్ములై మిగుల వేడ్కల్ సేయు లోకాళికిన్
శరదారంభవసంతముల్ శమనదంష్ట్రాప్రాయముల్ భూవరా. 622

క. కావున నీ ఋతువులను శు, భావహనవరాత్రముల సమంచిత భక్తి
శ్రీవిభవము లలరఁగఁ బర, దేవత నర్చింతు రెల్ల ధీరులు నధిపా. 623

వ. నవరాత్ర విధానం బెఱింగించెద సావధాన మనస్కుండవై యాకర్ణింపుమీ. చైత్రాశ్వయుజమాసమ్ములయందు సితపక్షమునఁ బ్రతిపత్తిథి మొదలుకొని నవరాత్రంబులును దేవి నారాధించు నరుండంతకు మున్నమావసయందుఁ దత్తత్పూజాద్రవ్యంబుల సంగ్రహించుకొని యా దినమ్మున హవిష్యాశనంబున నేకభుక్తంబొనర్చి సమప్రదేశమ్మున షోడశహస్త ప్రమాణమ్మును స్తంభధ్వజ సమన్వితంబును నగు నొక మండపం బేర్పఱచి గోరమృద్గోమయమ్ములచేఁ జక్కఁగా నలికి ముగ్గుపెట్టి తన్మధ్యమ్మునఁ జతుర్హస్త విస్తృతమ్మును నేక హస్తోన్నతంబును నగు నొక వేదికఁ బీఠార్థంబు నిర్మించి విచిత్రతోరణ వితానాది కంబులచే నలంకరించి మఱియును, 624

బుం బూర్ణం బొనరింతునంచు నియమంబున్ శక్తికల్మిఁ దద
గ్రంబందున్ వచియించి పూనఁదగు నార్యాపూజకుం దొప్పఁగన్. 634

సీ. మందార కరవీర మాలతీచంపకా • శోక కరజదివ్య సుమచయములఁ
జందనాగురుకచ్చూర కర్పూర బి • ల్వదళార్ఘ్యపాద్యాది లక్షణముల
నారికేళ కదళీనారంగదాడిమీ • పనసాదితరుజాత ఫలవితతుల
నన్నపానముల దివ్యభక్ష్యభోజ్యచో • ష్యాదికంబులఁ బాయసాదికముల

గీ. ధూపముల దీపముల మహాస్తుతుల నతుల • నతులగతుల వ్రతంబు మున్నతు లొనర్చి
పతుల సుతుల సుమతుల సద్గతుల నలరి • వెతలఁ బాయుదు రిదియ దేవీవ్రతంబు.

క. ఎన్నిక శక్త్యనుసృతిగా, నన్నంబిడవలయు భూసురాదులకు వ్రతం
బెన్నివిధంబులఁ జేసిన, నన్నంబిడఁడేని వ్యర్థమగు నరనాథా. 636

గీ. మాంసము భుజించువార లంబన్ యజింతు, రేనిఁ బశువుల బలిదాన మీఁగవలయు
నజవరాహమహిషము లత్యంతముఖ్య, ములు బలివిధానమున కవి మునులమతము.

గీ. అంబికకెదుటను జంపినట్టిపశువు, లెల్ల స్వర్గమ్మునకు నేగు హింస నింద్య
మయ్యు యజ్ఞాదికముల దేవ్యర్చనాది, కముల నింద్యమ్ముగాదు స్వర్గదముగాని.

వ. మఱియుఁ ద్రికోణంబగు కుండంబేర్పఱచి యందు హోమంబొనర్ప వలయుఁ ద్రికాలమ్ములయందును నృత్తగీతవాద్యమ్ములు సెలంగ మనోహరమ్ములగు పూజా ద్రవ్యమ్ములచే నర్చింపవలయు భూమిపై శయనింపవలయు వస్త్రాలంకారాదికం బొసంగి కుమారికల నేకైకవృద్ధి క్రమంబునఁగాని యంతకు ద్విగుణమ్ముగఁ గాని త్రిగుణంబుగఁగాని నిత్యంబును నారాధింపవలయుఁ గుమారీ లక్షణం బెట్లంటేని,

గీ. రెండువత్సరముల నలరెడువదియ కు, మారి; మూఁడేడు లైనచో మహిమ యది త్రి
మూర్తి; నాల్గేఁ గళ్యాణి, మొనపెనేని, యైదు రోహిణి; కాళిక యాఱు మొనయ.

గీ. సప్తవర్షంబులైనచోఁ జండిక యనఁ, బరగు నెన్మిదియైన శాంభవి యనంగ
వలరుఁ, దొమ్మిదియైన దుర్గాఖ్య నెసఁగుఁ, బదియయిన దాని నెంత్రు సుభద్రయనుచు.

గీ. ఇంత కెక్కుడు వయసాయెనేని శక్తి, సంతసింపదు తత్తదర్చనమునం గు
మారిలోనగుపట్టినామములు వాడ, వలయు నద్దాన నంబకుఁ గలుగుఁ బ్రీతి. 642

సీ. మాటిమాటికిని గుమారిఁ బూజించిన • దుఃఖదారిద్ర్యముల్ తొలఁగిపోవు
పూర్ణశక్తిని దాఁ ద్రిమూర్తిఁ బూజించిన • నాయుత్రివర్గముఖ్యఫల మబ్బు

ననువుమీఱంగఁ గళ్యాణిఁ బూజించిన • విద్యావినయరాజ్యవిభవ మెసయు
నకలంకభక్తిఁ గాళికఁ బూజచేసిన • శత్రుసంతతికి నాశనము పొసఁగు
గీ. చండిక యొసంగుసంపదల్, శాంభవి యిడు•నృపుల నలరించు శక్తి, నెంతే నసాధ్య
కార్యములు నెఱవేర్చు దుర్గయు, సుభద్ర • వాంఛితము లిడు, రోహిణి వ్యాధులడఁచు.
వ. మఱియు వీరలనర్చించుపట్ల శ్రీసూక్తనుమంత్రంబున నొండె శ్రీయుక్తంబులగు మం
త్రంబులనొండె బీజమంత్రమ్ములనొండె నుపయోగింపవలయు 644
క. అరయఁ గుమారితత్త్వము, లారాజీవభవముఖ్యు లగు సురలను వి
లారీతిగా సృజియించు కు, మారిం బూజించెదన్ సమాహితభక్తిన్. 645
క. సత్త్వాదులచేతఁ ద్రిమూ, ర్తిత్వమ్ము న్నిఖిలమూలధేయత్వము వ్యా
ప్తత్వమును గాంచుశక్తిన్, దత్త్వనిధిఁ ద్రిమూర్తి భక్తి దనర యజింతున్. 646
గీ. తనుభజించెడి భక్తసంతతికి నెపుడు, నఖిలకళ్యాణములను సమస్త కామ
ములు నొసంగెడి కళ్యాణి నెలమిఁ బూజ, చేసెద నఖండ భక్తి సుశ్రీలు సెలఁగ.
గీ. సకలభూతమ్ములను బూర్వజన్మ మందు, గూడఁబెట్టిన బీజముల్ కొమరుమిగుల
వెలువరించెడి రోహిణి విపులవిభవ, గారిణిఁ దలంతుఁబేర్మి నఖండభక్తి. 648
గీ. చండముండాదిహారిణి చండరూప, చండికను బూజలిడుదుఁ బ్రచండభక్తి
కారణములేవి యుత్పత్తిగలుగు శాంభ, వివి శుభప్రద భజియింతు విపులభక్తి. 649
క. ఏవంవిధమంత్రమ్ముల, నేవంవిధపూజలను సమిద్ధములగు నా
నావస్త్రాలంకృతుల ను, భావహలగు కన్యకలను నర్చింపవలెన్. 650
వ. మఱియు హీనాంగియు దుర్గంధబంధురయుఁ గుష్ఠయుక్తయు వ్రణాంకితయు దుష్టు
లభవయు జాత్యంధయుఁ (1) గేకరయుఁ (2) గాణియుఁ గురూపయు బహురో
మశయు రజశ్చిహ్నాద్యంకితయు జౌమయు (3) గర్భసముద్భూతయు గోళకయుఁ
గన్యకోద్భూతయు లోనగు కన్యకల వర్జించి యరోగిణియు సురూపాంగియు
సుందరియు వ్రణవర్జితయు (4) నేకవంశసముద్భూతయు నగుకన్యక నర్చింప
వలయు సర్వకార్యమ్ముల బ్రాహ్మణియు జయార్థంబు నృపవంశజయు లాభార్థంబు
వైశ్యకులోత్పన్న గాని శూద్రవంశసంభవగాని పూజనీయ లని యెఱుంగునది.
బ్రాహ్మణ క్షత్రియులకు బ్రాహ్మణియు వైశ్యులకుఁ ద్రివర్ణజయు శూద్రులకుఁ జతు
ర్వర్ణసంభవయుఁ గారులకు స్వకులోద్భవయు నారాధ్యలని యెఱుంగుము. 651

(1) మెల్లకన్ను గలది. (3) 1 వత్సరము దాటని వయస్సుగలది.
(2) ఒక కన్ను గ్రుడ్డియైనది. (4) ఒక్క తండ్రికి జన్మించినది.

క. నవరాత్ర విధానమున వి, భవము కొలఁదిఁ బూజసేయఁ బరమహితము శ
క్తివిభవ శూన్యం డష్టమి, ని విశేషంబుగ యజించె దేవియుఁ జాలున్. 652

గీ. అష్టమిని మున్ను దక్షయజ్ఞాపహంత్రి, యగుచుఁ దను యోగినీకోటు లనుసరింప
భద్రకాళి జనించె నృపాల! తన్ని, మిత్తమున నష్టమిని బూజ మేలుఁ గూర్చు. 653

క. నవరాత్రకాల మెల్ల ను, పవాస మొనరింపలేని వారికి నుపవా
సవిధులు సప్తమి యష్టమి, నవమియు నివి మూఁడు పోషణము లనిరి నృపా!

## నవరాత్ర మహాత్మ్యము.

క. ఈ మూఁడు దినములను దగు, హోమంబులఁ బూజనముల నొగి నలరింపన్
గామములిడు నవరాత్ర మ, హామహాకర్త్రుం బలెఁ బరాంబిక కరుణన్. 655

క. నవరాత్ర వ్రతమున కీ, యవనిన్ వేఱొండు సాటి యనుకొనకుము వై
భవమిడు నాయుష్య విడు విడు, శివమున్ విద్యయును యశముఁ జేవయుఁ బరమున్.

క. విను రాజ్యభ్రష్టునకున్, దనయంతిని రాజ్యమబ్బు ధరణీశ్వర! వి
ద్యమగోరి పూజచేసిన, మనుజకు విద్య లవియెల్లఁ గరగతములగున్. 657

క. వెనుకటి జన్మమ్మున నే, జను లీ నవరాత్రపూజ సల్పరొ వారే
యపవత్న్యులు రిక్తులు రో, గ విధులు దుర్జను లగుణులుఁ గష్టులు భ్రష్టుల్. 658

గీ. విధవలును వంధ్యలును ధనవిరహితులును, నైన కాంతలఁ గన్గొని నవ్వు "డీయ
భాగ్యలెల్లయుఁ బూర్వభవమ్మునందు, నీ వ్రత మొనర్పలే" దని యెఱుఁగు మధిప.

గీ. ఘనతరంబుగ రక్త చందన విమిశ్ర, బిల్వదళముల నెవఁ డతిప్రీతి దనర
నంబ నవరాత్రములఁ బూజనం బొనర్చు, నతఁడు భూపతి యగును భూపతివతంస!

చ. హరిహర పద్మగర్భులును నష్టదిగీశ్వరు లెల్ల దేవతల్
వరమమునీంద్రు లందఱును భక్తి దలిర్పఁగ దేవరాంబికా
చరణములన్ భజించి విలసద్గతి నొందుదు రమ్మహేశ్వరిన్
వరుల యజించు టబ్బురమె! వారిక మేగెడివారు దక్కఁగన్. 661

గీ. బ్రహ్మ సర్గంబు విష్ణువు పాలనంబు, హరుఁడు లయమును జేయు నేయంబకతన
నా జగద్ధాత్రి సర్వ పాపాపహంత్రి, నమ్మహేశ్వరిఁ బూజించు టబ్బురంబె. 662

గీ. వెఱవలుకు లేం విను మహాపాతకము లౌ, నర్చు దుర్మార్గుఁడైన వెన్నంగవాక్క
పారి నవరాత్రముల జగజ్జనని పూజ, చేయఁ బాపమ్ము లెల్లను బాయు నిజము. 663

వ. రాజేంద్రా! మున్ను కోసలదేశమ్మున సుశీలుండను నొక్క వణిజుండు ధనధాన్య విహీనుండు గలఁ డాతనికి సంతానం బధికంబు బిడ్డలఁ బోషింపనేరక యొక్కనాఁ డొక్క విప్రసత్తముం గాంచి నమస్కరించి యిట్లనియె. 664

క. ఓ విప్ర! మహాభాగ! కృ. పావంతుఁడవగుచు నాయభాగ్యదశను నీ
వేవిధినైన హరింపం, గావలయుఁ కుటుంబభృతియుఁ గలుగ్గవైతోఁచుఁగా. 665

క. ధనికుఁడఁ గావలెనని నె, మ్మనమున నాకిచ్చలేదు మన్నించి కృపం
గని నా కుటుంబభరణ, మ్మునకు నుపాయం బొకండు పొనరుపుమనఘా. 666

క. నాకొడుకులు నాకూఁతులు, నాఁకలికిం దాళలేక యన్నంబడుగన్
లేక యొనర్చెడి దేమియు, లే కిటుపచ్చితిని జూడలేక మహాత్మా! 667

క. అదిగాక, పెండ్లికీడై, నది గలదొకకూఁతు రది దశాధికవర్షం
బొదవినఁ గన్యాదానో, త్తదశకుఁ జెడుఁ బెండ్లియగునె ధనహీనులకున్. 668

గీ. దానిఁ దలఁచిన గుండె బ్రద్దలగు నాకు. నేమిసేయుదు? దారిద్ర్యమెట్లు విడుచు
నరసియేదేని నొక్క యుపాయమున్నఁ, బూని యొనరించిపుణ్యమ్ముఁ బొందుమయ్య.

వ. అని బహుభంగులం బ్రార్థించిన నవ్వైశ్యుంగాంచి సంశితవ్రతుండును దేవీ మహత్త్వవేత్తయు నగు నావిప్రుండు వల్కు "నోయనఘా! శరత్కాలమ్మున నాశ్వయుజసితపక్షమ్మునఁ బ్రతిపదాది నవరాత్రవ్రతం బొనర్చి దేవినారాధించితేని నీదారిద్ర్యంబు దొలఁగు నిద్దానికి వేఱొండు తుల్యమ్ముగాదని చెప్పి మఱియును.

ఉ. జ్ఞానమొసంగు మోక్షమునొసంగు ఘన న్నవరాత్రికాలమం
దేనపుఁబ్రైన నంబ జగదీశ్వరిఁ బూజనభోజనంబులన్
ధ్యానముఁనన్ జపంబులను దద్దయు హోమములన్ ఘనాంగనా
గాన వినోదనృత్యములఁ గ్రన్ననఁ దుష్టియొనర్చి మించినన్. 671

వ. మున్ను శ్రీరామచంద్రుండు వనవాసమ్మున సీతావియుక్తుండై కిష్కింధానగరమ్మున సుగ్రీవసాహాయ్యమ్మున నీ నవరాత్రవ్రతం బొనర్చియె కాదె సముద్రంబు బంధించి పుత్రమిత్రపరివార సహితంబుగ రావణ కుంభకర్ణుల హరించి విభీషణునకు రాజ్యం బిచ్చి సీతం గైకొని యయోధ్యకేతెంచి నిష్కంటకంబుగ రాజ్యం బొనర్చెఁ గాన నీవ్రతంబు శత్రునాశకరంబు సంపత్కరంబు సంతాన దాయకంబని చెప్పి యా వైశ్యునకు మాయాబీజాభిధంబగు తన్మంత్రం బుపదేశించిన నతండు తన గృహమ్మునకరిగి యథాశక్తిగ నీవ్రతంబు తొమ్మిదివత్సరమ్ములొనర్చె నంత. 672

ఆ.వె. నవమవత్సరమున నవరాత్రముల నష్ట, మీదినమున రాత్రి మేదురాద
రం బెసంగ నతని కంబ ప్రత్యక్షమై, పెక్కువరము లిడియెఁ బేర్మిమీఱ. 673

వ. అనుడుఁ బరాశరాత్మజునకుఁ బరీక్షిదాత్మజుం డిట్లనియె. 674

క. శ్రీరాముఁ డేకతమ్మున, దారం గోల్పోయె నతనితండ్రి యెవ ? రతం
డేరాజ్యమేలు ? రాజ్యం, బేరీతిఁ ద్యజించి యడవికేగెనొ ? చెపుమా ! 675

వ. నావుడు జనమేజయునకు వ్యాసుం డిట్లనియె. 676

గీ. దశరథుండను రా జయోధ్యాపురమ్ము, నేలె వినవంశజుండు సుశీలుఁ డతని
సతులు మూగురు పెద్ద కౌసల్య రెండ, వయది కైకేయియును మూఁడవది సుమిత్ర.

## శ్రీ రా మ చ రి త్ర.

వ. అతండు సంతానవిహీనుండై పుత్రకామేష్టియొనర్చి మువురియందు నలువురుకొడు
కులఁ గనియె నందు. 678

క. కౌసల్యకొడుకు రాముఁడు, భాసురుఁ డాతండు మిగుల భరతుఁడు కైకే
యీసుతుఁడు సుమిత్రకు రిపు, శాసకులగు లక్ష్మణుఁడును శత్రుఘ్నుండున్. 679

తే. జాతమాత్రంబునన దమశ్శ్రుప్రహాణు, లయిన నలువురు కొమరుల కానృపాలుఁ
డర్హసంస్కృతు లొనరించి యలరునంతఁ, గౌశికుం డేగుదెంచె మఖం బొనర్ప.

గీ. వచ్చి మఖరక్షణకు నవద్య రాముఁ, గోరె షోడశవార్షికుఁ గువలయేశుఁ
డిచ్చె లక్ష్మణు జతఁజేసి; యేగి రిరువు, రును మునీశ్వరు వెంట దారి నొకచోట.

గీ. మునుల బాధించు తాటకఁ దునిమి కదువి, పీచుని సుబాహుఁ జంపి మారీచు విహత
కల్పుఁగాఁ బాఱఁదోలి మఖంబొనర్పఁ, జేసె రాముండు కౌశికుచేత నంత. 682

చ. ఎలమిని మూగురున్ మిథిల కేగెడిచో రఘురాముపాదస
జ్జలజపరాగసంగతిని శాపము వాసె నహల్య శైవమౌ
విలు విఱుగంగఁ జేసి యట విక్రమధుర్యుఁడు రామమూర్తి మై
థిలి జనకుం డిడన్ గొనె సతీమణిగాఁ గమలాంశసంభవన్. 683

గీ. లక్ష్మణున కిడె నూర్మిళ లలితగాత్రిఁ, దగఁ గుశధ్వజతనుజాతల గుణవతుల
భరతశత్రుఘ్నులకు విడెఁ బార్థివుండు, సపరివారముగఁ బురికిఁ జనిరి వారు. 684

గీ. అంత దశరథనృపతి రాజ్యార్హుఁడైన, రామునకు రాజ్య మీ నెంచుటాజ నెఱిఁగి
పూర్వదత్తవరంబులఁ బొందెఁ గేక, యాత్మజ నకుండయిన భర్త నడిగి పిదప.

సీ. తిలపుష్పముం బోలి యలరెడునాసిక • ధనదుని తేజంబు, మొనలు గల్గి
తనరారు తళ్కుదంతములు ప్రాజాపత్య • తేజంబు, కావివాతెఱ దినేంద్రు
తేజంబు, మీఁదివాతెఱ కార్తికేయుని • తేజంబు పొల్పారు, దీప్తినలరు
పదియును నెన్మిదిబాహువులు విష్ణుతే • జం, బంగుళులు వసుసంభవములు,

గీ. స్తనయుగళ మంబుజారి తేజంబు, త్రివళిసంయుతము మధ్య మింద్రు తేజంబు జంఘ
లూరువులు వరుణుఁడు, కటి యుర్వి, యిట్లు • పుట్టె నద్దేవి శుభరూపమున నరేంద్ర!

క. ఆయమఁ గాంచి సురలు మో, దాయత్తత మించి "మహిషు నడఁచు మనకుఁ దా
నై యిచ్చు స్వర్గరాజ్యం, బీయంబిక" యంచు భయము నెడలిరి తమలోఁ. 180

వ. అంత విష్ణుండు సురలం గాంచి యీ యంబికకు మీ మీ భూషణంబు లొసంగి మీమీ యాయుధమ్ముల తేజమ్ములవలన నాయుధమ్ము లుత్పాదించి యొసంగునది, యనిన నిర్జరులు సంతుష్టులై యట్లొనరించిరి. 181

సీ. పాలసంద్రము మేల్మిచేలమ్ములను మంచి • దైనరత్నపుహారము నొసఁగె
నాపాదమస్తకం బమరఁదాల్పఁగ విశ్వ • కర్మ రత్నపుమేల్ నగల నొసంగె
నురమున శిరమున ధరియింపఁ దగుమాలి • కలు రెండు వరుణుండు కానుకిచ్చెఁ
దనరారు వివిధరత్నమ్ము లిచ్చుచు కాక • హిమవంతుఁ డర్పించె నేస్గు గొంగ

తే.గీ. హరియు హరుఁడును వరుణుండు నాత్మచక్ర • శూలశంఖమ్ములవలన నోలి సృష్టి
జేసి యొసఁగి రయ్యంబకు శ్రీకరములు • చక్రశూలశంఖమ్ములు జనవరేణ్య. 182

వ. మఱియుఁ బావకుండు మనోజవమ్మును శతఘ్నియనగు నొక శక్తియు, వాయువు బాణపూర్ణంబగు నంబులపొదియును జాపంబును, నింద్రుండు దనవజ్రమ్మునుండి యుదయించిన వేఱొక వజ్రమ్మును, నైరావతమున కలంకరించెడి గంటయును, యముండు దనదండమ్మునఁ బొడమిన దండంబును, బ్రహ్మ దివ్యగంగాజల పూరితంబగు నొక్కకమండలువును గాలుంబు ఖడ్గమ్మును పలకయును, విశ్వకర్మ తీక్ష్ణంబగు పరశువును, గుబేరుండు సురాపూర్ణంబగు కనక పాత్రంబును, వరుణుండు దివ్యపంకజమ్మును ఘంటాశతవినాదితంబగు కౌమోదకి యను నొక గదయుఁ ద్వష్ట యభేద్యకవచంబును నానావిధాస్త్రమ్ములను దివాకరుండు స్వకిరణములను నొసంగిన నవి దాల్చి వెలుంగు నజ్జగన్మాతృకం గాంచి వార లందఱు నిట్లు నుతించిరి. 183

మ. శివవై శాంతివి పుష్టివై సుఖదవై సిద్ధిస్వరూపంబవై
భవసంహారిణి! కాళరాత్రి వను యంబాదేవివై వృద్ధివై
యవనిం దొల్చియు దానిచే నెఱుఁగ రా కంతస్థితిం దొల్చి మా
య వెలింగించుచు దానికిం దెలియ రా వత్యంత గోప్యస్థితిన్. 184

వ. అట్టి వైష్ణవీరుద్రాణీంద్రాణ్యాత్మికవగు నీకు నమస్కరించెద మెట్లని మమ్ముం బీడించు నీహయారిని వయిమ్మనం దునిమి కళ్యాణము లొసంగు మని మాటిమాటికి నుతించి చరణంబులం బడు నయ్యసురుల కయ్యంబిక యిట్లనియె. 185

చ. వినుఁడు సురల్! సురారి నొకవ్రేల్మిడిఁ ద్రుంచెద దీని కింత భీ
తినిఁ గొనువారె బ్రహ్మముఖదేవత లందఱు? కాలపర్యయ
మ్మును గడవంగ నేరికినిఁ బోలునె? యెంతటివింత యంచు నా
ననము సమందహాసముగ నాచ మొనర్చె రిపుల్ భయంపడన్. 186

ఉ. మేరువు సంచలించె వడి మిన్నదరెన్ జలధుల్ గలంగె దు
ర్వారతరంబుగా ధరణి గ్రక్కదలెన్ దశదిక్కు లొక్కటై
ఘోరన మ్రోసె నా రవ మపూర్వగతిన్ విని యాహయారియున్
ధీరతఁ దక్కి రక్కసుల దిక్కు మొగం బయి యల్కపెంపునన్. 187

వ. ఇయ్యది కడుఁగ్రొత్తయై యున్నయది దీనికిం గత మేమొకో! యని శంకించి వెండియు, 188

ఉ. ఈరవ మాచరించు రిపుఁ డెవ్వఁడొ! గన్గొని వానిఁ గట్టి దు
ర్వారత నాదుసన్నిధిఁ గరంబు తిరంబుగఁ బొందఁజేయుఁ డ
ద్దారుణు మందబుద్ధి గతదర్పు నొనర్చి యమాలయాతిథిం
గా రచియింతు నెవ్వనికిఁ గాలము చేరువయయ్యె నియ్యెడన్. 189

క. సుర లిట్లొనరించిరొకో, పరమాపద దప్పి నాదుభయమున గిరిగ
హ్వరములపాలై నిర్భీ, తి రవం బొనరింప నింత తెగువ గలుగునే! 190

వ. అని పనిచిన దూతలు సని సర్వాంగసుందరియు నష్టాదశభుజయు సర్వాభరణభూషితయు నాయుధసంపన్నయు హస్తమ్మునఁ జషకమ్ము గొని సారెసారెకు మధుపానం బొనర్చుచున్నదియునగు నప్పురాంబ నీక్షించి భయత్రస్తులై మహిషుపాలికిఁ జని యిట్లనిరి. 181

ఉ. సింగము నెక్కి యెక్కుడగు చెల్వునఁ బొల్చెడి యొక్క కాంత స
ర్వాంగసముజ్జ్వలన్మణిమయస్ఫుటభూషణ విస్ఫురాయుధా
ళింగురహస్త నిత్యమధుపానమదాలస చారుచంచలా
పాంగ గనంగ వచ్చెఁ గనినంతన భీతి యొసంగె మాకొగిన్. 192

వ. అత్తలోదరి సురకాంతయు నసురకాంతయు నని నిరూపింప రాక యపూర్వప్రక్రియ నొప్పుచున్నయది. తత్తేజంబు దుర్దర్శంబగు కతన నిలువ నోడి యిట కరుదెంచితి మంతరిక్షమ్మున నుండి నిలింపు లాయంగనామణి నెక్కుడుగ సన్నుతించుచుండి రవ్వరారోహ యేమి కతమున నిట కేతెంచెనో తెలియుట మాకసాధ్యంబు తద్దర్శనమాత్రపలాయమానులమై దేవరకు విన్నవింపవచ్చితిమి. 193

క. శృంగారాదిరసమ్ముల, పొంగాధీనములు గాఁగ నంగజకళత మా
రంగ సృజియించు చెల్వన, వంగన రంగారు నేమి యనఁదగు నధిపా. 194

వ. ఇంక నెయ్యది కర్తవ్యం బానతిమ్మ నావుడు మహిషుండు మంత్రి దిక్కు మొగంబై సాభిలాషమ్ముగ నిట్లను. 195

మ. అమరాగిల్లితి నత్తలోదరికి నే, నయ్యంగనారత్నముం
గొని రమ్మెక్రియనైన సామమున నాకోర్కుల్ ఫలింపంగ నే
నొనరింతుం బ్రియమారఁ బట్టమహిషీయోగంబు, తత్కన్యకా
జనచూడామణి కింతకన్నఁ గలదే ! సంతోష మెంతేనియున్. 196

గీ. సామదానభేదమ్ముల సమ్మతించి, వచ్చెఁగాకేమి రాకున్న మచ్చెకంటి
నిటకు రప్పింపుమీ బలాత్కృతిగ నొప్పె, నేని రసభంగ మొనరింతువేమొ మొదల.

ఉ. అవరపీరుహాక్షి జలజాసన యాతమహధ్య లేని యీ
వాసవలోకసౌఖ్యములు వ్యర్థము; లచ్చెలిమిన్న విన్న నా
కాన జనించె నైళమ తదంగన నిమ్మెడఁ దేవలెన్ రసా
భావము గాకయుండ నొకపక్కిక పేదగు నేర్పుకూర్పునన్. 198

వ. అని యనిపిన నమ్మంత్రివరుం డరిగి దౌదవ్వుల నిలిచి వినయావనతుండై యిట్లను.

ఉ. ఎందులదాన ! నిమ్మెడకు నేమికతమ్మున వచ్చియుంటి ! నీ
యందముఁ జందమున్ విని స్మరాతురుఁడై వనుఁబంపె మావిభుం
డందుల కేగుదెంచెదొ ! రయమ్మున నాతనిఁ దోడి తెచ్చి నీ
కిందు నొనంగునాఁడనొ, మృగేక్షణ ! యీ తడవేల చెప్పుమా. 200

మ. సరసీజాసనదత్తమౌ వరమునన్ స్వర్గమ్ము నిర్జించి యె
వ్వరికిన్ వధ్యుఁడు గాక యిచ్ఛ కనురూపంబైన రూపమ్ము దా
ల్చి రసజ్ఞత్వము గల్గి మావిభుఁడు విస్ఫీతప్రతాపాదిభా
స్వరుఁడై వర్తిలు వేతెూకండు మహిషస్వామిస్థితిన్ బోలునే. 201

చ. అనవుడు లేఁతనవ్వు నగి యజ్జగదంబిక పల్కె "దేవతా
జనవిగ న న్నెఱుంగుము ప్రశంస యొనర్చితి కాన నంతయున్
వినిచెద మీవిభుం డిడెడివేదన కోపక నన్ను వేఁడినన్
బనిఁ గొని వచ్చితిన్ మహిషుఁ బట్టి వధించి సురాళిఁ బ్రోవఁగన్. 202

వ. ఇంతవట్టును నీయందలి వినయవిధేయతలకు మెచ్చి వచించితి వేతొక్క తెఱఁగేని యిప్పుడ నిన్ను వధింతు వింకఁ జాగు సేయక పోయి మీ రాజునకు నారాక యెఱింగించి యిటు వచియింపుము. 203

## దేవీ మహిషదూత సంవాదము.

శా. "జీవింపన్ వలతేనిఁ దత్క్షణమ స్వశ్శ్రీని వీడి పాతాళముం
బోవం జూడు మనుగ్రహించి విడుతున్, బో నేరకున్న న్నినున్
దేవప్రీతిగ యుద్ధరంగమున మద్దివ్యాస్త్రపాతమ్ములం
గావింతున్ మృతుఁగా మదగ్రమున నీగర్వంబు దుర్వారమే. 204

చ. ప్రతియుగమందు దుర్మదులు పల్వురు నీవలె దేవపీడ సం
తతగతిఁ జేసి మచ్ఛరశతమ్ముల రూపఱి పోయి రింక నీ
గతియును నట్లకాఁ దలఁచి గర్వము వీడుము ధాత నీకు మె
చ్చి తివిరి యిచ్చునవ్వరము చెల్లదు పొల్లగు మచ్ఛరమ్ములన్. 205

ఉ. కావున దేవసద్మమును గర్వముతోడన వీడి పొమ్ము లే
దా, వెఱపేది శస్త్రములు దాల్చి రణమ్మున కేగుదెమ్ము నీ
కావర మింతలో వడఁచి కాలునిప్రోలికిఁ బంపి స్వర్గ మా
దేవతలందు నిల్పెద విధేయులఁ బ్రోచుట నాకుఁ జెల్లదే." 206

వ. అని మహిషునకుం జెప్పుము పొమ్ము నాపుడు మంత్రి యయ్యంబిక కిట్లను, 207

ఉ. ఎక్కడిమాటలియ్యవి! మృగేక్షణ! యౌవనగర్వసంపదన్
మిక్కిలి మీఱి పల్కెదు సమిద్ధపరాక్రమశాలి మావిభుం

డెక్కడ ? బాల నీ పతని వెక్కటిపోరున నిగ్రహించు లా
వెక్కడ ? నమ్మ శక్యమగునే ? విను మాతని శౌర్యసంపదల్. 208

ఉ. ఆతని సైన్యమొక్కటియె నైనది కాదు రథాశ్వనాగము
ఖ్యాతతమై పదాతినిచయాకులమైఁ దగుఁ గాన చూప వి
ఖ్యాతుఁ డతండు నిన్నుఁ దన యబ్బురమే ? లలితాంగి ? మన్మథ
స్ఫీతగుణంబు మాంతి నశింపఁగఁ జేయుటయున్ భరంబొకో. 209

ఉ. నీయెడ మానిభుండు గడు నెయ్యము గల్గి చరించునప్పు డే
మో యువతీలలామ ? కఠినోక్తుల పల్కి రసంబు భంగముం
జేయఁగ రాదు నీకిటుల చెప్పుచునుంటి మఱింత యేల నీ
ప్రాయము సార్థకమ్ముగఁ గృపం గను గొమ్మ వరింపు మాతనిన్. 210

గీ. అతని రాజ్యము ధనము నఖిలమును ద్వ. దీయమగు భృత్యుఁడై సేవఁ జేయుఁబట్ట
రాజ్ఞివై మమ్ముఁ బాలింప రాదె ? భక్తి, భావమున నీకు మ్రొక్కెదఁ బంకజాక్షి.

వ. అనిఁ బహుభంగుల సామపూర్వకమ్ముగాఁ బోధించు వానికి నయ్యంబ యిట్లను,

ఉ. నీదగు తెల్వితేటలను నేర్పును వింతియ పిన్న మంత్రిగా
మాఁదినవానికిం దెలివి యొప్పునె ? యోపశుబుద్ధి ! యిద్ద ఱు
వ్మాదుల విద్దుణా హారమనస్కుల విద్దఱు విద్దవే వృథా
వాద మిదేల ? ధాత తగువారిని గూర్చె జగమ్ము నవ్వఁగన్. 213

వ. ఏను స్త్రీ స్వభావమ్మునం జేసి వాని బలపరాక్రమంబు లెఱుంగనని కదా ప్రేలితి వయ్యది నిక్కంబు. ఏను పురుషుంత నొందెఁ దదనుగుణస్వభావ నగు స్త్రీ నొందెఁ గాకుందునని వెండియు. 214

మ. అతిమూర్ఖుండయి యున్న మీప్రభువు కామాసించె స్త్రీచేతఁ బం
చత నద్దానికి తమ్మనన్. వినుము తచ్చాతుర్య, "మెంతే జగు
ప్పితమౌ నంగనచేతఁ జచ్చు" నని తాఁ జిత్తమ్మునన్ రోయఁడ
మ్మతిహీనుం డిపు డవ్వరం బెదిరెఁ దాపైపైఁ జనం బోలునే. 215

చ. "పశుపుని నన్ను నివ్వనిత పోర నెదిర్చి వధించునే" యటం
చరయక మృత్యు నీ వెసమ వందినదంచు నెఱుంగునట్లు మీ
వరపతితోడఁ జెప్పు మొకనాతియ కాదు. తృణంబు వజ్రమై
పొరిఁ గొనుఁ గాలపర్యయము మూఁడిన నెంతటివానికేనియున్. 216

వ. కాలంబు సమంజసం బగునప్పుడు వజ్రంబేనియుఁ దూలంబగునట్లగుటఁ దనకుం గల సైన్యమ్ములును నాయుధమ్ములుఁ దక్కటి సాధనమ్ములును వమ్మగు నిక్కువంబని మఱియును. 217

ఉ. కాయము దాల్చువారలకుఁ గాదొకొ మృత్యువు; నిక్కమేరికే
నాయువు నిశ్చలంబె; జలజాసనుఁ డాదిగ నొక్కఁడేని ని
త్యాయుతుఁ డున్నె; చావు లరయన్ బలురీతులు, దైవనిర్మితం
బై యిటు తన్ను మృత్యువు రయమ్మున మ్రింగఁగవచ్చె దుర్మతీ. 218

వ. ఎవ్వని కెవ్విధమ్మున విధించి యుండు వాఁ డవ్విధమునఁ బొలియు, నిట్లుండఁ గొందఱు మూఢులు 'మాకు వరమ్ము గలదు మే మెవ్వరికేని నవధ్యుల' మని విఱ్ఱవీఁగుదు, రట్లు గర్వించినవా రెవ్వరేని శాశ్వతులై యుండిరే; యింతవట్టు నీప్రభువునకు బోధించి జీవింపఁగలఁడేని హవిర్భాగమ్ములను దివమును దేవాధీనం బొనర్చి తన వారితోఁ బాతాళమ్మున కరిగి యందు సుఖమ్ముగ నుండునట్లొనరింపుము నావుడు మంత్రి నిజాంతర్గతంబున. 219

ఉ. ఎక్కువ తక్కువల్ తెలియ కియ్యబలామణి ప్రేలుచున్న దీ
చక్కెరబొమ్మ యుక్కడఁపఁ జాలియుఁ జాలకపోతి రాజు పె
న్మక్కువఁ జేసి దీనిఁ దన మానినిఁ గాఁ గొన నెంచి పంపిన
న్దిక్కెమలాక్షి యేమనిన నెల్లిదమై చన దింత నిక్కమౌ. 220

వ. కావని యుత్తరుణితో ననికి సంతనకట్టితినేని రసాభాసంబగు నట్లు విరసంబొనర్చి ప్రభుసన్నిధి కేగుటెట్లు సమంజసంబగు; అదియునుంగాక కామాతురుం డగుకతన నతండు నారాక కెదురు చూచుచుండు, నట్టియెడ నే నిద్దాని జయించినను నిద్దాని సమరమ్మున నోడినను నిరుదెఱంగు నతనికప్రియంబ యగుంగాకేమి యాతనికడ కేగి చక్కఁగా బోధించి పిదప నతని యభిప్రాయాను సరణమ్మునఁ గార్యంబు నిర్వహించెద నిదియ లగ్గని యతండు మహిషపాలికిం జని కృతాంజలియై యిట్లనియె 221

శా. నీయాజ్ఞం గొని యేగి కంటి నచటన్ నీరేజపత్రాక్షిఁ దే
జో యుక్తిన్ వెలుఁగొందు దాని శరసంస్ఫూర్త్యంచితాష్టాదశ
ప్రోద్యద్బాహువిలాస సింహగత నవ్యాలాశిరోమౌళితో
నీ యందమ్మునుఁ జందముం దెలుపుచు న్నే నిట్లు బోధించితిన్. 222

ఉ. మావిభుఁ డీత్రిలోకముల మన్నన కెక్కినవాఁడు విన్ను సు
శ్రీ వెలయంగఁ బట్టమహిషీపదమం దొగి నిల్పి సేవకుం
డై వశవర్తియై మెలఁగు నాతనిఁ బొందుము మూడులోకముల్
నీ వయి యేలుకొమ్ము రమణీ! యెలప్రాయము సార్థకమ్ముగన్. 223

వ. అను నా పలుకుల కక్కామిని కనలి స్మితం బొనర్చి యిట్లనియె. 224

మ. మహిషీగర్భసముద్భవుం డుఐన నమ్మందున్ సురప్రీతిధూ
ర్వహనై యేదలియిత్తు శక్తి కకటా! పాపాత్మ! నాబోఁటికిన్
మహిషుండా పతి! యెంత హీన యయినన్ మానంబుపెంపేది త
త్స్పృహవాసం బొనరించునే? మహిషియోఁదద్యోగ్య తుల్యాకృతిన్. 225

చ. సురలకు వైరియై మిగుల సోలుచు మత్తిలి దుష్టుఁడై యహం
కరణమునన్ జరించు జనకంటకు నమ్మహిషాధమున్ వధిం
తు నియము మీఱ దైత్యతతికోర రసాతల మేగనేనియున్,
గరుణ దలిర్పఁగాతు" నని కావర మెత్తి వచించెఁ బెల్చనన్ 226

వ. అంత నేనాదుర్భాషణమ్ములకు నైఁపక యుద్ధమ్మునకు నుంకింప నెంచి రసభంగం
బగు నని యోజించి దేవరకు విన్నవింప నిట కరుదెంచితి. 227

ఉ. అంగనయయ్యు నెక్కుడు మదాంధయై బలముఁజ జలంబు ను
ప్పొంగ నిరంకుశంబుగ రణోత్సుకయై చెలువారుదానితో
సంగర మాచరించుట యసాధ్యమ కా నగతున్ జయంబుఁ ద
ద్భంగము నన్న వెట్యేడల దైవవిధేయము లెంతవారికిన్. 228

వ. నావుడు మహిషుం డితిక ర్తవ్యతామూఢుండై వృద్ధులగు మంత్రుల రావించి యీ
యంగన దేవప్రేరితయై చనుదెంచిన శాంబరియగుమాయ యగుం గాకేమి మీర
లుపాయజ్ఞుల రిందు సామాదులయం దెయ్యది ప్రయోజ్యంబగు విశ్వాసార్హంబుగా
వచియింపుఁ డనిన వార లిట్లనిరి. 229

గీ. సత్యమై ప్రియమైనవచనము పతికిఁ
దెలుపు టుచితంబు రెంటికిఁ దొలఁగకుండు
మాటదొరకదు రుచ్యమై మందు రోగ
హారి యగు చెందు దుర్లభం బంద్రు బుధులు. 230

గీ. అనృతమునఁ బ్రీతి పుట్టించు నతికపటులు, వేనవే లుండ్రు సత్యమ్ము వినుచువాఁడు
వినెడివాఁడును దానిని మననచేయు, వాఁడు మూగురు దుర్లభుల్ పార్థివేంద్ర. 231

వ. కావున నెడతెగని యిమ్మహాకార్యమ్మునందు నీ కెట్లు ప్రీతికరుల మయ్యెద మది యునుం గాక రాఁబోవు శుభాశుభమ్ము లెవనికి వేద్యమ్ము లనవుడు మహిషుండు మంత్రుల కిట్లను. 232

క. తప్పేమి మీకుఁ దోఁచిన, యొప్పున వచియింపుఁ డిందు యుక్తియుతంబై
చొప్పడువానివచనమున్, గొప్పఁగఁ జేసి కయికొందుఁ గోర్కె దలిర్పన్. 233

## మహిషుండు దేవికడకుఁ దామ్రుం బంపుట.

వ. నావుడు విరూపాక్షుం డను మంత్రిశ్రేష్ఠుం డతని కిట్లనియె. 234

చ. అనృతము సాహసమ్మును మృగాక్షిఁసొమ్మని నీవెఱింగి యి
వ్వనిత ప్రగల్భవాక్యములఁ బ్రౌఢిమ గోల్పడఁ జెల్లునే? యొకం
డనక ననున్ వెసం బనుపు మవ్వనితన్ వధియింతు నొండెఁ గా
దనినను నాగపాశముల నంటఁగఁ గట్టెద, నిన్నుఁ జేర్చెదన్. 235

వ. పిదపఁ జేయునదిలేక వశవర్తినియై నీకోరినయట్లు వివిధ భోగమ్ములం దేల్చి నీయం దనురక్తయై యుండు నిది నాకుం దోఁచిన తెఱంగు, త్రిలోకవిజయం బొనర్చిన నీబోఁటి కొక్కబోటికై యింత తలంక వలయునే? యిది బిభీషికా మాత్రంబ కాని వేఱొండు గాదు నావుడు దుర్ధరుం డనుమంత్రి యిట్లనియె. 236

మ. అమమావమ్మునఁ జూడ నవ్వనిత కామాసక్తగాఁ దోఁచె నం
గనలం దిట్టి బిభీషికల్ గలవు వక్రప్రక్రియం బూరుషుం
గని లోఁగొందురు హావభావవిధు లాకర్షింతు రీచెయ్వు, ని
వ్వనజాక్షీమణి నిన్నుఁ గోరి యిటు పైపై వక్రతల్ సూపెడున్. 237

చ. "శరముల నీఁ జయింతు" ననె సారసగంధి, తదర్థ మన్యగో
చర మగు నెట్టు? లమ్మదనశాస్త్ర మెఱింగిననాకుఁ దక్క, భూ
వర! శరముల్ కటాక్షములు, వ్యంగ్యవిధిన్ గ్రహియింపు తత్పరం
పరల విగిడ్చి నిన్ను వశవర్తిగఁ జేయుతలంపు గాఁ దగున్. 238

వ. అమ్మగువ వచియించిన వాక్యమ్ముల కెల్ల నర్థం బిట్లన యోజింపవలయు నట్లు గాదేనిఁ ద్రిలోకమ్ములం జయించి హరిహరాదులఁ జీరికిం గొనక నిష్కంటకమ్ముగ

రాజ్యంబు శాసించు నీవయి నొక్క యబల బాణపాతం బొనరించు టది యేటి మాట। ఇంక నొక్కటి యుపదేశింతుము, "బాణప్రయోగం బొనరించి నిన్నుం బడ వైచెద" నని కదా, యుత్తరోక్తి పలికె। "పడవైచెద" ననుటకు వ్యాఖ్యానం బవధరింపుము. 239

చ. మొదలఁ గటాక్షపాతమున మోహితుఁగా నొనరించి మీఁద దు
ర్మదమున యుద్ధరంగమున మంజులశయ్య బలాత్కరించి విన్
జమునఁ బండబెట్టి పురుషాయితబంధమునన్ గరంతు నం
తదనుకఁ బాతు" మంట యది తత్త్వము మాకెఱుంగఁబోలునే 240

వ. మఱియును నిన్ను విగతప్రాణుఁగా నొనరింతుననుటకు నర్థంబు వినుము. ప్రాణం బనఁ దేజంబు దాని నపహరింతుననుట. యుత్తమాంగనలు వ్యంగ్యప్రధానముగ్నగాఁ మాటలు పలియింపుట గామశాస్త్రసమ్మతంబు. నీ వజ్ఞుండగువానిం బంపిన వాని కీ యర్థంబు గోచరం బగునే యని వెండియు. 241

ఉ. నామము దానముం గొలిపి చంపకగంధినిఁ బొందు మొండు లే
దీమెయి నీకుపాయము, మది యెంతటిగర్వము వేనిఁ దార్చుఁగా
కేమి మహాంత కోపవతియే యగుఁగా కిటు చేసినన్ వశం
బై మరగున్ గ్రమమ్ముగ, మృగాక్షులభంగులు వక్రవక్రముల్. 242

క. పలుమాటు లేల యచ్చిలు, కలకాలికిం దెచ్చి నీకుఁ గామక పేయం
గల నమ్మఁ బనుపు మావలఁ, గలపవి నేఁ జూచికొనెదఁ గా కసురేంద్రా. 243

వ. అని పలుకునతని కర్థంబై తామ్రుం డిట్లను. "మహాత్మా యిత్యాది కామాతురయు వ్యంగ్యార్థచతురయు నీయందనురక్తయుంగాని నిశ్చయంబు. 244

ఉ. ఆపర మూఁడి నాపలుకులందలి యర్థము సంగ్రహింపు మ
ష్టాదశబాహువుల్ నిశితసాయకముల్ గల దీనివంటి బల్
గాదిలివన్నెలాఁడి నొకకాలమునందును నెందుఁ జూడఁగా
రా దిది యెద్దియో కడు భరంబుగఁ దోఁచు నరిష్టహేతువై. 245

వ. దీని కనుగుణమ్ముగ నాకుఁ బెక్కులు దుస్స్వప్నమ్ము లింతకుమున్న ప్రతిదినమ్మును బొడముచున్నయవి. నేఁటి యుషఃకాలమ్మున నొక కాంత కృష్ణాంబర ధారిణియై యేడ్చుచు గృహాంగణమ్మునఁ బొడకట్టె నిది యట్లుండ. 246

క. ప్రతిదినమును వికృతములగు, రుతు లదర విలక్షణంపు రూపునఁ దగు ప
క్షితతులు గృహములపై రా, ప్రతతిన్ గూయంగఁ దొడఁగె దేవర ! వింటే. 247

వ. ఈదుర్నిమిత్తమ్ముల కెద్దియేని నొకకారణం బేర్పడవలయు, నియ్యెడ యుద్ధరంగమ్మున సన్నద్ధమై యున్నయంగన గంధర్వియు మానుషియు నాసురియుఁ దదన్యయుం గామి తెల్లంబు, దేవప్రేరితయైన యొకమాయ గావలయు నెట్లేని నగుఁగాక సంగరమ్మునకు సంతనకట్టి వెడలుట కర్జంబు జయాజయమ్ములు దైవాధీనమ్ము లగుట బుధుండప్పట్ల నిశ్చయుండు గావలయు శుభాశుభమ్ము లేరికిని వార్యంబులు గావు" నావుడు మహిషుం డతని కిట్లనియె. 248

ఉ. నీ వచనమ్ము లింత తగునే చను మిప్పుడ యుద్ధమందు బల్
చేవ యెలర్ప నవ్వనిత లీలమెయిన్ వశఁగా నొనర్చియుం
దే వెర వయ్యేనేని యిటు తెమ్మటు దక్కినఁ దీవ్రబాణముల్
ప్రోవులు గా నిగిడ్చి జను ప్రోలికి దాసి నొనర్చు మేత్తెఱఁగా. 249

ఉ. వీరుఁడవై స్మరాగమవివేకివి వాఁ గర మొప్పు నీదుగం
భీరత నేఁడు చూడవలె వే చని వేగిరపాటు దక్కి యం
భోరుహనేత్ర యియ్యెడకుఁ బోరఁగ వచ్చెనొ, పొందవచ్చెనో !
నేరుపుమైఁ గనుంగొనుము నిక్కమెఱింగి దొడంగు మాజికిన్. 250

గీ. కేవలము నిర్దయుండవై కినియ కత్త, లోదరీమణి నెమ్మది నున్న తెఱఁగు
పరసి యప్పటి కనుకూలమైన వలని, ననుసరింపుము పొమ్ము జయమ్ముఁగొమ్ము.

వ. అని యానతిచ్చినఁ దామ్రుండు కౌలవశుండై సైన్యమ్ములు గొలువ మహిషునకు నమస్కరించి వెడలి యెడనెడఁ బొడము దుర్నిమిత్తములు గణింపక చని ముందట.

క. హర్యక్షముపై నెక్కి య, వార్యాయుధహస్త యగుచు వచ్చిన యుద్య
ద్ధైర్యఁ గనె లోకనాయిక, వార్యజ దివిజాపశీసమారాధ్యపదన్. 253

వ. ఇట్లు కాంచి దొదవ్వుల నిలిచి సయుక్తికమ్ముగ వినయపూర్వకమ్ముగ నిట్లనియె.

ఉ. శృంగి వెలుంగుదే ! యతఁ డజేయపరాక్రముఁ డెల్లరూపు లా
రంగొన నేర్చువాఁ డబల ! రాక్షసశేఖరుఁ డావిభుండు నీ
కుం గడు లోఁగి నీదుగుణకోటి గుణించుచు రూపమెంచి పా
ణిం గ్రహియింపఁ గోరెడు గణింపఁ దరంబె భవద్విశేషమున్. 255

## తామ్రుండు దేవితో సంభాషించుట.

క. మాయేలిక కేలికవై, నీ యిచ్ఛకు వచ్చినట్లు నిర్జరభువన
స్థాయినివై నందనమునఁ, బాయక విహరించుకంటె భాగ్యము కలదే. 256

ఉ. సుందరమైన దేహ మిటు చొప్పడె నీకుఁ బురాకృతంబు మే
లందినదాన పౌట నకటా యిది యెట్లు ఫలించు మావిభుం
బొంది సుఖింపవేనిఁ బువుఁబోఁడిరో! కల్పకసూనవిస్ఫుర
త్కందుకముల్ ధరింప కిటు కత్తులఁ బూనఁగ నేల పాణులన్. 257

ఉ. మానిని! యేలొకో, తెలివి మాలి ధరించితి చాప మస్త్రసం
తానముతోడ? భ్రూలతలు నాజెవుఁజూపులఁ దత్తదర్థ సం
ధాన మొనర్పఁ జాలవొకో! తన్వి! సుమమ్ములఁ బూని యైన నె
వ్వానికిఁ బ్రీతి గావి యవి పల్లవపాణికి నీకుఁ జెల్లునే. 258

వ. అదియునుంగాక వింకొక్కఁడు వచియించెద యుద్ధమ్మునకవ్వ సంసారికి వేఱొండు దుఃఖమ్ము లే దైవను లోభావృతులై యుద్ధావికి మదాంధులు సమకట్టుదురు, నీబోఁటి బోటి కియ్యది యేల? అమ్ముగ్రహించి దేవదానవపూజితుండై లోకమ్ములెల్లఁ దానయై యతిశయించు నస్మదధిపతి మహిషాసురు వరియించి పట్టమహిషివై యిష్టోపభోగమ్ము లనుభవింపుము సంగరమ్మున వేరికేని జయంబు సంశయగ్రస్తం బింతయు నీతివేదివి వగు నీకుఁ దెల్లంబయని వెండియు. 259

చ. అతవి వరించి యౌవనమునందు సుఖమ్ములు గూడఁ బెట్టి వి
ర్జితసురనాథుఁడై మహిషుదేవకు మించెడివాని లోకసం
స్తుతు సుతుఁగాంచె దీవు కడు సుందరుఁ దత్తనుజుండు మీఁద దై
త్యతతికి రాజగుం దవదుధాటి సురాసురులెల్ల మెచ్చఁగన్. 260

వ. అను తామ్రునివచనమ్ములు విని మేఘగంభీరభాషణమ్ముల నయ్యంబిక యిట్లనియె.

శా. ఓరీ తామ్ర, కటుప్రలాప! వినుమీ యుక్తుల్ సహింప న్నమం
దేరం బంచినవానితల్లివలె గేదె న్నేను గా, నట్టి దు
ష్ప్రారంభున్ యవసాశి నమ్మహిషుఁ గామార్తున్ వరింపంగ నా
కేరీతిం దగుఁ బుచ్చుముం దురుదరం బేలీల నేఁ దాల్చెదన్. 262

ఉ. హరిహరవీరజావనుల నష్టదిగీశులఁ గోర కక్కటా!
మరుచిరమూర్తియంచుఁ దమ మానశరార్తుఁ దృణాశి శృంగి నే

వరువిఁగఁ బొంది లోకమున వారని దుర్యశ మంద వెజ్జీసుం
దఁటనె ; వళుఁ వరింపఁదగు తన్వియుఁ గల్గెనె యేయుగమ్మునన్. 263

వ. అదియునుంగాక నిర్గుణుండును నిర్మముండును సర్వసాక్షియు సర్వకర్తయు నక ర్తయు సర్వజ్ఞుఁడును సర్వగుఁడునుఁ బూర్ణుండునుఁ బూర్ణాశయుండును శివుం డును శాంతుండును సర్వభావనుండు నగు పురుషుండు మద్భర్త, అతనిఁ ద్యజించి హేయతాభాజనమ్మగు దేహమ్మునం బొల్చుమందాత్ము న్నధముఁ ద న్నే మని వరి యింప నుంకింతు నని వెండియు. 264

ఉ. శాతశరాశిఁ గాలుమహిషంబుగఁ జేసెద మీవిభున్ మరు
ద్భూతికిఁ దక్కి భీతిమెయిఁ బోయి రసాతల మంటియున్న వ
క్కాతరుఁగాతు నింతయును గ్రక్కునఁబోయి వచించి యుద్ధపుం
జేఁతకుఁ బిల్వు మత్తులవఁ జెచ్చెర వచ్చినఁ ద్రుంతు వ్రేల్మిడిన్. 265

శా. భిగ్నాళుండు ననున్ వరించునె ; మదప్రాగ్భారదుర్వారధీ
మగ్నాత్మ్కా మహిషాధముం దను నికామప్రోజ్జ్వలన్మామకా
స్త్రాగ్నిజ్వాలలఁ బ్రేల్తు నంచెఱుఁగఁడౌరా ; తామ్ర ; యంచున్ రిపుల్
భుగ్నప్రాభవులై కలంగ రవముం బూరించె ఘోరమ్ముగన్. 266

శా. స్వర్భూదుర్భర మైనయారవమునన్ సప్తాంబుధుల్ దూలె నం
తర్భారంబు సహింప కద్రులు ప్రతిధ్వానమ్ము లిచ్చెన్ భయా
విర్భావమ్మున దైత్యసంఘములు కంపించెన్ దదీయాంగనా
గర్భమ్ముల్ పగిలెన్ దిశావలయ మేకంబాయె నొక్కుమ్మడిన్. 267

ఉ. ఆ రవ మాలకించి భయమంది పలాయనశాలి తామ్రుఁడెం
దే రయ మార నమ్మహిషధీరుని సన్నిధి కేగె, మున్న త
త్పౌరులకర్ణముల్ బధిరభావము దాల్పె ననంతరంబు నా
గారియు గర్జిలెన్ ద్విగుణ మయ్యె భయమ్ము సురారికోటికిన్. 268

వ. పిమ్మట మహిషుండు భయత్రస్తుండై తన కడ కరుదెంచిన తామ్రుం గాంచి పచి పులదిక్కు మొగంబై చింతాదంతురం బగు చిత్తమ్మున నుత్తలపాటుగదుర నిట్లనియె. 269

మ. గరువం బేది రసాతలమ్మునకుఁ బోఁగా నెంతుమో దుర్గ మె
వ్వరికిం భేద్యము గాసరీతి నొనరింపం జూతుమో లేక సం

గరరంగమ్మున నత్తలోదరిఁ గడుఁగా గారింతుమో యెంచి మీ
ర్వరబుద్ధుల్ వచియింపుఁ డియ్యెడల శాస్త్రప్రక్రియాధుర్యులై. 270

గీ. మంత్రమూలంబు రాజ్యంబు మహిపతులకు, నదియు గుప్తమ్ము గావలె నట్లు గాని
చో వినాశమ్ము గలుగు నిచ్చో సమగుణ, మైనవలను విచారింపుఁ డయ్య మీరు. 271

ఉ. వచ్చినకాంతగా దబల, వైశమ వోయి జయింప రాదు తా
వచ్చపలాక్షి యెక్కటిగ నాహవకేళికి నిర్భయమ్ముగా
వచ్చుట కొంత చింత్యమగు వారక పోరితి మేని మీఁద మే
ల్వచ్చునొ! కీడు వచ్చునొ! శుభం బశుభం బెవఁడోపుఁ జెప్పగన్. 272

వ. ఉపాయవాదులు కొందఱు దైవం బన నెద్ది యెవ్వఁ డెఱుఁగు నోపినవట్టు యత్నం బొనరించుట కర్జం బంద్రు. కొందఱు దైవమ్ముమ నుద్యమంబును గార్యసిద్ధి ప్రదంబు లని చెప్పుదురు. మీమీ బుద్ధిబలమ్మున నిం దెయ్యది శ్రేయమో వివరింపుఁ డనుడు బిడాలుండను మంత్రి యతని కిట్లనియె. 273

సీ. మహిషేంద్ర వింటె! యిమ్మహిళ సురప్రేర • ణంబున నిటకు యుద్ధంబొనర్ప
నేతెంచె విక్రాంత యెల్లసురలయంశ • ములఁ బుట్టుటయు విక్రమముగ నెఱుంగ
నయ్యె. త్రిభీతు విన్నమరుల వంచింప • నిప్పాట యోజించి రిక్రతమునఁ
గాదె దౌదవ్వులఁ గడిసి యెల్లరు సహా • యులు గాఁగ మంకించు చున్నవారు

గీ. మనము రణమున కేగిన వనజనేత్రుఁ
దొట్టి సురలెల్ల నసురుల గిట్టఁ జేయఁ
గడఁగుదురు విమ్న మాత్ర మక్రాంత చంపు
నెఱిఁగి తగుయత్న మొనరింపు మింత నిజము. 274

వ. నా బుద్ధికిఁ దోఁచిన విధమ్మునఁ జెప్పితి భవితవ్యం బెఱుంగ నంత సమర్థుండనే! నీ కెయ్యది సులభంబగు నట్లు పచరించునది యేకాకినియై కామిని యుద్ధార్థిని యగుట యెంతకేనియు నక్కజంబగు ననునంత దుర్ముఖుండను సచివుం డిట్లనియె. 275

చ. జయ మిఁక నీకు లే దనుట సత్యము నావచనంబు తప్ప ద
ట్లయినఁ "బలాయనంబు వర" మన్నసురావళివెల్ల నోర్చి యొ
క్కయువతి కిట్లొనర్చుటయుఁ గాదు, రణం బొనరించి చచ్చినన్
బయి నెగడున్ యశంబు జయపక్షమునన్ సుఖ మప్రమేయమౌ. 276

వ. అనిన బాష్కలుం డిట్లనియె. 277

ఉ. ఏ నొకరుండనే చని జయించి యమాలయ మేగునట్టు ల
మ్మానినిఁ జేయు వాఁడ ధృతిమంతుఁడ వయ్యు నధీరుభంగి నీ
కౌనె భయమ్ము చెంద; నమరాధిపుఁ దొట్టి దిగీశులెల్లరన్
దీనులఁజేసి యిక్కరణిఁ దేఁకువ దక్కుదురయ్య! కొంతకున్. 278

గీ. ఈవు సంగ్రామమునకు రానేల! నన్నుఁ, బంపు మొక్కింతమాత్ర నప్పడఁతిఁ జంపి
మగుడ నీకడ కరుదెంతు మహిషరాజ!, మామకీనబలంబు సామాన్యమయ్య! 279

వ. అంత దుర్ధరుండు వినతుండై యిట్లనియె. 280

ఉ. నీ కయి దేవతల్ మిగుల నేర్పునఁ బన్నినయీలతాంగి మా
యాకృతి నొక్కఁ బ్రేల్మిడి శితాస్త్రపరంపరలన్ వధింతు నా
నాకుల కాకులత్వము రయమ్మునఁ గూర్తు విభీషికార్థ మీ
రాక యెఱుంగు, మింతయుఁ గరంబు తిరంబుగ నిర్వహించెదన్. 281

వ. అంతియకాని రాజనీతివిరుద్ధంబగు తెరువునఁ బోవలదు. మఱియొక్కటి వినుము లోకమ్మున సేవకులు సాత్త్వికరాజసతామసభేదమ్మున మూఁడు తెఱంగులవా, రందు సాత్త్వికులు స్వామికార్యమ్ములు సాధించుచుఁ దదవిరోధమ్మునం దమ కార్యమ్ములు నిర్వహించుదురు రాజసులు స్వకార్యతత్పరులై యొక్కొకతఱిని స్వామికార్యంబులును యదృచ్ఛగా నిర్వహించుదురు, తామసులు స్వామికార్యంబు దిగఁ ద్రొక్కి స్వకార్యతత్పరత్వమ్మున వలనగునెడ మార్తురం గలసి ప్రభుచ్ఛిద్రమ్ములు వెలిఁజేయుచుఁ గోశగుప్తంబగు వసివడువున భీతిం గొలుపుదురు. 282

క. కావునఁ దాదృశులగు దు, ర్భావుల నమ్మంగఁజనదు ప్రభువులు, మంత్రం
బా! వెలికిఁ బోవు కార్యం, బా! విపరీతించు నట్టియదయుల కతనన్. 283

## బాష్కలదుర్ముఖులు దేవితోఁ బోరుట.

వ. అట్లగుట నీవు నిశ్చింతమ్ముగ నుండు మేమును బాష్కలుండునుం గలసి యరిగి యక్కామినిం జయించి నీకడకుం దోడితెత్తుమని యిరువురును గృతనమస్కారులై దిక్కులు గ్రక్కదలఁ బురమ్ము వెలువడి దేవింగాంచి యిట్లనిరి. 284

ఉ. ఓ వశినాయతాక్షి! వినుమొక్కఁడు పంచెద మేము విన్ను, మా
దానవనాయకున్ మహిషుఁ దత్పరతన్ వరియింపు మాతఁడున్
మానవరూపమంది విను మన్ననఁజేయు రహస్యమందు; దు
ర్మానమ్ముమై నవిం గడఁగి మానముఁ బ్రాణముఁ గోలుపోదురే. 285

వ. కామరూపుఁడగు మారాజుతో సకలభోగమ్ము లనుభవించుచుఁ ద్రిలోకమ్ముల కేలి
కపైఁ యేలికొమ్ము నావుడు దేవి యిట్లనియె. 286

గీ. ఎంత కామినియయ్యుఁ దా నేలతాంగి
యధముఁ బతిఁగ వరింపఁగ నాత్మ నెంచుఁ
గులము శీలమ్ము గుణమును గలుగు తగిన
వరుని పరియించుఁ దన కంత వలయునేని. 287

చ. వెడవెడ మాటలాడుచు బిభీషిక లియ్యెడఁ జూప కింక మీ
యొడయనియొద్ద కేగి సముఖోన్ముఖుఁడై చనుదెంచునో, రయం
బడర రసాతలమ్మునకునై చనునో తెలియంగఁబల్కు యి
య్యెడ కదఁదెంచి నొద్దుఁ డిఁక నే సహియింప దురుక్తు లాడినన్. 288

ఉ. ఆ కఠినోక్తులన్ విని దురాత్ములు దైత్యులు బాణవృష్టి పెం
జీఁకటి గ్రమ్మఁగాఁ గురియఁ జెచ్చెర నజ్జగదంబ సింహనా
దాకులులై రిపుల్ బెదర నంపగముల్ పిగిడించి నంత దు
ర్ధీకుఁడు బాష్కలుండు చనుదెంచెఁ జమూతతి కగ్రగామియై. 289

క. ధట్టుండై యస్త్రమ్ముల, నెట్టన పద్దేవిమీఁద విగిడించిన వ
ప్పట్టున వయ్యంబయుఁ దా, బిట్టేసె శరములు వేనవేలు గడంకన్. 290

వ. ఇట్లు బాణపరిఘాసిఘాతమ్ముల విడువురుం దుములమ్ముగాఁ బోరుతఱి, 291

శా. ఆకర్ణాంతము చాపముం దిగిచి పంచాస్త్రమ్ము లద్దేవి య
స్తోకాహంకృతి వానిపై విడువ నా సోఁ కన్నిటిం ద్రుంచి వి
ర్భీకుండై యొకయేడు బాణముల దేవిం గొట్టి బిట్టార్చె రా
ద్రాకారమ్మున నంబయున్ దశశితాస్త్రావిద్ధు జేసెన్ రిపున్. 292

ఉ. వానిశరమ్ములం దునిమి వాఁడిశరమ్ముల నొవ వేసి య
మ్మానవభక్షదీవాప మవమానరయమ్మునఁ ద్రుంచి సింహనా
దానుగతిం జెలంగె జగదంబ, మురారి గదాత్తహస్తుఁడై
పూనిక నేగుదెంచె వలపుష్పసుగంధిని బిల్కమార్పఁగన్. 293

మ. అటు లేతెంచెడి బాష్కలుంగని గదన్ హస్తమ్మునంబూని యె
క్కటి కయ్యమ్మున మూర్ఛవోవఁదెచె వక్కంజాక్షి; వాఁడంతలోఁ

బటువేగమ్మున మూర్ఛఁ దేఱి గదవైవన్ దాని వారించి మి
క్కుటమౌ శూలమున న్విలింపరిపునక్కుం జించె నయ్యంబయున్. 294

ఉ. శూలముదాఁకి బాష్కలుఁడు సోలి యమాలయగామియై మరు
జ్జాలమువంత దీర్చె నది సైఁపక దుర్ముఖుఁ డాగ్రహమ్మునం
మూఁచుఁ జేరి నెక్కు 'విలు తొయ్యలి! యెక్కడకేగ వచ్చు వి
న్నాలములోఁ బొరిం గొనెద' నంచు శరమ్ముల ముంచి యెత్తినన్. 295

ఉ. వక్త్రము జేవురింప సురవైరులు భీతిల శంఖనాద సం
సక్తములై దిశల్ గలఁగ శక్తి గుణారవ మాచరించి త
న్ముక్తములైన మార్గణసమూహములన్ బొడిచేసి వానిపై
శక్తిముఖాయుధమ్ముల నసంఖ్యముగాఁ బరఁగించె నుద్ధతిన్. 296

వ. అంత దుర్ముఖుండు తత్తదాయుధమ్ముల నాత్మసాధనమ్ముల మరలించుచు నుక్కు మిలిగి యంబికపై ననేక శరమ్ముల విగిడించుచుఁ బోరాడు నవసరమ్మున సంగరమ్ము దుర్భరంబయ్యె. 297

గీ. అంబచే నవిఁ జచ్చిన యమరశత్రు, వికరముల గాత్రముల నుండి నెగసి రక్త
మేఱు గట్టె శివాకాకగృధ్రసార. మేయములకెల్ల సంతోషమాయతముగ. 298

ఉ. దుర్ముఖుఁడుగ్రకోపగతి దోఁపఁగ హస్తము నెత్తి పల్కె దు
ష్కర్ముఁడు "వింటె యోజలజచారువిలోచన! మానృపాలు నం
తర్మద మేది పొందు మటు దక్కిన నిన్ బరిమార్తు నుజ్జ్వల
ద్ధర్మవిముక్తతీవ్రవిశితప్రదరమ్ముల పాలు పేయుచున్. 299

ఉ. దుష్కరమైన కోపమునఁ దోఁగుచు నంబయు వానిఁబల్కె 'మీ
బాష్కలుఁ డేమియయ్యెర యపాత్ర! యపత్రపఁదక్కి దుర్మదా
విష్కరణంబు సేయఁగలవే యుఁకఁ గాలము దగ్గ ఱయ్యె నీ
శుష్కవచఃప్రసంగములు చూచెదఁ జక్కఁగ విల్వ మాజికిన్. 300

ఉ. శాత్రవుఁ డంబ పల్కులకు సైఁపక కోపకరాళవక్త్రుఁడై
మాత్రవ వించె నెక్కుడగుమార్గణముల్ ధృతిఁబూని యా జగ
న్నేత్రి శరమ్ముల న్నఱికి పీఱుగఁజేసి యొకంట వాని దు
ర్గాత్రము గ్రుచ్చె విక్కరణిఁ గర్కశ మయ్యె రణమ్ము వారికిన్. 301

ఉ. శూరులు మెచ్చఁ గాతరులు సోలి భయంపడ నొక్కట న్నిలిం
పారి శరాసనమ్ము దునుమాడి శరమ్ముల నేయుటన్ వెసన్
దేరు విరల్పడ న్నటకి దేవి భయంకరమూర్తి గాఁగ దే
వారి గదన్ గ్రహించి రయమారఁగ సింగముఁ గొట్టె బిట్టుగన్. 302

శా. రత్తావృతగదాభిఘాతహతమూర్ఛంబయ్యె హర్యక్ష ము
న్మత్తప్రక్రియ సీరఁ దోఁకఁ బిలువ న్మర్త్యారి కోపించి యు
ద్యత్తీవ్రస్థితిఁ బైకి రాఁ గని కనద్ఖడ్గంబు చేఁ బూని సం
కృత్తస్ఫీతకిరీటమస్తకునిఁ గా నేసెన్ సురల్ మెచ్చఁగన్. 303

వ. ఇట్లు విమ్ముఖంబున సమసిన హతశేషులైన రక్కసులు పలాయమానులై యరిగిన మహిషుండు వారలం గాంచి "యేమియయ్యె" నని యడిగి కలతెఱం గెఱింగి క్రోధమ్మును సంతాపమ్మును బెనఁగొనఁ దక్కటిమంత్రులం గాంచి, 304

గీ. అక్కటా! బలవంతులై యమరవరుల, నోర్చి పెం పెక్కినట్టి యీ యోధు లిట్లు
సత్తురే యాఁడుదానిచే! శక్యమగునె, కాలయోగమ్ము దాఁట నొక్కనికినేని? 305

## చక్షురతామ్రుల యుద్ధము.

వ. అని వనటం గుందు రాజు నాలోకించి చక్షురుండు దేవా! యింత వగవ నేల వేగ నేగి యీ క్షణంబ యమ్మానినిం బొరిగొందు నని యాజ్ఞం గొని తామ్రుండు దనకు బాసటగా దిక్కులు పిక్కటిల్ల సింహనాదమ్ము లొనర్చి పేర్చు దైత్యచమూసమూహమ్ములతోఁ గదలి చనుదెంచుచుండె; నవ్వాని దౌదవ్వులం గని, 306

ఉ. అంబిక ఘంటికానినద మారఁగ శంఖరవం బొనర్చి మ్రో
యం బిగలాఁగ శింజినియు నద్భుతరావ మొనర్చె దాన భీ
తిం బడి పాఱు దైత్యులఁ గతింగని చక్షురుఁ డాఁగి పల్కె వై
శంబ వధింతు నియ్యబల లావఱ వేటికి నిల్వుఁ డుద్ధతిన్. 307

మ. అని చాపమ్మును గేలఁ బూని జవితాహంకారదుర్వారుఁ డ
య్యుమ నద్దేవినిఁ గాంచి యిట్లను మహోద్యోగమ్మునన్ మ్రోయ నిం
గని భీతిల్లెడి వాఁడఁ గాను వినుమీ కంజాక్షి! నిం జంప నె
మ్మన మెంతే వెనుదీయుచున్నయది సంభావించి దోషస్థితిన్. 308

ఉ. అక్కట! వారునేత్రలు గటాక్షములన్ గురిపించి సంగరం<br>
బెక్కటిఁ జేయుటల్ గలుగునెమ్మెయి నో సరసీరుహాక్షి! నీ<br>
వెక్కడ! కొక్కొశాస్త్రముల నేయుట లెక్కడ! పుష్పమేనిఁ బై<br>
మిక్కిలి దెబ్బ పీడ నునుమేనిపయిం బడె నేని యుగ్మలీ. 309

గీ. క్షాత్త్రధర్మాసుటీపుల జన్మ మెంత, నిర్దయాత్మక మెమ్మెయి నెమ్మి గలిగి<br>
పెంచుకొను దేహమును గడుఁ బేశలమ్ము, గాఁ దలంపక ఖండింత్రు ఖడ్గతతుల.

గీ. ధనలోభమ్మునఁ గత్తులు, గొని పసులం బొడిచి తృప్తి గొందురు లోకం<br>
బున మూర్ఖు, లెంతకేనియుఁ, జొనుపుం దంధనము ధనము సుందరి! యెందున్.

చ. తెలిసినదాన వయ్యు నిటు తేఁకువఁ దక్కి లతాంగి! భోగజ<br>
మ్మొఁగు సుఖమ్ములన్ విడిచి పో రొనరింపఁగ నేల పేర్మి నా<br>
పలుకులు సమ్మతించి సుఖపాలుర నొంచి దివంబు గొన్న ధీ<br>
రలలితు మానిభుం గొని కరంబు సుఖింపుము నీక్రమొక్కెదన్. 312

ఉ. కత్తులు హత్తి శస్త్రములు గాఁడి శరీరము భిన్నభిన్నమై<br>
మిత్తికిఁ బాలుగాఁగఁ బయి మిక్కిలి నక్కలు కంకగృధ్రముల్<br>
నెత్తురు గ్రోలి మాంసమును నెమ్మిమెయిం దిని యాడ్చు నక్కటా!<br>
మెత్తురు సత్కవీంద్రు లవి మేటిగ నేమిగుణంబు చూచిరో! 313

క. అవిఁ దెగినవారలకు నా, కవివాసము గలుగునంద్రు గా కే మది యెం<br>
త నిజమొ తెలియదు నా బు, ద్ధిని నివి మారాజు నెనయఁ దివురు మృగాక్షీ. 314

చ. అవ జగదంబ వల్కుఁ గడు నాఅడికూఁతలు గూయఁబోకు శా<br>
స్త్రవిధిని వోలె నీలెదవు రాజులనీతి యెఱుంగుదే? మహా<br>
జనపహవాస మెయ్యెడల సల్పక కాఁతెనుపోతు నేత్త మం<br>
దిన నిసుఁబోటికిం దెలియునే! శ్రుతిగమ్యములైన ధర్మముల్. 315

చ. సురలకుఁ జెట్టచేసి కడుశూరుఁడువోలె మదించినట్టి ము<br>
ష్కరు మహిషాధమున్ జముపసద్మము చేరఁగఁజేసి శాసనా<br>
క్షరములతో జయార్థమగు కంబము నియ్యెడ నిల్పుదాన సు<br>
స్థిరత యెలర్ప నిల్పి యని సేయుము నిన్ మొదలన్ వధించెదన్. 316

వ. జీవితేచ్ఛాగ్రంథిగ్రస్తుండ వయ్యేదేని నీ రాజునకు బుద్ధి సెప్పి హతశేషులతోఁ బాతా

శమ్మునకుం బోవునట్లు పేయు మనవుడు దానవుండుఁ గ్రోధమూర్ఛితుండై ఘనా
ఘనాసారమ్ములు వోని శరంబులు గురిసిన, 317

ఉ. ఆ జగదంబ వాని ప్రబలాస్త్రములన్నియు మగ్గుచేసి స్వా
రాజముఖామరుల్ వొగడ రక్కసుపైగదవైచె దానఁ దా
రోఁజుచు మూర్ఛవోయెఁ గడురోషము గల్గియుఁ జక్షురుండు; ప్రో
త్తేజితశౌర్యుఁడంత నరుదెంచెను దామ్రుఁడు చాపధారియై 318

ఉ. వచ్చిన తామ్రుఁగాంచి రిపుభంజని యజ్జగదంబ "రమ్మ నీ
మచ్చర మేద నజ్జముని మందిరముం జొరఁజేసి పుత్తు మీ
వచ్చినవార్తఁదా విని వెసం జనుదెంచెడిఁ గాక దుర్మదుం
డచ్చపలుండు మీకుఁ బ్రభువైన హయారి రణంబుసేఁతకుఁన్, 319

క. మీరెందఱు వచ్చిన నా, క్రూరుఁడు మహిషుండు చావు గూరకయున్నన్
గోరిక తీరదు సురలకు, రా రమ్మను మద్దురాత్ము రణమొనరింపన్. 320

శా. మా యన్యోన్య పరాక్రమమ్ములపసల్ మా యుద్ధచాతుర్యతే
జోయుక్తుల్ గనుఁగొందుగాక చవి తుచ్ఛున్ బుచ్ఛవిభ్రాజితుఁన్
దాయంబంపుము మీ విభున్ జముఁనిగూడం జేసెద న్నాఁగ 'నో
హో' యంచుఁన్ వడివార్చి యేసెశరముల్ యుద్ధార్థితామ్రుండొగిఁన్. 321

మ. శరవృష్టిఁన్ శరవృష్టి నేర్చి కడఁకఁన్ శౌర్యం బవార్యంబుగా
విరుగేల విగిడించె భల్లములు దేవేంద్రాదు లగ్గింప న
య్యరవిందావన, మూర్ఛదేఱి తగఁ దా వయ్యంబికం జక్షురుం
డురుఁడై మార్కొనె విర్వరం జదిపెఁ గ్రోధోత్సాహియై యంబయుఁన్, 322

వ. దానికిం గనలి రక్కసులెల్ల నొక్కపెట్టున చుట్టుకొని పరశుపట్టిసఖడ్గముసల
భిండివాలాద్యనేకాయుధమ్ము లయ్యంబ పయిం గీలించినఁ బోరు ఘోరంబయ్యె.

ఉ. తాళవనంబు లోహజము దారుణమై విలసన్మణీమృణుల్
గ్రాల వెసంగు నొక్కముసలంబు కరంబునఁ బూని తామ్రుఁ డా
ఖీలత దోఁప సింగమును బిట్టుగఁ గొట్టె శిరమ్ము రక్తధా
రాళము గాఁగ దానికిఁ గరమ్ముమ వంబిక తీక్ష్ణమూర్తియై. 324

క. అసివెటికి వానిశిరమున్, వెస నఱికిన మొండె మొక్క వ్రేల్మిడిఁగేలఁన్
ముసలంబుదర పటించి ర, ణవరణి వంతంతఁ బడియె నాకు లలరఁగఁన్. 325

వ. అంతఁ బక్షురుండు తామ్రుమరణమ్మునకు నవుడుగఁ అలిగొని ఖడ్గమ్ము కేలం బూని సింహనాదం బొనర్చి యురువడించిన జగదంబ కోపాకులయై, 326

మ. ఒకబాణమ్మున ఖడ్గము న్నఱకి వేఱొక్కంట హస్తంబు భూ
మికి హత్తించి మఱొక్కటఁ శిరముపే ర్మిన్ డొల్లఁగా నేసి ది
క్ప్రకరాభీలముగాఁగ గర్జిలిన భగ్నీభూతమై దైత్యపై
వ్యకదంబం బుడివోయె నొల్కిరి ప్రసూనంబుల్ సురల్ దేవిపై. 327

వ. అట్లు చక్షురతామ్రు లిరువురుం జచ్చుట విని శోకించి మహిషుఁడు దురాగ్రహగ్రస్తుండై యసిలోమబిడాలాదుల ననేకుల ననేకసేనలతోడం జతఁజేసి పవిచిన వార లరుదెంచి యష్టాదశభుజాగ్రజాగ్రదాయుధమండలయగు చండికం గాంచి విస్మయాకులులగు నెడ నసిలోముండు వారలకుఁ గన్నాకై సేనాముఖమ్మున నిలిచి వినయమ్మున నయ్యంబ కిట్లనియె. 328

శా. దేవీ కొండొక చెట్ట నీయెడల నెందేఁ జేయఁగారాని స
ద్భావుల్ దైత్యులు వీరలిట్లు పొలియం దార్కొలు నీకేల ? వీ
రావేశమ్మున దుఃఖదంబగు రణం బాసింతురే ; సంధిమై
నాపెంటం జనుదెమ్ము నీవలయు నానావస్తువుల్ గైకొనన్. 329

ఉ. సారము లేని సంసరణసాగరమందు సుఖంబు గ్రాహ్యమె
వ్వారికి, శాంతిమై పదియుఁ బొల్పదు, దానికిఁ దక్కు మార్దవ
శ్రీ రుచిరంబు కాయము కృశించి వశింపఁగ నేల చెప్పుమా
ఘోరరణమ్మునం దిటుల గోరికచెందితి దుష్కరమ్ముగన్. 330

## అసిలోమ బిడాలాదు లనికి వెడలుట.

క. అసుఖము రెండు తెఱఁగుల, భాసిలు నిత్యం బనిత్యపదవియు నా, వి
ద్యాసంగతిఁ బరు నెఱుఁగుట, యే సుఖమగు నిత్య మది, తదితర మితరమౌ. 331

వ. ఇందు నాశాత్మకంబగు భోగసంభూతసుఖంబు తత్త్వజ్ఞులు త్యజించి నిత్యంబగు నాత్మజ్ఞానంబు వడయమంకింతు రదియట్లుండె. 332

ఉ. సౌగతధర్మ మూనుటయు సమ్మతమేని మృగాక్షి ; శస్త్ర సం
త్యాగము చేసి జవ్వనము సార్థకమై తగ నిచ్చకైన సం

భోగములన్ మెలంగు విరిబోఁడిరొ! ప్రాయము రేపు విల్చునే
ప్రేఁగగునిట్టి తాపమున వేఁతురె పుష్పముఁ బోఁదేహముల్గా! 333

చ. అదియునుఁ గాక యొద్దను నిరాగసులన్ బరితాపపెట్టి యి
ట్లివయతిమైఁ జరించు టది పాపి యగున్, దయకన్న ధర్మము
న్నదియె? తదీయరక్షణమునందు మనం బిది సత్య మిష్టు చె
ప్పఁ దగదె దైత్యవర్గములఁ బట్టి వధింపఁగ నేమి వచ్చెనో. 334

వ. సత్యంబునలవన కదా ప్రాణమ్ములు నిలుచుట దానికిం దప్పుట కొప్పమియు ధర్మం బనఁబడు నట్టి ధర్మమునకుం గట్టునడి కల తెఱంగు చెప్పు మని ప్రాంజలియై యడిగిన వసిలోమునకు నంబ కరుణించి యిట్లనియె, 335

ఉ. నీమవినీతి యింత దగునే! కరుణించి వచింతు నాదు యు
ద్ధాదరకారణంబు; జగమంతయుఁ ద్రిమ్మరుదాన దుష్టులం
గాదని చంపి సజ్జనులఁ గావఁగఁ నొందు ప్రయోజనంబు నా
కేదియు లేదు దీని కయి యెత్తుదు నే నవతారముల్ మహిన్. 336

మ. భయభక్తుల్ విడనాడి దేవతల నొంపం బూనె మీరాజు దు
ర్జయుఁడై; వాని వడంప వచ్చితి యథార్థం బింత; నీ వేగి దు
ర్నయువిం దమ్మహిషీతమాజు విట నే రమ్మన్న చందంబు దె
ల్పి యవింజేయఁగఁ బంపు మమ్యల వృథా ప్రేరేపఁగా నేటికిన్. 337

ఆ. వె. జీవితేచ్ఛఁ దవదుచేతమ్ము పొంసిన, బంధుజనులతోడ బయలు వెడలి
యీఁగకాలియంత యేవియు ద్రవ్యంబు, గొన కధోభువనము జనుట యొప్పు. 338

వ. అరసాతలమ్మునంద మీకులవృద్ధగు ప్రహ్లాదుండు వసించు వాఁ డాతనిం గొలిచి యట మందునది యని చెప్పు మట్లయిన మీరలందఱును బ్రతికి పోవుదు రనవుడు వసిలోముండు బిడాలు దిక్కు మొగంబై ప్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె. 339

ఆ. వె. వింటివే భవాని విచిచినవిధము ద, యార్ద్రహృదయ నంధి కనుమతించె
వి ట్లొవర్చి బ్రతికి యేగిన నేమగు, నా రసాతలమ్మునందయుండ. 340

వ. వావుడు బిడాలుం డిట్లనియె. 341

ఉ. అంబిక చెప్పినట్టి విధ మందఱకున్ సుఖదంబ రాజు నం
ధిం బడయంగనొల్లఁ డెటు దెల్పఁగ వచ్చు నెఱింగి మూర్ఖ రి

తిం బిషువాని ? మృత్యువది దెప్పర మా(గ( దరంబె యుద్ధరం
గంబున( జచ్చువారి( బొడ(గాంచియు( దక్కటివారి నంప(దే. 342

గీ. కడ(గి పాంచాలికలరీతిగా నతవికి, వకులమై యాజ్ఞ( దప్ప(గ వశమె సత్య
ముగ పచించిన పల్కు లెవ్వగ( బ్రియంబు, గలుగ(జేయు నృశంసులొ కావనులకు.

చ. "ధనమును రాజ్యముం గా విడిచి దర్పము నేదియు( గట్టుగుడ్డతో
వనికి( దొలంగి పేగుము భయమ్మున నీవు రసాతలమ్ము" నా
విని యత(డాదరించెడి వివేకము గల్గినవా(డె ; కోపముం
గని మనలన్ 'వధింతు' ననుగాక దురాత్ములు కీడు నెంతురే. 344

ఉ. కావున స్వామికార్య మెనకమ్మున( బూని చరింత మెమ్మెయిన్
జావది సిద్ధమౌ పెజ్జ(గి చావ(గనేల దురాత్ముచేతిలో
నా విని యాత(డియ్యకొనినం జెలరే(గి బిడాలు( దే త్తెలన్
దేవిని నొంచె స ప్తపటు తీవ్రశరమ్ముల వేసి యానునన్. 345

వ. అసిలోముండును ధనుఃపాణియై యంతంత నిలిచి చూచుచుండె( బదంపడి యంబిక
తన్మ క్తమ్ములగు బాణమ్ముల నెడనెడ( బొడిచేసి, 346

గీ. మూ(డు భల్లమ్ములను జాపమున నమర్చి, సింహనాదమ్ముచేసి పేర్చిన రయమున(
బఱపె; వా(డును దద్బాణపాతమునకు(, దొడరి మూర్ఛిల్లి పెద్ద విద్దురయు( జెందె.

వ. ఇట్లు బిడాలుండు సమసిన నసిలోముండు సన్నద్ధుండై రణరంగమ్మునకు వచ్చి
కరంబె త్తి యయ్యంబిక కిట్లను, 348

చ. ఎఱు(గుదు దేవి ; పీకతన మృత్యువు నా కగునంచు; బుద్ధులం
గఱపిన నొల్ల వట్టి విభు( గాదవ లేక రణంబు పే(త కే
త్తెఱ విటు లియ్యకొంటి( గడు(దెంపరినై మరణంబు భీతిమై(
బఱచుటకన్న లగ్గగుశుభం బశుభంబును దైవలభ్యముల్. 349

ఉ. ఇందఱు దానవుల్ చదిసి యేగిరి కాలునిప్రోలి కిందునే
నెందఱు(బోలువా(డ ; విధియెవ్వ(డు దా(ట(గనేర్చు( ; బౌరుషం
బెందును దైవముం గడచి యించుకయుం బనిసేయ దంచు మి
వ్నంద(గ నార్చి యేసె విశితాస్త్రము లజ్జగదంబ దిక్కు(గన్. 350

శా. ఆ బాణమ్ముల నంతరాళమున శాతాస్త్రమ్ములం ద్రుంచి పై
పై బాణమ్ములు గొన్నిటిం జెప పిగుడ్చన్ వా(డు తచ్ఛస్త్రధా

రాబాహుళ్యముచే బ్రవద్ధ్రుధిరుఁడై రాజిల్లెఁ బుష్పాళిలీ
లాబాళాసురకింశుకాగమము హేలన్ జూప నగ్గింపఁగన్. 351

ఉ. పిమ్మటఁ గోప మెక్కుడుగఁ బేర్చి గదంగొని యార్చి సింహమూ
ర్ధమ్మున మొత్త వయ్యది కరమ్ము భరమ్ముగ ఘోరభంగి నా
దమ్మొనరించి శస్త్రములఁ దాఁకెడి తీవ్రనఖమ్ములన్ దదీ
యమ్మగువక్షముఁ జీల్చె నక్కునన్ దివిజాళులందఱు మెచ్చఁగఁ జీల్చె నక్కునన్. 352

ఉ. దానికి లోఁగ కయ్యసురు దారుణభంగి నెదిర్చి యార్చి యా
త్మానుచరుల్ నుతింప రయమారఁగ నాహరిశీర్షమందుఁ గా
టూని పరాక్రమించి గద నుద్ధతుఁడై జగదంబ నొంచె న
మ్మానిని ఖడ్గధార దునుమన్ దల యూడిపడెన్ సురారికిన్. 353

ఉ. రక్కసుఁ డిట్టు లక్కుఱ సురల్ గుసుమమ్ములు గ్రుమ్మరింపుచున్
దిక్కులు పిక్కటిల్ల "జయ దేవి" యటంచు నుతించి మించి తా
రొక్కట దుందుభిధ్వనుల నుర్వియు నాకసముం గలంచి రిం
పెక్కఁగ సప్తకోటిమునులెల్లరు వాడిరి దేవి మెచ్చఁగన్. 354

క. హతశేషమైన దైత్య, వ్రతతిఁ జింగమ్ము పట్టి భక్షించె నము
ద్ధతవేగ మదరఁ గొందఱు, నతికిఁగతి దెలియఁ బఱపఁ బఱచిరి కడకన్. 355

వ. ఇట్లరిగి రోదనపూర్వకమ్ముగఁ గల తెఱఁగు చెప్పిన నమ్మహిషుండు ప్రళయకాల రుద్రుని చందమ్మున మండిపడి దారుకుఁ డను సారథిం జూచి సహస్రఖరసంయుతంబును నానాయుధ సమన్వితంబును బతాకాధ్వజవిరాజితంబును నగు తన రథంబు దోడికొని రమ్మనవుడు వాఁడట్లొనరింపఁ గామార్తుండగు కతన నద్దేవి తన్ను వరించున కాఁ దలంచి హేయంబగు నీ మహిషదేహంబు కాదని త్యజించి స్త్రీలు రూపచాతుర్యమ్ములం జూచి మోహింతురని కృతనిశ్చయుఁడై. 356

## దేవీ మహిష సంవాదము.

ఉ. మానవరూపముం గొని సమంచితభూషణభూషితాంగుఁడై
దానవసైన్యముల్ గొలువ ధారుణి గ్రక్కదలన్ రథస్థుఁడై
మానినులెల్ల మెచ్చఁదగు మంజులమౌ చెలువొప్ప వేగె న
వ్వానిని దప్పులం గని రవం బొనరించెఁ బరాంబ దంబుగన్. 357

వ. ఇట్లు శంఖంబు పూరించినదైత్యవాహిని కనుకవిం బఱచె వారల నిలువరించి మహిషాసురుం డామె కళిముఖుండై ఓఱునగవు మొగమ్మునం దనర నిట్లను 358

గీ. దేవి! సంసారమున యందుఁ దిరుగు పురుషుఁ, దేవిఁ గామినియేని సుఖానుభవము నొందఁగోరుదు రదియు సంయోగజంబు, గా నెఱుంగు మదియు భిన్నగతి నెసంగు.

వ. ఎట్లంచేని మాత్రపితృలకుఁ బుత్రునితో నగునది యుత్తమం, బన్నదమ్ముల సంయోగంబు మధ్యమంబు, వివిధావృతచిత్తులను బ్రసంగపరివర్తులును నగు నాపికుల సంయోగంబు సహజంబై యత్యల్ప సుఖదం బగుట నధమంబు. 360

ఆ.వె. సమవయస్కులైన జంపతులకుఁ దుల్య, రూపశీలగుణనిరూఢిఁ బ్రోపు మిగులు యోగ మది యమేయసుఖోదయం, బొసఁగుకతన నుత్తమోత్తమంబు.

వ. ఇట్లు సంయోగమ్ములు పరస్పరం బుత్కర్షాతిశయమ్మునం బొల్చు కతన, 362

ఉ. వీరుఁడనైన నాయెడ వివేకము గల్గిన దానవై సుధా
సారము వోవిచూడ్కులఁ బొసంగఁగఁ జేసి కరంచి తేవి దు
ర్వారసుఖంబు దావనగు బాలరొ! యిర్వుర కీసుఖంబుతో
నారయ నేసుఖమ్ములును నంద వనుత్తమ మౌ కతమ్మునన్. 363

చ. సురపతిఁ దొట్టి నిర్జరుల సొంపఱఁ జేసితిఁ గామరూపచా
తురి గలవాఁడ విట్టి నను దొయ్యలి! దాసునిఁ గాఁగ నేలి యా
దరముగఁ బట్టరాజ్ఞివయి దానవులెల్ల విధేయులై మెలం
గ రమణ నాదు వైభవము గైకొని పొందఁగరాదె భోగముల్. 364

ఉ. ఆవతి యిచ్చితేవి వినుమ య్యమరాపళిశోధ వైరమున్
మానెద నెద్ది పంచినను మావక చేసెదఁ బ్రేముడించు మె
ల్లైవి భవత్పదాంబుజములే శరణమ్ములు వేవకుండ ధ
ర్మానుగతుల్ వచింత్రు శరణాగత రక్షణ మొప్పదే చెలీ. 365

ఉ. పుట్టినకోలె దైన్యమునఁ బోవ నొకప్పుడు నాజి నెంతయున్
ధట్టుఁడ నా విశేషములు తామరచూలి మొదల్ సురోత్తముల్
గట్టిగఁ దామెఱుంగుదురు కామశరమ్ముల దాడి కోర్వ కి
ప్పట్టున దైన్యమూనితిఁ గృపన్ గను మాయుధముల్ త్యజించితిన్. 366

క. మరణావధి నెన్నఁడు ద, త్పరత సీ్త్రి కెదురుసెప్పఁ దన్వంగిరో! నీ గురుకుచము లావ మన్మథ, మరయుము శృంగారభంగితాపాంగములన్. 367

చ. అనవుడు దేవి వల్కె మొగ మంకురితస్మితకందళంబుగా
దనుజవరేణ్య! నాకుఁ బతి తత్పరమాత్ముఁడు; వాని యిచ్ఛనై
యొనరుచు సృష్టి; యప్పురుషయోగమునన్ జడనైన నాకుఁ జే
తనము ఘటిల్లుఁ గాంతశిల దాఁకిన యిన్ముసకుం బలెన్ లలిన్. 368

వ. ఇట్టి నాకు గ్రామ్యసుఖవాంఛ యెన్నండును లేదు నీవు మూర్ఖుండవై నన్నొక సామాన్యాంగనగాఁ దలంచి మత్సంగం బపేక్షించు చున్నవాఁడ వదియునుం గాక,

చ. నరునకు బంధనార్థముగ నాతి సృజింపఁ బడెన్ దురాత్మ! య
ప్పరమరహస్యముం దెలిసి భంగురమై కడు హేయమైన సౌ
ఖ్యరసమునం జరింపకుము గల్గు నొకప్పుడు ముక్తి శృంఖలా
స్థిరులకు నేని; పీరలకుఁ దీరదు ముక్తికి నేగ నెన్నఁడున్. 370

మ. తను మిచ్చున్ స్థిరసౌఖ్య: మద్ది హృదయ స్థానమ్మునం జేర్చి యా
యమరావాసము వీడి జీవమును నీవాసింతువేనిన్ వివా
వ మొనర్పంగ రసాతల మ్మరుగు; మీచందమ్ముగా కొండు చం
దము యేనిన్ రణమాచరింపుము వినుమా దర్పాంధుఁ దున్మాడెదన్. 371

ఉ. నీ వినయమ్ము విక్రమముగ నెమ్మది కెక్కుటఁ జేసి యింత నీ
కై వచియించితిం గడు దయాపరతన్; వలతేని విన్ము లే
దా! వెనుదీయ కాజి నను దాఁకుము నన్ బరికొల్పినట్టి దే
వావళి యప్పుడీర్తు విను నాత్మశరమ్ములపాలు సేయుచున్. 372

వ. నావుడు మదనమోహితుం డద్దురాత్ముండు మరల నిట్లను. 373

ఉ. పూలకు మించి యెక్కుడగు పొల్పునఁ బొల్పెడి మేనిదాన! వే
వాఁడము సేసి విన్నదఁ జవంతటి సాహస మూన నిప్పురో!
బేలనె! నీకృపం బడసి పెండిలిఁ జేసికొనంగ మంటి ని
న్నోలలితాంగి! యిట్టి కఠినోక్తు లనన్న నీకు న్యాయమే? 374

చ. హరిహర వీరజాసనుల నాహవభీరులఁ జేసి పుచ్చి మం
దరిపయిఁ జావుఁ దనె ప్రతాపము లోకుల నవ్వ? నీయెడం
గర మనురక్తి కల్మి భయకంపిత మయ్యెఁ గరంబు పొత్తి? యి
ద్ధ్వరమును మిత్రభావమును బొందిత మేటికిఁ దక్కు సంగతుల్. 375

క. ననుఁ బేర్మిఁ జూచి పెండిలి, యొనరిఁచికొన నొప్పెదేని యొప్పెదఁ గాదే
నివి వలసిన యెడ కరుగుము, వినునేఁ బ్రహరింపఁ జాల నిశితాస్త్రములన్. 376

గీ. సప్తపది మైత్రి యని బుధజనులమతము, గాన నాచెల్మికిత్తె నిన్ గసిమసంగి
పై ననుభవింపఁగల్గు నైశ్వర్య మొక్కఁ, డున్నె యింతటి పాపంబు నోపఁగలనె.

గీ. బాలహత్యయు స్త్రీహత్య బ్రహ్మహత్య, పాతకము లందు నెక్కుడు పాతకములు
గాన నెట్లైన నీదయ గాంచి జన్మ, మునకు సాఫల్యమొనరింతు వనరుహాక్షి. 378

గీ. విను బలాత్కృతిఁగొనియేగ నేర్తుఁగాని, దాన నేమి సుఖంబగుఁ దలిరుబోఁడి
స్త్రీపురుషులు పరస్పరస్నేహ మడరఁ, గూటమికి నియ్యకొన దానఁ గుతుక మెసఁగు.

చ. తెలియవుగాక పూరుషుని ధీరునిఁ బొందని కాంతకున్ సుఖం
బులు వెలిఁగావె తాఁ దగిన పొత్తికిఁ దక్కనిపూరుషుండునున్
వెలియగు, నెవ్వఁ డిక్కరణి వేఁదుఱు పుట్టఁగఁజేసె నీకు; వి
స్తులమగు జవ్వనమ్ము గడుసుందర మక్కట! వమ్మొనర్తురే. 380

ఉ. వైరి యెవండొ విన్నిటులు వంచనఁజేసి మరల్చెఁ గాక సం
సారసుఖమ్ము లిక్కరణిఁ జాగము సేయుదె తత్త్రిమూర్తు లం
భోరుహనేత్రలన్ విడిచి పోయిరె యెంతటిదేలనైతి వే
చారుముఖీలలామ పతిసంగతిఁ బాసి సుఖించుఁ జెప్పుమా. 381

చ. ననుఁ బువుఁగోలలం బఱపి నాఁచికొనం గమకించు చండశా
సముఁడు మరుండు నీయెడలఁ జాలఁ గృపం గలఁడేమొ, కాక యు
న్నను విటు లిల్వ నిచ్చునె! కనంబడె హేతువు వైరులైన దు
ర్మనసులు దేవతల్ మరు మరల్చిరి నీదరిఁ జేరకుండఁగన్. 382

ఉ. ఆదర మేది నన్నిపు డహంకృతి నీడితివేని మున్ను మం
దోదరి సుందరు న్నృపుని ద్రోచి పరంపడి ధూర్తు నాథుఁగా
నూఁది స్మరార్తియై వగల నొందిన చందమునం గృశింతు సు
మ్మీ! దరిలేని తాపమున, మీఁదటిబాధ గణింప నిమ్మెయిన్. 383

## మందోదరీ వృత్తాంతము.

వ. అనవుడు నమ్మందోదరీవృత్తాంతమ్ము వినవలతునన దేవికి మహిషుం డిట్లనియె. 384

శా. దేవీ! సింహళ దేశ మెల్లగతులన్ దేజమ్మునం బొల్చు న
ద్వాపుం డయ్యెడఁ జంద్రసేనుఁడను భూపాలుండు పాలించుఁ బా

రావారావృత మైన మేదిని కొకండై యేలు నవ్వాని కిం
పై వర్తించుఁ బతివ్రతామణి యొక ర్తర్ధాంగియై యిమ్ములన్. 385

గీ. ఆమె గుణవతి యను పేర నలరుఁ దద్గు, ణములు వర్ణింప నలవి యెన్నటికిఁ గాదు
కవియె నొక యుత్పలాక్షి నక్కాంత మొదటి, చూలుగాఁ బతి సుఖవార్ధి నోలలాడ.

వ. పిదప నమ్మనుజపతి యక్కన్నెకు మందోదరి యని నామకరణమ్ము చేసి తోరం
బగుగారమ్మునఁ బెంచుచుండ నవ్వాలికాజన చూళికారత్నంబు శశికలతెఱంగునన్
దినదినప్రవర్ధమానయై పంచమేండ్ల ప్రాయమ్మునం బొలుచుటయు నరేంద్రుండు
వివాహం బొనరింప నెంచి యనుకూల వరాన్వేషణపరాయణంబగు చిత్తమ్మున
నున్నయెడఁ గొందఱు బ్రాహ్మణు లరుదెంచి. 387

గీ. తనయ మద్రదేశమున సుధన్వుఁడనెడి, రాజవర్యుం డతని కుమారకుఁడు నీదు
కొమిరె కీ డగువాఁడు సద్గుణవిశేష, రూపరేఖావిలాసవిరూఢి నెందు. 388

శా. కంబుగ్రీవుఁడు వాని పే రనుచు భూకాంతుండు పుత్రిం దదీ
యంబౌసౌమ్ముగ నిశ్చయించి తన భార్యం జూచి యిక్కన్నె లో
కం బెల్లం గొనియాడ శీలమున నాకారమ్మునన్ మేటి యా
కంబుగ్రీవున కిచ్చి పుత్తమె యనంగా నామె సంతుష్టయై. 389

వ. పుత్రి యున్నెడ కరిగి యాదరమ్మున నమ్మా! యిమ్ము నీ జనకుండు మద్రదేశాధీశ్వ
రుండగు సుధన్వ తనయునకు సమస్తలక్షణలక్షితునకుఁ గంబుగ్రీవునకిచ్చి పెండిలి
యొనర్ప నున్నవాఁ డనవుడు మందోదరి యిట్లనియె. 390

శా. కౌమారవ్రత మూని స్వేచ్ఛగఁ దపఃకాంక్షన్ బ్రవర్తింప నే
నామోదింతుఁ జిరమ్మునుండి, యిఁక వాకమ్మున్ వరింపంగ నే
లా! మేలా యొకమానవుం దవిలి వాలాయమ్ము నవ్వానితో
గామాసక్తిని బారతంత్ర్యమున మోక్షప్రాప్తిఁ బోఁ గొట్టుటల్. 391

క. స్వాతంత్ర్యమ్మున నెప్పుడుఁ, జేతోమోదమునఁ దిరుగఁ జేకూరుట వి
ద్యాతత్త్వజ్ఞుల మోక్షక, లాతావాత్మ్యమునఁ జూచి లలిఁ బొగడరొకో. 392

సీ. అత్తమామలయెడ నడఁకువ గొలుపుట • బావలయెడ భక్తిపరతగనుట
మఱఁదులయెడఁ దగు మన్ననఁ జూపుట • తోడికోడండ్ర పొత్తున మెలఁగుట
యాఁడుబిడ్డల చిత్త మరసి వర్తించుట • సవతి గల్గిన దాని చన వెనయుట
పతికి వేళ్వేళలఁ బరిచర్య నలుపుట • సంతతి గని పెమసంతఁ బడుట

గీ. అకట ! బావిన యగుటకు నతిశయించు, గాదె యొక్క నివశమునఁ గాలమెల్లఁ
గడపు నిల్లాలి బ్రతుకు వికృముగ నాడు, జన్మ మధమాధమమ కాదె జననియెందు.

వ. ము న్నుత్తానపాదాత్మజుండును ధ్రువుని తమ్ముండును నుత్తముండును సర్వధర్మ జ్ఞుండును నగు నృపాలుం డొకండు పతిభక్తిపరాయణ యగు తనభార్య ననపరాధ నరణ్యమ్మున విడిచెనని వినమె కావున, 394

చ. తరుణికి భర్త పొందిడు మదమ్మున కంటెను గష్టమెక్కు డ
ప్పురుషుఁడు కాలధర్మమును బొందినచో విధవాత్వ మెంతయుఁ
భరమగు నారికేగిన నపారమగుఁ విరహాగ్ని యిట్లు నం
దురుటయు నొక్క సౌఖ్యమె మనోగతి చిక్కఁగఁ బట్టుటొప్పదే. 395

వ. అను నాపె నిశ్చయంబు మరల్పనేరక జనని చిన్నవోయిన మనమ్మున నృపాలుని కడ కరిగి యంతయుం దెలిపిన నతండును నౌఁగాదనక సమ్మతించినవాఁడుమం బోలె మిన్నకుండె నంత నక్కన్నె మిన్నకుఁ గొండొకకాలమ్మునకు జవ్వనం బంకురించినఁ జెలికత్తియలెల్ల మెల్ల మెల్లన వివాహమ్మునంగల సుఖమ్ములు బోధించి యొప్పింప నుంకింపుడు నప్పడఁతి యెప్పాట నొప్పదయ్యెఁ బదంపడి యొక్కనాఁడు, 396

చ. కుసుమిత కుంజపుంజములకు న్నెలవై తగు పూలతోఁట కే
గి సఖులుఁదాను నుయ్యెలలఁ గ్రీడలొనర్చుచుఁ బూలుగోయుచున్
గిసలయజాలముల్ పుణికి గీటునఁ బుచ్చుచుఁ గేళకూళులన్
బిసరుహకాండముల్ చిదిమి వేయుచు నిట్లు చెలంగుచున్నెడన్. 397

క. కోసల దేశాధీశుం, డా పరణికి నొక్కఁడగుచు నరుదెంచెఁ గళా
భాసురుఁడు వీరపేనుఁడు, దానజనులు కొందఱు తన దాపున మెలఁగఁ. 398

వ. రథారూఢుండై దవుదవ్వుల నరుదెంచువాని మదనసుందరు నా రాజును దూరదూర మ్మున నరుదెంచు సైన్యముం గాంచి చెలికత్తెలయం దొక్కరిత యమ్మందోదరి కిట్లనియె. 399

క. కనుఁగొంటివె యల్లదె దై, వనియతి నొకరాజసుతుఁ డపరమన్మథుఁడీ
మనయున్న తెరువునకు రా, గ మన్నవాఁ డతని చెలువు గా దనవశమే. 400

వ. అని పచించువంతన యంతంత నరుగుదెంచి యన్నృపాలుండు పుత్త్రడిబొమ్మం

బోవిదావి నమ్మందోదరి వీక్షించి విస్మయావిష్టుండై రథంబు డిగ్గి దగ్గఱకుం జవి యొక్కరిత కయ్యంగనం గేలఁ జూపి యిట్లనియె. 401

క. ఈలలితగాత్రి యామధు, రాలాపిని యెవతె, యెవ్వఁ డగు నొకో ధరణీ పాలుం డీచెలి జనకుఁడు, నాకాయము నాకుఁ దెలుప వలయు మృగాక్షీ. 402

వ. అనవుడు సైరంధ్రి 'నరేంద్రా! నీ వడిగినదెల్లఁ జెప్పెదం గాని మునుమున్న నీవృత్తాంతంబు విన వలతు' నావుడు 'లతాంగీ! కోసలంబను దేశం బొండు గల దద్దానికి నే నాయకుండ నా పేరు వీరసేనుండు మార్గ వశమ్మున నరుదెంచుచుఁ ద్రోవ దప్పి యిచ్చ్యోట కరుదెంచితి దొవవ్వల సైన్యంబును రాఁ గల' దనవుడు సైరంధ్రి యిట్లనియె. 403

క. మందోదరి యనఁదగు నీ, సుందరియుం జంద్రసేనసుత యీయెడ కా నందమునఁ గ్రీడసల్పెడి, దండడిఁ జనుదెంచె నాఁగ ధరణిపుఁడనియెన్. 404

క. సైరంధ్రి! నాకు నీచెలి, పై రాగము పుట్టె ధర్మవత్నిగఁ జేయం గోరెద నీచాతుర్యో, దారత కిది పెద్ద గాదు తలఁపు వొదమినన్. 405

వ. నా కింతకుమున్నె వే లోకభార్య లేకుంటం జేసి మీ చెలియ పట్టమహిషిగాఁదగుఁ జిరమ్మునుండి యే వసురూపశీలవయోగుణభాసురయగు కన్నియ నన్వేషించుచున్న వాఁడ నేటికి దైవమ్ము సమకూర్చె నని వెండియు, 406

గీ. ఏఁ గకుత్స్థకులోద్భూతి నింపు గన్న, రాచకొమరుఁడ నిట్టి నా రాణ నెఱిఁగి తండ్రియైనను వాకిడఁ దక్కువాఁడె, వల నెఱిఁగి చేయు మిందు నుపాయమనుడు.

శా. ఆసైరంధ్రి లతాంగి కిట్లనుఁ జెలీ! యారాజుఁ గన్గొంటె! నీ కౌ సౌందర్యము పేర్మిఁ బ్రాయమున విద్యాబుద్ధులం దెల్ల నా రాసూనుండు కరంబు నీయెడలఁ దా రాగిల్లె నన్నావి వి శ్వాసార్థుం బతిఁ జేసికో బుచిత మీ చందంబు నీ కొప్పదే. 408

క. నీవైరాగ్యపుఁ జందం, జేపము పుట్టింప జనకుఁ డెంతయు నగకుం దావలమై వందురు నా, బూవిబు నిప్పాటఁ దెల్పఁ బోలదె నీకున్. 409

వ. అతఁ డెల్లవేళల మమ్ముం గాంచి మీచెలిక త్తియకుఁ గఱదలు కఱపి పరిణయ మ్మునకు కియ్యకొలుపుఁ డని వినువక వచియింపుచుండు నింతదనుక విన్నుం బ్రబో ధింప నేర మైతి మిప్పుడిది తగు నల నగుటంజేసి చెప్ప వలసి వచ్చె నని మఱియును, 410

గీ. వ్రతము లెన్నేని భర్తృతత్పరతఁ దవిలి, చేరి శుశ్రూష యెడపక చేయుదానిఁ
బోలఁజాలవు విను మట్టి పూవుఁబోఁడి, యరుగు స్వర్గమ్మునకు నిక్కమండ్రు బుధులు

వ. నావుడుఁ గోపించి యామందోదరి సైరంధ్రి కిట్లనియె. 412

ఆ. వె. సిగ్గులేక నన్నుఁ జెనఁటిచందమ్మున, నరయ నంతఁ జాలక నైతి నొక్కొ!
తపము చేసికొనెడి తన్వికి నా కేటి, భర్తఁ బొమ్మటంచుఁ బలుకు మతని 413

వ. నావుడు సైరంధ్రి మెల్లన నిట్లను నమ్మా! కాలం బెప్పుడు నొక్క చందమ్మున నుండదు. మన్మథుఁడు దుర్జయుండు. నా పలుకు లంగీకరింపవినాఁడు నీకు నాపద ఘటిల్లక తీర దనవుడు రాజపుత్రి యిట్లను. 414

ఆ. వె. ఎంతయేనిఁ జెప్పు మేను వివాహ మం, గీకరింప వచ్చుకీడు తొలఁగఁ
జేయ నెవరితరము చెలియరో! దైవ వ, శంబు తప్పఁ జేయఁ జనునె నీకు.

వ. ఇట్లు వైరాగ్యమ్మున పీడంబోక పుయిలోట దక్కి యాసడించిన సైరంధ్రి వీర పేమం జూచి, 416

గీ. ఎన్ని చెప్పిన విననేర దీ లతాంగి, గుణగణాఢ్యుండు కాకుత్థ్సకులుఁడు మిగుల
రూపసి యటంచు నొక్క నీరూఢి దెలిపి, బిసివితి నిఁ కేమి సేయుదు వెదలు మధిప.

వ. నావుడు నృపాలుండు విమనస్కుండై తనయంత నరిగెఁ బిమ్మటఁ గొంతకాల మ్మున కమ్మందోదరి చెలియ లిందుమతి యనుదానికిఁ దండ్రి స్వయంవరమ్మునఁ బెండ్లిసేయం దలంచి చాటం బంచిన నప్పురంబున కఖిలధరాకాంతు లరుదెంచి మంటపమ్మున వలయు నెడల వసియించి రం దొక్కరునిఁ దనకనుగుణుండగు రాసూను నయ్యిందుమతి వరియించి కృతకృత్య యయ్యె. 418

క. మందోదరి యాపెండిలి, చందము వీక్షించి యందెసఁగు నృపతులయం
దందమునఁబొల్చు విటు శతు, నిం దగఁగని కలఁగి దైవనియతి వరించెఁగా. 419

వ. ఇట్లు కలంగి మదనవేదనాదోధూయమానయై తండ్రికిఁ దనకోరిక తెఱం గెఱింగించిన నతండును సంతసించి తగుఁదగదనక యతనిని గారవించి యథావిధిగ నకూఁతు నిచ్చి పెండ్లి యొనర్చి పారిబర్హంబొసంగి వీడ్కొల్పె; నాచారుదేష్ణుండును మందోదరీసహితుండై సంతసమ్మునఁ దనపురి కరిగి యవ్విలాసినితో వివిధోపభోగమ్ములం బ్రొద్దుపుచ్చుచు నొక్కనాఁడు. 420

క. తనదాసితోడఁ గామ, మ్మునఁ గ్రీడాగోష్ఠి నున్నపొంకము తద్రా
త్తనయకు సైరంధ్రిఁ గనుం, గొనిచెప్పెన్ దాన మిగులఁ గోపన యగుచున్.

వ. వా రిరువురం బట్టికొనఁదలంచి రంధ్రం బరయుచు నంత నొక్కెడ నేకాంత మ్మునఁ గ్రీడించువారి వారిం గాంచి యిట్లు చింతించె. 422

గీ. అక్కటా ! శరుఁడంచు మున్నరయనేర, నైతిఁ గడుఁ జెట్ట చేసి యీయధమువంచ నం బడితినిట్టి నిర్లజ్జునిం బతిగ గ్ర, హించి జన్మమ్మునకు హాని నించుకొంటి. 423

క. అని యమ్మలిక మనమ్మునఁ, బెనఁగొన నిఁక నిట్టివానిఁ బెంపేది హృదీ శునిఁగాఁ గొని ప్రేముడి నిం, చిన కంబె నఘంబు చెట్ట సేఁతయుఁ గలదే. 424

మ. పతిసంగంబు పరిత్యజించి మృతికై పాటింతునో ! దాన సం
గతమౌ నాత్మవధోద్భితం బయినబల్ కాలుష్య మట్లౌట మ
త్పితృగేహమ్మున కేగుదెంతునొ ! సఖుల్ పీడింతు రెగ్గించి దు
ర్మతినై యింతటిచేటు దెచ్చుకొని మైమైఁ బోవఁగా దీఱునే. 425

క. పొరిఁబొరి సంతాపము పొం, పిరివోవఁగ నిట్లు వగలపెల్లునఁ గడు వం దురి తుదకు నచట నుంటయు, పరమోత్తమ మంచు నెంచి పతిసంసర్గా. 426

వ. విడిచి వ్రతపరాయణయై పశ్చాత్తాపమ్మునం గుందుచుండె నట్లు గావున, 427

## దేవీ మహిషాసుర యుద్ధము.

ఆ. వె. ఇపుడు నన్ను నిట్లు లెడఁజేసి పిదపఁ గా, మార్తి దొడరెనేని నధము నొక్క శరు వరించి వాని సంసర్గమునఁ బ్రోపుఁ, దక్కనేల వినుము తలిరుఁబోఁడి. 428

చ. అనవుడు దేవి కోపమున నమ్మహిషాధముఁ జూచి పల్కె దు
ర్వినయ ! వివేక మేది పలవింపక సంగర మాచరింపు లే
కున్కి రసాతలం బరుగు మొండొక రీతి పొసంగ దెంత చె
ప్పిన విననేర కూరకయ ప్రేలెదు వీఁడిడివే తలంపఁగన్. 429

గీ. జన్మమెఱుఁగవి నా కిట్లు జన్మలబ్ధి, రూపమెఱుఁగని నా కిట్లు రూపలబ్ధి గలుగు దుష్టుల వధియించు కారణమున, నిక్క మమరహితమ్ముగ వి న్నదంతు.

వ. కావునఁ బాతాళమ్మున కరుగు మొండె ధనుర్ధరుండవై సంగరం బాచరింపు మన వుడు మహిషుం డక్షీణక్రోధరూక్షుండై, 431

ఉ. కర్ణమువాఁకఁ జాపమును గాఁడఁగ లాగి శరమ్ములన్ రయో
దీర్ణత నేయ నంబ వెనుదీయక యంతరమంద యన్నిటిన్

జూర్ణము చేసె నిర్జరకుఁ జూపఱు భీతి మునుంగ నిట్లు సం
పూర్ణరణంబు వాటిలె నపూర్వము ఘోరమునై పొరింబొరిన్. 432

వ. ఇట్లిరువురుం బోరాడుచుండ నంతరమ్మున దుర్ధరుం డరుదెంచి యంబం దలపడి,

క. కొన్ని శరమ్ములు నించినఁ, దన్నిచుని యెడలఁ గనలి దారుణ శరపా
శి న్నిగిడించిన వాఁడును, దన్నికొనుచుఁ జచ్చి పడియె ధర శృంగ మనన్. 434

ఆ.వె. వానిచావుఁ జూచి వగ గూరఁగఁ ద్రిణేత్రుఁ, డరుగుదెంచి దేవి నప్రసప్త
కంబుఁ జొనిపి నొంపఁగా వాని నయ్యంబ, యంతరాళమునన యడఁచివైచి. 435

వ. త్రిశూలమ్మున వానిం బిలుక్కుమార్ప నద్దానికి సైఁపక యంధకుండు గోపమ్ము పిరి
గొనం దాఁకి, 436

మ. గద చేఁబూని గజారిమస్తకముపై గాఁడంగ నేయంగ న
య్యాది క్రోధాకులమై వెసం గడఁగి తీవ్రాస్త్రమ్ములం బోని బె
ట్టిదపుం గోయలఁబట్టి చీల్చి కడు గోంద్రింపంగఁ దన్మాంస ము
గ్రదశం దాఁ దినియెన్ సురారులకు భీకంపంబు సంధిల్లఁగన్. 437

మ. అటు లయ్యంధకుఁ డీల్గఁ గినుక్కుమెయి నయ్యశ్వారి తీక్ష్ణుఁగా
ర్భటి రోదోంతరమెల్లఁ గప్పుచు రణప్రారంభుఁడై మించు న
ప్పటి యత్యాహిత మాఁగ నజ్జనని యప్పాపాత్ముపై నొక్క మి
క్కుటమౌ పెన్గద వైవ దానఁ బడె సోఁకు న్మూర్ఛమైవ్రేల్మిడిన్. 438

క. అంతంత లేచి దానవుఁ, డంతకుఁడై గదనుఁ బూని హర్యక్షం బొ
క్కింత గువలువడ నేసిన, దంతిపయిం గవియునవ్విధం బడరంగన్. 439

చ. ఖరనఖరావళిం బొదివి గ్రక్కదలన్ బడఁ జీల్చె నంత నా
హరిరిపుఁ డార్చి తాను హరియై సరియైన పరాక్రమక్రమో
ద్ధురనఖరాశి నుక్కఱఁగఁ దోడన వచ్చిన దాని కల్గి శాం
కరి ఫణిరాణ్నిభంబులగు కాండపరంపర నిండఁ జెండినన్. 440

మ. హరిరూపంబుఁ ద్యజించి యమ్మహిషుఁ డేన్గై వేగఁ దానొక్కభూ
ధరశృంగంబు కరంబునం బొదివి క్రోధం బెక్క బిట్టార్చి శాం
కరిపై నేయ శిలాశితమ్ములఁ గనత్కాండమ్ములం ద్రుంచె న
గ్గిరిశృంగం బొకియింత యింతగ సురల్ గీర్తించి యగ్గింపఁగన్. 441

ఉ. తోడన యార్చి సింగ మెదఁ దోఁష మెలర్పఁగఁ గుంభపాళి నా
రూఢిగ మించి కీడ్వఱచి రూక్షనఖంబుల వ్రచ్చివ్రచ్చి వేఁ
టాడఁగ రక్కసుండు శరభాకృతిఁ దాల్చి మరల్చినన్ సురల్
పోఁడిమిఁ దక్కి రంబికయుఁ గ్రోపఱఁ జేసె శితాస్త్ర సంహతిన్. 442

వ. అంత నా శరభాకారుండగు మహిషుండును, 443

ఉ. తుండమునం గడుం బొడిచి తోడన పుచ్ఛముఁ జుట్టి భూమిభృ
న్మండలముం బెకల్చి యొకమాత్రన బంతులు ఱువ్వుపోల్కి న
చ్చండిపయి న్నిగుడ్చుచు హసన్ముఖుఁడై యెలుఁగెత్తి విక్రమో
ద్దండత మిన్ను ముట్టఁగ మదమ్మున నజ్జగదంబ కిట్లనున్. 444

మ. మదముం ద్రిప్పఁగలేక నా పలుకుల న్మన్నింప కీరీతి బె
ట్టిదపున్ సంగర మియ్యకొంటివి ననున్ డీకొంట నీబోఁటి యాఁ
డుదియు న్నేర్చునె! యింద్రుఁదొట్టి సురలాటోపంబు వాటిల్ల ర
య్యది నీకుం దెలియంగ లేదొ, వినవో యస్మత్ప్రతాపస్థితుల్! 445

చ. వినుఁ బురికొల్పినట్టి సురనేతృముఖామరులెల్లఁ మేల్మిఁ ద
క్క నని వధించి నాదు భుజగర్వము దుర్వహమై జగమ్ములం
దనుకఁగఁ జేయుదున్ వెనుకఁదారక విల్వము నాఁగ వానిక
జ్జనని వచించుఁ గోప మొక చాడ్పు మెయిన్ గనుపట్ట నవ్వుచున్. 446

ఉ. తత్తఱపాటు మాని తగు దర్పమున న్నిలుమిద్ధ మాధవిన్
హత్తినవేడ్కఁ ద్రావి సురలందఱునుం గొనియాడ దుర్మదో
న్మత్తుని నిన్నుఁ జంపెద రణమ్మున నంచు సువర్ణపాత్ర మా
యత్తము చేసి త్రావెఁ దగ నాసవముం జల ముప్పతిల్లఁగన్. 447

క. ద్రాక్షాసవపానం బిటు, లక్షీణగతిం బొనర్చి యయ్యంబిక బల్
దక్షత మెఱయఁగఁ దా హ, ర్యక్షారావం బొనర్చె నసురులు బెగడన్. 448

క. జయ పెట్టుచు నమరులు పే, ర్మి యెలర్పఁగఁ బూలు గురియ మేకొని జగదం
బయు మహిషు నెదిరి పోరెన్, హయారియు ననేకమూర్తు లంచుచుఁ గడఁకన్,

చ. కపటపుఁబాండితిన్ మెఱసి కావలుఁడై పలుమైల నంబతో
నపగతభీతిమై నని నహంకృతిఁ జూపఁగ వాని కల్గి చం

వారును నతని దుఃఖితుఁగా నెఱిఁగి కరుణించి రాజా ! నీమనమ్మునఁ గల చింత యెయ్యది ? నొడువు మద్దానికిఁ బ్రతీకారం బొనరింతము నావుడు నృపాలుం డిట్లను.

మ. ధనధాన్యమ్ములు మేటి గుఱ్ఱములు భృత్యవ్రాతముల్ నాగముల్
ఘనరాజ్యమ్ము సుఖమ్మునుం గలదు చక్కంగఁగా ముదంబిమ్ము ల
వ్వనులు న్నూర్వురుభార్యలాకలరు తద్వామాక్షులం దొక్క యం
గనకైనన్ సుతలబ్ధి లే దిదియ శోకం బెప్పుడు న్నామదిన్.

వ. అపుత్రునకు గతి లేమి నన్ననుగ్రహించి సంతానార్థినగు నాచే నెద్దియే నొక యిష్టిం జేయించి కృతార్థుం జేయవేఁడద, నావుడుఁ దాపసు లింద్రదేవతాకంబగు నిష్టిం జేయించి యజ్ఞశాలయందు సంతానార్థమ్ముగా వేదమంత్రసమ్మంత్రితంబగు నొక కలశంబునిచిన నన్నరవరుం డానాఁటిరేయి తుషితుండై తద్గతంబులగు జల మ్ములం గ్రోలె, నంత మునులు మఱునాఁ డక్కలశంబున జలమ్ములు లేకున్న "నీ భార్యకునై యునిచిన జలమ్ము నీ వుపయోగించితివే" యనుడు నతండును బిపాసచే నట్లొనర్చితిననియె వారలును దైవబలమ్మునకు శంకించుచు నిష్టిని సమాప్తి చేసి తమయంతంజనిరి. 237

గీ. అంత మంత్రబలమ్మున నన్నృపాల, కునకు గర్భోదయంబయి ఘనతఁ జెంది
పూర్ణ మగుడు జనించె సత్పుత్రుఁడొకఁడు, కుడికెలనమండి గర్భంబు వొడిచి చించి.

వ. పిమ్మట దేవతల యనుగ్రహమ్మున నయ్యవనీపతి మృతుండుగాక జీవించెఁ బద వడి మంత్రు లమాత్యకుండగు నా శిశువునుద్దేశించి *"కంధాస్యత్యయ"మ్మని విచా రించుచుండ నింద్రుండేతెంచి తన తర్జనినాశిశువు నోట నిడుచు "మాంధాతా" యని పలికె, నక్కతన నతఁడు మాంధాతృ నామమ్మునఁ బ్రసిద్ధుండయ్యె. 239

చ. అతఁడు జయించి భూవలయ మంతయుఁ; బిమ్మటఁ జక్రవర్తియై
యతులితరీతి నేలె జగ, మయ్యవనీపతి భీతిఁజేసి ద
స్యుతతి గిరీంద్రకందరలఁ జొచ్చుట, నింద్రుఁడొసంగెఁ బేరు పా
ర్థత నలరారి యొప్పఁ ద్రసదస్యుఁ డనంగ ననుగ్రహమ్మునన్. 240

చ. విమల మనోహరాంగి శశిబిందుతనూభవ బిందుమత్యభి
ఖ్య మెఱయు సత్పతివ్రత నఖండయశుండు వివాహమాడి యు

---

* ( ధేట్ పావే, ధాతా. )

త్తముఁ బురుకుత్సు భూరిగుణతత్పరునిన్ ముచికుందు నిర్వరన్
గ్రమముగఁ గాంచెఁ బుత్రుల జగద్ధితబుద్ధి నతం డతంద్రులన్. 241

క. పురుకుత్సున కుదయించెను, నఁ ణ్యుఁ డతిధార్మికుఁడు మహాభాగుఁడు త
న్నరవరునకు బృహదశ్వుం, డరయఁగ నాతనికిఁ బుట్టె హర్యశ్వుండున్. 242

వ. ఆ హర్యశ్వునకుఁ ద్రిధన్వుండును నతనికి నరుణుండును, వానికి సత్యవ్రతుండును, బొడమి రితం డొక్కనాఁడు, వివాహసమయమ్మున నొక విప్రకన్య నపహరించిన నద్దురాచరణంబున కోర్వక తత్పభ్యు లొక్కమొగి నార్తులగుచుఁ జనుటయు నతని తండ్రియగు నరుణుండు నృశంసుండగు తన కొమరుం డెద్దియేని నొక దుష్కృత్యమ్మున వీరలఁ జెనకం బోలునని శంకించి వారల కిట్లను. 243

క. నాకొమరుఁ డెఱిఁగి యెఱుఁగక, మీకేమి యొనర్చె ననుడు, మేలెంచక తా మాకన్నియను బలాత్కృతిఁ, జేకొనియెన్ బెండ్లివేళఁ, జెనఁటివిధమునన్, 244

## సత్యవ్రతోపాఖ్యానము.

ఉ. నావుడుఁ గ్రుద్ధుఁడై నృపతి నందనునిన్ గని యిట్లు పల్కు, దు
ష్టా! వృథ నీదునామ, మకటా! యిది పాతకకృత్య మేమిగా
భావమునం దలంచితివి, పార్థివజన్మము నెత్త లేదె! నా
కీవు సుతుండ వన్నయశమే? యెటకేనియుఁ బొమ్ము దుర్మతీ. 245

వ. సత్యవ్రతుండే నేయెడ కేగుదునని యెదిరించి మాటికివి బల్కుడు నతం డిట్లను.

చ. శ్వపచులు నేనిఁ జేయని యసత్కృతిఁ జల్పిననీకు నా శ్వపా
కపరిచయంబు న్యాయ్యమగుఁగాన నటుల్ పొనరింపు మెంతయే
నవయశమిచ్చు నీకతన నౌదునె యేను గృతార్థుఁడన్! గులం
బు పతితమయ్యె నీజననమున్ గని యింతకు వంశపాంసనా. 247

వ. ఇట్లు వసిష్ఠ ప్రేరితుండగు జనకునిచే నిష్కాసితుండై సత్యవ్రతుండు వనమ్మున కరిగి శ్వపాకులంగూడి ధనుర్ధరుఁడై వర్తించుచు వసిష్ఠునియందుఁ గ్రోధమ్ము గలిగి యుండెఁ, బదంపడి నరుణుండు పుత్రార్థమ్ముగాఁ దపంబొనరింప వనమ్మున కరిగె నీ యధర్మమ్ము కారణమ్ముగ నింద్రుం డారాజు దేశమ్మునఁ బండ్రెండు సంవత్సరమ్ములు వర్షాభావం బొనర్చె నట్టియెడ, 248

క. ఆ నృపతి దేశమునఁ దన, సూనుల నర్ధాంగి విడిచి సొలవక తపముం
బూనఁజనెఁ గౌశికి యనం, గా నెగడెడి యేటికడకు గాధిజుఁ డెలమిన్. 249

క. ఆ కౌశికునర్ధాంగి క్షు, ధాకులులై శిశువు "లన్నమన్న" మనుచుఁ ద
న్నేకడఁ బీడింపఁగ బల్, శోకముపాలై మనమ్ము స్రుక్కి కలంగన్. 250

చ. పతి ధనహీననైన నను బాలకులన్ ద్యజియించి యేగె భూ
పతియును లేఁడు చూచుటకుఁ బట్టణమందు ; క్షుధార్తులై ననుం
బ్రతుకఁగ నీరు తిండికయి బాలకు ; లెవ్వఁడు రక్షకుండు ? దు
ర్గతి నెటు లీఁగుదాన ? బ్రతుకంగలరే సుతు లన్నహీనులై ? 251

ఉ. ఎల్లర జంపుకంటె మఱి యిందొకనిన్ దెగనమ్మదాన నే
నుల్లము రాయి చేసికొని ; యోమఁగ వచ్చును విక్రయాప్తసం
పల్లవ మిక్కుమారులకుఁ బ్రాణము నిల్పఁగఁ గొంతదన్క ; నే
తల్లికినేనిఁ జొప్పడని దర్మము ధాత విధించె నాకిటన్. 252

క. అని దైవగతికిఁ జింతన్, గొనుచున్ మధ్యముని యఱుతఁ గొంకక దర్భల్
చొనిపిన రజ్జువు దగిలిచి, తనగృహమున్ వీడి చనియెఁ దరుణి వగ దగన్. 253

క. మలమల మఱుఁగుచు నమ్మని, లలనామణి సుతులు వెఱఁగు లాగుచురా నెం
దులకేనిఁ బోవునది యి, మ్ముల సత్యవ్రతుని మార్గమునఁ గనుఁగొనియెన్, 254

వ. సత్యవ్రతుండును నాపె నీక్షించి యిట్లనియె. 255

క. అకటా ! యేద్చెడి పుత్రకు, నకు నఱుతం ద్రాడుగట్టి నారీమణి ! మి
వ్వాక యరిగెద వెందుల కే, మికతం బెవ్వతెవు ? తెల్పుమీ సత్యముగన్. 256

క. అనవుడు నల్లలనామణి, యను విశ్వామిత్రుఁ డనెడి యనఘాత్ముఁడు న
న్నును సుతులన్ డించి తపం, బున కరిగెన్ న న్నెఱుంగు మువివరు సతిగా. 257

క. ధనహీననైన కతమున, ననదనగుచు సుతుల పోషణార్థముగా నం
దనులం దొకర్కురుఁడగు వీ, నిని విక్రీతునిగఁ జేయనేర్చితి ననఘా. 258

చ. అనవుడు నా నృపాలసుతుఁ "డమ్మరో ! యేమిటి కిట్లొనర్ప నే
ననుదినమున్ భవత్సుతుల యాఁకటికిన్ దగినట్టి భక్ష్యముం
గొని యరుదెంతు సత్యమునకుం జవదాఁటక తావకాశ్రమ
మ్మున నొక చెట్టునం దిడుదు మూటగఁగట్టి గృహమ్ము చేరుమా. 259

వ. పదంపడి నీ భర్తయును రాఁగలఁడు" నావుడు నమ్మనివనిత సంతసించి తన

యాశ్రమమ్మున కరిగె నక్కొమరుండు గళబంధమ్ము కారణమ్మగ గాలవుం
డనఁబరఁగె. 260

క. ఆసత్యవ్రతుఁడును వి, శ్వాసమ్మును భక్తియును గృపయుఁ గలిగి సదా
దాసుండై మునివనితకు, గ్రాసంబిడు సుతసహితముగా భుజియింపఁగా. 261

గీ. మృగముల వరాహములను మహిషశశముల, ననుదినమ్మును గొట్టి సత్యవ్రతుండు
గాధిసుతు నాశ్రమముపొంతఁ గట్టుఁ జెట్టు, కొమ్మ కొకముల్లెగాఁ జేసి కూర్చుపేర్మి.

వ. విశ్వామిత్రునిభార్య తన్మాంసంబుకతన సుతులఁ బోషించుచుఁ గాలమ్ము గడపు
చుండె, నిట్లుండ నట సత్యవ్రతునితండ్రి తపమ్మునకరిగినది మొదలుగ నతని
పురమ్మును నంతఃపురమ్మును వసిష్ఠుండు గాపాడుచు రాజకార్యమ్ములు నెఱవేర్చుచు
నయోధ్యయం దుండె; నయ్యెడ నప్పురమ్మునకు సమీపమ్మునఁ దండ్రియానతిం జేసి
దుర్గతిం బడియున్న సత్యవ్రతునకు నొక్కనాఁడు మృగమ్ము లెవ్వియుం గానరాక
వసిష్ఠుధేనువు పొడకట్టె; దానింగాంచి యతండు పూర్వక్రోధమ్మున వధించి
తన్మాంసమ్ము కొంత దిని తన యాఁకలిం దీర్చికొని తక్కుంగల పలలమ్ము
నప్పాదపమ్మున నెప్పటియట్ల బంధించె. 263

క. ఆ ఋషిపత్నియుఁ దనదు కు, మారులకుం బెట్టి గోవుమాంసం బని తా
నారయ నేరక యెంతేఁ, గూరిమి భుజియించె మిగులఁ గుతుకం బెసగఁగా. 264

వ. అంత వసిష్ఠుండు తన ధేనువుమృతి నెఱింగి కోపాకులుండై పశుఘ్నుండగు సత్య
వ్రతున కిట్లనియె. 265

ఉ. ధేనువుఁ జంపి యెంతటికృతిన్ బొనరించితి వోరిదుష్ట! దో
షానుగతుండవై మును ధరామరదారహరించుటఁగా జగ
న్మానితుఁడైన తండ్రి యవమానము గైకొనుటఁగా వృథాగతిఁగా
ధేనువు నిష్ఠ చంపుటకు నిన్నుఁ ద్రిశంకుఁడనంగ నొప్పెడిన్. 266

వ. నేఁడు మొదలీ నామమ్మునం బొదలి జనులకుఁ బిశాచాకారమ్మునం బొడకట్టుచుండు
మని శాపంబిచ్చిన నతం డా రూపమ్ముదాల్చి యయ్యాశ్రమమ్మున వసియించుచు
నొక్క మునిపుత్రుని కతన నుపదేశంబు వడసి జగజ్జననిం గుఱించి యఖండతప
మ్మొనరించుచుండె నావుడు జనమేజయుండు మహాత్మా! త్రిశంకునకు వసిష్ఠశాపం
బెట్లుతొలఁగె నొడువు మన నతం డిట్లనియె. 267

గీ. ఆతఁడు పిశాచమై దేవినాత్మ నిల్పి, తన్నవాక్షరమంత్రతత్పరమనస్కుఁ
డగుచుఁ దప మాచరించి హోమార్థి యగుచు, నర్థి విప్రులకడ కేగి యడిగె నిట్లు.

వ. నాయొనర్చెడి నమస్కృతులంగొని మత్ప్రార్థనంబు సఫలంబొనర్పఁ గోరెద. నేను చిరమ్మునుండి నవాక్షరమంత్రరాజంబు జపియించితి నిపుడు జపదశాంశమ్ముచే హోమంబు సలుపవలయు మీరలు ఋత్విజులరై యికార్యంబు నెరవేర్చి కృతార్థుం జేయ వేఁడెద నన్నరుణపుత్రుండగు సత్యవ్రతుగాఁ నెఱుంగుఁడు నావుడు వార లిట్లనిరి. 269

క. తెలియంగ నయ్యె నీవాః, కులగురుఁడు వసిష్ఠమౌని గోపించి నినుఁగా
జలిపెఁ బిశాచముగా నీ, కలవడునే? వేదవిహితమగు కృతిసేయఁగా. 270

చ. అని తనుఁ దూలనాడుటయు నానృపనందనుఁ డేల నాదు జీ
వన? మిఁక నేమి సేయుదు? నపాత్రుఁడ రాజ్యములేమి చేసె మ
జ్జనకుఁడు దేశికుండిడెఁ "బిశాచమవై చెడు" మంచు శాప; మె
ప్పనికి నవర్హ్యతం బొరసి పాతకినై బ్రతుకంగఁ జెల్లునే. 271

వ. అని కృతనిశ్చయుండై శుష్కమ్ములగు కాష్ఠమ్ములు పేర్చి చితినేర్పరచి యగ్ని జొనిపి యందుం బ్రవేశింప నెంచి స్నానం బొనరించి జగజ్జనని నాత్మ దలంచు కొంచుఁ దత్సమీపమ్మునఁ గృతాంజలియై కూర్చుండునంత నజ్జగదంబ కరుణా శాలినియై యాకసమ్మున నాతనికి దర్శనంబొసంగి వారించి యిట్లను. 272

గీ. సాహసింపఁగ నేల యోజనవరేణ్య!, వినుము నామాట నీ తండ్రి వృద్ధుఁడయ్యె
నీకు రాజ్య మ్మొసంగి యెందేనిఁ దపము, చేయబోనున్నవాఁడు నిశ్చింతుఁడగుచు.

వ. మదనుగ్రహమ్మునంజేసి రేపు నిన్నుఁ బట్టాభిషిక్తుం జేయ నీతండ్రి యనుమత మ్మున మంత్రు లరుదెంతురని చెప్పి దేవి యదృశ్యమయ్యెఁ. బదంపడి త్రిశంకుండు మరణోద్యమమ్ము విడిచి సుఖంబుండె నంత నారదుండరిగి వృత్తాంత మ్మెల్ల నృపాలు నకుం జెప్పిన నతండు పుత్రు మరణోద్యోగమ్మునకు దుఃఖితుండై మంత్రులం బిలిచి యిట్లను. 274

ఉ. పొమ్మనినంత న వ్విడచి పోయి వనమ్మున భాగ్యహీనుఁడై
గ్రుమ్మరుచుఁగా గురుప్రవరుకోపము తన్నలయింపఁగాఁ బిశా
చమ్మయి దేవి గొల్చి విలసన్మతియై తుద కెంతయుఁగా విరా
గమ్మున నగ్నిలోనఁ దనకాయము వైవఁగ నెంచె నక్కటా. 275

గీ. కృప గలిగి దేవి వారింపదేని సుతుఁడు, మృతిఁ బొరయుఁగాదె, పైళమ యేగి నాదు
జ్యేష్ఠపుత్రునిఁ దెండు విశ్చింత వావి, కిచ్చి రాజ్యమ్ము తపమున కేగువాఁడ. 276

వ. నావుడు మంత్రులు సత్యవ్రతునిపాలి కరిగి యనునయ వచనమ్ముల నోదార్చి పుర మ్మునకుఁ దీసుకొనివచ్చి తండ్రికిం జూపిన నతండు జటాజూటధరుండును గ్రూరుం డును జింతాదంతురుండును నగు కొమరుం గాంచి పశ్చాత్తప్తుండై రాజ్యార్హుండును మేధావియునగు తనయు ధర్మం బెఱింగియు నిట్లొనరించితి నని సిగ్గిలుచు నాలింగ నం బొనరించుకొని తనసింహాసనమ్మునఁ గూర్చుండబెట్టుకొని ప్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె. 277

## రాజనీతి

క. తనయా! ధర్మమ్మున బు, ద్ధిని నిలుపన్ వలయు నెపుడు ద్విజవర్యుల మ
న్నన పేయవలయుఁ బ్రజలన్, దనుజులవలెఁ బ్రోవవలయుఁ నరనాథునకున్. 278

గీ. ధనము న్యాయాగతంబయి తనరుటొకటి
యన్నృతమునఁ గాలువెట్టమియును నమార్గ
గామి గాకుంట తపసుల నోముటయును
బరమధర్మమ్ము లియ్యవి పార్థివునకు. 279

గీ. ఇంద్రియజయంబు పూజ్యుల నెఱుఁగుటయును,
మంత్రగుప్తియు జోరుల మద మడఁచుట,
శత్రుశేషంబు పైఁపమి, సచివు నన్య
పక్షుఁ జేర్పమి పతికి యశస్కరంబు. 280

గీ. శత్రుమిత్రుల కృత్యముల్ చారముఖము
వలన నెఱుఁగుటయును శుష్కవాది గామి
దుష్టసంగంబు దొలఁగుట యిష్టులకును
బూజ్యులకు నీఁగియును విధి భూపతులకు. 281

క. యాగముల నొనర్చుట మృగ. యాగతి పతిరక్తి లేమి యంగనలం దు
ద్యోగముల విశ్వసింపమి, యాగమవిహితముల నృపతులగు వారలకున్. 282

గీ. ద్యూతమున దాని నాడెడి నీతిరహితు, నందు మద్యమ్మునందు వారాంగనాజ
నమ్మునందును దఱచు గానమ్మునందు, విముఖుఁడై ప్రజ నట్లొనర్పింప వలయు. 283

గీ. అరసి బ్రాహ్మముహూర్తమునందు లేచి, స్నాన మొనరించి నియతుఁడై శక్తిపూజ
భక్తి నొనరింపఁగావలెఁ బ్రతిదినమ్ము, జన్మసాఫల్యమును గోరు చతురమతికి. 284

క. ఒకసారియైన నప్పర, మకృపానిధి నంబఁ గొలిచి మన్ననఁ దత్పా
దకమలజలంబు గ్రోలిన, సుకృతికి జన్మమ్ములేదు సూ నిక్కముగన్. 285

గీ. దృశ్యమగు జగమఖిలమ్ము దేవదేవి, జీవుఁ డీశ్వరుఁడును గూడ దేవదేవి
యని, వినిశ్చితాత్ముండగు ననఘమతికి, నతులితానంద మెల్లప్పు డనుఘటించు.

శా. ప్రాతఃకృత్యములన్ యథోచితగతిం బాటించి కొల్వుండి వి
ద్యాతంత్రజ్ఞుల విప్రులన్ బిలిచి శాస్త్రార్థమ్ము లవ్వారిచేఁ
బూతుండై విని పాత్రులై తనరు నా భూదేవతాశ్రేష్ఠులకు
బ్రీతిన్ దానము లిచ్చిపుచ్చవలయున్ బృథ్వీశుఁ డెల్లప్పుడున్. 287

క. విను మూర్ఖులైన ద్విజులకు, ధన మీవల దిచ్చెనే నుదరపోషణకుం
గనిపెట్టి యీవలయు లం, ఘన మొనరింపగఁ దగదుగా ధర్మములన్. 288

చ. అనఘుల భూమిదేవతల నత్యమలాత్ముల నెన్నఁదేనియున్
జన దవమానముం గొలుప క్షత్రకులమ్మున కమ్మహామహుల్
జనకులు ; వారి యగ్నికిని, క్షత్రియజాతికి విప్రజాతి లో,
హనిధులకున్ శిలల్, జనకతాస్పదముల్ విధిచోదితమ్ముగన్. 289

ఉ. వారల తేజమెందును నవారితమై యలరారు భూపతుల్
వారలలోన ధీరులగు వారల నెన్ని యఖండదానస
త్కారములన్ మహావినయ గౌరవసంపదలన్ మహోన్నతిం
గోరుచుఁ బూజసేయుదు రకుంఠితవైభవముల్ సెలంగఁగన్. 290

గీ. ధర్మశాస్త్రానుసరణంబు దప్ప కెపుడు
దండనీతి యవశ్యంబు ధరణిపతికి
గోశసంగ్రహ మెల్లెడఁ గూర్పవలయు
ననుచు బోధించెఁ బృథివీంద్రుఁ డాత్మజునకు. 291

మ. తనవాక్యమ్ములు సమ్మతించినసుతున్ దత్తన్మహాతీర్థపా
వననీరమ్ములచేత మంత్ర్యనుమతిన్ బాఖుల్ శ్రుతుల్ సెప్పి దీ
వనలం జేయఁగ మంచికాలమున దీవ్యద్భంగిఁ బట్టాభిషే
చనముం జేసి యతం డరణ్యము తపస్సంసక్తి నేగెన్ దగన్. 292

వ. అట్లు నృపాలుండు గాంతారమ్మునఁ గాంతాసహితమ్ముగఁ దపంబొనర్చి కొండొక కాలమ్మునకు దేహంబు విడిచి దివం బరిగి యచ్చట నింద్రాసనసమీపమ్మున రెండవయింద్రుండై యుండెననుడు జనమేజయుం డిట్లను. 293

ఉ. మున్ను వసిష్ఠుధేనువును ముష్కరుఁడై వధియించి శాపముం
గొన్న త్రిశంకుఁ డేగతిని గుంభినికిన్ ధవుఁడయ్యె? నెందునే
ని న్నృపతిత్వ మూనఁదగునే మునివర్య! పిశాచముల్? గృపన్
దన్నృపు శాపమోక్షణకథన్ వినిపింపుము నాకు నావుడున్. 294

వ. వ్యాసుండిట్లనియె. 295

చ. అతఁడు పిశాచమయ్యు జగదంబిక నాత్మఁదలంచి తత్కృపా
మృతమున దివ్యదేహము ధరించె వసిష్ఠమహామునీంద్రు స
మ్మతికి విధానమయ్యెఁ బితృమాన్యతఁ గాంచె నృపాల! లోకవం
దితయగు నప్పరాంబిక నుతించిన నెయ్యది గల్గకుండునే. 296

గీ. అనఘుఁడై పేర్మినిట్లు సత్యవ్రతుండు, రాజ్యమును జెంది జన్మముల్ రమణఁజేసి
యెన్నఁదగు కీర్తి గాంచి లోకోన్నతుండు, సర్వలక్షణయుతు హరిశ్చంద్రుఁ గవియె

వ. పదంపడి యనుగుణవయస్కుండగు కొమరునకు యౌవరాజ్యం బొసంగి శరీరమ్ముతో దివమ్మున కరుగఁదలఁచి వసిష్ఠాశ్రమమ్మున కరిగి కృతాంజలి పుటుండై యిట్లను. 298

## వసిష్ఠుండు త్రిశంకునకు శాపంబిచ్చుట

మ. అనఘా! యీతనువుం ద్యజింపకయ నే నాసింతు స్వర్లోకసం
జనితానందము లప్సరోవిధుముఖీసంసర్గముల్ దివ్యనం
దనసంచారముఁ గర్ణపేయమగు గాంధర్వంబుఁ; దత్తాదృశా
భినవోద్యత్ఫలదాయి యాగమును సంప్రీతిం దగం దెల్పుమా. 299

చ. అనవుడు నవ్వసిష్ఠుఁ డను నాకనివాసము మర్త్యదుర్లభం
బనఘ! కృతాధ్వరుండు మృతుఁడై దివ మేగుట సుప్రసిద్ధ మే
మనఁదగు నీ మనోరథము యాగ మొనర్చితివేని వచ్చు త
త్తనువున నప్సరస్సతులఁ దద్దయుఁ గూడి సుఖింతు విమ్ములన్. 300

వ. అంతియ కాని బొందితో నాకసుఖం బొడగూర్చుట నాకశక్యం బనవుడుఁ, బూర్వ

రోషసంయుక్తుండగు నమ్మహామునికిఁ ద్రిశంకుండిట్లను, నీవు గర్వావేశమ్మున నన్నుఁ గ్రతువు చేయింపవేని వేఱొక్క పురోహితుఁ కతనఁ దాదృశంబగు జన్నం బొనర్చువాఁడ ననుడుఁ గోపోద్రేకమ్మున నిట్లు శపించె. 301

ఉ. గోవధపాపదూషితునకున్ ధరణీసురదారహర్తకున్
దేవనివాస మన్యమగు దేహము దాల్చినయేనిఁ గల్గ దో
రా! వెఱ పింత లేక నను నాగ్రహయుక్తునిఁ జేయుదే? దురా
త్మా! విను మిప్డ నీకు ననువౌ శ్వపచత్వము శాపహేతువై. 302

చ. గురుఁ డిటు శాప మీ నతనికుండలముల్ శిల లయ్యె, నీలతన్
బొరసెను బట్టుపుట్టము, సముజ్వలమైతగు దివ్యదేహమున్
గరి కెన యయ్యె, మై నలఁదుగంధము విట్సమమయ్యె శక్తికిం
కరుల నెదిర్చి యెవ్వఁడు సుఖమ్ములఁ బొందు జగత్త్రియమ్మునన్. 303

శా. గాయత్రీజపతత్పరుండు సురలోక జ్యేష్ఠకల్పుండు దు
ర్జ్ఞేయుండైన వసిష్ఠుఁడిట్లు తను వంచింపన్ మహాంబేది చిం
తాయత్తుండయి యింటికిం జనఁగ నత్యంతమ్ము శంకించి యీ
కాయం బెంతయు హేయ మేలిఁకని తత్కాంతారసంచారియై. 304

క. శ్వపచుండగు పతిఁ గని యెం, త పతివ్రతయేని భార్య తర్కించును, మం
త్రిపురస్సరులగు బంధులు, నెప మిడి యెడ నుంతు రింత నీచత గలదే. 305

మ. మరణంబే శరణంబుగాక యని యాత్మన్ నిశ్చయం బంది త
న్మరణం బేగతిఁగల్గు, వహ్నివిషసంబంధమ్మునం జేసి యె
వ్వరు గోల్పోత్తురు కాయ మాపతితు లాపై జన్మమందున్ బునః
పరితాపమ్మును గాంచువార లని చెప్పన్ వింద ధర్మమ్ములన్. 306

వ. కావున నాత్మహత్యకన్న నింద్యంబొండు గన్పట్ట దెట్టిదైన గృత శుభాశుభకర్మమ్ములు కేవలభోగ్యంబు లగుట నేనీ దేహమ్మునన యీశ్వపచత్వమ్ము విశేషముగా ననుభవించు టొప్పుఁగాదె? పుణ్యతీర్థమ్ములు సేవించుచుఁ బరాంబికాస్మరణమ్మును సాధు సంసర్గమ్మును తోడుగాఁ గాననమ్మున సంచరించెద నెవ్వండేని యొక మహానుభావుండు దొరకకుండునే? యని నగరమ్మువిడిచి గంగాతీరమ్మున కరిగి యట దుఃఖపరీతుండై వసియించుచుండె. 307

క. తనతండ్రి దుర్దశను విని, ఘనుఁడు హరిశ్చంద్రుఁ డాత్మగలఁగ సచివులన్
జనిచెన్ వారలు గంగా, ధుని యొద్దునకేగి నృపుని దుఃఖితుఁ గృశునిన్. 308

వ. కాంచి వినయమ్మున మహాత్మా! యువరాజగు నీతనయుండు హరిశ్చంద్రుండు నిన్ను సన్మానపూర్వకమ్ముగఁ దోడితెండనిన వచ్చితిమి కటాక్షించి నగరమ్మున కరుదెంచి యథాపూర్వకమ్ముగ మంత్రులును సేవకులును సేవింప రాజ్యభారమ్ము వహింపుము గురుండెట్లు ప్రసన్నుండగు నట్లొనర్పవచ్చునని బహుభంగుల విన్నవించినను శ్వపచుండగు నా నృపాలుండు గృహంబేగుటకు సమ్మతింపక వారల కిట్లనియె. 309

చ. చనుఁడు మదాజ్ఞఁజేసి శ్వపచత్వమునన్ బురిఁజూడనోప మ
త్తనయునితోడ బ్రాహ్మణహితమ్ముగ జన్నములాదియౌకృతుల్
బొనరుచుదున్ ధరాభరము పూని ప్రజన్ భరియింపుమంచు నా
పనుపునఁ జెప్పి మీరలును బాల్పడుఁ డాతనికిన్ సహాయులై. 310

వ. ఇట్లు కృతనిశ్చయుండైన త్రిశంకునకు నమస్కరించి దుఃఖావేశమ్మున నందఱును నాయాశ్రమంబు విడచి పురికరుదెంచి, 311

క. అనవద్యమగు దినమ్మున, ఘనుని హరిశ్చంద్రు భూమికాంతునిగా స
జ్జనహితు నభిషేకించిరి, మునిజనముంతోడ మంత్రిముఖ్యులు పేర్మిన్. 312

వ. హరిశ్చంద్రుం డిట్లు కృతాభిషేకుండై మనమ్మునఁ దండ్రిం దలఁచుచు న్యాయ్యంబుగ భూపాలనం బొనరించె నావుడు జనమేజయుండు. 313

మ. జనమాన్యుండు త్రిశంకుభూపతి హరిశ్చంద్రున్ జగ
ద్వినుతుం బట్టము గట్టఁజేసి పిదపన్ దేహమ్ము చాలించెనో!
మునిచే శాపవిముక్తి చెందెనొ! వనిన్ మున్నెట్టు లప్పాట మా
లని భంగిన్ జరియించెనో నొడువు మెల్లన్ వృత్తము న్నాకొగిన్. 314

వ. నావుడు వ్యాసుండు, రాజేంద్రా! త్రిశంకుం డట్లు హరిశ్చంద్రునకు రాజ్యంబొసంగి జగజ్జనని నాత్మనిల్పి యవ్వనమ్మున గంగాతీరమ్మునఁ దపమ్ముకలిమిఁ గాలయాపనం బొనర్చుచుండె, నంత మున్ను తపమ్మున కరిగిన విశ్వామిత్రుండు సమాప్తవ్రతుండై దారపుత్రాదుల నీక్షించుపొంటె నరుదెంచి సుతసహితమ్ముగ నెదురువచ్చి నిర్వర్తిత సపర్యయై యున్న భార్యంగాంచి ప్రీతిపూర్వకమ్ముగ నిట్లనియె. 315

క. తరుణీ! దుర్భిక్షమ్మున, నరిగితి నేఁ దపమొనర్ప నాత్మజులను వి
న్నారు లెవ్వరు పోషించిరి, తరమె కుటుంబమ్ము గడప ద్రవ్యములేమిన్. 316

గీ. కలి వతిశయించె ననువార్తకతన మిమ్ముఁ
దలఁచి శోకించి నిర్ధనత్వమునఁ జేయు
తెరు వెఱుంగక యిటకరుదేరనైతి
నాకు నప్పటి దురవస్థ నాతి వినుము. 317

క. ఆఁకలిఁ బట్టఁగ లేక శ్వ, పాకుని గృహమేగి చోరభావమ్మున భాం
డాకలితపక్వఖనక ప, లాకాంక్ష యొనర్చునంత నా శ్వపచుండున్. 318

వ. తత్తఱమ్మున సడిఁగట్టి మేల్కాంచి వంటింట నున్న నన్నుంజూచి నీవెవ్వరేకత మ్మున మద్గృహమ్మునకు వచ్చితి, భాండంబేల తడవెదు ? నావుడు నేను భయత్ర స్తుండనయ్యు ధైర్యం బవలంబించి వాని కిట్లంటి. 319

ఉ. తాపసుఁడన్ క్షుధార్తిమెయిఁ దాళఁగ లేకిటు చోరభావమున్
జూపుచు నీగృహమ్మునకుఁ జొచ్చితి నే నతిథిన్ గృపన్ మదా
శాపరిపూర్తిచేయఁగ నొసంగుము మాంసమొకింత ; భాండమం
దీపనికై కరంబిడితి నేటికి నాఁగెదు క్రోధమూర్తివై. 320

వ. నావుడు శ్వపాకుండు నా కిట్లనియె. 321

చ. ఇది శ్వపచాలయంబు విను మేను శ్వపాకుఁడ మాంసమున్ భుజిం
పఁ దగునె యగ్రజాతికిటఁ; బాతకకృత్యము చూడనేరన
య్యెద మనువేమి చెప్పె వినవే ? శ్వపచుల్ మఱియేడుజాతులున్
విధిగ ననర్హు లెందులకు విప్రకులోత్తమ ! విడ్వు భాండమున్. 322

గీ. వీఁడు లోభావృతుండని చూడఁబోకు, మకట ! మానవజన్మ మప్రాప్య మందు
విప్రతయు దుర్లభం బిట్టివిధికిఁదగుదు, వే ? ద్విజన్ముఁడవై వర్ణవిధము చెడదె.

వ. నావుడు వాని ధర్మమ్మునకు సంతసించియే నిట్లంటి. 324

క. తగుగతిఁ బల్కితి విది ధ, ర్మగతికిఁ దగుభంగి సూక్ష్మమార్గము విను మె
వ్వగనైన దేహమును ని, ల్పఁగఁదగు శంకింపఁ దగదు పాపమ్మునకున్. 325

గీ. తనువు గల్గినమీఁదఁ బాతకము నడఁచు
నికృతి చేయంగ వచ్చు నేరికిని పాప
దలు ననాపదలని చూడఁదగదు దోష
మెదయుఁ జేయకయున్నఁ బాల్పడు నరకము. 326

చ. మరణము క్షుత్తుచేఁ గనిన మానవుఁడెట్టిడునే నవశ్యమున్
నంకము చెందుఁగాన మరణమ్మునకున్ భయమంది చోరతన్

బొరపి శ్వపాకగేహమని బుద్ధి నెఱింగియు నీ మహానసం
బరయఁగ వచ్చినాఁడ విను మాకలి యొండు నెఱుంగనిచ్చునే. 327

క. ఆదియునుఁగా కీ చౌర్యము, తుద కాపర్జన్యదేవు దోషాత్ముని, జే
యఁదగు నవర్షణ మాతం, దొదవించినకతన నింతయు న్నిజమనుడున్. 328

శా. ఆపర్జన్యుఁడు నేస్గుతొండములలావై ధార లొప్పార స
ర్వాపన్నాశకుఁడై పటత్పటరవంబై భూనభోభాగ మి
చ్ఛాపూర్తిన్ విలసిల్లఁగాఁ గురిసె గాంచత్కాంచనోదంచితం
బై పాటిల్లెడి వృష్టి విద్యుదుదయం బందందుఁ గన్పట్టఁగన్. 329

చ. ధనమును గాంచి సంతసము దాల్చి తదీయగృహమ్ము వీడి ని
న్నును సుతులన్ గృహమ్మును గనుంగొన వచ్చితి నింతకాల మి
వ్వనమున క్షామమందుఁ బసిబాలుర నేగతినోమి ? తెల్లు జీ
వనమున నుంటి ? తెల్పుమన వారిజలోచన మౌని కిట్లనున్. 330

క. నీచనుట మొదలుఁ గఱవు పి, శాచముగతిఁ బ్రబలి క్షుత్తు నైఁపక సుతులున్
మై చాకచక్య మెడలిన, యాచింపఁగఁ బ్రతిగృహంబు నరిగి నయమునన్. 331

క. అడుగుచు నీవారమ్ముల, నడవులలో నేరికొనుచు నాయీరీతిన్
గడిపితిఁ గొండొకకాలము, బడలంగానీక చిఱుతపాపల నెల్లన్. 332

ఉ. పిమ్మట నిండ్లకుం జనిన బిచ్చము పెట్టరు గేస్తు, లేయర
ణ్యమ్మునకేగి చూచినను నారయ రా దొకగింజ, కందమూ
లమ్ములుగాని చెట్టుల ఫలమ్ములుగాని లభింప వట్టి కా
లమ్మునఁ గుట్టలన్ గవి తలంకితి నాఁకలి దీర్పరామికిన్. 333

వ. అంత నందఱం జంపుటకంటె నిందొక్కతనయు నమ్మి తత్క్రయప్రాప్తంబగు ధనమ్మునఁ దక్కటిపుత్రులఁ బోషించుట లగ్గనియెంచి క్రంవమానుండగు కొమరునఱుత రజ్జువుం దగిల్చి వెంటఁ బెట్టికొని యెందేనిఁ జనునయ్యెడ సత్యవ్రతుండను రాకొమరుఁడుచూచి "యేమీబాలకుం దేడ్చుకతం" బనవుడు నేనిట్లంటి, నీశిశువు నాచే విక్రయార్థంబుగాఁ గొనిపోవంబడువాఁడు నావుడు నతండు గరుణించి "నీవు గృహమ్మరుగుము నీకుటుంబమునకుఁ బ్రతిదినమ్ము చాలినంత యామిషముఁ దెచ్చి యే నిచ్చువాఁడ నద్దాన జీవింతువుగాక యిట్లు నీ పతియగు మునీంద్రుండు వచ్చుదనుక నా చేయుట" యనిన నేను ముదంబంది యింటికరిగితి

నతండును ద్రతిదినమ్మును నల్లొనర్చువాఁ డస్మన్నిమిత్తమ్మున వసిష్ఠుచే శపింపం బడియె నది యెట్లంటేని, 334

క. ఒకనాఁడు మృగములేచటఁ ద, నకుఁ గానఁగరాక యీ వనము నెల్లెడ మి
న్నక తిరిగి విసివి యతఁడు తు, దకుఁ జంపె వసిష్ఠుగోవుఁ, దన్మునివరుఁడుణా.

క. అలిగి త్రిశంకుండను పే, రలవడఁగ శపించె మాలఁడై కుందఁగ నా
వలనఁగదా యాతని కీ, కలుషము ఘటియించెనని వగచెద మునీంద్రా. 336

వ. కావున నుపకర్తయగు నన్నరవరుఁ డేగతినైనఁ దపోబలగరిష్ఠుండవగు నీకుప కార్యుండని వేఁడిన సతికిఁ బతి యిట్లనియె. 337

క. నే దవ్వై యున్నప్పుడు, నీదైన యవస్థ చూచి నెజిఁ బ్రోచిన దా
యాదునిఁ దన్నృపవర్యుని, సాదరమతి శాప మెడలు నల్లొనరింతున్. 338

వ. అని చెప్పి యతనిదుఃఖం బెట్లు విముక్తంబగునో కో ! యని యెంచుచుఁ ద్రిశంకుండున్న పక్కణంబున కరుగుడు నతండు మునిరాక యెఱింగి యెదురై విస్మయం బొదవఁ బాదమ్ములం బడి నమస్కరించినఁ గరుణార్ద్రుండై కౌశికుండు లేవనెత్తి యిట్లనియె. 339

క. జననాథ ! నీవు మిక్కిలి, యనఘుండవు నాతదర్థమై శాపంబుం
గొవి చండాలుఁడ వైతివి, చను నే నా కూరకుంట శక్తుఁడ నయ్యుక. 340

వ. ప్రత్యుపకారం బొనర్చి ఋణవిముక్తి జెందనుంటి నీ యభీష్టంబేమనుఁడుఁ ద్రిశంకుఁడు మహాత్మా ! మున్ను మత్కులగురుండగు వసిష్ఠుని సశరీరస్వర్గదంబగు జన్నమ్మున నన్నుఁ గృతార్థుఁ జేయుమని వేఁడిన నతం డొల్లఁడాయె. 341

క. ప్రీతి న్నాకోరిక నిడ, నేతువయేని వినుమయ్య ! నియమమ్మున నా
చేత సశరీరనాకద, మై తనరెడి జన్నమును దయణా జేయింతే. 342

వ. కులగురుం డొల్లననిన నే నమ్య గురునిఁగాఁగొని యీయాగంబు నిర్వర్తింపం చెద, ననుడు నతండుఁ "నన్నవమానింప నుంకించితివి గానఁ జండాలుండవై నవయు" మనియె, వియ్యది శాపకారణంబు నావుడుఁ గౌశికుండు దచ్ఛాపంబు గ్రహింరించి యుపకృతిం బొనర్పనెంచి యజ్ఞసంభారమ్ము లార్జించి మునులం బిలిచిన వారలు మఖయాథార్థ్యంబు గుఱుతెఱింగి వసిష్ఠనివారితులై యొక్కరును రాకుండిరి. దానికిఁ గ్రుద్ధుండై కౌశికుండు త్రిశంకుకడ కరిగి వసిష్ఠుదౌర్మంత్ర్యమ్మున మును లొక్కరును నిటకురారు. 343

మ. ద్విజు లేతేరక యున్న జన్న మెటు సంధిపంగనౌ నిన్ దివం
బజరుద్రాదులు మెచ్చ నంపెదను రాజా! నాతపశ్శక్తిమా
డ( జనుగాన్ గైకొను మిప్డ నీ కొసఁగువాఁడన్ బెద్దకాలంబు చే
యు జపం బంచును ధారవోసెఁ దప మా యుర్వీశుహస్తమ్మునన్. 344

క. తనగాయత్రీజపనం, జనితంబగు సుకృతమిచ్చి జనవర! చను మిం
కను స్వర్గంబున కెవ్వం, డును నిన్నడ్డంగఁజాలఁడు జగత్త్రియిలో. 345

## త్రిశంకుండు స్వర్గమ్మున కరుగుట.

చ. అని యనుపన్ ద్రిశంకుఁడు రయమ్మునఁ బక్షియుఁబోలె నాకసం
బునకుఁ దపోబలమ్మున సముద్గతుఁడై దివ మేగునంత న
య్యనిమిషు లంతరంబున జనాధిపతిన్ శ్వపచాకృతిం గనుం
గొని శ్వపచుండు నాకమునకుం జనుదెంచెడి దేవవల్లభా, 346

ఉ. నావుడు దేవనాథుఁడు మనమ్మున విస్మయమంది యేగి యా
భూవిభునిన్ శ్వపాకునిఁ దపోవిభవమ్మున నాక మేగు దు
ర్భావునిఁ దాఁద్రిశంకునిఁగ భావనచేసియు "పొమ్ము పొమ్ము నీ!
దేవనివాస మేదఁ! జనుదేర శ్వపాకుఁడు నేడ! దుర్మతీ." 347

వ. అని తొలఁగం ద్రోచినఁ ద్రిశంకుండు క్షీణపుణ్యుండగు నమరుండునుం బోలె భూమిం బడువాఁడు గాధిజుంగూర్చి యిట్లాక్రోశించె.

చ. చను మనినంత నేగి సురసద్మము చేరెడి నన్ను దేవతల్
కని సురనాథుతో నుడువఁగా నతఁడీగతిఁదెచ్చె నో మునీం
ద్ర! నమఁ గనుంగొనందగదె? ధారుణిపైఁ బడుచుంటి నాఁగ న
మ్మని విని "నిల్వు" మంచు నృపముఖ్యునినాఁగెఁ దపమ్ము పెంపునన్. 349

వ. గాధిజుండట్లు త్రిశంకుని గగనమ్మున నిలువరించి పిదప నుదకంబు స్పృశించి సువిస్తరంబగు నిష్టి నొనర్చి నూతనసృష్టిగా వేఱొండు స్వర్గమ్ము నిర్మించునంత నింద్రుం డెఱింగి సత్వరమ్మున నయ్యెడ కరుదెంచి వినయమ్మున నిట్లను. 350

క. కోపించి నూత్నసృష్టిన్, బ్రాపింపఁగనేల? మౌనివర! భావత్కా
జ్ఞాపరిపూర్తి యొనర్చెద, నాప్రార్థన పాటిపేయు నా మునివరుఁడున్. 351

చ. సురపతి కిట్లు పల్కు "బలసూదన! త్వద్భవనమ్మునుండి యీ
ధరఁబడు మాత్రిశంకుని ముదమ్మునఁ దోడ్కొని స్వర్గలోక సు
స్థిరునిగఁ జేయు మిట్లు ఘన సృష్టికి మాఱొనఁచింపనే" ననన్
గరము మునీంద్రుదార్ఢ్యమునఁ గంపితుఁడై సురనాథుఁ "డో" మనెన్. 352

క, తప్పనివిధిచే నీగతి, నొప్పి పిదప దివ్యదేహ మొసఁగి త్రిశంకుణ్
గొప్పగఁ దన పార్శ్వమునన్, జొప్పడఁగాఁ జేసి యరిగె సురపతి దివికిన్. 353

వ. ఏకవిమానసంగతులై యిట్లింద్రత్రిశంకులు దివమ్మున కరిగిన స్వస్థుండై గాధిజుం డాశ్రమమ్మున నుండె. 354

గీ. స్వర్గగతి తండ్రి కబ్బినవార్త నెఱిఁగి
సంతసంబంది యాహరిశ్చంద్ర నృపతి
పుడమినేలుచుఁ దనకూర్మి పడఁతిఁ గూడి
యిష్టభోగమ్ము లనుదిన మెనయుచుండె, 355

క. సంతానము దవ్వగుటకుఁ, జింతించి వశిష్టమౌని సేవించి మహా
మంత్రజ్ఞ! నాకు సంతతి, యింతకు లేకుంట కేమి హేతువు చెపుమా. 356

మ. కలవింకమ్ములు సంతతిం గని సుఖాఖండస్థితిణ్ బొల్చు న
వ్వల వీక్షింపు ముపాయశాలి వయి దైవజ్ఞుండవై మంత్రవే
త్తలకుం బ్రాపయియున్న నీదు పదపద్మమ్ముల్ దగం గొల్చువా
రలకున్ మాకిటు లొటకుం గతము ప్రారబ్ధమ్మునాఁ జెల్లదే. 357

వ. అని శోకమిశ్రమ్ముగఁ బల్కు సజ్జనవరునకు వసిష్ఠుండిట్లనియె. 358

చ. కనఁగ నపత్యహైన్యమునకన్నను దుఃఖము లేదు సంసృతిం
బనుపడువారికిణ్ ధరణివల్లభ! సంతతి నీఁగ నెంతయుణ్
ఘనుఁడని విందు నవ్వరుణు; గ్రక్కున నాతనిఁ బూజచేసి నం
దనుఁ గొనవచ్చుఁ దత్కృతికి దైవముతోడగునాఁడు తత్కృపన్. 359

గీ. దైవపురుషకారమ్ములు దవిలి కార్య, సిద్ధిఁబొనరించు నుద్యమస్థితికి నరుఁడు
గడఁగ దైవంబు తోడగుఁ గాని, లేని, నాఁడు కేవలదైవ మొనర్చు టెట్లు? 360

వ. అని గురుం డుపదేశించి వీడ్కొల్పినఁ గృతనమస్కారుండై యరుదెంచి హరి శ్చంద్రుండు గంగాతీరమ్మున ఘోరతపంబొనర్చె. 361

క. అతని నిక్షేపమున కెఱఁగి ప్రౌ, చేతుం డానంద మొంది చెచ్చెరఁ గనవై
ప్రీతిన్ గోరుము వరమన, భూతలపతి కేలు మొగిచి పులకితతనుఁడై. 362

క. అనపత్యుఁడనై దుఃఖం, బున మునిగెడినాకు ఋణవిముక్తి ప్రదు నం
దను఼ఁ గరుణింపుము నావుడు, జనపతి కతఁ డనియె దరహాసమ్ముఖుఁ డగుచున్.

ఉ. నందను నీ కొసంగెదఁ గనంబగు నందము వొల్చువాని మి
న్నందెడి సద్గుణంబులకు నాకరమై తగువాని భూమిసం
క్రందన! తత్సుతుం బశువుగా నొనరించి యజించెదే? మదా
నందము గోరి; నావుడు మనమ్మున భూపతి గొంకి యిట్లనున్. 364

వ. మహాత్మా! వంధ్యతకన్న నియ్యది కొంత మేలగుట నిష్పాట నొనరించువాఁడ సుతుఁ బ్రసాదింపు మనవుడు వరుణుండు నీకు నవశ్యమ్మును గొమరుండు పుట్టు గృహం బరుగుము నావుడు సంతుష్టుండై యతఁడు పురమ్మునకుఁ జని భార్యకు నొడివిన నాపెయు సంతసించెఁ దక్కఁగల భార్యాశతమ్మును ముదమ్మునఁ బొదలె. 365

## రోహితోత్పత్తి.

గీ. అతని భార్యాశతమ్మునయందుఁ బట్ట
రాజ్ఞి యగు శైబ్య యంత గర్భమ్ముదాల్చి
పదినెలలు నిండఁ గనియె శుభదినమందు
సుతునిఁ గందర్పసుందరుఁ బతిహితముగ. 366

వ. హరిశ్చంద్రుండు జాతకర్మం బొనరించి యఖండోత్సవం బాచరించె, నట్టియెడ వరుణుండు విప్రవేషమ్మున నట కరుదెంచి స్వస్తివచనపూర్వకముగఁద న్నెఱిగించి యిట్లనియె. 367

ఉ. నావరదానకారణమునం దగె వంధ్యత లేమి నీకు, న
ద్భావుఁడ వేని యీసుతునిఁ బార్థివ! యజ్ఞపశుం బొనర్చి సు
శ్రీ వెలయన్ యజింపుమనఁ జింతమెయి న్నరపాలుఁడక్కటా!
యేవిధి నిక్కుమారకుని నీఁదగు నీకెటు లోమఁగాఁదగున్. 368

చ. వరుణుఁ డితండు విప్రుఁడయి వచ్చె మఱొక్కట నీఁడ బోవఁదె
వ్వరికిని దేవహేళనము భావ్యము గా దతికోమలాంగు నం

బుధహసమాననున్ మఖముపొంటె వధించినఁ బుత్రశోకముం
దరమె భరింపఁ దక్కుటి విధమ్మున నీతఁడు ప్రీతిచెందునే. 369

క. పెక్కుగు బాములఁ బడి తుద, కొక్కరుఁ గని నందులకు సుఖోదయమునకుం
దక్కితి నదిగాకయుఁ బై, మిక్కిలి శోకింపవలసె మితిలేనివగన్. 370

వ. అని చింతించి ధైర్యం బవలంబించి వినయమ్మున నతని కిట్లను, మహాత్మా! పుత్రుం డుదయించిన పదిదినమ్ములకుఁ దండ్రి కర్మయోగ్యుఁడగుఁ దల్లి మాసమ్మునకు శుచియగు యాగమ్మునకు దంపతులు ముఖ్యులగుట సర్వసమ్మతం బనవుడు వరుణుండు మాసానంతరమ్మున నరుదెంతుననిచెప్పి చనియె; నంత హరిశ్చంద్రుండు పరమానందమ్మున విప్రులకుఁ గోట్లకొలఁది గోవులను దిలపర్వతమ్ములను హేమ రాసులను నొసంగి యాత్మజునకు రోహితుండను నామంబిడి పుత్రవదనసందర్శన జనితానందపరవశుండై యుండునంత మాసమ్ము పూర్ణంబగుడు, వరుణుండెప్పటి యట్ల విప్రుఁడై యరుదెంచి యజింపుమనుడు నృపాలుండు దుఃఖసాగరమగ్నుండై యతనికి నమస్కరించి కృతాంజలియై యిట్లనియె. 371

క. పావనమయ్యెన్ సదనము, దేవర రాఁబట్టి మఖవిధికిఁ బసిబాలుం
దేవిధి నర్హుఁడు దంత, శ్రీవెలయని పశువు శ్రుతినిషిద్ధముకాదే. 372

వ. కావున దంతోదయంబుగా వేగమ క్రతువొనర్తు ననుడు నంగీకరించి యతం డరిగెఁ; బిమ్మట సంతసమ్మునఁ గొంతకాలంబు గడపి నృపాలుం డున్నంత దంతోదయం బగుట యెఱింగి వరుణుండు యథాపూర్వకమ్ముగఁ గ్రతు వొనర్పుమని వచ్చె; నంత హరిశ్చంద్రుండు నిర్వర్తిత సత్కారుండై యతనికిట్లను. 373

గీ. అకృతచౌలుండు గర్భకేశాన్వితుండు, సమ్మతుఁడు గాఁడనుట వృద్ధసమ్మతంబు
గానఁ దత్కృతి నెరవేర్చి క్రతు వొనర్తు, నీ వెఱుంగని ధర్మ మెందేనిఁ గలదె.

వ. అనుటయు. 375

క. తెలిసి వరుణుండు నన్నుం, బలుమఱు త్రిప్పెదవు కపటభావంబదినీ
కలవడియె నాత్మజుని యం, దలి మోహము వి న్నసత్యతత్పరుఁ జేసెన్. 376

వ. కేశఖండానంతరమ్మునఁ గ్రతువొనర్పవేని దారుణంబగు శాపమ్మునాచే నీ కీఁబడు నింత నిక్కువ మని చెప్పి మఱియు నిట్లనియె. 377

క. జనవంద్యుం డిక్ష్వాకు నృ, పుని కాలమునఁ బొడమి వ్యర్థపుం బల్కులు గ
ల్గినవాఁ డితఁడనియెడి కీ, ర్తిని జెందకు పోయివత్తు నృపతివతంసా. 378

వ. అనిచెప్పి యప్పటికతం డరిగె. భూపాలుండును సంతుష్టాంతరంగుఁడై యుండెఁ బదంపడి కొండొకకాలమ్మునకుఁ గొమరుండు చూడాకరణయోగ్యుం డగుడుఁ దత్కర్మార్థంబు గృతప్రయత్నుండై. 379

క. తానును భార్యయుఁ దొడపై, సూనుని నెలకొల్పి మిగుల శోభనలీలన్
శ్రీ నెగడ నున్నతఱి వి, ప్రానుగతిన్ వరుణుఁ డచటి కరుదెంచి యనున్. 380

వ. రాజేంద్రా! చూడాకరణంబు నిర్వర్తించుమంటి వికఁ గొఱఁతయేమున్నయది? మఖం బొనరింపుము నావుడు హరిశ్చంద్రుండు గృతనమస్కారుండై యతని కిట్లను. 381

చ. ఇపుడ యొనర్పు టర్హ మని యేను నెఱుంగుదు నట్లొనర్తు యా
గపశువుగా నొనర్పఁగఁ దగం డితఁ డాగమసంస్కృతిన్ ద్విజ
త్వపదవి నొందకుండిన కతమ్మున; మూఁడగుజాతులందుఁ దా
రుపనయనంబు లేమిఁ జరణోద్భవతుల్యులు కర్మబాహ్యులున్. 382

వ. కావున శూద్రప్రాయుండగు నిక్కుమారుని యాగపశువుగా నొనర్చుటకు శంకింతు నుపనీతుం డగునాఁడు నీయభీష్టంబు నెరవేర్తు రాజుల కేకాదశవర్షమ్మునను బ్రాహ్మణుల కష్టమవర్షమ్మునను వైశ్యులకు ద్వాదశాబ్దమ్మునను నుపనయనంబు విధిచోదితం బనుగ్రహించె దేవిఁ దత్కర్మానంతరమ్మున యాగంబు విధియుతంబుగ నొనరింతు నా వచనంబు సత్యమ్ముగ నమ్మి యిప్పటికి వేంచేయుమనుడుఁ బ్రసన్నవదనుండై వరుణుండు దనపురమ్మున కరిగె; నంత నృపాలుండును బుత్రుని కతనఁ బరమానందమ్మున గాలయాపనం బొనర్చుచుండె. 383

క. పదపడి యబ్బాలునకున్, బదియేడులు వోవుదెంచెఁ బార్థివుఁడు న్నె
మ్మదిఁ జింత గడలుకొనఁగాఁ, బదునొండవయేటఁ దగు శుభదినమునందున్. 384

వ. ఉపనయనంబు యథోక్తంబుగ నొనర్చి యున్నంత వరుణుం డరుదెంచి మఖం బొనర్పు మనుడు రా జిట్లనియె, 385

క. దేవా కొమరుం డుపనయ, పావితుఁడై యొప్పె మఖము పచరించెదఁ గా
నీ వేఁడికొనెద నిమ్మ స, మావర్తనకర్మ మొలయునంతకుఁ దాళన్. 386

క. అప్పుడు నీ మాటకుఁ బ్రతి, సెప్పన్ దయచేసి పాదసేవకునిఁ గా న
న్నిప్పాట గారవింపుమ, యప్పతి! యన నతఁడు కోపియై యిట్లనియెన్. 387

క. వినయమున నన్ బ్రతారణ, మొనరించెదు పుత్రబంధ మొక్కింతయుఁ ద్రెం
చినయట్లు తోఁప దటు ద్రెం, చెనేని నన్నిట్లు త్రిప్పఁజెల్లునె నీకున్. 388

వ. కానిమ్ము నీపలుకులయందలి విశ్వాసమ్మున నిప్పుడు సయిత మరిగి సమావర్తన కర్మానంతరమ్మున రాఁబోవువాఁడనని చెప్పి యతండరిగెఁ; బిమ్మట నృపాలుండు సంతసించి యుక్తకాలమ్మునఁ దక్కినకార్యంబు నిర్వర్తించి రాఁబోవు వరుణునకై తలంకి చింతించుచున్నఁ, గొమరుం "డిటులేల చింతసేసెద" వని యడిగి కారణం బెఱిఁగి యాత్మమరణమ్మునకు భయమంది మంత్రిపుత్రులతో యోజించి యేకతంబ వనమ్మునకుఁ బలాయనంబొనర్చెఁ; బదంపడి వరుణభయమ్మున దూతలనంపించి నృపాలుండు వెదకించి కానక దుఃఖాక్రాంతుండై యుండునంత వరుణుండు జన్నం బొనర్పుమని నిర్బంధింప నరుదెంచిన భయత్రస్తుండై యతం డతనికి మ్రొక్కి యిట్లను. 389

చ. భయమునఁ బాఱిపోయె జలపాలక! బాలకుఁ డేమి సేయుదున్
నయపథగామి గామియును నా కనువయ్యె వనమ్ములందుఁ ద
ద్దయు మునిపల్లెలందు వసుధాధరగహ్వరసీమలందు నా
దయిన యనుజ్ఞ భృత్యతతి యారసి కానకవచ్చి రెయ్యెడన్. 390

ఉ. ఏమి యొనర్పుమన్న నది యే నొనరింతు మహాత్మ! తప్పు నా
పై మొనసెన్ క్షమింపుమనఁబాశి మహాగ్రహుఁడై ననున్ వృథా
కాముని గా నొనర్చితివిగా కపటమ్మున? నీకు నబ్బు దీ
ర్ఘామయమౌ జలోదర మిహమ్మున దీనఁ గృశింపు మెప్పుడున్. 391

వ. ఇట్లు శపించి యతం డరిగిన నరపతి వ్యాధిపీడితుండై పుత్రుఁగనరామికి మఱింత వగచుచు నుండునెడఁ బదపడి యొక వత్సరమునకుఁ దండ్రి దురవస్థ విని కనుఁ గొన నుంకించి రోహితుండు బయలువెడలు నంత శక్రుం డద్దమై విప్రరూపమ్మున నతని కిట్లనియె. 392

ఉ. పోకుము రాజపుత్ర! నృపపుంగవుఁ డెమ్మెయి నాత్మసౌఖ్యముం
జేకొని యాగము న్నెపము చేసి వినున్ వధియించు నాత్మసౌ
ఖ్యాకలనంబుఁ గోరునృపు లాత్మజుఁడంచుఁ దదన్యుఁడంచు దు
ర్ధీకులు సూడఁ బో రకట త్రెళ్లఁగనేల? యకారణమ్ముగన్. 393

గీ. ఆమయనివృత్తి పొందె నిన్నడఁప నెంచు
తండ్రిఁ గననేగ నేల ? యతండు మృతిని
జెందు పిమ్మట నరిగి యానంద మెసఁగ
రాజ్యభారమ్ము వహియింపరాదె నీకు. 394

వ. అని బహుభంగుల వాసవుండు నిషేధింప నివర్తితగమనుండై రోహితుండు మఱియు నొకవత్సరమ్ముదనుక నవ్వనమ్మునయుండి పదంపడి తండ్రియత్యంత దుఃఖమ్మున నున్నవాఁడని విని మరణమ్మునకుఁ గృతనిశ్చయుండై గమనోన్ముఖుం డగుడు బ్రాహ్మణరూపమ్మున వాసవుండు యథాపూర్వముగా నేతెంచి యుక్తివచనమ్ముల వారించెఁ బిమ్మట, 395

క. భూతలపతి రోగమ్మున, నాతురుఁడై గురు వసిష్ఠుఁ బ్రార్థించినఁ దా
నాతఁడు చెప్పె నుపాయము, క్రీతునిచే సుఖముచెందు కృతకృత్యుఁడవై. 396

వ. వేదవిలు క్రీతుని దశవిధపుత్రులలో గణియింతురుగావున వరుణుండిక్కతమునఁ బ్రీతుండై శాపమోక్షణంబొనర్చునని చెండియు, 397

క. తపములు వ్రతములు దానము, లపరిమితముగా నొనర్చి యాత్మజుఁ గని లో
భపరీతుండై యెవ్వఁడు, కృపలేకవ్వాని సుఖము నెనయ వధింపుఁడా ! 398

వ. పదంపడి వల్లె యని నృపాలుండు క్రయక్రీతుండగు కొమరుం దెమ్మని మంత్రిని నియోగించిన నతం డెల్లెడ నరయునంత నజీగర్తుండను బ్రాహ్మణుండు ధనహీనుం డొక్కరుండు పొడగట్టె; నతనికి శునఃపుచ్ఛ శునశ్శేఫ శునోలాంగూలు రనువారలు మూగురు కొమరులు. 399

ఉ. ఆతనిఁ జూచి మంత్రివరుఁ "డగ్రకులోద్భవ ! మానృపాలకుం
డాతురుఁడై రుజాపహృతికై నరయాగము సేయు నీతనూ
జాతులలోన నొక్కరు నొసంగెదె ? గోశతమున్ గ్రహించి వి
క్రీతునిఁగాఁగఁ" నా; నతఁ డొగిన్ ధనహీనతఁ జేసి ప్రీతుఁడై. 400

వ. లోభమ్మున నొక్కరు నమ్మం దలఁచి యందుఁ గార్యాధికారియగు కతన జ్యేష్ఠు నీనేరక కనిష్ఠు నీనెంచుతఁ దల్లి "నాకు వీనియందుఁ బ్రేమం బగ్గలం" బనియె. నంత మధ్యముండగు శునశ్శేఫు నొసంగిన మంత్రి యతనిం గొని నృపాలున కిడియె, 401

## హరిశ్చంద్రుఁడు నరమేధం బొనర్చుట.

క. మునిపుత్రునిఁ బశువుంగా, నొనరిచి యూపమునఁ గట్టి యుర్వీశుఁడు యా
గనియతి నుండుడుఁ గనిముని, జనులెల్లరు కస్తి పడిరి జననాథమణీ. 402

వ. అట్టియెడఁ బశువిశసనకర్మమ్మునకు శమితశస్త్రాదిదానం బొనరింపక దయాళుం డగుట నిట్లను. 403

క. దీనుని విప్రకుమారు న, నూనమ్ముగ నేడ్చువాని నూరక చంపం
గానేరఁ బాపకర్మము, గానెఱిఁగియు నిట్టిపనికిఁ గడుకొనఁదగునే. 404

వ. అని యతం డప్పాపకర్మమ్మువలన విముఖుండగుటయు రాజు సదస్యులంగాంచి కర్తవ్యంబేమని యడిగిన నా సభయం దొక్క పెట్టఁ గిలకిలారావం బెసంగె; శునశ్శేపుండు నతిదీనగతి నేడ్చుచుండె నయ్యెడఁ దజ్జనకుం డజీగర్తుండు లేచి యుచ్చైస్స్వరమ్మున నిట్లను. 405

చ. జనవర! యాత డిప్పనికి సమ్మతి నందఁడయేని నేన మ
త్తనయుఁ డటంచు సందియమెదం గనకే మఖకర్మపూర్తికై
హననమొనర్తు నిప్పశువు; నప్పుడొసంగినదానికన్న వే
తన ద్విగుణమ్ముగా నిడెదె ద్రవ్యమ చేయు మఱెట్టికృత్యముల్. 406

వ. అనవుడు నృపుడు సంతసించి యెల్లెయనుటయు నజీగర్తుండు పుత్రహననమ్మున కుద్యుక్తుండయ్యె, నంత సభాసదు లెల్లరు నాతని ఘోరకృత్యమ్మునకు హాహాకారమ్ము లొనర్చుచు నిట్లనిరి. 407

క. క్రూరుండు పిశాచమకా, కారయ నీతండు విప్రుఁ డగునె మహాపా
పారంభుఁడు లోభమునఁ గు, మారుం జంపుటకు నుద్యమం బొనరించున్. 408

వ. అని యతని నుద్దేశించి, 409

క. విను మోవిప్రాధమ నం, దనుఁ జంపి ధనంబుఁ గొనుటదగునే! వేదం
బునఁ "దా నపుత్రుఁడగుచున్, జనియించు" నటన్నపలుకు చదువఁగ లేదే. 410

వ. ఇయ్యది ధనలోభమ్మున నాత్మహననం బొనరించుటయకాదే! యని బహుభంగుల దూషించుసమయమ్మునఁ గౌశికుఁడట కరుదెంచి రోదనం బొనర్చు శునశ్శేపునియెడ గరుణించి నృపతింగాంచి వారించి యిట్లనియె. 411

క. అకటా! మలమం మఱుఁగు ద్వి, జకుమారుఁ జంపుటుడుగు జనవర! నీయా
గకృతియుఁ బూర్ణంబగు నీ, కకలంకయశంబు రోగహానియు నొదవున్. 412

మ. తనదేహమ్మున కన్యదేహమును విత్తం బిచ్చి పాపాత్ముఁడౌ
జనకుం దీఁగొని వమ్ముచేసి యశమున్ సాధింపఁగా నేల ? యీ
జననింద్యమ్మగు కృత్యముగా విడు హరిశ్చంద్రావనీపాల ! యెం
దును బుణ్యం బనుకంప, హింసమిగులన్ దోషమ్ము ముమ్మాటికిన్. 413

గీ. సర్వభూతములందును సమత గలిగి
యింద్రియోపరమమ్మున నెసఁగువాని
కఖిలసుఖములు నొసఁగు నయ్యంతరాత్మఁ
డిట్టి దుష్కృతి సౌఖ్యమెందేని యిడునె ? 414

చ. బ్రతుకుట యిష్టమెల్లరకుఁ బార్థివ ! నీవలె వీనికిన్ స్వకీ
యతనువునందుఁ బ్రీతియగు టబ్బురమే ! సకలంబు నాత్మస
న్మితముగఁ జూచు పూరుషుఁడు మేటి ; పురాభవవైరమేని నీ
కితనికి లేదు విక్క, మితఁడే యపకారమొనర్చె నక్కటా. 415

క. జనుఁ డెవ్వాఁడు నిరపరా, ధుని దున్మన్ వాఁడు వానితొల్లిటి కృత్యం
బును మఱవక రాఁబోవు జ, ననమునఁ బలపట్టి చంపు న్యాయ్యంబగుటన్. 416

క. అకటా ! యెంతటి దుష్టుం, డౌకదా ! ద్రవ్యంబునన్ గడున్ లోభము పూ
ని కనినసుతుఁ గనికరము గ, నక చంపఁగ నొప్పుఁ దజ్జనకుఁడు ద్విజుండై. 417

క. పలువురఁ బుత్రులఁ గనఁదగు, నెలమిన్ గయ కేగు నొక్కఁడేనియు యాగం
బులు సేయు, వృషము విడుచున్, సలలితమగు గతిని దనకు సంపాదింపన్. 418

క. అను ధర్మమ్ములు వమ్ముగ, జనకుం డిటు సేయ నొప్పె ? జనవర ! దుష్టా
త్మని నీతని శిక్షింపఁగఁ, జనదే ? పాపంబు పైప జనపతి కగునే. 419

ఉ. ఏ నృపుదేశమందు వసియించుజనుం డొనరించుఁ బాప మ
ద్దానను షష్ఠభాగమును దన్నరనాథుఁడు వొందు ; నుత్తముం
డైన త్రిశంకుభూమిపతి కాత్మభవుండవు పుత్రుఁ జంపు ని
వ్వానికి ద్రవ్య మిచ్చి రవివంశమునం దపకీర్తి గూర్తువే. 420

క. మనిపుత్రుని విడువుము దు, ర్జనుని నజీగర్తు శిక్ష సలుపుము నాదై
న నియోగం బొనరింపుము, పనుపడు నీదేహమం దపారసుఖమ్ముల్. 421

చ. జనవర ! నీదుతండ్రి గురుశాపము చెంది శ్వపాకుఁడయ్యె నా
పనుపున బొందితోఁ జనె దివంబున, కాయుపకారకారణ

మ్మనసయినన్ ద్విజాత్మజానిముక్తుఁగఁ జేయుము బ్రాహ్మణుండయా
గనియతు విమ్ము వేఁడితిని గానక నాకిది యీఁగఁ జెల్లదే. 422

ఉ. యాగ మొనర్చువాఁడు దన నగ్రజుఁడెయ్యది గోరు దాని "న
భ్యాగతుఁడే రమేఁశు" డని యాదరమూని యొసంగుటొప్పు, న
త్యాగికి యాగమెట్లు ఫలదంబగు? నేనిది గోరినాఁడ నా
కీఁగఁ దలంపు మియ్యదియ యిచ్చు నరేంద్ర! సుఖంబు నీకొగిన్. 423

ఉ. నావుడు రాజు వల్కు మునినాథ! యథార్థము పల్కితీవు స
ద్భావుఁడవయ్యు నాకుఁ గ్రతుభంగ మొనర్చెదె, వేఁడుగోరు మీ
గావలతుణ్, జలోదర మఖండగతి న్నను బాధపెట్టఁగా
నావరుణున్ యజింపఁగ ధరామరపుత్రకుఁ గ్రీతుఁ జేసితిన్. 424

వ. సకలధర్మవేత్తవగు నీవింద బదులు సెప్పకు మనుడుఁ గౌశికుండు కోపాకులుండై శునశ్శేపురోదనంబు విననొల్లక కరుణారసపూర్ణుండై దుఃఖించు నజీగర్తపుత్రు పార్శ్వమ్మున కరిగి యభయం బొసంగి యిట్లను. 425

ఉ. ఈనృపుఁ డేమి సేయు, విను మే నొకమంత్రము సెప్పువాఁడ న
ద్దానిఁ బఠింపు మయ్యది ముదం బిడు నీ కని యట్లొనర్ప, శో
కానుగతంబుగా మనమునం దది మాటికిఁ దా జపించె న
ద్దానఁ బ్రసన్నుఁ డయ్యె సుఖదాయకుఁడై వరుణుండు వానికిన్. 426

వ అట్లు స్వస్వరూపమ్మున శునశ్శేపునకుం బొడకట్టిన యద్దేవుంగాంచి యెల్లరును విస్మితులైరి. హరిశ్చంద్రుండును బద్ధాంజలి పుటుండై నమస్కరించి యిట్లు సన్నుతించె. 427

ఉ. దేవ! మహానుభావ! నను దీనుఁ గృతాగసులుబ్ధు మందునిన్
బావితుఁజేయ వచ్చితి వపారకృపారసవార్ధివై భవ
త్సేవకుఁడన్ గటాక్షమునఁ జేకొనుమీ యపరాధ మెమ్మెయిన్
దేవర కాచరించితిఁ బ్రతిజ్ఞకుఁ దప్పితిఁ బుత్రకాంక్షినై. 428

క. బెగడయ్యె నా "నపుత్ర, స్యగతి ర్నాస్తి" యను వచనసంశ్రవణమునన్
భగవంతుని నిను వంచితు, విగఁ జేసితిదానఁ గాదె నిగమవిధిజ్ఞా. 429

చ. తెలియనివాని హేళనము ధీవరులొప్పి సహింత్రు, దేవ! నా
కలవడె రోగబాధ పయి నాత్మజు చేసినవంచనంబు; కా

నల కరిగెను సుతుండు మరణమ్మునకున్ భయమంది ; జన్నమున్
సలుపఁగఁ గ్రీతుఁ దెచ్చితిని సద్ద్విజపుత్రకు నీదు ప్రీతికై. 430

గీ. వీని కతమున దేవ! నీదైన దర్శ, నంబు నాకబ్బె ననుపమానంబు మజ్జ
లోదర వ్యాధిబాధయు నుడిగినట్ల, యయ్యె నావుడుఁ బాశి యిట్లనియెఁ బతికి. 431

క. రోదనశీలుండై న, న్నాదరమున ధైర్య మేది యనుపదమున్ స్తో
త్రాదుల నుతించు ద్విజదా, యాదు శునశ్శేపు విడువు మామయ మెడలన్. 432

వ. నీజన్నంబు పరిపూర్ణం బయ్యె, నీకింక వ్యాధి వలని భయంబు లేశంబును లేకుండు నని చెప్పి వరుణుండు శునశ్శేపు విడిపించిన, 433

క. ఆయకారణమై జయరవ, మయమయ్యెన్ యజ్ఞశాల, మహిపతియు విరా
మయుఁడయ్యెఁ, శునశ్శేపుడు, భయహీనుం డయ్యె మఖము పరిపూర్తిఁ దగెన్.

వ. ఇట్లు విముక్తుండై శునశ్శేపుండు సభ్యులను నుద్దేశించి కృతాంజలియై, 435

ఉ. ఓ కృతవిద్యులైన కరుణోదధులారా! మహాత్ములార! శా
స్త్రాకలనమ్మునన్ దగినయట్లు వచింపుఁడు మీఁద నెవ్వఁడో
నాకగుఁ దండ్రి, మీదువచనమ్మున నాతనిఁ గొల్చువాఁడ సు
శ్లోకుని ; ధర్మనిర్ణయము సూక్ష్మమతుల్ వివరించు టొప్పగున్. 436

క. అనవుడు సభ్యు లజీగ, ర్తునికిం దాఁ బుట్టి పెరిఁగి తుద కీతం డా
తనికిం గా కెవ్వరికిన్, దనయుండగు నొండు రీతి ధర్మ్యంబగునే. 437

వ. అని శంకించుచు నుండ వామదేవుండను మునివరుండు, 438

క. కనఁగాక యజీగర్తుఁడు, ధనలుబ్ధుం డగుచు నమ్మె, ధరణీపతికిన్
దనయుం డీతఁడు గాదే, ననఘుఁడు వరుణునకుఁ బుత్రుఁడగు న్యాయ్యముగన్.

గీ. అన్నదాత భయత్రాత యాదరమున, విద్య నొసఁగినవాడును విత్తదాత
కనినవాఁడును నేవురు తనకుఁ దండ్రు, లండ్రు ధర్మవిధానజ్ఞులైన మునులు. 440

వ. నావుడుఁ గొందఱు కన్నవాని కనియు మఱిఁ గొందఱు వరుణుని కనియు వేఱఁ గొందఱు నృపతి కనియుఁ దమ తమ యభిప్రాయమ్ములు వెలువరించి వివరించు చుండ వసిష్ఠుం డిట్లనియె 441

చ. వినుఁడు సభాసదుల్ శ్రుతిగవేషణశీలనఁ జెప్పుచుంటి నీ
తని ధనలుబ్ధుఁడై క్రయవిధమ్మున భూపతి కిచ్చినప్పుడే

జనకత తండ్రియం దెడలి సంగతమయ్యె నృపాలునందు ; యూ
పనియతుఁగా నొనర్చుటను బార్థివుఁ దట్టిఁడ నాఁగఁ జెల్లెడిన్. 442

చ. వరుణుఁడు దన్ను మాటికి స్తవంబొనరించుటఁజేసి వీని నా
దరమునఁ గాచె నాతఁడును దండ్రి యనం దగఁ, దెవ్వనిన్ నుతిం
తురు మఱి వాఁడొసంగు ధనతోషపశుప్రభుతాది సంపదల్
పరమను బ్రాణముల్ దన కపారముగా ముద మబ్బెనేనియున్. 443

గీ. ప్రాణసంకటమునఁ గృపాపరత వీర్య, వంతమగు మంత్ర మిచ్చి కాపాడె నెవ్వఁ
డతఁడు కౌశికుఁ డీతనిపిత ; సుమతుల, సమ్మతం బిది నావుడు సభ్యులెల్ల. 444

క. ఇది ధర్మం బని నుడివిన, సదయుండై గాధిజుండు జనకుండై "ర
మ్మిది మొదలు నాగృహమ్మునఁ, బొదలుము నాపుత్రులందుఁ బుత్రుఁడ వగుచున్".

వ. నావుడు శునశ్శేపుండు గౌశికువెంట నరిగెఁ, బదంపడి వరుణుండు తనభువనమ్ము
నకుఁ జనియె, ఋత్విజులును సభ్యులును దమతమ పొందుపట్లకు నేగిరి. 446

గీ. ఆ హరిశ్చంద్రభూపాలుఁ డామయంబు, వాసి కృతకృత్యుఁడై ప్రజాపాలనం బొ
నర్చె రోహితుఁడు విని జనకునికడకు, వచ్చె దుర్గమమైన యవ్వనము విడిచి.

చ. తనయుని రాక చారులు ముదమ్మునఁ జెప్పఁ ద్రిశంకుపుత్రుఁ డం
త నెదురు వచ్చె, రోహితుఁడుఁ దండ్రికి దండము వెట్టి దండరీ
తిని బదయుగ్మసన్నిధి నతిప్రతిపత్తిని లేవకున్న నం
దను నొగి లేవనెత్తి ప్రమదమ్మునఁ గౌఁగిటఁజేర్చెఁదండ్రియున్. 448

క. మలివెచ్చని బాష్పమ్ములఁ, దలఁదడుపుచు మూర్కొనున్ ముదమ్మున నంక
స్థలమున విడికొని మోమున్, బలుమఱుఁగనుఁ గుశలమడుగుఁ బార్థివుఁడు సుతున్

క. నరమేధయాగవృత్తం, బరిదిగఁ బుత్రునకుఁ జెప్పి యన్నరవరుఁ డా
దరమేదురుఁడై రాజ్య, స్థిరుఁడై జగ మేలుచుండె ధీరులు మెచ్చన్. 450

వ. పదంపడి హరిశ్చంద్రుండు. వసిష్ఠుండు హోతగా రాజసూయం బొనర్చి యతని
నెక్కుడు సత్కారమ్ముల గారవించె. 451

ఆ. వె. యాగపరిసమాప్తి యగుమీఁద నొకనాఁడు, శక్రసదనమునకుఁ జనె నరుంధ
తీమనోహరుండు తివిరి గాధిజుఁడును, నటకు వచ్చె నింద్రు నరయుపొంటె.

## వసిష్ఠవిశ్వామిత్ర సంవాదము.

వ. ఇట్లిరువురును నొక్కెడఁ గూర్చుండి యుండునంత విశ్వామిత్రుండు హరిశ్చంద్ర దత్తబహుమానభాసురుండగు వసిష్ఠుం గాంచి విస్మయమ్మున నీకీ యబ్బురంబగు పూజ యెవ్వం డొనర్చె నొడువు మన నతండు సంతోషపూర్వకంబుగ నిట్లనియె.

ఉ. చంద్రసమానసద్యశుఁడు సత్యవచోనిరతుండునౌ హరి
శ్చంద్రుఁడు మాకు శిష్యుఁడు ప్రశస్తగుణుం డతిదాత యన్యరా
జేంద్రులు సాటి రా రతని యాగికి మొన్న యొనర్చె దక్షిణా
సాంద్రము రాజసూయమను సత్క్రతు వప్డిదె నిట్టిసత్కృతుల్. 454

గీ. సత్యవాదుల దాతల శౌర్యపరుల, ధర్మవంతుల నెంచ భూతంబు మొదలు
మూఁడు కాలమ్ములందు నీరేడుభువన, ముల హరిశ్చంద్రునకు సాటిగలరె నృపులు.

వ. ఇట్లు వసిష్ఠుండు హరిశ్చంద్రు గుణాతిశయం బుగ్గడించిన నసూయాగ్రస్తుండై గాధి జుండు కోపసంరక్తలోచనుండై యిట్లనియె. 456

క. కపటప్రియు మిథ్యావా, దపరాయణుఁ బెద్దఁజేసి తద్దయు నుతి చే
సి పలుకఁ దగవే యాతఁడు, నెపమున వంచింప లేదె నీరాధిపునిన్. 457

చ. పలుకుల కేమి ! యానృపునిఁ బందెమువెట్టి యసత్యవాదిగా
తలనిఁగ దాతగామిగ నికామ మొనర్పఁగలాఁడ నిట్లు నే
సలుపనయేని నాదయిన సంచితపుణ్యము రిత్తవోవు ని
ట్లలవడఁ జేయఁ జాలినపు డట్లగునే భవదీయ పుణ్యమున్ ? 458

వ. ఇట్లన్యోన్య సంభృత సుకృతమ్ములు పణమ్ముగా వివదింపుచు నమ్మునివరులు నాకమ్ము విడిచి స్వాశ్రమమ్ములకు వచ్చి యున్నంత నొక్కనాఁడు హరిశ్చంద్రుండు వనమ్మునఁ గ్రుమ్మరువాఁ డొక్కెడ, 459

క. ఘోరవనంబున నేద్పెడి యొక యం, భోరుహపత్రాక్షిఁ జూచి పొడమిన కరుణా
ఘోరవనమ్మున నిటు లే, కారణమున నేనికి యెవఁడు కాంతుఁడు నీకున్. 460

క. క్రూరుండు రాక్షసుండున్, నారాజ్యమునందు లేఁడు నాతిరో ! నీ దుః
ఖారంభమ్మున కెవ్వఁడు, కారణము వచింపు వాని గండడఁగింతున్. 461

చ. అను నరపాలువాక్యముల కచ్చెలి యుత్తర మిచ్చె నిట్లు రో
దనజనితాశ్రువుల్ వదనతామరసమ్ము నలంకరింప " నో

జనవర ! గాధిజుం డనెడి సంయమి నన్ను బాధ పెట్టు నా
తనితపమున్ మదర్థ" మనఁ దన్నరపాలుఁడు దాని కిట్లనున్. 462

వ. నీవు స్వస్థచిత్తవై యుండునది, యేను భవత్పీడాపహాయణుఁడనై తపంబొనర్చు నమ్మునిని నిప్పుడ వారించువాఁడ నని యూరార్చి విశ్వామిత్రు నాశ్రమమ్మున కరిగి నమస్కరించి వినయమ్మున నిట్లను. 463

ఉ. ఏల తపం బొనర్చెదు మునీంద్ర ! వృథాగతి దేహపీడయున్
బోలునె సంయమీంద్రులకు ; బొంకక తెల్పుమునీదుకోర్కె ; భూ
పాలన మే నొనర్చుతఱిఁ బాపపుబుద్ధిని లోకపీడ కీ
లీలఁ దపం బకార్య మగు లెమ్మిది పున్నెమ, పూరుషార్థమా ! 464

వ. హరిశ్చంద్రుం డిట్లు వారింప నచ్చోటు విడిచి విశ్వామిత్రుండు తపం బుడిగి సంభృతక్రోధుండై యొండెడ కరుగుచు, 465

క. దినమునఁ దాను వసిష్ఠుఁడు, వివదించుటయును దపంబు విఘ్నంబును హే
తువులుగఁ గోపము హెచ్చఁగ, నవనీపాలునకు వంచనాధాయకుఁడై 466

వ. ఒక్కదానవుని సూకరంబుగా నొనర్చి పనిచిన నదియును హరిశ్చంద్రు నుపవనంబు జొచ్చి రక్షకుల భయపెట్టి కదంబమాలతీ యూథికాదులం గదలంజేయుచుఁ బుడమికి దంతాఘాతంబు దొడరఁ జంపక కేతకీమల్లికాదుల నున్మూలించుచుఁ గరవీరోశీరంబులం బ్రవ్వుచు ముచుకుందాశోకతిలక వకుళంబుల రూపుమాపుచుఁ గదనం బొనర్చునంత మాలాకారులు గొండొకపోరాడి శరంబులు పఱఁగించినఁ దలంక కున్కి నిది కేవల సూకరంబు గాదనియుఁ గాలరూపమ్మున నిల్లైవ్వండేని రాఁబోలు ననియు శంకించుచుఁ బలాయనం బొనర్చి శరణాగతులైన నృపాలుండు వారల కిట్లను. 467

ఉ. ఏమి భయమ్ము చెందుటకు హేతువు ? దేవతలో, సురారులో ?
భూమి నెవండు నాకును రిపుండు వచింపుఁడు వాని వింతలో
నేమముమై వధించెద ననిన్ నను నొక్కఁ డెదుర్చువాఁడె ! త
న్నామము రూపుఁ దావును గుణమ్ములనున్ వివరింపుఁడింతకున్. 468

వ. నావుడు మాలాకారు లిట్లనిరి. 469

చ. దివిజుఁడు గాఁడు రక్కసుఁ డుదీర్ణబలుండునుఁ గాఁడు దేవ ! పు
ష్పవనములెల్లఁ గూల్చె నొకపంది తదీయబలంబు చెప్పఁగా

నవునె? యెదిర్చి పై విడుచు నమ్ముల కోర్చియు నార్చిపేర్చి భీ
తి వడఁగఁజేసె మమ్ముఁ; జని తీర్పుము దానిమదంబు నావుడున్. 470

వ. హరిశ్చంద్రుండు వారువంబునెక్కి సైన్యావృతుండై వనంబున కరిగి ఘుర్ఘురించు నక్రోలంబు దొడవ్వులంగాంచి దానిచే విశీర్ణంబులై పడియున్న లతాకుంజపుంజమ్ముల నరసి సంజాతక్రోధుండై. 471

క. కడుకొని ధనువున బాణము, దొడిగి యెదురు వచ్చుదాని దుడు కడఁపఁగ నె
క్కుడు రయమున విడిచిన నది, తడయక పరుగిడియె నులివుదళదిశ లలమన్.

క. ఈగతి నాకుగమునకున్, లోఁగక గికురించి వనములోఁ జొఁరఁబడు న
య్యాగడపుటడవిపందిన్, దాఁగని కోపించి యేసెఁ దద్దయు శరముల్. 473

ఉ. కొండొకసేపు గన్పడును గొండొకసే పెడయై యదృశ్యమై
గండునఁగ్రుమ్మరుం దడయుఁ గ్రాఁడనొకానొకచోట నార్చును
ద్దండముగాఁగ నొక్కయెడ; దాని పిఱుందన వాజి నెక్కి భూ
మండలనాయకుం డరిగె మానని కోపభరంబు పెంపునన్. 474

క. రయమునఁ బఱచెడి కోలము, నెయిదఁగ నరపాలుఁ డిట్టు లేగినఁ దత్సే
న యదా యదలు పదాపద, లయి యాభూపాలు నెయిద కటునిటు చెదరెన్. 475

ఉ. ఆనరపాలసూతి యిటు లక్కిటి వెంట నధిజ్యచాపుఁడై
సేనకుఁ బాసి యేగి వనసీమలు పెక్కులు దాఁటి సంగత
గ్లానివిధూనమానసుఁ డఖండపిపాసకుఁ డంతఁ గాంచె న
క్కానవమధ్యమం దతులకాండ మనోహరమైన యాంగణ. 476

వ. కాంచి తత్తీరమ్మున వారువమ్ము డిగి జలమ్ములు ద్రావి త్రావించి యికఁ గోలమ్ము నరయరాదని కృతనిశ్చయుండై దిగ్భ్రమంబు దొడర నగరంబున కెట్టు లేగుదునని యోజించుచున్నంత వృద్ధబ్రాహ్మణరూపమ్మున విశ్వామిత్రుఁ డటకరుదెంచిన నతనికి నమస్కరించుటయు నతండు స్వస్తివచనపూర్వకముగ నిట్లనియె. 477

క. ఏమిది యొక్కఁడవై యీ, భూమికిఁ జనుదెంచితివి నృపుఁడవయ్యును నీ
కేమి పని యిబ్బె నిచట న, యోమయ మివ్వనము మనుజు లుండరు దీనన్. 478

వ. అని యడిగిన హరిశ్చంద్రుం డిట్లనియె. 479

ఉ. కోల మొకండు వచ్చి సుమకుంజములం బడఁగొట్టె నేడ్తెఱన్
బాలవనమ్ములోఁ దిరుగఁ బోణిమి దక్కి యెదిర్చి రక్షకుల్

దోలఁగ లేక నాకడకుఁ దోరపుభీతిని నేగుదేర నే
నోలి వధింప వచ్చి శరమొండు విగుడ్చితి నంత నద్దియుఁ౯. 480

## విశ్వామిత్రుండు హరిశ్చంద్రుని వంచించుట.

వ. పరుగిడిన దానివెంటఁ బఱతెంచి యిట కరుదెంచితి సైన్యం బెటకేనియుం జనియెఁ గోలం బెటకేగెనో యెఱుంగరాదు క్షుత్పిపాస లధికంబుగ బాధించుటజేసి నగరమ్మున కరుగ నెంచిన దిగ్భ్రమణం బొదవి మార్గంబుఁ దెలియదు. కరుణించి తెరువెఱింగింపుమని మఱియు నిట్లనియె. 481

మ. అరయన్ న న్నెఱుఁగంగఁజెప్పెద నయోధ్యానాయకుండ౯ నభ
శ్చరమాన్యంబుగ రాజసూయము మొదల్ జన్న మ్ములంజేసి భా
స్వరకీర్తి౯ జగమెల్ల నేలెడి హరిశ్చంద్రుండ నాతోడ మా
పురి కే తెంచితివేని నిస్తులధనంబు౯ నీకు నే నిచ్చెదన్. 482

వ. తద్ధనంబునంజేసి జన్నంబొనరించికొంమవుగాక నావుడు విశ్వామిత్రుండు నగి హరిశ్చంద్రున కిట్లనియె. 483

చ. ఇది యొక పుణ్యతీర్థము మహీశ్వర! యిం దవగాహనం బొన
ర్పఁదగుఁ బితృప్రియం బొనరుపందగుఁ దర్పణ మాచరించి యోఁ
గఁదగు స్వశక్తి కల్మిఁ ద్రిజగంబులు మెచ్చఁగ దానధర్మముల్;
"నదిఁగని యాడఁబోయిన జనంబులు చెందు దురాత్మహంతృతి౯." 484

వ. అను మనువచనంబు వినవే? యియ్యెడ స్నానంబు సలిపి నీకుఁ దోఁచినయది నా కిచ్చితివేని దాన సంతుష్టుండనై కొండొకవేళవచ్చి మార్గంబుఁ గనఁజేయువాఁడ. ననవుడు నృపాలుం డక్కపట వచనంబుల గల తెఱంగెఱుంగక కృతోద్యముండై య న్నదిని(గ్రుంకి పితృతర్పణంబు సలిపి కపటాకారుండగునావృద్ధున కిట్లనియె.

ఉ. దాన మొసంగువాఁడ విదితంబుగఁ గైకొనుమయ్య నీకు నే
దేని యభీష్ట మయ్యదియ యిచ్చెదఁ గాంచనమో గజాశ్వసం
తానమొ భూమిఖండమొ ధనంబులొ భూషలొ గోవులో మహో
ద్యానములో సతీమణులొ తక్కిన వెయ్యవియేని దేయముల్. 486

క. మును రాజసూయమున స, న్మునిసన్నిధియందు సకలమును గోరిన లే
దన కిత్తు ననుచు వ్రతమును, గొనియుంటి మహాత్మ! నీదుకోరిక చెపుమా. 487

క. అనఘుఁడవు నీవు శీర్ధం, బును బావన మిది, యొసంగఁబోలదె నీకో
రిన కోర్కె, నాదు ప్రతినవ్, మునిజను లెల్లరును సత్యముగ గణియింపన్. 488

చ. అన మునినాథుఁ డిట్లను ధరాధిప ! యంతటివాఁడవౌదు స
జ్జనసుతమైన నీయశము చాటుదు రెల్లరు సూర్యవంశసం
జనితుఁ డుదారధీరుఁడు త్రిశంకుని పుత్రుఁడు శాదృశుండు లే
డనుచు వసిష్ఠమౌనియును నాడఁగ వింటి నతండు బొంకునే. 489

క. దాతవు సకలధరిత్రీ, నేతవు నీకొండు కొదయె నృప ! నాదుతనూ
జాతునకుఁబెండ్లి సేయు మ, నేతాదృశమైన కీర్తి నెనయుము పేర్మిన్. 490

వ. అని గాంధర్వమాయావశమ్మున దశవార్షికి యగునొక కన్నియను, సుకుమారుం డగు నొకకుమారుని దెచ్చిచూపి వీరివధూవరు లిక్కార్యమ్ము రాజసూయాధిక పుణ్యప్రదమ్మనిచెప్పిన రాజట్లకాక యని యంగీకృతిం దెలిపి యవ్విప్రప్రదర్శిత మార్గమ్మున స్వపురమ్మున కరిగె, మునియు నటనుండి స్వాశ్రమమ్మునకుఁ జని కృతోద్వాహుండై వచ్చి యగ్నిహోత్ర శాలాస్థితుఁడగు హరిశ్చంద్రుంగని యియ్యది మంచిసమయ మ్మీ వేదీమధ్యమ్మునన నాకు మున్నిచ్చెదనని చెప్పినదానం బొసంగ వలయు నని కోరుటయు వదాన్యశేఖరుండగు నానృపాలుం డిట్లనియె. 491

ఉ. ఆరయ నీవు బ్రాహ్మణుఁడ వంతయు నేలెడిరాజ నేను సం
సారికి నెంతయుండిన యశంబునకుం గొఱగాకయున్న ని
స్సారమ కాదె వానిదగు జన్మము ? ద్రవ్యము శాశ్వతంబె ? నీ
కోరిన దేదియేనియును గొంకక యిచ్చెదఁ గోరుకొమ్మిగిన్. 492

మ. అన విప్రుండను నట్టిదాతవె నరేంద్రా ! నీయశం బింతక
న్నను నందందుఁ బొగడ్త కెక్క జగదానందంబు సంధింప నీ
ఘనరాజ్యం బఖిలంబు నేన్గులు తురంగంబుల్ మొదల్ సంపద్వృ
ద్ధి నొసంగం గదవయ్య నీవిటులె వేదీమధ్యమందుండఁగన్. 493

వ. అని కోరిన హరిశ్చంద్రుండు మాయామోహితుండై నీయడిగినట్ల యిచ్చితిననియె గాధిజుం డయ్యది గ్రహించి యిట్లను. 494

క. దానం బిచ్చితి దానన్, మానస ముప్పొంగె "దక్షిణారహితంబౌ
దానము వ్యర్థం" బనియెడి, మానవధర్మంబు వినవె మానవనాథా. 495

వ. కావున దీనికిం దగియెడి దక్షిణ నొసంగి కృతార్థుండవు గమ్మనుటు మునీంద్రా! దక్షిణామానంబది యెంత చెప్పు మనుటయు గాధిజుం డతని కిట్లనియె. 496

గీ. హేమభారద్వయమ్ము నాకిమ్ము సార్ధ
ముగను దక్షిణ దాన సంపూర్తిచెందు
ననుడు నొసఁగెదనని ప్రతిజ్ఞను బొనర్చె
సత్యపరిపాలకుఁడు హరిశ్చంద్ర విభుఁడు. 497

వ. అట్లు కృతప్రతిజ్ఞుండై హరిశ్చంద్రుం డమ్మునికపటమ్మునకు విస్మయావిష్టుండగు నయ్యవసరమ్మున మున్నరణ్యమ్మునఁ దిన్నంబాసి పలుత్రోవల నరిగిన సేవకు లరుదెంచి స్తుత్యాదికమ్ముల నలరింపుటయుఁ జింతాదంతురుండగు కతన వారల కెద్దియుం జెప్పక యంతఃపురమ్మున కరిగి నిజాంతర్గతంబున. 498

చ. ధనమును రాజ్యముఁ గా మొదల దానము చేసితి దాని కేమి య
మ్మునికపటం బెఱుంగక సముద్ధతి దక్షిణ యిత్తునంటి నిం
కను ధనమేడఁ దెత్తు నిది కాలవశం బటుగాక యున్న నెం
దును దపసుల్ ప్రతారణము నం బొనరింతురె ద్రవ్యలుబ్ధులై. 499

వ. అని తదేకచిత్తుండై యొండెఱుంగక యున్నపతిం గాంచి రాజ్ఞి యిట్లనియె. 500

ఉ. చింతకు నేమి కారణము చెప్పుము కాననసీమనుండి ధీ
మంతుఁడు వచ్చెఁ బుత్రుఁడు ; క్రమంబుగఁ జేసితి రాజసూయముఁ గా
భ్రాంతము నందు దూరమునఁ బార్థివసత్తమ ! లేఁ డరాతి ; నీ
కింత విచారమేల ? వచియింపుము నావుడు భూపమౌళియుఁ గా. 501

వ. చింతాకారణమ్మును గొందొక చెప్పి భోజనాదికం బొనర్పక యారేయి గడుపునంతఁ దెల్లవారుటయు సంధ్యాదికృత్యంబు లొనర్చునంతకు మున్న విశ్వామిత్రుం డరుదెంచి కృతనమస్కారుండగు నృపతి కిట్లనియె. 502

క. విడువుము రాజ్యమ్మును నొం, డెడ కేగుము దక్షిణార్థమిచ్చెద నని ము
న్నాడివిన బంగారమ్మును, గడువది నాకిమ్ము తడయుఁగా నేమిటికిన్. 503

వ. అని దార్ఢ్యమ్మునం బలుకు గాధిజునకు నరేంద్రుం డిట్లనియె. 504

క. ఇచ్చితి సర్వస్వమ్మును, బుచ్చికొనుము వెడలి యిపుడు పోయెద నీకుఁ బై
పెచ్చుగ నొడివినదక్షిణ, నిచ్చెదఁ గాలాంతరమున నిపుడీలేమిన్. 505

వ. అని యమ్మునికిం జెప్పి భార్యాపుత్రుల వీక్షించి యిట్లనియె. 506

క. మన మూఁడుకాయములు గా, క నిఖిలరాజ్యంబు వివిధకరితురగములున్
ధనధాన్యములను నిమ్ముని, జనమౌళికి నిచ్చినాఁడ సంతోషముగన్. 507

వ. కావున నిఁక మనమియ్యెడ నుండు టనుచితంబు వెడలుండని నిర్గమించు నమ్మహీపాలునివెంటఁ గొమరుండును భార్యయును జింతాదంతురులై నమ్రవదనమ్ములతో నరిగి, రట్లు కట్టుగుడ్డలతోఁ గదలు వారల యవస్థం గాంచి. 508

ఉ. పౌరజనమ్ములెల్లరు నపారకృపారస మొల్క "నక్కటా!
ధీరుఁడవయ్యు నించుకయుఁ దేఁకువ లేక మునీంద్రుమాయయన్
దారుణపాశముం దవిలి దైన్యము నొందఁగ నయ్యెనే? దురా
చారుఁడు ధూర్తుఁ డెంతపని సల్పె ధరామరుఁ" డంచు బోరనన్. 509

వ. అమ్మునీంద్రు నిందించుచు దుఃఖాక్రాంతులై యున్నెడ భార్యాపుత్ర సహితమ్ముగఁ గదలి పురంబు వెలువడినఁ బిఱుందన చని నిలువరించి గాధిజుండు నిష్ఠురమ్ముగ నిట్లనియె. 510

చ. జనవర! దక్షిణం దగ నొసంగు మొసంగుట కిచ్చ లేనిచో
"నన" యనిపల్కు మట్టులయినన్ నిజ నేనడుగన్ సమస్తముం
గొనుటకు నిచ్చయేవి యిదిగోఁ గొను మిచ్చెదఁ గానిచోఁ బ్రతి
జ్ఞను జవదాఁట కిమ్ము కనకమ్మును దక్షిణకై యథామతిన్. 511

వ. అని ప్రాణగొడ్డమ్ముగఁ దవిలిన యమ్మునీంద్రునకు నమస్కరించి దీనాత్ముండై యంజలి ఘటించి హరిశ్చంద్రుఁ డిట్లనియె. 512

ఉ. వారక నీఋణం బది యవశ్యము నీఁదగు, నిచ్చికావి యం
భోరుహమిత్రువంశమునఁ బుట్టియు మెచ్చుగ రాజసూయమున్
సారగతిం బొనర్చియు యశమ్మున మించిన దాతనయ్యు నే
నేఁ హి నన్నముం దినఁగ నిచ్చయొనర్తు జగంబు నవ్వఁగన్. 513

వ. నీఋణంబు దీఱుదనుక నే భుజింపనొల్లమియు నిశ్చయంబు కొండొక తాళితివేవి దైవానుకూల్యమ్మునంజేసి ధనంబు చేకుఱునది దక్షిణార్థంబుగఁ బ్రతిశ్రుతం బొనర్చిన కనకమ్మనకుఁగా నొసంగెద నావుడు ముని యిట్లను. 514

ఉ. వెడవెడ మాటలాడెదవు వీఱిఁడివే నరపాల! నీకు నె
క్కడ దొరుకుణా ధనంబు? ధనకారణమైన సమస్తరాజ్య మి

ప్పుడ మదధీనమయ్యె నిటు బొంకక " లే " దని చెప్పు మింక ని
న్నడిగెడివాఁడఁ గాను జను మాపయి నీమపు వచ్చునట్లుగన్. 5

మ. వనవాసమ్మున కేగువాఁడు నృపుఁ డిప్పాటన్ బ్రయోగించు న
మ్మునివాగ్బాణములన్ సహింపక యనున్ మోహమ్ముగాఁ బల్కువాఁ
డనె? ద్రవ్యంబున కేమి శంక? యొకచోటన్ దేహమేనమ్మి నీ
కనకం బిచ్చెద నిర్ధనుండ నని నన్ గారింపఁగా నేటికిన్. 5

ఆ. వె. తెవులు లేని మూఁడు దేహమ్ము లుండఁగ, నీ ఋణంబు దీర్ప నేమొ మెట్లు?
గ్రాహకుం డొకండు గల్గెనే నీయయో, ధ్యాపురమ్మునందుఁ జూపు మనఘ. 5

## హరిశ్చంద్రుండు కాశికిఁ బోవుట.

వ. కాదేనిఁ గాశీపురమ్మున మమ్ము విక్రయించికొని నీకు దక్షిణార్థంబు ప్రతిజ్ఞాతంబగు
సార్ధభారద్వయపరిమితకాంచనమ్మును నొసంగుదునని చెప్పి తత్సహితమ్ము
నరుగువాడు ముందట. 5

ఉ. గౌరిని గూడి శంకరుఁడు కాఁపుర ముండెడిచోటు మేటిభా
గీరథి యొద్దునం దనరు కేవల పుణ్యపురాశి కాశి యిం
పారఁగఁ గాంచి యందుఁగల హర్మ్యములన్ దిలకించి ప్రోలికిన్
దూరమునుండి చేసెఁ బ్రణతుల్ గృతకృత్యుఁడ నంచు నెంచుచున్. 51

వ. పదంపడి గంగానికటమ్మున కరిగి యందుఁ గృతస్నానుండై తర్పణాదికం బొ
రించి మునిఋణవిముక్తికై మార్గమ్ము నాలోచించుచు సర్వథా యిప్పుణ్యస్థలంబు
శివపరిగ్రహంబ కాని మనుష్యపాలితంబు కాదు. కావున నిట నన్నకించిత్కరుని
నెవ్వండేని తదనుమతమ్మునం జేసి కొని కృతకృత్యు నొనర్పవచ్చునని యెంచుచు
సుతసతీసహితమ్ముగఁ గొంతతడవేగి పార్శ్వగతుండును దక్షిణార్థియును నగు బ్రాహ
ణుం గాంచి వినయమ్మున నిట్లనియె. 52

క. ఈ నన్ను నాదు కొమరున్, నా నారీతిలకమును గనందగుఁ బేర్మిన్
మౌనివర! యేమిపని మా, కొనతి యిచ్చెదవు తెల్పు మర్మిలికల్మిన్. 52

వ. ఇందొక్కరి కతన నీఋణంబు దీర్చుకొను మనుడు నవ్వి యవ్విప్రుఁడు రాజు
కిట్లనియె. 52

క. ఒకమాసమాయె, నను మి, న్నకమాటలు సెప్పి త్రిప్ప నాయమె భూపా
లక ! దక్షిణ యిడి కదలుము, యకలంకంబైన కీర్తి నందెదవేనిన్. 523

వ. నాపుడు హరిశ్చంద్రుండు మహాత్మా ! మాసం బిప్పటికిని బూర్ణమ్ముగాలేదు దినా
ర్థంబింకను వ్యవధి యున్నది, యించుక ప్రతీక్షించితివేని ఋణవిముక్తుండ
నయ్యెదనన నమ్మౌని యిట్లను. 524

క. ఇపు డరిగివచ్చెదను స, త్యపరత నపు డీఁదలంపు నందకయున్నన్
శపియించెదనని యరిగెన్, గపటబ్రాహ్మణుఁడు నృపతి కళవళమందఁగా. 525

ఉ. అంతఁ ద్రిశంకుపుత్త్రుఁ డకటా ! యెటులిమ్మని యప్పుదీర్తు ? శ్రీ
మంతులు మిత్త్రులుండినను మానముచక్కఁ బిఖుఁడనయ్యు నొ
క్కింతకుఁ జేయిచాఁపుదునె ? వృత్తులు మూఁడు విధించె క్షత్త్రతా
క్రాంతులకెల్ల బ్రహ్మ ; యవిగాక మఱొక్కటి ద్రొక్కఁజెల్లునే. 526

వ. ఇతని ఋణంబు దీర్పకమున్న మృతిచెందితినేని బ్రహ్మస్వాపహరణజనితదోష
మ్మున నధమాధమంబగు క్రిమిజన్మంబు సంప్రాప్తంబగుఁ, గాదేనిఁ బ్రేతత్వంబు
చేకూఱునట్లుం గాన నాత్మవిక్రయణం బొనర్చుటయ వరంబని యెంచి చింతాకులత్వ
మ్మున నధోముఖుండై దీనుండైయున్న పతికి సతి యిట్లనియె. 527

ఉ. జనవర ! సత్యవంతులకు సాటి మఱొక్కఁడు గాఁడు, సత్యవా
క్యనియతి దప్పి ప్రేతసముఁడై వెలిఁజెందు నరుండు ; వాని స
ర్వనియమముల్ వృథా, ఋతము పాలనసేయుము స్వర్గలోకసా
ధనమగు నెట్లు సత్య ; మనృతంబగు దుర్గతి కట్లహేతువై. 528

వ. నాథా ! యయాతి శతాశ్వమేధంబులొనర్చి పిదప రాజసూయకర్తయై స్వర్గమ్మున
కరిగి యొక్కపరి యసత్యంబాడి యధోగతికి వచ్చెనని వింద నను దురా జిట్లనియె.

గీ. యెద్దియో చెప్పఁదలఁచితి విందువదన !, పలుకుమయ్యది కొంకర బాలకుం డి
తండు వంశంబు నెగడింపఁ దగినవాఁడు, కలఁడు వెనుదీయ నెయ్యది కారణంబు.

వ. నాపుడు రాజపత్ని యిట్లనియె. 531

క. నరవర ! సంతానమ్మున, కరయఁగ సతి యట్టిఫలము నందితి వీఁక న
న్నొరులకునమ్మి ధరామరు, ని ఋణము దీర్పంగఁ జనదె నిశ్చలబుద్ధిగా. 532

వ. అను శైబ్యవచనమ్ములకు దుఃఖాకులుండై, 533

చ. చెలి! దరహాససంగతినిఁ జెన్నలరారెడి పల్కులెల్ల ని
మ్ములఁ విడనాడి నాహృదయముం గలఁగింపఁగ నిట్టివాక్యముల్
పలుకుట చెల్లునే? మృదులభావము గల్గినదానవయ్యు న
న్నలయఁగఁ జేయుదే? విధికి నన్నెముఁ బున్నెము లేకపోయెనే. 53

వ. అని కరుణంబుగఁబల్కి యన్నృపాలుండు దారవిక్రయమ్మున కధీరుండై దుఃఖా
రేకమ్మున మూర్ఛంజెందినంగాంచి యప్పతివ్రతయు, 53

ఉ. హా! నరనాథ! దైవమున కంతగ నెల్లిదమైతిమే? జగ
న్మానితులైన భూపతులు మన్ననఁజేయఁ జతుస్సముద్రము
ద్రానుగతంబు భూవలయ మంతయు నీమహనీయుఁ డేలు న
వ్వానికి నీకు స్థండిలముపై నిటు నెవ్వగఁ గూరు టొప్పునే.

ఆ. వె. కోట్లకొలది విప్రకోటులకిచ్చియు, జ్ఞమును చేసి సత్యసంధుఁ డనఁగ
నెగడు నాదుపతికి నీకు నీదురవస్థ, యెట్లు గల్గె? నాకు నెఱుఁగఁ జెపుమ. 53

క. అనయము నింద్రోపేంద్రుల, కెన యాతఁ డనంగఁ బుడమి నేలెడి ధర్మా
త్మున కీదుర్దశ గూర్పఁగఁ, జనునే! దైవమున కింతశంకయు వలదే. 53

క. అని పలుమఱుఁ గుందుచు న, వ్వనజానన మూర్ఛగూరి భర్తదరిన్ గ్ర
న్ననఁబడియె నిట్టికష్టము, చన దిఁక నెవ్వానికేని శత్రుండైనన్. 53

వ. ఇట్లిరువురును మూర్ఛం జెందియున్నయెడఁ గొమరుండు రోహితుండు క్షుధ
కులుండై. 54

క. నాలుక యెండెడి నా క, బ్బా! లలి భోజనము నిడక ప్రాణము నిలువం
జాలదు, క్షుద్బాధకు నేఁ, దాళ ననుచు మొఱ్ఱవెట్టుఁ దలిదండ్రులకున్. 54

గీ. అంతలో నంతకుఁడు వోలె నధికకోప, మడర గాధిజుఁ డేతేర నవనిపతికి
నధికమై తగె దుఃఖ; మట్లగునుగాదె, ఋణికి ఋణదాత క్రుద్ధుఁడై యెనయుపట్ల

వ. విశ్వామిత్రుండును మూర్ఛంగూరిన యన్నరపాలునిపై శీతలోదకంబు చిలికి. 54

క. నరపాల! నీకకాదిడ, నరులకు నెల్లరకునున్ ఋణము నీఁదెరువున్
బొరయనివారికిఁ గలయది, య రయముమై లెమ్మి వంచనాదృతి మేలే. 54

వ. అని లేపిన హరిశ్చంద్రుండు శీతలోదకసేచనమ్మున లబ్ధసంజ్ఞుండై క్రోధావిష్టుఁ
డును నంతకాపరావతారుండును నగు నమ్మునింజూచి మగుడ మోహాయత్తుండగుడ
ద్విగుణితక్రోధుండై తపసి నృపున కిట్లనియె. 54

ఉ. సత్యము దప్పవేనియు నొసంగుము దక్షిణ; సత్యహేతువా
దిత్యునితేజ, మియ్యవని తెల్లము సత్యమునంద నిల్చు, నా
దిత్యులలోక మియ్యెడఁ బ్రతిష్ఠితమైచను, సర్వధర్మముల్
సత్యమునంద పొల్చు, నొక సత్య మగుఙ్ శతవాజిమేధముల్. 546

ఆ. వె. ఇంతయేల నాకు నిమఁ డస్తగిరి కేగు, నంతలోన దక్షిణార్థమైన
కనక మిచ్చి పుచ్చుఁగా నేరవేని శా, పం బొసంగువాఁడఁ బార్థివేంద్ర. 547

## హరిశ్చంద్రుండు భార్య నమ్ముకొనుట

వ. ఇట్లు పుయిలోడక నిష్ఠురమ్ముగఁ బల్కి యతండు సనినపిమ్మట దుఃఖార్ణవమగ్నులై దంపతు లిరువురును గుందుచున్నంత వేదపారగుండగు నొకబ్రాహ్మణుండు బహువిప్రసహితుండై యెటకేనియుం బోవుచుండ రాజపత్ని యాతనిం జూపి పతి కిట్లనియె. 548

ఉ. ఎక్కడు విప్రులం గలిసి యిట్లరుదెంచుచున్నవాఁడు దా
నొక్కమహీసురుం; డతనియొద్దకునేగి ధనంబు గోరినన్
దక్కక యిచ్చుఁ బుత్రులకుఁ దండ్రిధనంబు గ్రహించు టొప్పదే?
తక్కిన మూఁడుజాతులకుఁ దండ్రులకారె మహీసురోత్తముల్. 549

వ. అను సతికిఁ బతి యిట్లనియె. 550

గీ. క్షత్రియుఁడనయ్యు నేఁబ్రతిగ్రహముకొఱకుఁ
జేయిచాఁపుట యెట్టు లిప్పీః ప్రతిగ్ర
హంబు విప్రులసొమ్ము వర్ణంబులకును
వారు గురువులు పూజ్యులు వారిజాక్షి. 551

క. గురువుల యాచింపం దగ, దరయఁగ దానంబు యజన మధ్యయనంబున్
శరణాగతరక్షణముఙ్, బరమంబులు క్షత్రియులకుఁ బరిపాలనముఙ్. 552

గీ. "దేహి" యనుమాట వలవదు దేవి నాకుఁ
గలుగుఁగాక "దదామి" యఙ్ పలుకు, తెచ్చి
యెట్టులైనను నిమ్మని ఋణము దీర్తు;
నడుగుటకు నొండు గలదె యెందైనఁ గస్తి? 553

వ. నావుడు రాజ్ఞి యిట్లను. 554

క. సమవిషమకాలముల యో, గమునఁ మానం బమానకతయుఁ దాతృ
త్వము యాచకత్వమును విని, క్రమమున నొదఁగూడుఁ గాలగతి వాఙ్యంబే. 555

క. కాదేని ధర్మలతకున్, బాదులు బ్రాహ్మణులు ద్రోహపరులై క స్త్రీఁ
ద్వాదృశుఁ ద్రోయుదురే? మ, ర్యాదాస్థాలిత్యములు సమయచోదితముల్. 556

చ. అనుసతి కిట్లు పల్కు "జలజానన! వాఁడి కరాసిఁ బూని గ్ర
క్కున రసనఁ సుఖం బలరఁ గోసికొనం దగుఁగాని యొక్కనిం
గని ధనలోభమూని యడుగంగమకింతునె "దేహి" యంచు, రా
జునకుఁ ద్రిశంకుపుత్రునకు శూరున కింతటిదైన్య మొప్పునే. 557

వ. కావున నెట్లైన భుజవీర్యార్జితంబగు ధనమ్మొరుల కీయన యభిలషింతుంగాని యాచ్ఞాదైన్యం బొల్ల" ననుడు నప్పతివ్రతాశిరోమణి యిట్లనియె. 558

ఉ. అమ్మిన నార్చినఁ మఱియు నందల మెక్కఁగఁ జేసినఁ వివా
హమ్మునఁ గొన్నభార్య దగు నన్నిటికిన్ నరపాల! యాచ్ఞకుఁ
సమ్మతి లేనిచో నను యశమ్మునకై తెగనమ్మి వచ్చు మూ
ల్యమ్మును నిమ్మునీంద్రుని ఋణార్థముగానిడు మింత యొప్పదే? 559

క. అను సతిపలుకులు విని యా, జననాథుఁ డఖండదుఃఖసాగరమునఁ గ్ర
న్నన మున్గి యింతకష్ట, మ్మనకుఁ నే నొప్పు టెట్లు పూర్ణేందుముఖీ. 560

వ. అనిన నోదార్చి యమ్మగువ మరల నిట్లనియె. 561

గీ. ద్యూతహేతువు మద్యహేతువును రాజ్య, హేతువును భోగహేతువు నెఱుఁగ కకట!
సత్యసంరక్షణమునకు సాధ్వి నమ్మఁ, దగదె నీవంటి యుత్తమోత్తమున కధిప.

క. అని మాటిమాటికిని న, వ్వనితామణి యుక్తియుక్తవచనమ్ములఁ ద
న్నును బ్రేరేపఁగఁ దుద కి, ట్లను నంగీకార మాత్మయం దిగురింపన్. 563

ఉ. ఎవ్వరుఁ జేయరాని పని యే నొనరించెద నీదుమాటచే
జవ్వని! భార్య నమ్మెడి నృశంసులు గల్గిరె యేయుగమ్మునం,
దెవ్వగ నిట్టి దుష్కృతికి నిచ్చ యొనర్తు? నభాగ్యమూర్తినై
నవ్వుల కాకరంబ నయి నల్వురలోఁ దలవంపు నింపఁగన్. 564

వ. ఇట్లు చింతించుచు నెట్టకేలకు హరిశ్చంద్రుండు రంగమ్మునఁ బత్ని నవతరింపఁ జేసి గద్గదకంఠుండై యెడనెడ నడుచు నాగరికుల కిట్లనియె. 565

గీ. నాగరికులార! కరుణాసనాథులార!, యీ తలోదరి నాభార్య యెవరికేని
దాసిగా విక్రయించెదఁ దగినధనము, లీఁగలుగు దాత గలఁడె యిం దెందుఁ జెపుఁడ.

వ. నా వుడు వారలందఱుఁ బరమాశ్చర్యసంభృతమానసులై మండలాకారమ్ముగఁ జుట్టువారి నిలిచి నీ వెవ్వండ, విట్లు పత్నీవిక్రయణం బొనర్ప నేమివచ్చె నా వుడు వారల కతం డిట్లను. 567

క. సగపాలు వచ్చి యీ ము, ర్వగకార్యము చేయువాఁడఁ బాపాత్ముఁడ దుం
డగుఁడగు రక్కసునిన్ బో, లఁ గలుగు కఠినుండ నన్ దలంప నఘ మగున్.

వ. ఇట్టి నావృత్తాంతమ్ము మీ కేల, పరిసిన నియ్యంగనం దగిన ధనమ్మిడి దాసిగాఁ గైకొనుఁడని యుచ్చైస్స్వరముగ నాడువు నమ్మానవపతివచనంబులు విని కౌశికుండు వృద్ధబ్రాహ్మణరూపంబు ధరియించి యయ్యెడ కరుదెంచి యిట్లనియె. 569

చ. ధన మతులంబుగాఁ గలదు తద్దయునున్ సుకుమారి యస్మదం
గన పనిసేయరామిఁ గడుఁగష్టము చెందుచునుండు నీకుఁ గో
రిన ధనమిచ్చి పుచ్చెదను బ్రేయసి నమ్మట నిక్కువంబె నాఁ
గను బ్రతి చెప్పఁడయ్యె క్షితికాంతుఁడు మారినవంత పెంపునన్. 570

వ. అట్లు నిరుత్తరుండగు నన్నరపాలున కతండు మరల నిట్లను, ధర్మశాస్త్రముల ద్వాత్రింశల్లక్షణోపేతయు శీలవతియు నగు తరుణికి మూల్యంబు కోటి యనియుఁ బురుషునకు నయ్యుతంబనియుఁ జెప్పంబడుఁ గావున. 571

క. నీ తరుణి కనుగుణంబగు, నేతన్మూల్యంబు గొనుము గృహమే గెవ నే
నీ తన్విం గొని యనవుడు, నాతఁడు ప్రతి చెప్పఁడాయె నతదుఃఖమునన్. 572

గీ. అంత నావృద్ధవిప్రుఁ డహంకరించి, ధనము నృపునగ్రమునఁ బోసి "దాసివైతి
రమ్ము తడవేల" యనుచుఁ గరమునఁ గొప్పు, పట్టి యీడిచె నారాజపత్ని నకట.

వ. అట్లు కఠినుండై లాగికొని పోవుచున్న యమ్మునికి నప్పరమసాధ్వి యిట్లను. 574

చ. అకట! మునీంద్ర నన్ విడువుమయ్య సుతున్ విడనాడనోప నే
నకలుషనౌ పతివ్రత నయం బొకయించుక లేక నన్ను ము
ట్టకు మని, పుత్త్రుఁ గూర్చి యకటా నృపపుత్త్రక! దాసినైన నా
వికలత చూడుమయ్య నను వీడఁగదయ్య యిఁకేటిదారుణుల్. 575

చ. అనిన నవస్త్రమున్ విడువ కన్నృపపుత్త్రకుఁ 'డంబ యంబ' యం
చనుగతుఁడై యఖండగతి నశ్రువు లొల్కఁగ నేడ్చుచున్ మునిః

పునరుదయత్వదస్ఖలనముఁ గని యేగుచు నుండ నెంత దు
ర్జనుఁడొ యతండు ! పొమ్మనుచు రాజసుతున్ గరమెత్తి మొత్తెడిన్. 576

ఆ. వె. ఎంత తిట్టి మొట్టి యెడచేయ నెంచినఁ, దల్లికొంగు వట్టి తత్తఱమున
వెనుక నరుగుచుండె, విడువఁగ శక్యమే, బాలురకును దల్లిపట్లఁ బేర్మి. 577

చ. అటు చనుదెంచు నాత్మజుని నయ్యమగాంచి, మహాత్మ ! నన్నుఁ గొ
న్నటులె మదాత్మజాతుఁ గొనుమయ్య ధనంబునొసంగి యిట్లొన
ర్చుట నను రక్షసేఁత యొకరుండ సుతుండగుటన్ విశేషలం
పటమయి మన్మనంబు పనిపాటలకున్ వెనుదీయుఁ గానిచో. 578

## రోహితుండు క్రీతుండగుట

వ. ఇందులకుం గొఱగాని నన్నుంగొని యేమిఫలంబగు ? నో యయ్యా ! యెట్లైన దీన
నగు నన్ననుగ్రహించి నాకొమరునిఁ గ్రీతుఁగా నొనర్పుమనవుడు నతండంగీకరించి
పురుషునకు నర్బుదంబు మూల్యంబని చెప్పి యమ్మహీనాథునొద్ద తద్ధనం బునిచి
మీరిరువురును వెంబడి వచ్చునది యని చెప్పి యవ్విప్రుండు బయలువెడలె; నంత
నమ్మహాపతివ్రత భర్తకుఁ బ్రదక్షిణం బొనర్చి పాదమ్ములపై శిరంబిడి యతిదుఃఖ
భరమ్మున నిట్లను. 579

క. దానము లీఁబడి యగ్నులు, మానింపఁబడి ద్విజుల్ సమగ్రమ్మున స
న్మానితులై రేనియు నా, కీ నరపతి భర్తకాఁడె యెన్నిభవములన్. 580

క. అని పాదములంబడి వా, రని భక్తియుఁ బేర్మి కూర్మి గ్రందుకొనఁగ లే
వని భార్యం గని దుఃఖాం, బునిధింబడి యిట్లు పల్కె భూపాలకుఁడున్. 581

క. ఈ తరుణి యాతలోదరి, యాతల కెటు లేగు ? భర్తనగు నా కెదయై
యేతీరున మను ? వృక్షా, పేతంబై నీడ యొలయు నెందుం గలదే ! 582

వ. అని నికటగతుండగు కొమరు నుద్దేశించి, 583

మ. అకటా ! నన్విడనాడి పోయెదె కుమారా ! దుర్భగుండైన తం
డ్రికి నీబోఁటి సుతుండు దక్కునె ? యిఁకన్నేదుఃఖముం జెంద నొ
ద్దకు నేతెంచి నిషేధవాక్యములు దద్దన్ బల్కి యోదార్చి బు
ద్ధికి ధైర్యం బిడువార లెవ్వరు ననున్ దీనాత్ముఁగాఁ జేసెదే. 584

ఉ. ధారుణి యెల్లఁ బోయినను ధైర్యము వీడ; సుతున్ గుణాకరున్
ధీరమతున్ ద్యజించు టెటు? దెల్పఁగదయ్య ద్విజేంద్ర! యంచు నా
భూరమణుండు విప్రునని, పూతచరిత్ర! సరోజనేత్ర! న
న్నీరహిఁ డించి దాసివయి యేగెదె? దైవబలమ్ము పెంపునన్. 585

క. నను నిక్ష్వాకుకులోద్భవుఁ, డనియును రాజేంద్రుఁడనియు నధినాథునిఁగాఁ
గొని నాకారణమున నో, క్కనికిన్ దాసివయి కుందఁగాఁ బనుపడెనే. 586

క. ఏతాదృశగురుదుఃఖా, న్వీతుఁడనై కుందునన్ను నెవ్వరు మోదా
న్వీతు నొనరింతు రని య, త్యాతురుఁడై భూపుఁ డడలె ననదవిధమునన్. 587

వ. అంత నవ్విప్రుం డేతెంచి క్రోధాకులుండై యారాజర్షిసమక్షమ్మున నారాజపత్నిం బట్టి కశాఘాతమ్ములం గొట్టి పుత్రసహితమ్ముగ నీడ్చికొని పోవుచుండ హరిశ్చంద్రుం డేమియుం జేయునది లేక యిట్లు దుఃఖించె. 588

చ. తరణిశశాంకవాయువులు తక్కనమానవులున్ మఱెవ్వ రే
పరమపతివ్రతం గనఁగఁ బాల్పడ కుందురొ మున్ను; నేఁడు భా
గ్యరహితయై యకారణమ యవ్వనితామణి దాసి యయ్యె దు
స్తుఃమగు దైవపాక మది దాఁటఁగ రాదు విరించి కేనియున్. 589

ఉ. మారుని గేరువాఁడు సుకుమారుఁడు నాదు కుమారుఁ డీతఁ డం
భోరుహమిత్రవంశజుఁడు పూజ్యతఁ దక్క యభాగ్యుఁడైన నా
నేమికారణంబుగ ననిందితుఁ డొక్కనిచేతఁ గ్రీతుఁడై
బోరన నేడ్చుచుం జనుట పోలునె? పుత్రులు లేరె ధాతకున్. 590

ఉ. హా నళినాక్షి! హా తనయ! యక్కట! దుష్టుఁడనైన నాదు దు
ర్మానము కారణంబుగఁ గ్రమంబున దైవబలమ్ము దక్కయెం
దేనియుఁ బోతిరే? ఋణము తీఱెనె? మీకును నాకునేఁటితోఁ
బూనిక నింత చేసియును బోవనిప్రాణము నాకుఁ గల్గెనే. 591

వ. అని మిన్ను మన్ను నొక్కటిగా విలపించు నాసత్యసంధుని కడకు విశ్వామిత్రుండు సశిష్యుఁడై వచ్చి కోపమ్మున నిట్లను. 592

క. అనృతం బాడక సత్య, మ్మనకుం గట్టువడెదేని ము న్నిచ్చెద నీ
కని పల్కిన దక్షిణఁ గ్ర, న్నన నా కిడు మనుడు ధరణినాథుఁడు పేర్మిన్. 593

వ. మునిహృదయం బెఱింగి యితండు రాజ్యదానదక్షిణయుంగాకమున్ను నే నితనికి

"యాగార్థంబు ధనం బిచ్చెద నయోధ్యకు ర" మ్మని నొడివిన ధనముంగూడ దెమ్మనుచున్నవాఁడు; కాని మీ ధనంబున సార్ధహేమభారద్వయంబ కాక మఱి కొంత మిగిలియే యుండుఁ గావున నుభయమ్మునకుం బర్యాప్తం బగుంగాకేమి యని కెలన నున్న ధనముం జూపి యిందు రాజసూయ దక్షిణయుం గలదు దీనిన్ గ్రహించి నన్నుం గృతార్థుఁ జేయు మి నావుడు గాధిజుం డీధనం బెట్లుసంగ్రహించితివి నొడువు మనుడు నతం డిట్లు లను. 594

క. మునివర! ద్రవ్యంబును గై, కొను మంతియకాని వేఱు గోరకు మదినే
వినిచిన నీకును నాకును, బనుపడు శోకంబు పట్టఁబగ్గము లేమిన్. 595

క. నావుడు ముని యిట్లను నో, భూవల్లభ! ద్రవ్య మెట్టిపోఁడిమిచే నీ
తావునకు వచ్చె? శస్త్రం, బై వెఱయక యున్న మాకు నది గ్రాహ్యంబే. 596

చ. అనవుడు రాజు వల్కు విను మయ్య మునీంద్ర! పతివ్రతాంగనా
జనమణియైన మత్పతిని సద్గుణశోభిత నమ్మినాఁడ ని
ష్కవిచయ మొక్కకోటిగొని; కన్నకుమారకు నర్బుదంబు కై
కొని యిడినాఁడ నీధనము గొంకక కైకొనుమయ్య మొక్కెదన్. 957

వ. అని ప్రార్థించుటయు నమ్ముని యాధనముం జూచి యియ్యది యల్పంబు రాజసూయమ్మునకు దక్షిణ యింత స్వల్పం బెట్లు? మఱి కొంత తెచ్చి నా కొసంగు మట్లొనరింప వేవి. 598

గీ. నాతపోవీర్య మద్యయునంపుఁజేవ, మత్ప్రభావంబు నాదగుమహిమ మగుప
డంగఁ జేసెద విప్ర లనంగ నంత, నెల్లిదమె? యిమ్ము తక్కిన దిపుడ నాకు.

వ. అనవుడు హరిశ్చంద్రుండు కొండొక తాళితివేని మఱియుం గొంత ధనంబిత్తుననుటయు, గాధిజుండు రాజా! యిఁక దినమ్మున నాలవభాగంబు మాత్ర మవశేషముగా నున్నయది యంతదనుకం దాళువాఁడఁ బిమ్మట మఱుమాట చెప్పిన నే నొప్పెడి వాఁడఁగానని యాధనంబు గొని యరిగెఁ; బిదప హరిశ్చంద్రుండు దీర్ఘనిశ్వాసం బొనరించి యధోముఖుండై యుచ్చైస్స్వరమ్మున నిట్లనియె. 600

క. నను విత్తక్రీతునిగా, నొనరిచి ప్రేతత్వ మందియుఁడివ నాచేఁ
జను నెవ్వని యార్తి యతం, డనుగతుఁడై యిటకు వచ్చు నర్కుండుండన్.

వ. అనునంత నొక్క చాండాలుండు దుర్గంధదూషితశరీరుండు వికృతోదరుండు

శ్మశ్రుకుండు లంబోదరుండు శవమాల్యాలంకృతుండు హస్తజర్జరయష్టి యగుచు నేతెంచి యిట్లను 602

క. విను మేఁ జాండాలకుల, మ్మునఁ బుట్టి ప్రవీరుఁ డనఁగఁ బొల్చెడి వాఁడఁ
జనవర! నాయానతి మృత, జనచేలాపహృతి సలుపఁ జనుము కడంకన్. 603

వ. నావుడు రా జిట్లనియె. 604

గీ. బ్రాహ్మణక్షత్రియులఁ గూర్చి పలికియుంటిఁ, గాని తక్కొరులగుటించికాదు; జగతిఁ
దనరు నుత్తమమధ్యమాధముల కనుగు, ణంబయిన ధర్మములు విహితంబు లగుచు.

వ. కావున నీవు నన్నుఁ గొన ననర్హుండవన వాఁడను నరేంద్రా! నీవు సామాన్యమ్ముగ నాయెదుటఁ బలికినకతనఁ గొన నుద్యమించితి, సత్యమునకుం దప్పవేని యట్లొనరింపు మిప్పు డీరియమమ్ములు చెప్పుట పాడి గా దని మఱియును, 606

క. అవిచారితమతియై తా, నెవఁడును సత్యంబు దప్ప నెఱుఁగనిదో ముం
దు వచింపగా దసత్యముఁ, దవిలెడివాఁ డెట్టులేనిఁ దగుఁ బలుకంగన్. 607

క. అను నమ్మాలని పలుకులు, విని జనపతి సత్యమునకు వెలియై నరక
మ్మునఁ బడుటకన్నఁ జాండా, లనియతి నుండుటయ కొంత లగ్గుఁగాదే. 608

క. అని యోచించెడి యాలో, నన గాధిజుఁ డటకువచ్చి నరవర! నీ కో
టినధన మిచ్చెద నను మా, లనికిన్ దాసుండ వగుట లాఘవమగునే, 609

హరిశ్చంద్రుండు చాండాలునిచేఁ గ్రీతుండగుట.

వ. అట్లేని నా కీఁదగు దక్షిణ యేవిధమ్మునఁ బూర్ణం బగునని క్రోధతామ్రాక్షుండై యరుగు నమ్మునివరునకు జనవిభుం డిట్లను. 610

క. అనఘుండగు సూర్యుని కొల, మునఁ బొడమిన క్షత్రియుండ మునివర! నాకుం
జనునే? చాండాలుని సే, వనముం బొనరింప ధనమువలని దురాశన్. 611

వ. అనిన ముని యిట్లను. 612

ఉ. మాలని కెట్లు సేవన మమర్తునటంచుఁ దలంకెదేని నిన్
జాలినద్రవ్య మిచ్చి కొనుసత్పురుషుం గనఁ జేయు మింక నేఁ
డాళ, శపించి యేగెదను దామరసాప్తుఁడు వోవుదెంచె నా
కేల విచార మెట్లయిన నీవలె దక్షిణ కైకొనన్ వలెన్. 613

వ. నీ వెట్లేని ధనమిచ్చుటయ నాకుఁ బ్రధానం బని ప్రాణగొడ్డమ్ముగ ధూంకారం బొనర్చు నమ్మునికి నంజలి ఘటియించి పాదమ్ములం బడి నృపాలుం డిట్లనియె.

ఉ. ఓమునినాథ! కొంత కృపయుంచి ప్రసన్నుఁడవై భవత్పదం
బే మదినమ్మియున్న ధరణీంద్రుని దీను ననాథు నార్తు న
న్నోమఁగదయ్య! యంత్యకులయోగముకన్న నినున్ భజించి నీ
ధామమునందు సేవకపదమ్మున నేఁ బనిగొందు నమ్రతన్. 615

వ. నీ వేది పంచిన నయ్యది యొనర్చువాఁడ నని పదమ్ముల నుండి లేవని యన్నర నాథున కతం డిట్లను, నీకోరినయట్లు నాకు దాసుండ వగుము నేనెద్ది చెప్పిన నయ్యది యొనరింతువే? నావుడు హరిశ్చంద్రుండు కొంత సంతసించి పునర్జాతు నిగాఁ ద న్నెంచికొనుచు నమ్మని కిట్లను. 616

క. ఓమునిజనమణి! న న్నిఁక, నేమి యొనర్చినను మంచిదే నీపాదం
బే మదిని నమ్మి నీపను, పేమైనన్ జేయువాఁడ నెల్లపుడుఁ దగన్. 617

వ. కావున నీకేమి యొనర్తు నిప్పుడ నా కానతిమ్మనుడు నమ్ముని చాండాలుం బిలిచి యిట్లను. 618

గీ. ఓరి చాండాల! వీఁడు నాయొద్ద దాసుఁ, డయ్యె ద్రవ్యంబు నాకు ముఖ్యంబు గాని
వీనితోఁ బనిలేదు నాయానతిని ధ, నంబు నిడి వీనిఁ గైకొ మ్మనంగ వాఁడు. 619

వ. గాధిజుం గని మహాత్మా! ప్రయాగమండలంబున దశయోజన విస్తీర్ణంబగు భూమిని రత్నమయమ్ముగా నొనర్చి నీకు మూల్యమ్మునకుఁగా నొసంగువాఁడ నాకు నివ్వానికతన నియ్యార్తి యడంగు నియ్యది నీవొనర్చిన యుపకారంబని చెప్పి.

క. రతనములు మౌక్తికమ్ములు, నతులితమగు పైఁడియున్ సహస్రపు సంఖ్యల్
మితిమీఱునట్టు లమ్ముని, పతికిచ్చెఁ బ్రవీరుఁ డెంతభాగ్యము గలఁడో. 621

చ. అటు మునిచేత విక్రయము నంది త్రిశంకుసుతుండు "నాకు ని
జ్జటిలుఁడు సేవ్యుఁ డీతని వశమ్మున నెయ్యదియేనిఁ జేసినన్
గుటిలత నన్నుఁ బొంద దనుకూలమ యిమ్మునియాజ్ఞసేఁత యిం
కెటులయినం గృతార్థుఁడ మునీంద్రు ఋణమ్మును దీర్చనేర్చితిన్. 622

వ. అని నిర్వికారవదనుండై యానందించునెడ నశరీరవాణి యిట్లను. 623

ఉ. ధన్యుఁడవైతి సత్యమును దప్పక బాములకోర్చి యెల్ల రా
జన్యులు దేవతల్ నినుఁ బ్రశంస యొనర్ప నగణ్యకీర్తిస
న్మాన్యుఁడవై మునీంద్రునిఋణంబు తృణంబుగనిచ్చివచ్చి యీ
దైన్యము లెక్కపెట్టక ముదమ్మునఁ బొల్చెద వింత యొప్పునే! 624

ఆ. వె. మేలు మేలు నీవు మేదినికెల్లను, భూషణమవు నిన్నుఁ బోలరాదు
సత్యమున మఱొక్కజనునకు నని నుతుల్, గొలిపి సురలు పూలు గురిసి రపుడు.

వ. పదంపడి హరిశ్చంద్రుండు ద్విగుణితానందుండై కౌశికునికిఁ గేలు మొగిచి యిట్లను. 626

క. తల్లియుఁ దండ్రియు దైవం, బెల్లరు నాకీవ నన్ను ఋణముక్తునిఁగాఁ
దెల్లము చేసితి వో ముని, వల్లభ! నీయాజ్ఞ నే నవశ్య మొనరుతున్. 627

వ. నీవెయ్యది చెప్పినను నాశ్రేయమ్మునకుఁ గాని యొండుగాదు నిక్కమ్ముగ నేమి యొనర్తు నాన తిమ్మనుడు నమ్ముని యిది మొదలీచాండాలునిపనుపున జాగరూకుండవై వర్తింపుము, నీకు శుభమ్మగునని చెప్పి యరిగె; నావుడు జనమేజయుండు మహాత్మా! యతండు చాండాలసేవకుండై యవ్వానిగృహమ్మున నెట్లు వర్తించె ననుడు వ్యాసుం డిట్లను. 628

గీ. అట్లు కౌశికుఁ డరుగుడు నా నృపాలుఁ
గని శ్వపచుఁడిట్లు పల్కు "దొంగవయి పాఱు
దువొ, మఱేమొకొ! యిందు బద్ధుండవగు" మ
టంచుఁ గట్టించె రజ్జుల నంటఁదీసి. 629

వ. అట్లంటఁగట్టి యసత్యుండవై పలాయనం బొనర్పకుండువాఁడ వని దండమ్మునం దాడించుచుఁ దనపక్కణమ్మునకుఁ గొనిపోయి, 630

గీ. ఇష్టబంధువియోగార్తు నష్టతేజు, వ్యాకులేంద్రియు నా నృపవర్యు నిగళ
బద్ధునిఁగఁజేసి నిద్రకుఁ బడియె శ్వపచుఁ, డకట! యాతని గని చూడఁడాయె మరల.

వ. అట్లు నిగళబద్ధుండును క్షుద్వ్యాకులుండునునై భార్యాపుత్రులం దలంచికొని యిట్లు విలపించు. 632

ఉ. దీనముఖుల్ సుదుఃఖితునిఁ దేజము దక్కినవాని బాలుఁ దా
నానతవక్త్రయై కని 'సుతా! బెగడొందకుమయ్య యింతలో
మౌనిఋణంబుఁ దీర్చి నృపమౌళి కృపన్ మన కీయవస్థ యె
ట్లైనియుఁ బాపు' నంచు స్మరియించు సతీమణి నన్ను మాటికిన్. 633

గీ. 'అయ్యయొద్దకు నేగెద' ననుచు నేడ్చు, సుతుని నోదార్ప నక్కటా! సుదతి 'యప్లె
యేగుదువు గాని' యనిచెప్పి యెలమి గల్గఁ. జేసి మఱపించు నేమియుఁ జేయరామి.

గీ. అంతియే కాని యకట! యయ్యతివ నేఁడు, మాలని గృహమ్మునం దసామాన్యనిగళ
బంధమున నిట్టు లున్నసంబంధమెఱుఁగ, దెఱిఁగెనేనియు మృతిచెందు నిదియ మేలు.

చ. రమణ నెసంగునట్టి ఘనరాజ్యము పోవుట బంధుమిత్రసం
ఘముఁకు దూరమేగుట జగమ్మునకెల్ల మహాపతివ్రతా
త్వముగలభార్యయున్ సుతుఁడు దాస్యమునొందుట నాకు మాలగే
హము గతియౌటయుం దొడరె నాపద లాపదలంద పైఁబడున్. 636

వ. ఇట్లు ప్రతికూలంబగు విధికిఁ దలంకుచు భార్యాపుత్రుల స్మరించి కొనుచు నొక్క
నాలుగుదినమ్ములు గడపునంత నాపవీరుం డతని బంధనిర్ముక్తుఁ జేసి పరుష
దుర్భాషణంబులఁ దర్జించుచు మృతచేలాపహరణమ్మునకై యిట్లు నియోగించె. 637

క. ఈ నగరిదక్షిణమున శ్మ, శానము గల దచట నుండి శవవస్త్రసమా
దానము పని గా న్యాయ్యం, బై నెగడెడివృత్తి మెలఁగు మనవరతంబున్. 638

వ. జర్జరంబగు నీదండంబు గైకొని యియ్యది వీరబాహుం డిచ్చెనని యెల్లరకుఁ
దెలియ నుద్ఘోషించునది యని చెప్పి పనిచినఁ దదాజ్ఞంగొని దండమండితకరుండై,

ఉ. అనఘనాయకుండు భయమై శవమాల్యయుతంబు పూతిగం
ధానుగతంబు ధూమమయ మామిషలోలుపగృధ్రకంకదు
ర్ధ్వానము నర్ధదగ్ధశవదర్శనసంగతమై మనస్యసం
ధానమునౌ శ్మశానము సవ్రాలపమ్మునకంబు గన్గొనెన్. 640

చ. పెనిమిటి కేడ్చు భార్యలును ప్రేయసి కేడ్చెడిభర్తలున్ దనూ
జున కడలొందు తల్లులును సోదరికై వగచెందునప్పలున్
మనుమల కేడ్చుతాతలును మామల కేడ్చెడిభాగినేయులై
పనపడు నా శ్మశాన మతిభైరవశబ్దసమాకులంబునై. 641

వ. ఇట్టి మహాఘోరాకారమ్మునఁ గల్పాంతకాలసన్నిభంబును జ్వలన్మాంసవసామేద
"శ్రూయ్, చూయ్" ధ్వనిసంకులంబును నగు నమ్మహాశ్మశానంబున కరిగి యాహరి
శ్చంద్రుండు, 642

చ. వెనుకటిరాజ్యమున్ సుతుఁడు భృత్యులు మంత్రులు భార్యయుం దలం
పునఁ బొడకట్టఁ దన్మయతఁ బొంది ధృతిం గనలేక "ప్రేయసీ!
నను విడనాడితే? కులమ, నన్నెడచేసితె? పుత్రకా, ననుం
గనుఁగొనరావుగా?" యని యఖండగతిన్ విలపించు ఖిన్నుఁడై. 643

క. కోపముఁడగు నావిప్రుని, బ్రాపున మీ రెట్టిపాట్లు వడుచుంటిరొ? మీ
యాపదలు నే నెఱుఁగ నా, యాపత్తును మీకు నెఱుఁగ నయ్యెడినె కటా. 644

## హరిశ్చంద్రుండు శ్మశానమ్మున నుండుట.

క. అని చింతించుచు ధర్మం, బును దప్పిన నరుఁడు శుభము వొందఁడు యత్నం
బున నది రక్షించిన స, జ్జనునకు సుఖమును యశంబు సమకూరు నొగిన్. 645

వ. కావున నెప్పాటనేని ధర్మరక్షణంబు కర్జంబని తనకు వీరబాహుం డాజ్ఞాపించిన చందమ్మున వచ్చుశవమ్ములఁ గనుంగొనుచుఁ దత్తన్మూల్యగ్రహణంబున కటు నిటు నరుగుచుఁ దత్తత్కృత్యమ్ముల జాగరూకుండై రజోదిగ్ధసర్వాంగుండై మెలఁగుచు. 646

ఉ. ఈ శవమూలమై మనకు నింతధనం బొదఁగూడె మీఁద నా
యా శవకారణమ్మగ శతాధిక మూల్యము వచ్చు దీన భూ
మీశున కింత, యింత మనయేలిక మాలని, కింత నా కటం
చాశ మెయిన్ జరించు నొకఁడై ధృతజీర్ణపటైకకంథుఁడై. 647

క. నానాశవౌదనాదన, దూనానూనక్షుదార్తితోఁ దన్మాల్యా
ధానశిరస్కుఁడుఁ దద్భ, స్మానుగతాంగుండు నగుచు నవనిపుఁ డచటన్. 648

చ. పవలును రాత్రియున్ నిదురఁబాసి వసాదికలిప్తపాణియై
శవములరాక చూచుచు విషక్తవిలోచనుఁడై శ్వపాకజా
తి వలుకురీతిఁ బల్కుచు మదిన్ మఱియొండు నెఱుంగ కొక్కయేఁ
డవశత నిట్లు పుచ్చె, నదియొ శతవర్షసమంబు పార్థివా. 649

వ. అంత నొక్కనాఁడు రోహితుండు సవయస్కులగు విప్రబాలురం గూడి పురమ్మున కనతిదూరమ్మున కేగి యచ్చటఁ గొండొక క్రీడించి రాఁబోవువాఁడు ముందట. 650

గీ. అల్పమూలమ్ములను మఱి యగ్రసహిత, ములును గోమలములును దర్భలను జూచి
యార్యునకు నివి యుక్తమ్మ లనుచుఁ గట్ట, కట్టి సమిధాదికమ్ములు దొట్టి భక్తి. 651

వ. ఇట్లు తన యేలిక యగు విప్రునకుఁ గూర్చువాఁడై పాలాశాది కాష్ఠమ్ములతోఁ గట్టిన మోపొకటి శిరమ్మున నిడికొని భాసంబైనయెడ దింపికొని ఖేదంబు నొందుచు జలంబు సంప్రాప్తంబైనఁ ద్రావుచు వచ్చునెడ నొక్క వల్మీకమ్మునఁ గాష్ఠభారంబు

దింపి మరల నెత్తికొనునంత విశ్వామిత్రప్రేరితంబై యొక్క సర్పం బతిఘోర
విషరూషితం బవ్వల్మీకంబు నిర్గమించి, 652

క. ఆ నృపసుతునిం గఱచిన, మే నెఱుఁగక పడియెఁ దోడ మెలఁగెడి బాలుర్
దీనులయి వేగ చని రా, ట్సూనుజననిఁ గాంచి కొంత శోకము గదురన్. 653

ఆ.వె. వినుము విప్రవాసి! తనయంత నీసుతుఁ, డరుగుదెంచె నాటలాడ నెంచి
యచటఁ బాము గఱచె నంతట భీతిల్లి, వచ్చినార మిటకు వార్తఁ దెలుప. 654

క. అను పలుకు వజ్రపాతం, బున కెనయై రాజపత్ని పొరిఁబొరి మూర్ఛన్
బనుపడి నఱకిన కదళీ, ఘనతరువుంబోలెఁ బడియెఁ గష్టముపాలై. 655

వ. అంత నవ్విప్రుం డరుదెంచి శీతలోదకంబు చల్లిన లబ్ధసంజ్ఞయై విలపించు నాశైబ్యం
గని యతం డిట్లను. 656

ఆ.వె. ఈప్రదోషవేళ నేడ్చుట లక్ష్మీక, రంబు గాదనుమఁ గుంబు నెఱిఁగి
నా గృహమ్మునందు నాతిరో! యేడ్చెదు, సిగ్గులేదె యిదియుఁ జెప్పవలెనె. 657

వ. అని నిష్కరుణుండై తన్నుం దిట్టు నవ్విప్రుని కుత్తరం బీనేరక తన్మయచిత్తయై,

క. కన్నీరు కాల్వగట్టఁగఁ, దన్నెఱుఁగక కరుణ మొలయఁ దద్దయు శోకా
భ్యున్నతి నెలుఁగెత్తుచు నే, డ్చె న్నందనుఁ దలఁచి "యెంత చేసితి" వనుచున్.

## శైబ్య పుత్రమృతికి శోకించుట.

వ. ఇట్లు వికీర్ణకేశియై యొడ లెఱుఁగక మిన్ను మన్ను నొక్కటిగా నొఱలుచున్న
రాజపత్నికి దుర్మార్గుండు పాఱుం డిట్లను. 660

క. ధనము తగినంత యిచ్చితి, నిచుఁ దెచ్చితి నింటిపనికి నీవీగతి న
న్నను మోసపుత్తె? దాసికిఁ, జనునే యీ రీతి? నిన్నుఁ జంపెద మొండీ! 661

వ. అని తన్నుఁగొట్ట నుంకించు నక్కఠినాత్మున కారాజపత్ని మహాత్మా! నన్నుంగొట్ట
కుము నాసుతుండు సర్పదష్టుండై మృతుండయ్యె. 662

క. కరుణించి యాజ్ఞ యిచ్చిన, నరిగెద నాపట్టి నాకులాభరణము తా
నురగవిషమ్మున నెచ్చట, మరణము గనె నటకు; నన్ను మన్నింపు మొగిన్. 663

క. ఇఁక నీ జన్మమునకుఁ బు, త్రకుమోముం జూచు భాగ్యదశ గల్గదు నేఁ
టికి ఋణము తీఱె నొక్కం, త కరుణ నన్నటకుఁ బంపఁ దగదె మహాత్మా. 664

వ. అని కన్నీరు వఱ్ఱుగా రోదనంబొనర్చు నమ్మానినికిఁ గ్రుద్ధుండై వృద్ధుం డిట్లను. 665

గీ. ఓసి దుర్మార్గురాల ! నాదాసివయ్యు, నింటిపనులను డించి నీ వేగితేని
యెవఁడు నీతాత యిప్పని నెల్లఁజేయు, స్వామికార్యవిఘాతంబు సలుపనగునె. 666

వ. ఎవ్వండేని వేతనంబుగొని స్వామికార్యంబొనర్పఁ డవ్వాఁడు మహారౌరవనరకమ్మునం బడి యొక్కకల్పంబుండి పదంపడి కుక్కుటంబై జనియించు. 667

గీ. ఐన నాకేల నీయెడ నఖిలధర్మ, ములును వమ్ముగ వచియింప, మూర్ఖులందు
నీచులందును వ్యర్థమై నెగడు నీతి, చౌటనేలను బడ్డ బీజంబు పగిది. 668

వ. నీకించుకేనిఁ బరలోకభయంబు గలదేని వచ్చి యింటి కార్యమ్ములు చక్కఁబెట్టుమని నిష్ఠురమ్ముగఁ బల్కునద్ధరాసురున కమ్మగువ వేపమాన యగుచు నిట్లను.

క. ఒకయింతలోన మృతపు, త్రకుదేహము చూచివత్తుఁ దడయక నాపై
సకరుణదృష్టిం జొనుపు ము, పకృతిం బొనరింపు మింత పాటిగనేనిన్. 670

వ. అని చరణమ్ములం బడి యతికరుణమ్ముగ నేడ్చు నమ్మగువం గని కోపోద్రేకమ్మున నతం డిట్లను. 671

గీ. కొడుకు చచ్చిన మా కేటిగొడవ ? యింటి, పనులు తక్కక చేయుము గొనము గలిగి
కానిచో మత్కశాఘాత మూని వీఁపు, బ్రద్దలగు మున్నె ఱుంగవే పడఁతి నన్ను.

వ. అని పుయిలోడక పల్కునప్పాపాత్మునకు మాఱాడక ధైర్యం బవలంబించి తత్తద్గృహకృత్యమ్ము లొనర్చి పాదసంవాహన మ్మొనరించునంతకు నర్ధరాత్రంబు గతించెఁ, బిమ్మట నాపె కాతఁ డిట్లను. 673

క. ఇఁకఁ జనుము నీదుపుత్రకు, నకు దాహాదికము వే యొనర్చి గృహమునొ
ద్దకుఁ బ్రొద్దువొడుచునాయిం, తకుఁ బను లొనరింప రమ్ము తడసెదు సుమ్మీ. 674

వ. ఇట్లు తదనుజ్ఞాతయై యేకాకినియై విలపించుచు యూథభ్రష్టయగు కురంగివడువున వత్సవిహితయగు గోవు విధమున నరిగి పురమ్మునకు నవుల ననతిదూరమ్మున నొక్కెడ మృతుండై పడియున్న పుత్రుంగని హాహానినదమ్ము దనర దరికేగుచు,

గీ. పతిఁడినమ్మను నెదురేగువాఁడ విప్పు
డేల రా ? వింత కోపింప నేల నీకు,
"నంబ" ! యని పిల్వరాదె నాయన్న ? యనుచుఁ
దొట్రుపాటొప్ప నేగి సుతుపయిఁ బడియె. 676

వ. అట్లు పడి మూర్ఛిల్లి కొంతవడికిఁ దెలిసి బాష్పమ్ము లొలుకుచు నబ్బాలకుని బాహు

వులంబట్టి కౌఁగిలించుకొనుచు నతని మోమున మోమిడుచుఁ గరమ్ములచే నురమ్మును శిరమ్మును మోదుకొనుచు, 677

క. హాపుత్రా! హాపుత్రా!, హాపుత్రా! యనుచు మిగుల నార్తస్వనయై
యాపడఁతి యడలి యెంతయు, వాపోవఁ దొడంగెఁ దీర్చువారలు లేమిన్. 678

వ. పదంపడి పతిం దలంచికొని, 679

క. ఓనరపాలక! నీసుతుఁ, డీనాఁటికి నిట్టు లాయె నిప్పుడ చనుదే
వే, నేఁడు దక్కినన్ నీ, సూనుని వక్త్రంబు మరలఁ జూడం గలవే. 680

వ. అని వెండియుఁ బరిపూర్ణరాకాసుధాకరుం గ్రిందుపఱచు నబ్బాలుని మొగమ్ము జీవితభ్రాంతిం జూచి యట్లుగామికి మరలఁ బెచ్చుపెరుఁగు దుఃఖాతిరేకమ్మున మూర్ఛితయై కొంతవడికిఁ దెలిసి యబ్బాలుని మొగమ్ము కరమ్మునం దిడికొని యిట్లను.

చ. శయనమునుండి లెమ్మిది నిశాసమయం బిటఁ బ్రేతభూతసం
చయము చరించుచుండెఁ జెలువం గడు నార్చుచునుండె నక్కలు; ల
య్యయొ! వినువీడి మిత్రులు రయమ్మున నిండ్లకు నేగిరయ్య! వి
ర్భయమున నీకు నిట్లునికిఁ బాడియఁటయ్య! నృపాలపుత్రకా! 682

క. వే యనురాగమ్మున లే, వే! యను మన విప్రునింటికేగన్వలె రా
వే! యనుఁ దల్లిని విడిచెద, వే! యనుఁ బ్రతివచన మొసఁగవే! యను నార్తిన్.

ఉ. తల్లిని గాన యేను? నపుఁ దక్కొరులంబలెఁ జూడనేల? నా
యుల్లము చల్లఁజేయుటకు నుద్భవ మంది యనాదరింతె? సం
పల్లవమేని లేక పురిఁ బాసియు నొక్కనియింట దాసినై
చెల్లియు నిన్నుఁ జూచికొని జీవము దాల్చితిఁగాదె పుత్రకా. 684

ఉ. ఆయువు దీర్ఘమై పృథివి కంతకు నేలికయై నిరంతర
శ్రీయును విద్యయున్ యశముఁజేవయు నిండియు విప్రపూజయున్
బాయక తల్లిదండ్రులకు భక్తుఁడునై యితఁడొప్పుఁ బుత్రపౌ
త్రాయతి నంచుఁ బుట్టినపు డగ్రజులాడుట కల్లయేసుతా. 685

గీ. చక్రమత్స్యాదిరేఖలు స్వస్తికధ్వ, జాదిరేఖలు నీదు కరాంబుజమున
నాయురారోగ్యదంబులై యలరు నవియు, వమ్ముచేసితె నాదుపాపమ్ము కతన. 686

శా. నీరాజ్యమ్మును నీ ధనంబు మఱియున్ నీ మంత్రులున్ నీదు ది
వ్యారామమ్ములు నీమహర్మ్యములు నీదౌ నాతపత్రంబు సు

శ్రీ రంజిల్లెడి నీహాయమ్ములు కరుల్ సింహాసనంబేడ న
య్యా రాజేంద్ర! సమస్తమున్విడిచి నీవాలోకముఁజేరితే. 687

వ. అని మఱియును బతి నుద్దేశించి వారని దుఃఖమ్మున. 688

సీ. కుంకుమాదికమునఁ గొమరారు నీవక్ష • మతిబాల్యమున నెవ్వఁ డాత్మదేహ
సంగతమాలిన్యసంగతిచేఁ బంకి • లంబుగాఁ జేయు, ఫాలమ్మునందు
మృగనాభిపంకంబు మెదపితీర్చిన తిల • కంబును జూచి యంకస్థుఁడగుచు
నెవ్వఁ డద్దానిని నవ్వుచుఁ దుడుచు, నిం • కెవ్వని మొగము నాకెల్లవేళ

గీ. మృత్స్నమాకులమయ్యును మేల్మి ముద్దు•వచ్చు, నీ యా తనూజుఁ డివ్వడువున మృతి
చెందె నాయీమొగం బరవిందతుల్య • మయ్యు నీఁగలకును నెలవయ్యె నధిప.

గీ. దైవమా! పూర్వభవమున దారుణమగు, కృత్య మెయ్యది చేసితిఁ? గిటు లిట్టు
లే కతమ్మున నాకబ్బె? నేరికేని, గీటులును మేలు లనునని కేవలములె! 690

క. హా పుత్ర! హా కుమారక!, హా పుణ్యనిధాన! హా మహారాజతనూ
జా! పాపాత్మిక యిది యని, యీ పాటన్ విడిచిపోతివే యలుకమెయిన్. 691

## తలవరులు శైబ్యంగట్టి తీసికొనిపోవుట.

వ. అని సారెసారెకుఁ జింతిల్లుచు నెలుఁగెత్తి మహాఘోరమ్ముగ రోదనం బొనర్చు
చున్న యా పతివ్రతకడకు నారెకు లేతెంచి నీ వెవ్వతెవు? పతి యెయ్యెడ కరిగె?
యిట్టి నిశీథసమయమ్మున నొంటిపాటున నిప్పాట శోకింప నేమికత? మ్మని యడి
గిన దుఃఖార్ణవమగ్నయగు నా రాజపత్ని నిరుత్తరయై యెప్పటియట్ల శోకించుచుండె
నంత వారలు సంశయగ్రస్తులై, 692

క. స్త్రీ గాదు బాలఘాతిని, నాఁగాఁదగు నెంత పిల్చినన్ బలుకమికిన్
మూగయె? యిబ్బాలకు నెం, దేఁ గొని భక్షింప నిటకు నేతెంచెనొకో. 693

వ. అని తత్తఱమ్మున దొదవ్వల కరిగి ధృతశస్త్రపాణులై యియ్యది యెద్దియేని నొక
ఖేచరి గావలయు నట్లగుటంజేసి మనకు వధ్యయని యందఱు నొక్కపెట్టన వచ్చి
యంటంగట్టి కేశపాశంబు వట్టికొని చాండాలవాటికకుఁ దీసికొనిపోయి యియ్యది
బాలఘాతినియగు ఖేచరి గావున వధింపుమన వాఁడేతెంచి కాంచి వారల కిట్లను.

చ. ఘనము నిప్పురిం గలుగు నప్పుఖలం దినుచున్న నొక్క ఘా
తిని యని పెంచు నెప్పుడును దీనిఁ గముంగొనఁనేరనైతినే

ర్పున నిటు కట్టి తెచ్చితిరి భూరియశమ్మగు మీకుఁ బట్టణం
బునకు సుఖమ్ము కల్గు విధి పుట్టిన బాలుర నెల్లఁ జంపెడిన్. 695

చ. పెలుచనఁ గొంపలం దగులఁబెట్టెడివానిని దారిఁగొట్టు దు
ష్కలుషుని విప్రులన్ శిశులఁ గాంతలఁ జంపెడివాని మేటియో
గ్యుల నెదిరించువానిఁ గలుఁగ్రోలెడి దుర్మదు దేశికాంగనన్
గలసినవానిఁ జంపుట నికామమహాసుకృతప్రదంబగున్. 696

వ. ఇట్టి కార్యమ్ము లొనర్చువాఁడు బ్రాహ్మణుం డనియు నంగన యనియు జూడక వధ్యులని చెప్పి యతికోపమ్మునం బట్టి కొట్టి కెలననున్న తన యనుచరు హరిశ్చంద్రుం బిలిచి యిట్లను. 697

క. ఇయ్యది బాలురఁ జంపెడి, దయ్యము స్త్రీ యంచులోనఁ దలఁపకు మింకన్
జయ్యనఁ గడతేర్పుము మే, లయ్యెడు లోకమున కనుడు నానువరుఁడున్. 698

గీ. వజ్రపాతోపమమ్ము నప్పలుకు విని మ
హాత్మ! యింకెద్దియేనియు నాజ్ఞ యిమ్ము
శక్యమేనియు నయ్యది సలుప నేర్తు
నకట! స్త్రీహత్యఁజేయఁ జేయాడు టెట్లు. 699

క. అనవుడుఁ జాండాలుం డను, ననుచర యసి కేలఁ గొని భయంపడ కిద్దా
నినిఁద్రుంపుము పుణ్యంబగుఁ, జనునే? శిశుఘాతసేయు చాన క్షమింపన్. 700

వ. నావుడు నృపాలుం డిట్లను. 701

క. వనితల యత్నమ్మునఁ గా, వసగున్ బురుషుండు జ్ఞానవశమున నజ్ఞా
ననియతిఁ జంపినదుర్మా, ర్గునకున్ నరకమ్ము గల్గు రూఢిగననుడున్. 702

క. ఒకప్రాణము వలనన్ జగ, మకలంకత్వమునఁ బొదలునప్పుడు లోకా
పకృతిస్వభావ దుష్టా, త్మక దీని న్నణుక వలవదే? సుకృతార్థుల్. 703

వ. ఇయ్యది యనేకుల బాలుర వధియించె నిద్దానిం జంపుట యావశ్యకం బాయుధంబు గైకొను మనుడు నాతండిట్లను. 704

క. చాండాలరాజ! నాకుం, గొండికతనమాది యింతకుం బొంఁతుకలన్
ఖండింప ననుచు వ్రత మి, ట్లుండన్ నన్నిందుఁ జొనుపు టుచితంబగునే. 705

చ. అనవుడు స్వామికార్యమున కడ్డముచెప్పుటకన్న దోసముం
డునె? మతియొందు; నాపనికిటుల్ ప్రతిచెప్పెదె? యిట్టిద్రోహముం

బొనరుచు నీకు నారకసముద్ధృతి యెన్నఁటికేనిఁ గల్గనే
ర్పునె? తగువేతనంబు గొని ద్రోహము సేసెదె దుష్టబుద్ధివై. 706

వ. అన నరపాలకుం డను మహాత్మ! జగమ్మున నీకు శత్రుఁ డుం
డిన ననుఁ బంపు మింద్రుఁడు కడిందిబలమ్మునఁ దోడు వచ్చినన్
దునిమెద వాని నొక్క పెనుతూపున; మేదినికెల్ల నిన్ను నా
థునిఁగ నొనర్తు నియ్యబలఁ ద్రుంచుట నాపని గాదు నావుడున్. 707

ఉ. "కూలికివచ్చి పాలికిటు కూయఁగ" వచ్చునె; న్యాయమేది; చాం
డాలనియింట దాసుఁడు హుటాహుటి ఖూరుఁబల్కు లాడఁగాఁ
బోలునె? చాలుఁ జాలు నసిపూని కరమ్మున నడ్డుచెప్పకీ
బాలకహంత్రిశీర్షము చివాలునఁ ద్రుంపుము నిర్దయాత్మతన్. 708

వ. అని ఖడ్గం బొసంగుటయు స్వామికార్యార్థి గావునఁ గైకొని దగ్గఱ జని యన్యోన్య
జ్ఞానంబు లేమి నాపె కిట్లను. 709

క. ఓవనిత! నాదు హస్తము, చేవం గడలుకొనునేని శీర్షచ్ఛేదం
బేవడిఁ జేసెదనని స, ద్భావుం డవ్వనితఁ జంపఁ దత్పరుఁ డగుడున్. 710

చ. తనమరణంబు నెమ్మదిని దద్దయుఁ గోరుచుఁ బుత్రశోక మా
ర్తి నిగుడఁజేయ నిట్టులను దీనత దోఁపగ, నో శ్వపాక! నా
తనయుఁడు ద్రెళ్లె నక్కెలనఁ దత్తనువున్నది దానిఁదెచ్చి నీ
పనుపున నియ్యెడన్ జితను బన్ని దహించెదఁ దాళుమంతకున్. 711

వ. నావుడు హరిశ్చంద్రుండు ధర్మాత్ముండు గావున "నట్ల యొనర్పుము పోయి ర"
మ్మని యాజ్ఞ యిచ్చిన, హాపుత్ర! హాబాలక! హాతనూజ! యని మాటిమాటికిఁ
గుందుచు నరిగి యబ్బాలకుం దెచ్చి శ్మశానమ్మున నునిచి యాక్రోశించుదానిఁ బాంసు
ధ్వస్త శిరోరుహ నతిమలినఁ గృశాంగి జన్మాంతరసంగతనాఁ దగుదాని నప్పరమ
పతివ్రత నాత్మపత్నిగాఁ జిరవిరహసంగతుండగు కతన నెఱుంగక యానృపేం
ద్రుండు కెలని కరిగి శవమ్మున నున్న వస్త్రమ్ము లాగికొనుటయు నయ్యదియు
నగ్రమ్మున నున్న యతిని నతికృశాంగు నన్యరూపు నాత్మధవునిఁగా నెఱుంగదయ్యె.

క. అంకమున బాలు నిడికొని, కొంకుచుఁ బలుమాఱు దలఁచికొని యేడుచు న
ప్పంకజముఖి దరి కరిగిన, జంకె హరిశ్చంద్రు మనము సంశయహతమై. 713

## హరిశ్చంద్రుండు తనపత్ని నెఱుంగుట.

సీ. చంద్రునిఁ గాదనఁజాలు వక్త్రముసొంపు • గండముల్ దర్పణఖండములగుఁ
గుంచితాగ్రమ్ములు కోమలంబులు నీల • ములు దీర్ఘములు పెన్నెఱులు దలంపఁ
గనులు రాజీవముల్, ఘనబాహులున్నతాం • సములు, వక్షము విశాల, మధరంబు
బింబమ్ము, పాదముల్ పృథులము, లంగుళుల్ • సూక్ష్మములల్, నాభి యసూక్ష్మబిలము

గీ. మఱియు లక్షణముల వీఁడు మానవేంద్రు • నింటఁ బుట్టినకొడుకగు నింతనిజము
కాలవశమున నిట్టి దుర్గతికిఁ బాలు • వడియె నడిదాఁట లేఁడుగా బమ్మయైన. 714

వ. అని కొండొక విచారించి పునఃపునరాలోకనం బొనర్చుచుఁ గ్రమక్రమమ్మున, 715

చ. వెనుకటి రీతులెల్ల స్మృతివీధిఁ దగుల్కొని చేరవచ్చి నం
దనుఁ డని నిశ్చయించి పరితాపము పట్టఁగలేక పుత్రకా!
యని విలపించుఁ గన్నుఁగవ నశ్రులు కాల్వలు గట్ట "నాతనూ
జునకె తటస్థ మాయె నిటు శోకము నెట్లు భరింతు నక్కటా." 716

వ. అని పలుతెఱఁగుల శోకించు నజ్జనపాలుని భర్తగా శంకించి శైబ్య యిట్లను, మహాత్మా! నీకియ్యెడ నిట్టిదుష్కార్యమ్మున నుండుటెట్లు కలిగె మ మ్మెట్లు మఱచితి వనుచు దుఃఖావేశమ్మున విధి నుద్దేశించి, 717

క. ఓవిధి! యేవిధిఁ జేసితి?, భూవిభునిఁ ద్రిశంకుపుత్రుఁ బూతచరిత్రున్
శ్రీ వెలువరించి సుతభా, ర్యావిక్రయమునకుఁ జొనిపి యంత్యజకులుఁగాన్. 718

వ. అను నాకె నాత్మపత్నిగా నిశ్చయించి యీదుఃఖ మంతయు విధిప్రేరితంబై నాకై వచ్చిన యది యని వగచుచు, 719

క. ఈ తరుణి నాతలోదరి, నాతనయుం డీశవంబు నా పాపము యీ
యాతనకు హేతువని సం, జాతార్తిన్ మూర్ఛఁబొందె జనవరుఁ డంతన్. 720

వ. రాజపత్నియుఁ దనపతిదురవస్థచే ద్విగుణితశోకయై మూర్ఛిల్లె నంత గొంతవడికి దెలిసి నరపాలుండు పుత్రుఁజూచి యిట్లు విలపించు. 721

క. అన్నా! దీనంబై కడుఁ, జెన్నుదఱిఁగి యున్న నీదు చిన్నిమొగము గ
న్గొన్నంత మన్మనము పగు, ల న్నేరకయుండె నిది శిలయొ వజ్రంబో, 722

ఉ. హాసుత! హాకుమార! తనయా! వినయాకర! "తాతతాత" యం
చానమెయిఁగా ననుం బిలుచు నక్కటదృష్టమ! యేమిదోసముం

జేసితినోయి! నన్నుఁగని చెచ్చెర మున్వలె వచ్చి మేనిపై
భాసిలుపంక మంటుగతిఁ బ్రామికొనంగదవోయి నవ్వుచున్. 723

మ. అకటా రాజ్యము బంధుసంతతియు దవ్వైపోయెఁ జాండాలవా
టికి నేతెంచితి వల్లకాటి నిటు లొంటిన్ వాసముం జేసి సే
వకవృత్తిన్ మనుచుంటి నియ్యదియు దైవం బోర్వఁగాలేక పు
త్రక! పాముం గఱపించెనే నిను? నసాధ్యంబెద్ది యద్ధాతకున్. 724

క. ఘోరవిషవహ్నిఁ బంచత, గూరిననినుఁ గనులఁజూడఁగూడెనె నా కం
చారాజర్షి విచారా, ధీరుండై యక్కుఁ జేర్చె తెగనివగ సుతున్. 725

క. మృతసుతుఁ గౌఁగిట విడుకొని, సుత సుత సుత యనుచు నెగడు శోకభరమునన్
స్మృతిచెడి మూర్ఛితుఁడై పడె, సుతశోకముకన్న నొండు శోకం బున్నే. 726

వ. ఇట్లు తేఁకువ సెడి మూర్ఛితుండై పడియున్న నరపాలు నీక్షించి శైబ్య సర్వలక్ష
ణమ్ముల నీతండు విద్వజ్జనమనశ్చంద్రుండగు హరిశ్చంద్రుండకా నిశ్చయింపనగు
నని వెండియు, 727

ఉ. ఉన్నతమై తిలప్రసవమో! యన నొప్పెడి నాసతీరు, సం
పన్నశినాశికిం దగిన వక్త్రము, చారురదాళిసౌరు, పే
రెన్నిక నొప్పు వాక్పటిమ మిన్నిటికిం బయివచ్చు నీతఁ డౌ
నన్నరనాథుఁ డెవ్వని యుదారయశంబు త్రిలోకపూజ్యమౌ. 728

గీ. ఆ హరిశ్చంద్రుఁ డీతండ యైన నీ శ్మ
శానమున నుండు టేలొకో! సత్యసంధుఁ
డనుచు సుతశోక ముడిగి యయ్యతివ సంత
సమును విస్మయదైన్యముల్ సనఁగఁ జూచె. 729

గీ. భర్తృపుత్రశోకమ్ముల భార మెక్కు
డై సహింపఁగరామి నయ్యతివమిన్న
మూర్ఛపడి కొంతవడి లేచి మొనయుసంత
మరల నరనాథుపై దృష్టి మానసముగ. 730

చ. నిలిపి "నృపాల! యెంతకును నిందురఁడ కాఁడె విధాత వానికిం
గలదె జుగుప్సయున్ దయయుఁ గార్యమకార్యమునాఁగ నక్కటా!

యిల సకలంబు ధర్మగతి నేలెడి దేవసమాను నిన్ను వం
తల కెఱచేసి మాలనికి దాసునిఁ జేయునెకీ ర్తిరోయునే. 731

గీ. రాజ్య మెడచేసి పుత్రదారక్రయంబు
నకుఁ జొనిపి యంతఁబోక యంత్యకుఁడుఁగా నొ
నర్చియును నీడఁబోవఁడు నాథ! యేమి
తపొప్పనర్చితి వవ్విధాతయెడ నీవు. 732

మ. అకటా! యియ్యెడఁ గానరావుకద నీదౌ నాతపత్రంబు, ల
చ్చికిఁదావై రతనంపుఁ గూర్పుగల నీ సింహాసనంబున్, యశః
ప్రకటంబై తగు చామరద్వయము, పార్శ్వస్థాయి మంత్ర్యాది సే
వక బృందమ్మును, మంగళధ్వనులు, దీవ్యద్వాజి సంఘంబులున్. 733

శా. ఏ నీ వేగెడివేళ రాజమణులున్ భృత్యత్వముంబూని ముం
దై నేర్పొప్పఁగ నాత్మవస్త్రముల రథ్యాపాంసుసంశుద్ధిసం
ధానంబుం బొనరింతు రిట్టి ధరణీనాథుండవై నీవు నీ
కౌనే దుర్భగమౌ శ్మశానమున నిట్లావాసమున్ జేయఁగన్! 734

వ. వెండియుఁ గపాలసంకులంబును ఘటీపటనిర స్తరమ్మును మృత నిర్మాల్యసూత్రాంతర్లగ్నకేశసుదారుణమ్మును వసానిష్పంద సంశుష్కమహాపటలమండితంబును భస్మాంగారార్ధదగ్ధాస్థిమజ్జాసంఘట్టభీషణంబును గృధ్రగోమాయునాదార్తమ్మును బుష్టక్షుద్రవిహంగమమ్మును జితాధూమాయతపటనీలీకృతదిగంతరంబును గుణపాస్వాదనసంప్రకృష్టనిశాచరంబునునై దూనంబగు నీ శ్మశానంబున దుఃఖితుండవై యెట్లుంటివని శోకపరవశయై యతని నాలింగనంబు చేసికొని, 735

చ. నరవరమౌళిమానితకనత్పదపీఠ! మహీమహేంద్ర! యి
క్కరణి ఘటించుటెల్లఁ గల గాదుగదా? నిజమేని ధర్మత
త్పరునకు నీకు నిట్లయిన ధర్మముతోఁడిక నేరికౌ? ఋతా
దరు లెవ? రెవ్వ రార్జవవిధమ్మున నుండెడివార? లెయ్యెడన్, 736

క. అని యెడగలుగని దుఃఖమ్మున నేడ్చెడిదాని కవ్విభుండు తనకు మా
లని దాస్యము గల్గిన మే, టి నిమిత్తము చెప్పె బల్ కడింది వగ దగన్. 737

## చంద్రమతి పుత్రుండు మృతియైన చందము పతికిఁ దెల్పుట.

చ. ఇటు దనపాటు చెప్పి కడుహెచ్చిన శోకము పేర్మి నార్తిలం
పటుఁడగు ప్రాణనాథునకుఁ బట్టిఁ మృతింగను చందమెల్ల దు
ర్ఘటమగు వంతపెంపునఁ బరంపరగా వచియించె నాపె యం
తట నృపుఁ డాత్మజాతు వదనమ్మున వక్త్రముచొన్పి ఖిన్నుఁడై. 738

వ. తన్మయుండై యేమియు నెఱుంగక శోకించుచుండె నట్టి భర్తంగని శైబ్య యిట్లను. 739

క. స్వామిద్రోహము సేయకు, మో మానవనాథ! సత్యముడిగెదె? నాపైఁ
బ్రేముడి నెడచేసి శిరం, బీమెయి నఱుకుము విధాత కెదముద మొదవన్. 740

చ. అనవిని రాజు మూర్ఛఁగొని యంతనలేచి 'మృగాక్షి! యింతమా
టనఁదగునే? యశక్యకృతి కాదునె చేతులు? నాక కాక యె
వ్వనికిని" నాఁగ నమ్మగువ వల్కుఁ "బునర్భవమందునిన్ను నా
థునిఁగ నొనర్ప దేవికి నతుల్ పచరించితి నెమ్మనమ్మునన్. 741

క. ఇఁకఁ దడయనేల సత్యం, బకలంకము గాఁగఁ బ్రేమ మఱఁజేసి శిరం
బొక వ్రేటునఁ దున్ముము మి, న్నక వెనుదీయంగ నేల నరనాథుఁడవై. 742

వ. నావుడు నరపాలుం డఖండంబగు దుఃఖావేశమ్మున మూర్ఛితుండై యంతన తెలిసి పుత్రు మొగంబు చుంబించుచు భార్య కిట్లను. 743

ఉ. ఓనలినాక్షి! యింక భువినుండఁగ నోప శరీరధారినై
కానఁ గృశానుసంగతినిఁ గ్రాఁగి పరమ్మున కేగుదెంతు నన్
బ్రాణసమంబుగాఁ గను శ్వపాకునియానతి చెంద కిప్పుడిన్
నేనయి చేయుచో నిచట నిందయు నచ్చట హానియుందగున్. 744

క. చచ్చియు నీపాపమ్మున, వచ్చెడిజన్మమ్మునన్ శ్వపాకునిదాస్యం
బచ్చువడఁ గాంచు టొప్పునె, విచ్చలవిడి లేనిబ్రతుకు వృథ యెవ్వరికిన్. 745

గీ. ఏది యెట్లైన, దుఃఖమ్ము నెనయుకంటె, మేనిసంబంధ మెడలుట మేలుకాదె
లేక శైకొక్కరుఁడు పుట్టి లేఁతవయసు. నంద మృతిచెందఁ బాప మేమాచరించె!

క. కులము నెగడించు నీతం, డలఘుం డని నమ్మియుంటి నకటా! జగదే
కలలితుఁ బుత్రకుఁ బాసియు, నిలపై మనఁగంటినొకని భృత్యుఁడ నగుటన్. 747

గీ. లేనిస్వాతంత్ర్యమును బూని లేమ యిపుడు
ప్రాణములు వాసి యేగినఁ బరమునందు
వైతరణియందు నసిపత్రవనమునందుఁ
గలుగు దుఃఖంబు దీనికిఁ దులయుఁ గాదె. 748

చ. లలనరొ యెట్టులైనను జ్వలజ్జ్వలనమ్మున మత్కుమారుతోఁ
గలసి శరీరమున్ విడుతుఁ, గాదనినన్ మరలింప కాజ్ఞ నా
వలన రయమ్మునం గొనుము బ్రాహ్మణునింటికి నేగి దాసివై
యలయక యమ్మహామహానియాజ్ఞ మెలంగుము జాగరూకతన్. 749

క. దానములు చేసి యగ్న్యా, ధానమ్ము లొనర్చి గురులఁ దనిపితి మేనిన్
మానిని! మన మూగురకున్, దానగు సంబంధ మమరధామమునందున్. 750

వ. అట్టి సంబంధమిఁక నీలోకమున దుర్లభం బదియునుంగాక యెన్నండేని రహస్యమ్మునఁ బరిహాసమ్మునకుఁగా నిన్నవమానించి యుండుదునయ్యది క్షమింపు మిఁకఁ బునర్దర్శనాకాంక్షిణివై ధర్మమ్మునకుఁ గట్టువడి యవ్విప్రునింట నుండి రాజపత్నివను గర్వమ్మున వారి నవమానింపక యెద్ది పంచినను సలుపుట నీకుఁ బరసాధనం బని బోధించుపతికిఁ బతివ్రత యిట్లను. 751

క. నరనాథ నాకమైనన్, నరకం బయినన్ హితంబు నాతికిఁ బతితో
మరణంబు, నేను నిప్పుడ, యరుదెంచెద నీపిఱుంద నవహితమతినై. 752

వ. నావుడుఁ బరమ పతివ్రతాశిరోమణివగు నీకు నియ్యది యొప్పదే! యిట్లొనర్తువు గాకయని సహగమనం బంగీకరించి చిత నేర్పఱచి యందు సుతకళేబరం బమర్చి భార్యాసహితుండై, యంజలిఘటించి పరమేశ్వరియు శతాక్షియు జగదీశ్వరియుఁ బంచకోశాంతరగతయుఁ బుచ్ఛబ్రహ్మస్వరూపిణియు రక్తాంబరపరీధానయుఁ గరుణారససాగరయు నానాయుధధరయు జగత్పాలనతత్పరయునగు జగదంబ నాత్మం దలంచుచు నగ్నిసంధానం బొనర్చునయ్యెడ. 753

## బ్రహ్మాది దేవతలు ప్రత్యక్షంబగుట

ఉ. వాసవుఁ డాదిగాఁగల సుపర్వు లఖర్వరయం బెలర్ప న
గ్రేసరుఁగాఁగ ధర్ము నిడి ప్రీతిమెయిం బొడసూపి "మేలుమేల్
నీసరివారు లేరు ధరణీధవ! సత్యసహాయ! నాకసం
వాసుల మేము కిన్నరులు వారలు వీరలు సిద్ధచారణుల్. 754

వ. అనునంతఁ బితామహుం డిట్లను. 755

గీ. ధర్మరూపుఁడ నేను బితామహుండ, వీర లందఱు సురలును జారణులును
గిన్నరులు రుద్రు లశ్వినుల్ నిన్నుఁ జూడ, వచ్చినారు మహారాజ! వైభవమున.

వ. ఇతండు విశ్వత్రయమైత్రీకారణుండగు విశ్వామిత్రుండు నీకుం బ్రియం బొనరింప నరుదెంచి యున్నవాఁడు విలోకింపుము. 757

గీ. నీ తితిక్షాదిగుణముల నెమ్మి గొలుప, వచ్చితిని ధర్ముఁడను నేను సచ్చరిత్రు
లందు నెవ్వరికెక్కుడై యనఘమూర్తి, వైతి పదునాల్గులోకములందు భూప. 758

వ. అంత నింద్రుఁ డిట్లనియె. 759

క. వాసవుఁడ నేను నాపైఁ, గైసేయుము కొంతదృష్టి కాంతయు నీవుఁ
నీసుతుఁడును సుగుణమ్ములఁ, జేసి జగత్త్రయజయమ్ము చేసితిరి నృపా. 760

క. కొమరుఁడు నీవును భార్యయు, విమానసంగతుల రగుచు విచ్చేయుఁడు దే
హముతోడ స్వర్గమున కని, యమృతమయం బైనవృష్టి నాతఁడు గురిసెన్. 761

గీ. దుందుభులు మ్రోయఁ, బూవులు దొలకరింప,
నచ్చరలు మెచ్చుగా నాడ, నా చితాంత
రమున శయనించియున్న భూరమణపుత్రు
పై నమృతవర్ష మప్పుడు పాదుకొనియె. 762

క. సుకుమారంబగు దేహం, బకలంకంబైన వదన మలరఁగ నా రా
జకుమారుఁడు రోహితుఁడు మృ, తికిఁ దక్కి తనంత లేచె దెసలు వెలుంగన్.

చ. నరపతి పుత్రునింగని మనం బలరం దగఁ గౌఁగిలించి సు
స్థిరుఁడయి భార్యఁజూచి సురసేవ్యములైన యలంకృతుల్ వరాం
బరములఁ బుష్పమాలికలఁ బట్టియు భార్యయుఁ దానుఁ దాల్చిమే
దురతర మోదవారినిధిదోఁగుచుఁ బూర్ణమనస్కుఁడై తగెన్. 764

వ. అయ్యెడ నింద్రుం డతని కిట్లను. 765

చ. పరమపతివ్రతామణియు భాసురశీలయునైన భార్యతో
నురుగుణుఁడైన పుత్రకు మహోత్తము నంకమునందుఁ జేర్చి పూ
ర్వరచితమైన పుణ్యము కరంబు తిరంబుగ నిర్వహింప నె
వ్వరికి నగమ్య మైన త్రిదివమ్మున కీ వరుదెమ్ము భూవరా. 766

క. అన సత్యహరిశ్చంద్రుం, డను దేవాధిప! శ్వపాకు ననుమతి గొని పైఁ
జనుదెంతు నాకు నాతం, డు నియోగము సేయఁదగు ఘనుండు విభుండుఁగా. 767

వ. నావుడు ధర్ముం డిట్లనియె. 768

గీ. ఓయి నరనాథ! నాదగు మాయకలిమి, నేన చాండాలరూపమ్ము నూనినాఁడ
భావిసంగతి నెఱిఁగి నిన్ బఱిగొనంగఁ, బక్కణమ్మున నుంటి నప్పాట నపుడు.

వ. పిమ్మట నింద్రుం డిట్లను. 770

క. రాజాధిరాజ! దినకర, తేజ! హరిశ్చంద్ర! పుణ్యతేజస్వులు వి
భ్రాజిత తపముల దేనికి, భాజను లా నాకపదము వడయఁగ రమ్మా. 771

చ. అన నరనాథుఁ డిట్లను సురాధిప! మత్పురవాసులెల్ల న
న్నను విడనాడి కుందరె? తనుం గని కొల్చెడివారి వీడువాఁ
డును ద్విజుఁజంపినట్టి యతఁడున్ మధుపాయియు స్త్రీని హంతగో
హననపరాయణుండునను లౌట వచించెడిఁగాదె ధర్మముల్. 772

క. వారలతో స్వర్గము కా, దారయ నరకంబయేని యది గమ్యము నా
కోరాజ! తన్నుఁగొల్చెడి, వారల నేమని త్యజింప వలనగు ననుడుఁగా. 773

క. జనవర! పురవాసుల కె, ల్లను స్వర్గమొసంగు టెట్లలవడెడి? వారల్
పొనరిచిన పాపపుణ్యము, లన వేఱుగనుండుఁ దుల్యమగునే యెందుఁగా. 774

వ. నావుడు రా జిట్లను. 775

గీ. వినుము సురనాథ! సేవకజనులకతన
రాజు రాజ్యం బొనర్చు ధర్మములు సేయు
జన్నముల కియ్యకొనునిందు సంభవించు
సుకృతము సమంబు నృపతికిఁ బ్రకృతితతికి. 776

వ. కావున మదనుష్ఠితంబులగు పుణ్యంబులు వారలకును ననువగు నిది యిట్లుండ నిం కొక్కటి వచింతు నాదగు సుకృతమ్మున బహుకాలోప భోగ్యంబగు నాకపదంబ వారలం గలసి యొకదిన మనుభవించినం జాలు నట్లగుట మత్సుకృతంబు విభజించి యిట్లొనరించుటకు నినుఁ బ్రార్థించెద నావుడు నింద్రుం డట్ల యగునని సమ్మతించి ప్రసన్నహృదయుండై ధర్మవిశ్వామిత్రాదిపురస్సరమ్ముగ నయోధ్యకరిగి హరిశ్చంద్రు సమక్షమ్మున వారలకిట్లను. 777

క. శర్మదమై యజ్ఞాదిసు, కర్మము లొనరించువారు గాంచెడి స్వర్గ
మ్మర్మిలి మీకెల్లరకును, ధర్మానుగ్రహముకలిమిఁ దనరారెఁ దగన్. 778

వ. కావున నెల్లవారును నరుదెంచునది యనునెడ హరిశ్చంద్రుండు వారల కిట్లను. 779

క. దివమునకు వచ్చుటకు మీ, కెవరెవరికి నిచ్చ వొడము నెల్లరు నాతో
నవిరళగతి రాఁదగు నీ, దివిజాధిపుఁ డట్లు తనమదిం గరుణించెఱా. 780

## హరిశ్చంద్రుండు కొడుకునకు రాజ్యంబిడి పౌరులతో స్వర్గమ్మున కరుగుట.

చ. అను తమ భూపునానతి సురాధిపునానతి యొండుగాఁగ బో
రనఁ జనుదెంచిరప్డు నగరమ్మున వారలు కొంద ఱా దివం
బునకు విమానమెక్కి తమపుత్రులపైఁ దగ నాత్మసంస్మృతిం
జొనిపి మనమ్ము స్వర్గమును జూచెడి వేడ్కల మిన్నుముట్టగఁన్. 781

వ. హరిశ్చంద్రుఁడు తక్కంగల బంధుమిత్రులను దగు గౌరవమ్ములఁ దనిపి తన
కొమరుండగు రోహితునకు సాధుజనసమ్మతమ్మున విధివిధానమ్మగఁ బట్టాభిషేకం
బొనర్చి. 782

క. తనకాంతామణియును దా, నును స్వర్గమ్మునకుఁ జనిరి నూతనఘంటా
నినదమ్మనఁ బొలుపొందెడి, యనూనపుష్పకము నెక్కి యమరులు వొగడన్. 783

వ. అట్లు సత్యనిధియైన హరిశ్చంద్రుండు స్వర్గమ్మున కేగుదెంచునెడ నాలోకించి దివి
జకవీంద్రుం డిట్టియర్థముగల శ్లోకంబు పఠియించె. 784

క. ఎంతటిదానం బెంతటి, శాంతిగుణం బెంతసత్యసంధత తగుఁ దా
నెంతకునైనను నీ భూ, కాంతుఁడు స్వర్గమొక హెచ్చుగా దితనియెడన్. 785

మ. జనలోకైక విశుద్ధచర్యుఁడు హరిశ్చంద్రావనీనాథు వ
ర్తనముం జెప్పితి దీని భక్తిగరిమ ఱా దానెవ్వఁడే విన్న ని
మ్మున వాఁడెయ్యదిగోరు నయ్యది సుఖమ్మో రాజ్యమో విద్యయో
ధనమో సంతతియో సురాలయమొ సందర్భించుఁ బారిక్షితా. 786

క. నావుడు జనమేజయుఁ డో, దేవా! దేవతలకన్నఁ దేజమ్మునఁ బె
ద్దై వెలయు శతాక్షీపద, భావు హరిశ్చంద్రు వింటి భావంబలరన్. 787

ఆ.వె. ఈ శతాక్షి యనఁగ నెట్లుదయించె ? నే, తన్మహత్త్వమెట్లు తనరు నాకుఁ
దెలుపు, మెద్ది వినిన యలఘుల కళ్వమే, ధళతఫలము ప్రతిపదమునఁ దొడరు.

గీ. ఎంత వీఱిఁడియైనను నెంత పాపి, యైనఁ దానెంత నిర్భాగ్యుఁడైనఁ బావ
నమ్ము శ్రోత్రపుహారి యిహమ్ముఁ బరము, నిచ్చు దేవీచరిత్రపై నిచ్చఁగొనఁడె.

క. అనవుడు వ్యాసుం డిట్లను, జనమేజయ ! నీకు దాఁపఁజన దెద్దియు స
జ్జనుఁడ వగుకతనఁ దెల్పెద, వినుము శతాక్షీమహత్త్వవిధ మదియెల్లన్. 790

క. దుర్గముఁడను పేర్వాఁడు ని, ర్గళబాహాప్రతాపుఁ డతిలోకుఁడు దు
ర్మార్గుండు హిరణ్యాక్షుని, వర్గీయుఁడు రురునికొడుకు వఱలున్ జగతిన్. 791

వ. అతండు దేవతలకు బలంబగు వేదమ్ములు హరించిన వారును నశింతురని తలంచి హిమాలయమ్మునకుఁ జని వాయుభక్షుండగుచు సహస్రవత్సరమ్ములు విరించి గుఱించి తపమ్ము సేయు చున్నంత, 792

## శా తా క్షీ మ హి మ.

గీ. క్షోణి యంతయుఁ గంపించెఁ గులమహీధ, రమ్ములు చలించె నతని తేజమ్ము కతన
నంతఁ జతురాననుఁడు ప్రసన్నాననాబ్జుఁ, డగుచు హంసము నెక్కి ప్రత్యక్షుఁడయ్యె.

వ. ఇట్లెదుటం బొడకట్టి సమాధిగతుండగు నా దుర్గముంగాంచి నీ తపమ్మునకు మెచ్చి భవదభీప్సితంబు నొసంగవచ్చితి నను నలువకు మ్రొక్కి, దేవా ! జగతీసురుల యందును సురలయందునుగల వేదమ్ములును మంత్రమ్ములును నా సమీపమ్మున నుంటయు సురలకుఁ బరాజయంబు సేయఁగలుగుటయు నా కనుగ్రహింపవేయనిన వల్లెయని యవ్విరించి తననివాసమ్మునకుఁ జనియె నంత, 794

సీ. వేదశాస్త్రమ్ములు విప్రులు మఱచిరి • స్నానసంధ్యాహోమ జపతపమ్ము
లన్నియు నడఁగె, హాహాకార మవనియం • తయు నిండె, సురలును నాకమందు
యజ్ఞాదికమ్ముల హవ్యమ్ము దొరకమి • సౌఖ్యమ్ము విడనాడి నజరులైరి,
దుర్గముండును రణోద్యుక్తుఁడై పెల్చన • నమరావతీపురి నాక్రమించె,

గీ. వజ్రమయదేహుఁడైన యవ్వానితోడ • బోరఁగాలేక యమరులు భూమిధరగు
హాంతరంబులయెడకుఁ బలాయమాను • లైరి శరణమ్ము గానక ప్రాణభీతి. 795

వ. ఇట్లు దేవతలు గిరిగుహాంతరవిలయులగుచు జగదంబం గొనియాడుచున్నంత. 796

గీ. జన్నములు మాసి ధర్మంబు సున్నయైన, కతన నూఱేఁడు లేకప్రకారముగ జ
గతి ననావృష్టిదోషంబు గలిగె ; దాన, నేఱ్ఱుఁ జెఱువులు నూతులు నెండిపోయె.

వ. దానంజేసి పశుపక్షిమృగాదులయందును మనుజులయందును శవసంగ్రహంబు విస్త
రించె, నిట్లు జగదుపద్రవంబు సంభవించినఁ బదంపడి శాంతచేతస్కులగు కొందఱు
విప్రులు హిమాలయంబు పజ్జకుంజని జగదీశానింగూర్చి సమాధిధ్యానపూజాయోగ
మ్ముల నిరాహారులగుచుఁ దదేకాయత్తచిత్తమ్మున నారాధించుచు నిట్లు వినుతించిరి.

గీ. ఓమహేశాని ! యపరాధయుక్తులైన, పామరులయెడ దయలేమి పాడియగునె !
కోప ముపసంహరింపుము, పాపు మీ య, నర్థమింకెవరు శరణమమ్మ ! మాకు.

వ. అనంతకోటిబ్రహ్మాండనాయికయుఁ గూటస్థరూపిణియుఁ జిద్రూపయు భువనేశ్వ
రియునగు నీకు నమస్కారము, "నేతినే" తీతివాక్యమ్ములచే బోధ్యమానవగుచు
సర్వకారణంబవగు నీ కంజలిఘటింతు, మైతత్కాలికంబగు దురవస్థంబాపి మమ్ముం
గటాక్షింపవే ! యనువారి యెలుఁగు లాకర్ణించి యప్పరాంబయు నొక్కెడఁ బ్రత్య
క్షంబయ్యె. 800

సీ. నీలాంజనముఁ బోలఁజాలు దేహమ్మును • బీనసమోత్తుంగవృత్తకర్క
శపయోధరములును శతనయనంబులు • భాస్కరకోటిప్రభాసమృద్ధి
జగదతీతమ్మగు సౌందర్యమును లవ • ణిమయును గలదాని విమలమధుర
రసయుతక్షుత్తృడ్జరాఘ్నశాల్యోదన • శాకఫలయుతహస్తములదానిఁ

గీ. జాప మాయుధములును హస్తములఁ దాల్చి • వెల్గుదానిని నప్పరాంబికను జూచి
స్తవ మొనర్చిన నాపెనేత్రముల నుండి • వారిధారలు గురిసె నవారితముగ. 801

వ. ఇట్లు నవరాత్రమ్ము లొక్కభంగి సకలౌషధీజాలసంతర్పకంబగు నేత్రజలాసారంబు
వెల్లివిరిసిన దానంజేసి నదనదీనిర్ఝరమ్ము లనూనమ్ములయ్యె; సురలు గిరిగుహాంత
రమ్ములనుండి వెలువడి భూసురులంగలసి యంబిక నిట్లు సన్నుతించిరి. 802

సీ. నిత్యసంతృప్తవు నిరుపమనిఖిలాగ • మాంతవేద్యవు భువనాధిపతివి
బ్రహ్మస్వరూపవు భక్తకల్పాగమ • మవు దేవి ! నీవ యీ భువనమెల్ల
మాయచే సృష్టింతువే యవతారమై • నను నెత్తుదువు భక్తజనులకొఱకు
నమితలోచనముల నలరారు నీరూప • మంబ ! నిర్జరనిమిత్తంబ కాదె

గీ. యెత్తితి శతాక్షి యనుపేర నెసఁగుమింకఁ • దివిరి మా యాగమమ్ములు తెచ్చి యిచ్చి
కరుణఁ జూడుము మమ్ము నాఁకటికిఁ దాళ • లేమి నిన్ను నుతింపఁగ లేము తల్లి.

వ. అంత నప్పురాంబ తాను దెచ్చిన భోజ్యమ్ములా సురలకిచ్చి యక్కతమ్మున శాకం
భరి యనుపేర నెగడి యిట్లు వారల యుమ్మలికమ్ము వాపెఁ; బదంపడి దుర్గముం
డును దూతముఖమ్మున నిది యెల్ల నెఱింగి సహస్రాక్షౌహిణీపరిమితసేనాసము
పేతుండగుచు హిమాలయమ్మున కరిగి యద్దేవినికటమ్మున నున్న దేవతల నరికట్టి
విప్రులఁ బీడించిన, 804

క. ప్రోవుము ప్రోవు మనుచు భూ, దేవత లాకపెట్ట నజవ దేవియుఁ గరుణా
భావమ్మున నొక చక్రము, గా వర్తిలఁజేసె మీఁదుగాఁ జక్రమ్మున్. 805

## శతాక్షి దుర్గముం బరిమార్చుట.

వ. ఇట్లు బహిస్థిత యగుచు నొక్క శరంబేనియు నవ్వారిపైఁ బడకుండ సంరక్షించు
నద్దేవికిని దుర్గమునకును శరపరిచ్ఛన్నసూర్యమండలమ్మును బాణసంఘర్షణసము
ద్భూతపావకమ్మును గఠోరజ్యారవత్కారబధిరీకృతదశదిశాతటమ్మును నగు ఘోర
సంగరమ్ము కరమ్ము ప్రవర్తిల్లుటయుఁ దచ్ఛతాక్షీదేహమ్మునుండి కాళికయు దారి
ణియు బాలయుఁ ద్రిపురయు భైరవియు రమయు బగళయు మాతంగియుఁ ద్రిపుర
సుందరియుఁ గామాక్షియు జంభినియు మోహినియు మున్నగు ద్వాత్రింశచ్ఛక్తులును
ననుపదంబ చతుష్షష్టిశక్తులును బొదమి యసంఖ్యాతప్రకారంబున నడరి సాయుధ
హస్తలై మృదంగవీణాశంఖనాదనాదితంబగు రణాంగణమ్మున విజృంభించి శతా
క్షౌహిణీపరిమితంబగు రక్షస్సైన్యమ్ము రూపుమాపుటయు దుర్గముం డగ్రేసరుండై
శక్తులతోఁ బదినాళ్ళు పోరొనర్చి పమునొకండవనాఁడు, 806

సీ. అరుణచందనమును నరుణసరమ్ములు • దాలిచి గొప్ప యుత్సవముచేసి
పెంపారఁ ద్రిజగతీవీరునిగతి విక్ర • మించి శక్తుల నుక్కడంచి సోఁకు
మూఁకలతోడ వీరైకనియత మగు • తే రప్పరమశక్తి తేరి యెదుట
నిల్పిన వారి కనల్పంపుఁ బోరయ్యె •. యామద్వయంబు భయప్రదముగ

గీ. రక్కసునిపైఁ బదేనునారసము లేసి
రెంట లోచనములను నాల్గింట గుఱ్ఱ
ములను నొక శరమున ధ్వజమ్మును భుజముల
రెంట సారథిఁ గొట్టె నొక్కంట దేవి. 807

వ. తక్కంగల యేనిట నవ్వానివక్షమ్ము చీల్చిన వాఁడును నెత్తురుగ్రక్కుచు నజ్జగ

దంబ పురోభాగమ్మునం బడియె, నంత వాని కాయమ్మునుండి యొకతేజమ్ము వెడలి యాపెయందు సంక్రమించె. 808

మ. ఇటు లక్కంటకుఁ ద్రెళ్ళనేసిన జగమ్మెల్లన్ బ్రశాంతత్వసం
ఘటితంబయ్యె సమస్తదేవతలు నోంకారాత్మ! యోదేవి! య
క్కటికం బీదృశ మేరికిం గలదె! దుఃఖగ్రస్తులన్ మేల్మిఁ బ్రో
చుటకంచు న్నుతియించుచున్ గరములన్ జోడించి రొక్కుమ్మడిన్. 809

వ. ఇట్లు నుతించు హరిహరాదుల కాజగదంబ సంతోషకారిణియై కెలన నంజలిఘటించి యున్న విప్రుల కిట్లనియె. 810

క. ఈ నామే నధికమ్ముగ, మానింపం దగిన దేను మాటికిఁ బూజా
గానాదికములఁ గొలిచిన, మానినులకు నిహముఁ బరము మానకయిత్తున్. 811

గీ. దుర్గముండను రక్కసుతోడఁ బోరఁ, బెక్కుకన్నులతో నుద్భవించి వాని
హతముచేసినకతన శతాక్షి యంచు, దుర్గయంచును నన్నుఁగొల్వ దొనఁగు లడఁగు.

క. అని యుపదేశం బొనరిచి, కనుమొఱఁగెన్ దేవి; యిట్టికత విన్నను వ్రా
సినఁ జదివినఁ జదివించిన, జనులకు నా దుర్గయే యొసంగును శుభముల్. 813

వ. ఇది పరమరహస్యమ్ముగా గోపనీయంబని నుడువు వ్యాసుంగాంచి జనమేజయుండు పరశక్తిభక్తులగు చంద్రవంశ్యుల చరిత్రమ్ము వినవలతు నావుడు నాతం డిట్లనియె,

క. అంబిక దయచేత మహ, త్త్వంబుం గొనినట్టి చంద్రవంశ్యుల చారి
త్రంబును వచియించెదఁ ద, త్త్వంబున్ దగ విశ్వయించి ధరణీనాథా. 815

క. ఎంతయు నూర్జితమును శ్రీ, మంతమ్మును గడు విభూతిమంతమునగు నీ
యంతయు దేవీమయ మా, వంతయుఁ దదితర మొకింతయగుపడ దరయన్. 816

వ. సంసారవృక్షమ్మున కప్పరాంబికాపాదసేవనంబు దక్క మఱియొండు కుఠారంబు గానము; ధాన్యార్థియగువాఁడు ముకం ద్యజియించువగిది నీసర్వంబును బోవిడిచి భువనేశ్వరీ పాదమూలంబు సేవించునది యని మఱియును. 817

సీ. ప్రాఁబల్కులను నహూపారమ్ము మథియించి • యప్పరశక్తిపాదారవింద
మను రత్న మరసి నే నతిధన్యుఁడ నయితిఁ; • బంచబ్రహ్మాసనయందు వినుతిఁ
గన్న యప్పరశక్తి కన్న నన్యము గాన, • మైదింటి కన్నను నధికమైన
వస్తు వవ్యక్త, మావస్తువునం దోత • ము ప్రోతమును జగ మనుచుఁ దెలియ

వ. అంత నప్పరాంబ తాను దెచ్చిన భోజ్యమ్ములా సురల కిచ్చి యక్కాతమ్మున శాకం భరి యనుపేర నెగడి యిట్లు వారల యుమ్మలికమ్ము వాపెఁ; బదంపడి దుర్గముం డును దూతముఖమ్మున నిది యెల్ల నెఱింగి సహస్రాక్షౌహిణీపరిమిత సేనాసము పేతుండగుచు హిమాలయమ్మున కరిగి యద్దేవినికటమ్మున నున్న దేవతల నరికట్టి విప్రులఁ బీడించిన, 804

క. ప్రోవుము ప్రోవు మనుచు భూ, దేవత లోక పెట్ట నఖిల దేవియుఁ గరుణా భావమ్మున నొక చక్రము, గా వర్తిలఁజేసె మీఁదుగాఁ జక్రమ్మున్. 805

## శతాక్షి దుర్గముం బరిమార్చుట.

వ. ఇట్లు బహిస్థిత యగుచు నొక్క శరంబేనియు నవ్వారిపైఁ బడకుండ సంరక్షించు నద్దేవికిని దుర్గమునకును శరపరిచ్ఛన్నసూర్యమండలమ్మును బాణసంఘర్షణసము ద్భూతపావకమ్మును గఠోరజ్యారణత్కారబధిరీకృతదశదిశాతటమ్మును నగు ఘోర సంగరమ్ము కరమ్ము ప్రవర్తిల్లుటయుఁ దచ్ఛతాక్షీదేహమ్మునుండి కాళికయు దారి ణియు బాలయుఁ ద్రిపురయు భైరవియు రమయు బగళయు మాతంగియుఁ ద్రిపుర సుందరియుఁ గామాక్షియు జంభినియు మోహినియు మున్నగు ద్వాత్రింశచ్ఛక్తులను నను పదంబ చతుష్షష్టిశక్తులను బొడమి యసంఖ్యాతప్రకారంబున నదరి సాయుధ హస్తలై మృదంగవీణాశంఖనాదనాదితంబగు రణాంగణమ్మున విజృంభించి శతా క్షౌహిణీపరిమితంబగు రక్షస్సైన్యమ్ము రూపుమాపుటయు దుర్గముం డగ్రేసరుండై శక్తులతోఁ బదినాళ్ళు పోరొనర్చి పదునొకండవనాఁడు, 806

సీ. అరుణచందనమును నరుణసరమ్ములు • దాలిచి గొప్ప యుత్సవముచేసి
పెంపారఁ ద్రిజగతీవీరునిగతి విక్ర • మించి శక్తుల నుక్కడంచి సోఁకు
మూఁకలతోడ వీరైకనియత మగు • తే రప్పరమశక్తి తేరి యెదుట
నిల్పిన వారి కనల్పంపుఁ బోరయ్యె •. యామద్వయంబు భయప్రదముగ

గీ. రక్కసునిపైఁ బదేనునారసము లేసి
రెంట లోచనములను నాల్గింట గుఱ్ఱ
ములను నొక శరమున ధ్వజమ్మును భుజముల
రెంట సారథిఁ గొట్టె నొక్కంట దేవి. 807

వ. తక్కుంగల యేనిట నవ్వానివక్షమ్ము చీల్చిన వాఁడును నెత్తురుగ్రక్కుచు నజ్జగ

దంబ పురోభాగమ్మునం బడియె, నంత వాని కాయమ్మునుండి యొకతేజమ్ము వెడలి యాపెయందు సంక్రమించె. 808

మ. ఇటు లక్కంటకుఁ ద్రెళ్ళనేసిన జగమ్మెల్లన్ బ్రశాంతత్వసం
ఘటితంబయ్యె సమస్తదేవతలు నోంకారాత్మ ! యోదేవి ! య
క్కటికం బీదృశ మేరికిం గలదె ! దుఃఖగ్రస్తులన్ మేల్మిఁ బ్రో
చుటకంచు న్నుతియించుచున్ గరములన్ జోడించి రొక్కుమ్మడిన్. 809

వ. ఇట్లు నుతించు హరిహరాదుల కాజగదంబ సంతోషకారిణియై కెలన నంజలిఘటించి యున్న విప్రుల కిట్లనియె. 810

క. ఈ నామే నధికమ్ముగ, మానింపం దగిన దేను మాటికిఁ బూజా
గానాదికములఁ గొలిచిన, మానినులకు నిహముఁ బరము మానక యిత్తున్. 811

గీ. దుర్గముండను రక్కసుతోడఁ బోరఁ, బెక్కుకన్నులతో నుద్భవించి వాని
హతముచేసినకతన శతాక్షి యంచు, దుర్గయంచును నన్నుఁగొల్వ దొసఁగు లడఁగు.

క. అని యుపదేశం బొనరిచి, కనుమొఱఁగెన్ దేవి; యిట్టికత విన్నను వ్రా
సినఁ జదివినఁ జదివించిన, జనులకు నా దుర్గయే యొసంగును శుభముల్. 813

వ. ఇది పరమరహస్యమ్ముగా గోపనీయంబని నుడువు వ్యాసుంగాంచి జనమేజయుండు పరశక్తిభక్తులగు చంద్రవంశ్యుల చరిత్రమ్ము వినవలతు నావుడు నాతం డిట్లనియె,

క. అంబిక దయచేత మహ, త్త్వంబుం గొనినట్టి చంద్రవంశ్యుల చారి
త్రంబును వచియించెదఁ ద, త్త్వంబున్ దగ విశ్వయించి ధరణీనాథా. 815

క. ఎంతయు నూర్జితమును శ్రీ, మంతమ్మును గడు విభూతిమంతమునగు నీ
యంతయు దేవీమయ మా, వంతయుఁ దదితర మొకింతయగుపడ దరయన్. 816

వ. సంసారవృక్షమ్మున కప్పరాంబికాపాదసేవనంబు దక్క మఱియొండు కుఠారంబు గానము; ధాన్యార్థియగువాఁడు ముకం ద్యజియించుపగిది నీసర్వంబును బోవిడిచి భువనేశ్వరీ పాదమూలంబు సేవించునది యని మఱియును. 817

సీ. ప్రాఁబల్కులను నకూపారమ్ము మథియించి • యప్పరశక్తిపాదారవింద
మను రత్న మరసి నే నతిధన్యుఁడ నయితిఁ; • బంచబ్రహ్మాసనయంచు వినుతిఁ
గన్న యప్పరశక్తి కన్న సన్యము గాన, • మైదింటి కన్నను నధికమైన
వస్తువవ్యక్త, మావస్తువునం దోత • ము ను ప్రోతమును జగ మనుచుఁ దెలియు

ఉ. సౌరతరంగిణీకలహశాపభరంబున స్వాంశచేత నా
భారతి యట్టు లీభరతవర్షమునందుఁ దరంగిణీశుభా
కారముఁ బూని లోకుల యఘంబులు పాఱఁగఁ దోలు వృత్త మెం
తే రమణీయమయ్యెనుగదే వినిపింపఁగదే దయామతిన్. 180

క. శ్రుతిసారశ్రవణంబునఁ, గుతుకం బెపఁ బొదలెఁ దృప్తి కుదురదు సుకథా
మృతమందుఁ దలఁప శ్రేయ, స్స్థితి నెవ్వాండేని తృప్తిఁ జెందునె ధరణిన్. 181

ఉ. ఆరయఁ బూజనీయ యగుసట్టి విధాతృనిఁ రాణి తెట్టు భా
గిరధి శాపమీయఁగడఁగెఁగా శుభపుణ్యవిధాత్రి సాత్వికా
కార తలంపఁ దత్కలహకారణమున్ విన వేడ్కయయ్యెడున్
చారుపురాణదుర్లభము సత్కథగాన నెఱుంగఁబల్కుమీ. 182

వ. అనవుడు నారాయణుం డిట్లనియె. 183

ఉ. ఏకథ విన్నమాత్ర నశియించును దోసములెల్లఁ బున్నెమున్
చేకుఱు నట్టి యీ కథను జెప్పెద సన్మతి నాలకింపు: ర
త్నాకరశాయికి న్మువురు దారలు భార్గవి, పల్కునాతి, మం
దాకిని నాఁగ నాహరియుఁ దన్వుల ముప్వుర నొక్కపేర్మిచేన్. 184

క. అన్నెలఁతలు మువ్వురు హరి, సన్నిధి సేవింతు రెల్లసమయములందున్
వెన్నుని సదనం బొకతఱి, మున్నెఱ గనెన్ సరాగ స్మితవదనయునై. 185

ఉ. ఆసమయంబునందు జలజాక్షుఁడు గంగమొగంబుగాంచి సం
తోసముతోడ నవ్వె: నది తోయజగేహిని మేకొనెన్; మదిన్
రోసముఁబూనె భారతి కనుంగొని; భార్గవి బోధచేసినన్
వీసమునేని సైఁప దెదఁ జేరిచె నీసును సారెసారెకున్. 186

చ. అరుణవిలోచనాంతయు మహారుణభాసనయు స్మహద్రుషా
స్ఫురదరుణాధరాధరయు మూనశిలీముఖపాతయాతనా
భరపరికంపితాంగియయి వల్లభుఁ గన్గొని పుల్కపుల్కనన్
గరుణము నెమ్మదిం గదురఁగాఁ బలికెం బయి కీసుఁ జూపుచున్. 187

క. ధర్మిష్ఠవరిష్ఠుండవుం, బేర్మి సమానంబు గలుగుఁ బ్రేయసులందున్
దుర్మతి కిది విపరీతపు, ధర్మంబని యెఱుఁగవలయుఁ ధర్మజ్ఞ విధీ. 188

గీ. గంగపై నీకుఁగల కూర్మిఁ గాంచికూడ, లచ్చి సైరించు టరయ నాలవగూడ
నట్టి నీకూరిమికి పాత్రమగుట ధ్రువము, నేనె మూగురిలోఁ గడు హీన నైతి. 189

చ. పతి తనకాంతలందు సమభావమునం జరియించెనే జగ
ద్ధితుఁడగు నట్లుగాక నయమేది చరించిన యంత లోకగ
ర్హితుఁడగు సత్వరూపుఁడని యెల్లరు నిన్నునుతించు టెంతయుం
జతురత లేమి నీమనసుజాడ నెఱుంగమిఁగాదె యచ్యుతా! 190

క. నిమిషంబైనను దుర్భగ, త మనంగా నాకు నాస దవులదు; నేఁ బ్రా
ణములను విడచెద. పతి నె, య్యములేని లతాంగి బ్రతుకనగునే జగతిన్. 191

క. అని యిట్లు దీర్ఘకోపం, బునఁ బల్కుచు నున్న పల్కుబోటిం గని నె
మ్మనమున యోచించి వెసం, జనియెన్ సభనుండి వెలికి శౌరి కడంకన్. 192

క. నారాయణుండు చనఁగా, నార క్తవిలోచనాంతయై నిర్భయతన్
భారతి గంగను జెవులకు, పారుష్యము దోఁప నిట్లు వలికెన్ బెలుచన్. 193

క. ఓసి గయాళీ! కడువి, శ్వాసము నాయంద కూర్చు వల్లభుఁ డనుచున్
నీసౌభాగ్యము దెలియం, జేసెదు విభుతావలేపచేష్టల గంగా. 194

క. నానను బూనక వాగెద, వీ నలినోదరునిచెంత విప్పుడ నీదౌ
మానంబుఁ గూలఁజేసెద, మానాథుఁడుగాఁడె! శౌరి మగఁడే నీకున్. 195

గీ. ఇమ్మెయి వీసున గంగా, ధమ్మిల్లము వట్టి తివియఁదలఁచెడు పల్కుం
గొమ్మకు నడ్డముచని రమ, సమ్మతిఁ గావించె నయము సల్పుచు నంతన్. 196

ఉ. కోపము కెంపు కన్నుగవకుం బొడమంగ విరించి బోటి వే
శాప మొసంగె నిట్లు జలజాతనికేతన కుర్విభూనదీ
రూపము లాక్రమించు మిఁక రూపఱు గర్వమటంచు నంతఁ దా
నేపలుకున్వచింప దొకయింతయుఁ దద్విపరీత మెంచుచున్. 197

క. కోపముఁబూనదు క్రమ్మఱ, శాపమ్మునొసంగఁబోదు జలజజ వాణిం
జేపట్టి భూజముంబలె, ద్వీపినిబలె పెల్లుగ దురపిల్లుచు నుండెన్. 198

క. కోపప్రస్ఫురితాధర, యై పలుకక మిన్నకున్న నంబుజనిలయన్
రూపించి పలికె నమర, ద్వీపిని శశ్వద్రుషాప్రదీపితయగుచున్. 199

క. ఈలలన యేమిచేయఁగఁ, జాలును నను విడుము దీని చల మడఁచెద దు
శ్శీలయు సంతతమును వా, చాలయునగు రమణి చెడుఁ బ్రశంసలకెడమై. 200

క. ఆదరము పెద్ద పలుకుం, బైదలికిం గలహమందుఁ, బరికింపఁగ నా
తోఁ దడయనేల యిపుడే, వాదం బొనరించుగాఁత బలముకొలందిన్. 201

క. ఈ దుర్మఖి తనశక్తియు, నాదార్ఢ్యము మీ కిపుడ గనంజేయంగా
లోఁదలఁచి యున్న దింకను, మాదృథతానంతవిక్రమంబులు గనుఁడీ. 202

చ. అని వచియించి గంగ జలజాలయఁ గన్గొని "నీకు శాప మి
చ్చిన పలుకుంబడంతుకకుఁ జెచ్చెఱ శైవలినీస్వరూప మి
ష్టొనరునుగాత। కల్మషజనౌఘనికేతనభూతలంబునం
దనిశనివాసియౌ" నని దురంతముగా శపియించె భారతిన్ 203

క. ఆశాపము విని రోషా, వేశంబునఁ బల్కె నెలఁది విబుధతటినికిన్
దా శాపమిచ్చె "ధరణి ని, వేశ మనుప్రాప్తి సంభవించు" నటంచున్. 204

క. అచ్చపువుఁబొలఁతి శాపం, బిచ్చిన యవ్వేళ భార్గవీశ్వరుఁడటకున్
విచ్చేసెఁ జతుర్భుజులును, సచ్చరితులు పార్షదులును సన్మతిఁ గొలువన్. 205

క. అరుదెంచి సరస్వతిఁ దన, కరములతో నెత్తి చక్రకరుఁడు రహిం బే
రురమున ధరియించి పురా, చరితము బోధించెఁ బ్రీతిసతుల మువురకున్. 206

క. కాంత లిటు శాపకలమై, కాంతముఁగావించి యెదలఁ గడు దురపిలఁగా
సంతతసామయమగు వృ, త్తాంతం బిటు లానతిచ్చె దనుజారి వెసన్. 207

ఉ. సారసగేహ। వాసియొ విచారము మాన ౯ నయోనిజాతవై
ధారుణిలో వృషధ్వజసుతామణి వౌదువు పొమ్ము తన్నృపా
గారముఁ గూర్చిః దాతకృప గౌరవమొప్పఁగ శంఖచూడబృం
దారకవైరిముఖ్యునకు దారవుకాఁగల వీవు భార్గవీ. 208

క. అపల దైవవశంబున, నే వృక్షత్వంబు సంభవించును విదపన్
దేవేరివి నాకౌదు వు, మీ వచియించితిని సంశయింపకు మింకన్. 209

క. త్రైలోక్యపాపనికర, జాలోలంబైన తులసియన రాజిలుమీ
జాలముపేయరు మిఁకఁ బొ, మ్మా లలనః పవిత్స్వరూప మందుము కళచేన్. 210

క. భారతి శాపవశంబున, భారతవర్షంబునందుఁ బద్మాపతినాఁ
బేరు ధరింపుము వేగ న, దీరూపముఁ దాల్చి మీ మదిం గనలకుమీ. 211

వ. అని కుఱంగట మెలంగుచున్న గంగం గని నీవును భారతీశాపంబున దారుణజన
పాపాపనోదనమునకై భగీరథతపోనీతవై ధాత్రికిం జని భాగీరథీనామం బపధరించి

నాయానతిని మదంశసంజాతుండైన సముద్రునకును గుణసముద్రుండైన శంతనునకును భార్యవై యుండు మని యానతిచ్చి భారతిఁ గని యిట్లనియె. 212

క. ఏకాంశతోడ సారెకుఁ, బోరానరించిన ఫలంబుఁ బొందుము చనుమీ
భారతమునకుం బ్రహ్మ, గారంబున నలువచెలివి కాఁగలవు సుమీ. 213

క. గంగాసతిచేఁ గలిగెను, భంగం బా గంగ శూలిపదముం గను నా
చెంగట నుండును భార్గవి, సంగతితోఁ గ్రోధరహిత శాంతయు నగుటన్. 214

క. ఈచాన సుశీలయు ధ, ర్మాచారయు సత్వరూపయు నాయెడ స
ద్రీచీనభక్తి సలుపుట, నాచెంగట నుండుఁ గాత నయమున సతమున్. 215

క. ఈతన్వి యశమున నీ, క్ష్మాతలమునఁ బుట్టి సతులు సాధ్వులు ధర్మో
పేతాచారలు శాంతి, ఖ్యాతలునై పూజనీయలై యుందురిలన్. 216

క. ముప్వురునెలఁతలు, భృత్యులు, ముప్వురు బాంధవులు మువురుఁ, బొల్పు నతనికిన్
మవ్వపుయశము దొలఁగును, రవ్వయు వాటిల్లు సుగుణరహితుండు నగున్. 217

క. పైదలులు మువురు గలసిన, మోదము రూపఱును ఖేదమును నగు నశుభా
పాదనము గల్గు నిక్కము, వేదవిరుద్ధంబు సేయు వేయేలయిఁకన్. 218

గీ. ఎతని గృహసీమ భామ పుంగతిని బరఁగు, సతివశంబున నెవ్వాఁడు బ్రతుకఁదివురు
నతని జన్మంబు వ్యర్థతాస్థితిని దనరు, నతులమై సంఘటిల్లు దుర్దశలపెల్లు. 219

ఉ. తామస మోర్వలేమి యనృతంబును రాగతనంబు గల్గు నా
కామిని యబ్బెనేని కడకం జనుటొప్పను వాఁడు గాన, క
చ్చో మధురంపుఁబండ్లు పరిశుద్ధజలంబు తలంబు లబ్బెడున్
గీములలో లభింప విలు కీడగుఁ గూడును లగ్గు కానలో. 220

ఉ. మేలగు హింస్రజంతుసుసమీపనికేతనుడౌట, యెంతయున్
మేలగుఁ జిచ్చుఁజొచ్చుటయు, మేకొని దుర్ముఖియైన కాంతతోఁ
గాలముఁ బుచ్చుకంటెను; సుఖంబులు ఘోరహాలాహలజ్వల
జ్జ్వాలలు తన్ముఖార్చులవి చావున కెక్కుడు నొక్కఁజేసెడున్. 221

గీ. మత్తకాశినీత్రాసితమానసుండు, నిత్యమును జేయు కృత్యముల్ నిష్ఫలములు
కీర్తిదొలఁగును బరఁగు దుష్కీర్తి పెల్లు, నైహికాముష్మికములు దుఃఖావహములు.

గీ. తరుణి వెరుపైన మనుజుఁ డీధరణిలోనఁ, బరఁగు నిందల పందయై నరకమొందు
బిట్టు సౌఖ్యంబు కీర్తి లేనట్టివాఁడు, బ్రతికెనేనియుఁ జచ్చినగతిన యుండు. 223

క. పలువుర సవతుల కొంతచో, నిలువంగాఁ గూడ దట్లు నిలిచిన యశమా
నిలువదు; పలువురు చెలువలు, గలిగిన కీ, డొక్కరమణి గల్గిన లగ్గౌ. 224

క. సౌమ్యుఁడ గంగా ! శర్వాప, దమ్మున దీపల్కునాతి తాఁజను విధిగే
హమ్మున దీరము నా నిల, యమ్మున వసియించు మంజులాశయ యగుటన్. 225

క. పతిరత యనుపత్నియును, సతతంబు సుశీలయు నగు దాన గలుగువాఁ
డతులసుఖవంతుఁడును స, ద్గతిపాత్రుం డౌను ధర్మతత్పరుఁడు నగున్. 226

గీ. ఎవని యిల్లాలు పతిరత యవుచునుండు
ముక్తుఁడును శుచి సౌఖ్యసంయుక్తుఁ డతఁడు
ఎవని యర్ధాంగి దుశ్శీల యవుచునుండు
పాపి దుఃఖియు జీవచ్ఛవం బతండు. 227

ఉ. ఇట్టని మిన్నకుండెఁ గమలేశ్వరుఁ; డంగన లొక్కపెట్టఁ జ
న్గట్టుల బాష్పముల్ దొరఁగి కాల్వలు గట్ట పరస్పరంబునుం
బిట్టు కవుంగిలించుకొని మిన్నుముట్టన్ వెసనేడ్చి రంతవా
రెట్టు సహింతు రట్టి జగదీశ్వరు శాశ్వతవిప్రలంభమున్ ! 228

ఉ. కన్నులనీరు కాల్వలయి క్రిందఁ జలన్నిజగాత్రవల్లులై
మిన్నుదొలంగి పైఁబడిన మేఁకను బెయ్యలు దక్కియుండి యా
యమ్మలు దేవి కొంతకు భయస్థితి గద్గదభిన్నకంఠలై
విన్నపమాచరించి రిటు వెన్నునితోడఁ గ్రమక్రమంబునన్. 229

మ. "అకటా ! యెట్లుభరింతు నాజననశోచ్యంబైన నీశాప ? మీ
వె కటాక్షింపుము శాపమోక్షణకథాభివ్యక్తిఁ గాదేని నీ
వికటస్మృతలమందు యోగకలనం దేహంబు చాలింతుఁ బా
విక పాఁకందగుఁగాక పేఁకచెడి చన్నే నీ కుపేక్షింపగన్." 230

వ. సరస్వతి యిట్లు పలియింప గంగ యిట్లను. 231

మ. "నను నిర్దోష నిటుల్ త్యజింపఁదగునే నాథా ! భవత్త్యక్తనై
మనఁగాఁజాలుదునే ! తలంపు మిటు లాత్మప్రేయసీత్యాగముం
బనితం జంపిన దోసమున్ సుగతికిం బాపుంగదా ! లోకనా
థుఁడవైనన్; నిరయంబుఁ జేర్పు చెడుగుం ద్రోవల్ ప్రియంబాయెనే !" 232

ఉ. అంతట లక్ష్మి నాథుఁ గని యంజలిపట్టి "మహాత్మ! యీకిటుల్
పంతముఁబూనఁగాఁ దగునె? పల్కునెలంతయు గంగయున్ రుషా
క్రాంతలు నిందలాడుకొనఁగా నవివారల జాలిమైఁ గటా
క్షింతురుగాక, తాల్మి విడఁజెల్లునె! నీకు దయాపయోనిధీ! 233

క. తెలిసీతెలియక కాంతలు, సలిపెడు కర్మములు తెలిసి సైఁచుటతగు భ
ర్తల కట్లుగాన నీయీ, చెలువల నెటులైనఁ గావఁజెల్లును నీకున్. 234

చ. సెలవిడి నన్నుఁ బంపు మిఁకఁ జెచ్చెర భూమి జనింప నేగఁగా
వలె, నట నెంతకాలము నివాసమొనర్తునొ? నాజలమ్ములన్
గలిపిన పాపముల్ సయిచి క్రమ్మఱ నెప్డు భవత్పదాంబుజ
మ్ములు గొలువంగవత్తునొ? ప్రభూ! తెలుపంగదె! భీతియయ్యెడున్. 235

గీ. తులసి యనియెడు సన్నచేఁ గళధరించి
ధర్మకేతుధరానేత తనయ నగుచు
ధరణిఁ బరఁగుదు నెప్పుడు తావకీన
చరణయుగ మేను గనుఁగొందు శరణ మనుచు. 236

క. ధరణీజాకృతితో నీ, ధరణిని ద్వదధీనదేవతాత్వముఁ గనుచోఁ
గరుణామతి వగుచు మదు, ద్ధరణం బొనరించు టెపుడు తడయక చెపుమా. 237

క. వాణీశాపవశంబున, క్షోణికిఁ దానేగె గంగ ఘోరతరాంహః
పాణింధమమగు ముక్తివిఁ, బోణిమిమైఁ గాంచి నిన్నుఁ బొడఁగను టెపుడో.238

క. గంగాశాపంబునఁ బ, ల్కుంగుబ్బెత రత్నగర్భకుం జనుచో నే
భంగిని దా శాపవిము, క్తిం గొను నీచెంగటను సుఖించుటకు హరీ. 239

గీ. నలువయింటికిఁ బలుకులకలువకంటి, గంగ యాస్మరఘస్మరాగారమునకు
నేగుఁడంచును నానతి యిచ్చినార, లెడఁద నెనరూని యిది క్షమియింపవలయు."

వ. అనిన వెన్నుండిట్లనియె. 241

క. నీవాక్య మాచరించెద, నావాక్యము రిక్తగాఁ దనర్పునె యెందున్
భావించిచేయు సామ్యము, నే వచియింతును జగద్వినేయము గాఁగన్. 242

క. నలువయింటికిఁ బలుకులకలువకంటి, గంగ యాస్మరఘస్మరాగారమునకుఁ
జనుదు రీవుందు విచట నాచనపు గల్గి, యన్యథాగతి గలుగఁజేయంగఁ దరమె.

గీ. అభగీరథనీతయై యవనికరిగి, త్రిభువనంబులఁ బ్రోచి ప్రతిష్ఠజెంది
గట్టువిల్కాఁడి యౌదల మెట్టి గంగ, పూతయయ్యును దా నతిపూత యగును.

గీ. కళను ధరియించి నైజసంగతిని బాసి, యవనిఁ బద్మావతి తులసి యనఁగ నొప్పి
ద్వీపినీమేదినీరుహరూపములను, దాల్చియుండుము మదిని ఖేదంబుఁ దొఱఁగి.

క. ఇంతీ! పంచసహస్రా, నంతరమునఁ గలియుగంబునం గల్గును శా
పాంతము పిమ్మట నావ, ర్యంము నేతెంతువు నిశ్చయంబగును జుమీ. 246

గీ. ఎల్లదేహుల సంపత్సమృద్ధులకును, నాపదల హేతుభూతములై తనర్చు
మహిపు గల్గునె యాపద్విరహితపుగుచు, భపునకై నను సారసభవునకైన. 247

వ. మామకమంత్రోపాసనదీక్షాదక్షమునిజనతాక్రాంతవిరాయమానస్నానావగాహనదర్శన
స్పర్శనంబులంజేసి యుష్మదీయఘోరాంహోజాలంబు నిర్మూలంబగు మఱియును,

గీ. భూతలంబును దీర్థములౌ పూతములగు, సంతసంబున మద్భక్తజనులు స్పర్శ
దన్మనంబులు సల్పెఁ దక్షణంబ, యదియె పావన మవియ మహానదులగు. 249

సీ. ఏకాదశీవ్రతహీనులు నాస్తికుల్ ♦ గ్రామయాజకనరఘాతకు లటు
లత్యుగ్రభాషి మిథ్యాసాక్ష్యవక్తము ♦ తమ్నకృతఘ్నవిప్రఘ్నగోఘ్న
గురుతల్పశయనులు పరదారగమనవి ♦ శ్వాసఘాతుకవృషవాహకులును
పుంశ్చలీపుత్రులు పుంశ్చలీరతులును ♦ దేవలాదీక్షితధావకులును

గీ. దల్లిదండ్రులఁ దమ్మునిఁ దనయుఁ దనయ ♦ భార్య భగినిని దైన్యపద్బంధుజనుల
నత్తమామలఁ బోషింపనట్టి పాపు ♦ లనఘులగుమదు నాభక్తజనులఁగనిన. 250

క. శూద్రశవవాహకులు వి. ప్రద్రవ్యవినాశకరులు రసవిక్రేతల్
భద్రద్వంసకు లిల న. శూద్రులెలా నాదు భక్తుఁజూచినయంతన్. 251

వ. అనిన లక్ష్మి యిట్లనియె. 252

క. హరిభక్తిహీనులైనను, తరియింతురు భక్తజనుల దర్శనమున నం
చరుదుగ పచియించితి దే. వర భక్తు లనంగ నెట్టివారలు సెపుమా. 253

గీ. అనిన భగవంతుఁ డిట్లను నతివతోడ. భక్తలక్షణ మధికగోప్యంబు పాప
నాశనంబును సౌఖ్యసంధానచణము. నైనఁ దెల్పెదఁ బ్రాణతుల్యవగు నీకు. 254

క. గురుముఖమువలన నెవనికి, హరిమంత్రము సెప్పఁబడునొ యాతఁడు చెందున్
సురలోకస్థితుఁడైనను, నరకస్థితుఁడైనఁ దక్షణంబునముక్తిన్. 255

ఉ. మానిని! మద్గుణశ్రవణమాత్రమునం బులకల్ జనించు నె
మ్మేన మనంబులోన మితిమీఱిన సమ్మద మావటిల్లి క
న్గోనల బాష్పముల్ గురియుఁ గ్రొంజెమట న్విలసిల్లు దేహమె
వ్వానికి వాఁడెపో పరమభక్తుఁడు ముక్తిచతుష్టయార్హుఁడున్. 256

వ. నావుడుఁ గమల యిట్లను. 257

గీ. కలియుగం బైదువేలేండ్లు కడచనంగ, శాపమును బాపుకొని నీదు దాపునకును
నిచ్చ రమ్మని యానతి యిచ్చినారు, పిదప ధారుణి యేగతి వెలయుఁ జెపుము. 258

వ. అవిన నారాయణుం డిట్లనియె. 259

క. కలిఁ బంచసహస్రాబ్దం, బులు చన ధర్మంబు సత్యముం గర్మంబుల్
గలుగవు క్రమక్రమంబుగ, నిలలో వర్ణాశ్రమములు హీనంబులగున్. 260

చ. అరయ మహాకలిన్ దశసహస్రశరత్తు లతిక్రమింప స
త్పురుషులు ధర్మవర్తనులు పుణ్యులు గణ్యులు వేదవేదులున్
సిరిదొరఁ గోరువారు తులసీవనసేవనపావనాత్మకుల్
విరళముగా వసింతురు వివేకవిపాకవిహీనచిత్తులై. 261

ఉ. క్రూరులు దాంభికుల్ శఠులు క్రోధమనస్కులు హీనసత్వులా
చారవిదూరు లప్రియు లసత్యవచస్కు లళీకవాదులున్
జోరులు ప్రాణిహింసకులు కుంఠలు మూర్ఖులు ద్యూతకారకుల్
జారులు నీతిబాహ్యులు నసహ్యముగా భువి నుందు రెల్లెడన్. 262

క. తమతమ యాచారంబులు, క్రమముగ వర్జించి యర్థకాంక్ష యవనశా
స్త్రము లభ్యసింతు రిది యు, త్తమమని విప్రాదు లధమతతిఁ గూడి తగన్. 263

సీ. సత్యముండదు సర్వజనములకడ భూమి • పండకయుండు భూమండలాధి
పతులు ప్రతాపహీనతనుందు రంబుహీ • నంబులై నదులుండు నగరములను
నరశూన్యములు భయానకములై వర్తిల్లు • గోవులు క్షీరముల్ గురియకుండుఁ
బాలలో వెన్న స్వల్పంబేని యుండదు • వికృతాకృతిని జనవితతి వొలుచు

గీ. అన్ని వర్ణంబు లొక్కటౌ న్యాయ మన్న • దూరమగు సజ్జనుల మాటఁ జేరకుండు
నయ్యయో! చెప్పశక్యమే యధమమైన • కలియుగంబునఁ గల్గు దుష్కర్మములను.

క. కొందఱు పొందుదు రత్తలఁ, గొందఱు భ్రాతృసతి గవయఁ గోరుదు రక్కన్
గొందఱు వేయేటికి యెటు, సందర్భం బటుల జరుగు జారత్వంబుల్. 265

క. పదియాఱు వత్సరములకు, ముదిమి యొదవు గుజ్జువాండ్రు బొడముదు రిల ని
ర్వదియేఁడులు గతియించిన, నదియే పూర్ణాయు వందు రఖిలజనులకున్. 266

గీ. వత్సరాంతప్రసూతలై వనితలుండ్రు, జరయు రుజయును వెంటనే సంభవించు
వంధ్యలగుదురు తఱచుగా వనితలెల్లఁ, గలియుగపుఁజర్యఁ జెప్పశక్యంబుగాదు. 267

క. కన్యాధనకుక్షింభరు, లన్యాయపథానుచరు లహంకృతియుక్తుల్
మావ్యక్రేతలునై సౌ, జన్యం బొకయింత లేక జనులుందురిలన్. 268

క. పున్నపు నమవసమాపుల, సన్నముఁ గుడిచెదరు విప్రులదియొకఁడేలా
జన్నిదము లూడ్చి సంధ్యకు, సున్నయిడుదు రపని విప్రశూన్యముగాదే. 269

గీ. బ్రాహ్మణాగారములయందు బాచకాళి, మసలు భగవద్భక్తముల నియమంబు దఱుఁగు
వ్రేలుఁబొడ వుండుదురు జనుల్ వృక్షతతియు, హస్తమాత్రప్రమాణంబు విస్తరిల్లు.

వ. ఈ ప్రకారంబు కొంతకాలం బతిక్రమించిన యనంతరంబ. 271

గీ. అవని యవనేశ్వరుల కెల్ల నాటపట్టు, గాఁగ నుండుటకతనఁ బంక మభివృద్ధి
జెందుటయు దాని నశియింపఁజేయ విష్ణు, వవతరించెడు నొక్క విప్రాలయమున.

ఉ. పాటిఁ దొఱంగి సజ్జనులఁ బట్టి తురుష్కులు పుష్కరంబునన్
బాటులఁబెట్టుచుండ నలబ్రాహ్మణపుత్రరుఁడైన కల్కి తా
ఘోటక మెక్కి ఖేటకము క్రూరముగా ధరియించి పేనిదా
ఘాటముగా వధించు నలఘాతుకజాతి సబాంధవంబుగన్. 273

క. ఖానుల వధించి యంత, ర్ధానమునొందంగ ధర యరాజక మగుడున్
మానవగృహములు దస్యు, స్థానములై పరఁగుచుండుఁ దాపసవర్యా. 274

ఆ. వె. క్షోణితలము నిండ స్థూణాప్రమాణమా, సార మఖిలజంతుఘోరముగను
గురియు నాఱుదినము లరుదుగా ద్వాదశ, సూర్యు లుదయమగుదు రార్యవినుత.

గీ. అంత గృహవృక్షలోకశూన్యమగు భువన, మర్కతేజంబుకతన ననంతరంబ
ఘోరకలిపోయి కల్మషదూరమైన, కృతయుగం బేగుదెంచు ధార్మికులతోడ. 276

సీ. సకలవేదార్థవిజ్ఞానవిజ్ఞాపన • భాసురభూసురాగ్రేసరులును
బ్రాహ్మణభక్తిసంపాదితైశ్వర్య ప్ర • తాపదిగ్విజయభూమీపతులును
గో కృషివాణిజ్యకుశలవృత్తిపర్ధిత • ద్రవ్యతోషితసుమార్గణవణిజులు
బాదభక్తియుతవైశ్యసేవానమా • పాదితధర్మయుక్శూద్రజులును

గీ. మగనిమాటను దాఁటని మానవతులు, స్వకులధర్మంబు వీడని సకలజనులు
సర్వసస్యసమృద్ధమౌ క్ష్మాతలంబు, నగుచుఁ జెలువొందు నాకృతయుగము మౌని!

క. దేవీభక్తిపరాయణు, లై వేదోక్తప్రకార మాచారంబుల్
గావించి సకలజను లిల, లో వెలయుదు రఘములకును లోఁబడకుండన్. 278

గీ. ధర్మము త్రిపాదములను త్రేతాయుగమున, ద్వాపరంబున రెండుపాదములఁ గలిగి
నేకపాదంబునను నటియించు నంతఁ, గొన్నిదినముల కదియును గొఁఱతయగును.

వ. అనుటయు, 280

గీ. భూమి దానంబుచేఁ గల్గు పుణ్యములును, ధరణిహరణంబువలని పాతకము ధాత్రి
దీప మిడుటయు మొదలు ధరాపరాధ, ములును దత్ప్రీతికరణముల్ తెలుపు మీశ.

వ. అనిన నారాయణుం డిట్లను. 282

గీ. ధరణి నిచ్చు నెవండు వితస్తిమాత్ర, మాగమజ్ఞున కతఁడు శివాంతికమున
కరుగు; నుర్వర నిచ్చిన హరిపదమున, భూమిరేణుప్రమాణాబ్దములు వసించు. 283

క. భూగ్రామదానములు వి, ప్రగ్రామణులకు నొసంగు వాఁడు విధూతో
దగ్రాఘుండై దేవికి, నగ్రచరుం డగుచు వెలయు ననిశం బనఘా. 284

క. తానొసఁగిన దొరు లొసఁగిన, దైనను భూసురులవృత్తి హరియించెడు న
మ్మానవుఁడు కాలసూత్రమ, హానరకమునందుఁ గూలు నతికష్టమునన్. 285

క. మఱియును నాతని సంతతి, హరియించును భూమి హీనమగు, సంపదలున్
స్మరణీయములగు, రౌరవ, నరకంబును గలుగుఁ బిదప నారదమౌనీ. 286

క. గోమార్గంబుల నుంచక, భూమిని సస్యంబుసేయు మూర్ఖుండును గో
సీమలఁ జెర్వుల దున్నిన, పామరుఁడును నరకమందుఁ బడకుండుదురే. 287

క. కామియయి వీర్యపతనము, భూమిని గావించినట్టి పురుషుండు పరు
స్త్రీమల భూములు చేసిన, పామరుఁడును నరకమునకుఁ బాత్రులు కారే. 288

గీ. పంచపిండంబు లీయఁ ద్యజించి స్నాతుఁ, డౌను బరకూపమందు నే మానవుండు
నరకసంవాసియగు వాఁ డనారతంబు, స్నానమును నిష్ఫలంబగు మౌనివర్య. 289

గీ. దీపము ధారుణి నుంచిన, పాపాత్ముం డంధుఁ డగును; బంచజనులకున్
క్ష్మాపతికిఁ బిండ మీయక, యే పితరుల కిచ్చి నరకమేగును వాఁడున్. 290

గీ. రత్నమౌక్తికహీరహిరణ్యములును, శంఖయంత్రశిలాజలచందనములు
పుష్పజపసరదుగ్ధకర్పూరములును, ధరణి నిడువాఁడు నరక మొందంగలాఁడు 291

గీ. యజ్ఞసూత్రము కుశలు రుద్రాక్షములును, బుస్తకంబును శివలింగమును నెవండు
భూమియందు సమర్పించు మూర్ఖజనుఁడు, బ్రహ్మజన్మంబుఁ బొందఁ డెప్పటికి వాఁడు.

గీ. గ్రహణకాలంబునందు భూకంపమందు, వసుధ ఖననంబు జేసిన వాఁడు ముందు
జన్మమున నంగవైకల్యసహితుఁడగుచు, దుఃఖమును బొందునని నారదుడు వచించు.

## గంగోత్పత్తి.

చ. ప్రవిమలమౌని చిత్తము విభాసిలె నివ్వసుధాసుధాకథా
శ్రవణమున న్మహాత్మ! దివిజస్థలసుస్థితిఁ గన్న గంగ యీ
యవనికి నెట్టు లేయుగమునం దెపు డెవ్వని ప్రార్థనంబుచే
నవతరణం బొనర్చె నివి యానతి యీవె కృతార్థుఁ జేయవే. 294

క. అని విన్నపంబు సేయుట, యును నారదమౌనితోడ నొగి ననె నారా
యణుఁ డిటు మంధాద్రిధృ, ద్ఘనీరనిధిబంగళంగివాబాగ్భటితోన్, 295

ఉ. రాజకరాంబుజాతభిదురప్రతిభాగతి శాతబాణధా
రాజితవైరిసంచయశిరస్థ్సమణీముకుటీ విభాళినీ
రాజితపాదపద్ముఁడు ధరాసురరాజసమాజదానవా
రాజితవైజనమ్ముఁడు ధరిణా సగరుండనురాజు రాజిలున్. 296

గీ. ఆ సగరుఁడు వివాహముఁ జేసికొనియె, బానమాననిజశరీరభాసమాన
లైన పడఁతుల వైదర్భి యనెడుదాని, శైబ్య యనియెడుదానిని సంతసమున. 297

క. ఆరాజవరుఁడు స్మరసుఖ, మారని ననసుంజాఁదను కుమారునిఁ గనె శై
బ్యారామాగర్భంబున, నారాధనఁ జేసె శివుని నన్యయు భక్తిన్. 298

క. అంగజసూదనుగృపచే, తం గర్భముతో సమాశతంబు గడపి య
య్యంగన మాంసపుపిండం, బుం గనియెను దాని పూర్వపుణ్య మదేమో. 299

క. ఆమాంసపుఁ బిండము గని, తా మనమునఁ జింతనొంది తరుణేందుధరున్
సోముని గరుణోద్ధాముని, వేమాఱు నుతించుచు పనివి పనివి యేడ్వన్. 300

గీ. సూతికాగారమున నున్న సుదతి కడకు, భూసురాకారమును బూని భూతనేత
చేరి మాంసపుఁబిండము జీల్చె నంతఁ, గ్రమత షష్టిసహస్రఖండములు గాఁగ. 301

గీ. ఆశకలములు గ్రీష్మమధ్యాహ్నసమయ, తిగ్మభానుప్రభామృష్టతేజులయిన
బాలకొమరులయ్యె రూపలక్ష్మిఁ గుమారు, లికొమరు లంచుఁ జూపఱు వాకొనంగ. 302

వ. ఇట్లు య్యఱువదివేవురు పుత్రులు దినదినాభివృద్ధి గాంచుచున్నంత. 303

మ. హయమేధం బొనరింపనెంచి సగరుం డాత్మోద్భవశ్రేణినా
హయమున్ రక్షయొనర్పఁబంప నది యన్యావార్యమై భూమిలో
రయమొప్పం జరియించి నాగసదనప్రాంతోర్వి నిల్చెందవో
వియతిన్ గాలముబుచ్చు నాకపిలమౌనిశ్రేష్ఠు పాశ్చాద్దిశన్. 304

ఉ. సాగరు లాహయం బరుగు జాడఁ గనుంగొనలేక వీక భూ
భాగము లెల్లెడ న్వెదకి వాహముఁ గానక ధాత్రిఁ ద్రవ్వి యా
భోగవతీపురంబు దరిఁబోవుచుఁ గన్గొని రొక్కచోటన్ సమ
స్తాగమవేదియౌ కపిలు నాతనివెన్కఁ దురంగమంబునున్. 305

క. వైతానాశ్వహరుండగు, నీతాపసియంచుఁ జేరనేగి తపోదీ
క్షాతత్పరుఁడగు మౌనిని, నీతి సడలి పరిభవింప నెలకొనుకతనన్. 306

చ. అతులతపఃప్రభావుఁడగు నమ్ముని కోపదవాగ్ని భస్మసా
త్కృతులయి రా కుమారు లదియెల్లను జారులుదెల్ప నాలకిం
చి తతవిషాదుఁడై యెరియుచిత్తముతో సగరుండు దాపసాం
చితమగు నొక్క పేరడవి చెంతకు నేగెఁ దపోభిలాషయై. 307

గీ. అతని యాత్మజుఁ డసమంజుఁ డనెడియాతఁ, డభ్రగంగను భూమికి నవతరింపఁ
జేయఁదలపోసి నిష్ఠమైఁ జేసెఁ దపము, లక్షయేఁడులు పిదప కాలగతిఁగనియె. 308

గీ. అతని తనుజాతుఁ డంశుమదాఖ్యుఁ డభ్ర, నదిని ధరణికి నవతరణం బొనర్ప
లక్షయేఁడులు గురుతపోదీక్ష సల్పి, కాలయోగంబు కతన సద్గతినిగనియె. 309

చ. అతనిసుతుండు ద్రాక్షఫలితార్యమనోరథుఁ డబ్జవాసినీ
పతిపదనీరజాతయుగభక్తివిహారధి శాంతిదాంతిసం
స్తుతగుణరత్ననీరధి యశోనిధి యైన భగీరథుండు దీ
క్షితుఁడయి నిష్ఠమైఁ దపముసేసె వియన్నదిఁదెచ్చు బుద్ధితో. 310

ఆ. వె. జరయు రుజయులేక జలపర్ణమారుతా, శనత దేహయాత్ర జరపికొనుచు
నూఱువేలయేం డ్లనూనతపంబు నొ, నర్చుచుండి యొక్కనాఁ డతండు. 311

సీ. హరినీలమణివిభాస్వర శరీరమువాని • మురళి మ్రోయించు కెమ్మోవివాని
గ్రీష్మసహస్రోష్ణకిరణతేజమువాని • బట్టుపుట్టము మొలగట్టువానిఁ

జతురాననాదినిర్జరనుతాంఘ్రులవాని • ముసిముసినగవుల మోమువాని
భక్తసంత్రాణసంభ్రమమానసమువాని • తోయజమేలు కన్దోయివానిఁ

గీ. ప్రకృతిపరు సాక్షిరూపు గోపాలవేషు • వహ్నిశుద్ధాంశుకాధాను వరచిరత్న
రత్నభూషణభూషితుఁ బ్రణుతిపాత్రు • బాలకృష్ణునిఁ గనె నేత్రపర్వముగను. 312

క. కాంచి హరిపాదములకును, మంచితమతి మ్రొక్కి మాటిమాటికి నుతిగా
వించుచు నిటు విన్నప మొన, రించెరా మది భక్తిగదురఁ గృష్ణునితోడన్. 313

శా. దేవా! సాగరు లాదటన సగరు మేధీయాశ్వముకా రోయ బ
ల్యావాసంబున రేగి యాకపిలురోషాగ్నిచ్ఛటం గ్రాఁగుటన్
దేవద్వీపపతిన్ భువిన్ దిగిచి తద్వీచిస్మృత వ్వారి నెం
తే పీతాఘులఁ జేయనెంచితిఁ దపోనిష్ఠాగరిష్ఠుండనై. 314

క. నాపుడు నాళీకాక్షుఁడు, ద్యోవాహినిఁ గాంచి యనియెఁ దొయ్యలి! సగర
క్ష్మావరసుతులను వేగమ, పావనులను జేయఁ జనుము భారతమునకున్. 315

క. నీవాయుస్పర్శనమున, బావనతం బరిఢవిల్లి వారందఱు నా
యావాసమునకు వత్తురు, దేవస్యందనవిహారదీపితులగుచున్. 316

క. నామూర్తిఁ దాల్చి సతతని, రామయతం దనరుచుండి యనిశము నాదౌ
ధామంబునందు భక్త, గ్రామణులై యుందు రెల్లకాలంబు రహిన్. 317

క. గంగావాయుస్పర్శము, నం గోటిభవార్జితప్రభృతిసంచేని వెసఁగా
ల్చుంగు నటంచును వేదము, నం గానఁగనయ్యె నదియు న్యాయ్యము గాదే. 318

వ. దేవీదర్శనస్పర్శనంబునం గలుగు పుణ్యంబుకంటె సామాన్యదివసంబున మను
జుండు జేయు మౌసలస్నానంబు పదిగుణంబు లధికంబై యుండు. 319

గీ. కోటిజన్మంబులందుఁ దాఁగొనినయట్టి. బ్రహ్మహత్యాదిఘోరపాపంబులైనఁ
బంచబంగాళమై చనుఁ బన్వమందు, మౌసలస్నానమును జేయుమాత్రమునను. 320

క. అనిపలికి మున్నదుండిన, వనజవిలోచనునిఁ గాంచి భక్తివినమితా
ననయై వినయముతోడన్, జవపున నిట్లనియె గంగ సంయమివర్యా! 321

మ. అల రాజన్యతపఃప్రభావమున నీయాజ్ఞాప్రకారంబునం
బలురుంగోమలి శాపకారణమునన్ క్ష్మాలోకమున్ జేరి పా
పులచేఁ బ్రాప్తములైన పాపనికరమ్ముం బాపి నే నెప్పు దే
వలనం దేవరపాదము ల్గనుదు దేవా! యానతీవే కృపన్. 322

క. నామనమునఁ గోరిక లేఁక, నేమేమండిన సమస్త మెఱుఁగుదువుగదా
యేమని దెల్పుదు నాకుం, గామితముల నొసఁగి వేగఁ గావు మనవుడున్. 323

చ. ఎఱుఁగుదు నీ మదింగల సమీహితమున్ లవణాబ్ధి నాథుఁడై
యతిముఖ గారవించు నిను నాతఁ డనంగ మదంశజాతుఁ డ
బ్బురముగ లక్ష్మియంశమునఁ బుట్టితి వీవును గాన మీకు ని
ద్ధ్వరకును దంపతిత్వ మమరున్ జగతీత్రయసుప్రసిద్ధమై. 324

క. ద్వీపవతు లెన్నియుండిన, నీపై మోహంబు మిగుల నెలకొల్పి దయన్
గాపాడుచుండు వారిధి, ప్రాపించున్ వారికంటె బలుసిరులు నినున్. 325

గీ. వరభగీరథకృతనుతిఫణితిచేతఁ, గణ్వశాఖేరితధ్యానకలనచేత
భారతం బందలి జనం బనారతంబు, పూజఁ గావింత్రు మది భక్తి రాజిలంగ. 326

ఆ.వె. నూఱుయోజనముల దూరమం దుండియు, "గంగ గంగ గంగ గంగ" యనుచు
నుడువు నతఁడు బాసి చెడుగులవలనను, బాయకుండు విష్ణుపదము లలన! 327

క. పాపిసహస్రకృతస్నా, నాపాదితపాపజాల మంతయు మస్మం
త్రోపాసకదర్శనమున, రూపఱు నిక్కంబు జాతరూపనిభాంగీ. 328

గీ. పాతకిసహస్రకుణపసంస్పర్శనమున, నీకుఁ గల్గిన కిల్బిషానీక మెల్ల
నాదు భక్తుం డొకండు స్నానంబు చేయ, నంతమాత్ర నిప్పచ్చర మగును దరుణి!

గీ. ద్వీపినీ! వినుము సరస్వతీప్రముఖన, దీచయసమక్షమం దఘమోచన మనఁ
గా వసింతువు త్వద్గుణగణన మెచట, నగు నపుడ యాను నదియె పుణ్యస్థలంబు.

గీ. సుదతి! నీదగు రేణువు సోఁకినట్టి, నరుఁడు పాతకియైన నాతడుణమందుఁ
బావనుండగు నిక్కంబు దేవిపదవి, భూమిరేణుప్రమాణాబ్దములు వసించు. 331

ఉ. డెందమునందుఁ గోర్కెలు కడిందివిచారము వోవనాడి మీ
యందలి భక్తిమామకమహామనువున్ స్మరియించుచున్ మృతిం
జెందిన మానవావళి వసించును శౌరిపదంబు సేరి యా
నందమువొంది పార్షదజనప్రభుతాప్రతిభాప్రసిద్ధమై. 332

క. జ్ఞానవిహీనుం డేనియు, నీ నీరస్పర్శనమున నీగుణనుతితో
దా నసువులు విడిచిన నా, స్థానంబున పార్షదప్రధానుని జేతున్. 333

క. ఏయెడనైనను నీనుతిఁ, జేయుచుఁ బ్రాణంబులను ద్యజించు నరునకున్
సాయుజ్య మిచ్చి పార్షద, నాయకుఁడై యుండఁగా నొనర్తును గొమ్మా! 334

మ. ఇదితీర్థం బిదిగాదనంగఁ బనిమే మెచ్చోటనే నిచ్చతో
మదిలోఁ దావకనామసంస్మరణముం బాటించుచున్ జీవమున్
వదలుం ధాత్రి నెవాఁడు వాఁడు మణిదివ్యస్యందనారూఢిఁ బా
ర్షదసంసేవితుఁడై మదీయపదవిన్ సారూప్యముం బొందెడున్. 335

వ. ఇట్లు గంగ నామంత్రణంబు సేసి. 336

గీ. ఓభగీరథ! వినుము నీయుల్లమందు, గలుగుకోర్కెలు ఫలియించు కాలమిదియ
చిత్తమునఁ బాదుకొల్పిన భక్తితోడ, గంగఁ గీర్తింపఁ బూజింపఁ గడఁగు మింక.

ఉ. నా విని యా భగీరథుఁ డసంతసముదంబును బొంది యజ్ఞభు
క్త్సపలిలిం గనుంగొని వెస న్నుతి సేయుచు శీర్షముర్విపై
మోప నమస్కరించి యఘమోచను సారసపత్రలోచనున్
వే విధులన్నుతించెఁ దనవెంటనె గంగ చనంగ సంతతన్. 338

వ. అవిన నారదుండు గంగాపూజావిధానం బనుగ్రహింపుఁడన నారాయణుం డిట్లనియె.

క. స్నానమ్ము సేసి విహితవి, ధానమ్ములఁ దీర్చి సుపరిధానంబుల్ దాఁ
బూని మది దేవషట్క, ధ్యానం బొనరింపవలయు ధర్మజ్ఞుఁ డిలన్. 340

ఉ. గణపతి విఘ్నశాంతి, కల కల్యాణదాయి రుజాప్రశాంతికిన్
ద్రిణయను జ్ఞానసిద్ధికి, హరిన్ సిరికి, న్నుచియుక్తి కాళుకు
క్షణిని, హిమావనీధ్రతనుజాతను ముక్తికిఁ, గౌరి యే రవా
రణముగ భక్తిఁ గొల్తు రల ప్రాజ్ఞుల కెల్లఫలమ్ము లయ్యెడున్. 341

గీ. అట్లుచేయక పూజ సేయంగఁ దగదు, వానిపూజన మగును నిష్ఫలము గాన
దేవషట్కంబుఁ బూజించి తివిరి యిష్ట, దైవతసమర్చనము సేయఁదగునటన్న.

గీ. కలియుగం బైదువేలేండ్లు గడచినంగ, గంగ యెచ్చోటి కేగె వినంగ మిగుల
వేడ్క వొడమెడు నెదఁ జెప్పవే యనంగ, నాతఁ డిట్లని చెప్పె సంప్రీతితోడ. 343

ఉ. అత్తటి వవ్వలాసిమ లహంకృతి లోఁ బొడమం బరస్పరో
పాత్తములైన కోపము లవశ్యము భోగ్యములౌటఁ జిత్తముల్
తత్తఱమందఁ దద్గతులఁ దాలిచి యా యవధిన్ ధరించి య
ద్యుత్తమమైన దేహములతోఁ జనుదెంచిరి శౌరిచక్కికిన్. 344

వ. అవిని నారదుండు, మహాత్మా! విష్ణుపాదాంబుజంబున నుద్భవంబందిన మందాకిని
బ్రహ్మకమండలు వసియు శివప్రియ యనియుం జేర్కొనంబడుచుండ నారాయణు

నకుఁ బ్రియపత్ని యగు చెట్లనవుడు; మునీంద్రా! తొల్లి గోలోకంబున రాధా కృష్ణాంగసముద్భూతయయి తదంశంబయి యనన్యకన్యకాజనసామాన్యలావణ్యం బగు ద్రవరూపం బవధరించి నిరతంబు వెన్నునికి సన్నికృష్టయై యుండ నొక్క నాఁడు, 345

క. గోపికలు గొలువగా రా, ధాపతి కొలువుంబొనర్చుతటి గంగ హరిఁ జూపు నిలిపి కని మోహో, ద్దీపితయై యచ్చటన్ స్తుతిం గావించెన్. 346

గీ. హరిని గనులారఁ గనుగొన్నయంతఁ బొదమె
నెదఁదఁ గడలేనిమోహ మీపడఁతి కపుడు
లజ్జయును దోడఁ జనుదెంచె విజ్జగమునఁ
దరుణి కెందులకేవి స్వాతంత్ర్యమున్నె. 347

ఉ. ఆదళదబ్జనేత్ర మది నాపఁగరాని తమిన్ గడంగి దా
మోదరునిం గనుంగొనుచునుండెను దువ్వలువ న్మొగంబు నా
చ్ఛాదనమాచరించి విహసన్ముఖచారువిలాసయై; ధరన్
మీఁదుఁ దలంప రంగనలు మిక్కిలిమోహము గల్గుపట్టునన్. 348

గీ. తెప్పవేయక మదిలోన నుప్పతిల్లు, కామమును లజ్జయును సతిగౌరవంబు
వెత్తిపేయంగ మూర్ఛలోఁ బెనఁగొనంగఁ, జేష్టలఁ దొఱంగి విల్చె రాజీవనేత్ర.

సీ. ఒకచక్కి గోపికానికరమ్ము మణివేత్ర • పాణులౌచును బరాబరులు సేయ
నొకయోర కిన్నరీనికురుంబము బలసి • సాహోనినాదముల్ సల్పుచుండ
నొకచాయ నప్సరఃప్రకరంబు కవగూడి • చెలువార నాట్యముల్ సేయుచుండ
నొకవంక నిర్ఝరీవికచాంబుజాక్షులు • ప్రమదంబుతోఁ జామరములు వీవ

గీ. మంజులానంతరత్ననిర్మాణమైన • రథమునందు వసించి యారాధ యటకు
రమణనేతెంచి హరిఁ గాంచి రథము డిగ్గి • నాథుకడ కేగె మందయానంబు గదుర.

ఉ. శౌరిపదాంబుజంబులకు సాగిలిమ్రొక్కి తదుక్తనర్మవా
చారస మారగించుచును సంభ్రమమొప్ప నమస్కరించు నా
భీరకులాంగనాతతిని బ్రేమగడల్కొన నర్హపద్ధతిన్
గారవమాచరించి యట గద్దియఁ దా వసియించె నొయ్యనన్. 351

క. భయమున్ సంభ్రమము నతివి, నయము న్మిగులన్ మనమ్మునం బొదలఁగ గం
గయును వెడలి తచ్చరణ, ద్వయుకిం బ్రణమిల్లి శౌరివలపట నిల్చెన్. 352

చ. కలికి తదాననాంబుజవికాసముఁ గనుఁగొంచు నాత్మ మి
క్కిలియగు మోహభావమునఁ గీడ్వడి యోఁదలవాంచి యన్యచిం
తలు డిగఁద్రావి యుండె నటఁ దద్గతమానసయై నితాంతముగా
వలపుగలట్టిచోట ప్రతిబంధము గల్గిన ట్టులేదరా. 353

క. అంతట రాధికయును ద, త్ప్రాంతంబున నుంటఁ జేసి యాచైదము ల
త్యంతముఁ జూచుచు మదికి, న్వింతగఁ గన్పట్టి కోపవిహ్వలమతియై. 354

ఉ. మోవి చలింపఁ జిర్నగవు మోమున నొప్ప పతాంతకాంతవా
చావిభవంబువోఁప హరి చక్కని దృష్టి నిగిడ్చి పల్కె ని
ట్లావల కొల్వులోపలి వయస్య లహో యన గంగ హా యనన్
దేవత తెల్లఁ దల్లడిల దీపితరోషకషాయితాక్షియై 355

ఉ. దేవరపార్శ్వమందు భవదీయముఖాంబుజ మాస్థఁ జూచుచున్
భావములోనఁ బుట్టు తమి పైకి వెలార్చుచు నవ్వుమోముపై
తీవి యొసంగఁ బయ్యెద మఱింపుచుఁ గంటకితాంగియౌచు మూ
ర్ఛవశయయ్యె నీయువతి సంశయమేటి కెఱుఁగ్గ చెప్పుమా. 356

క. ఈ వేడిమపై నిప్పుడు, సీచిత్తము మిగుల మోహనిరతం బనియే
సూచింపఁబడియె నిజనా, లోచన యేటికి నిజము బలుకుము విరాననన్. 357

ఉ. కాతరతాప్తిచే దరిగా వసియించిన నన్ను గోపయో
షాతతిసేఁ జూడక యసంగతమంచుఁ దలంపఁబోక యీ
నాతిఁ బ్రక్కఁజేసితి మనం బవురా! యిదియెంత జంతరా!
ఘాతుకవృత్తి కట్టులాడఁగ ట్టిన నీవును సమ్మతింతువే. 358

ఉ. ఈతటి సిద్ధగాత్రియన నేటికి చెప్పటి నిద్దె యిట్టి నీ
చేఁతలు వేంవేల్ గవి విశేషము నీయెడఁ గల్గనట్టి సం
ప్రీతిఁ దొలంగఁజాల కురరీకృతనై సహియించుచుంటి స్త్రీ
జాతికి పిఱిఁబోలెఁ దగునా హసమిం కనె మాతనప్రియా! 359

క. ఈగాథవిదోడ్కొని గో, లోకంబున నుండి యొందులోకంబులలో
నేండికైనను బొమ్మా, నాదు వసియింపఁగఁ దగంతము సుమ్మా. 360

ఉ. చంచలవాటి నెంచి విడఁజాలక గూడి రమింపనాఁటి నీ
చంచమఁ గాంచు నాపయికి జాడనె నీవు తిరోహితత్వముగా

జెందిన యంత నాకమ ప్రసిద్ధము గాదె నదీస్వరూపమున్
బొంది భవద్వశస్థితిఁ బ్రబోధము చేయుచునుండె నేఁటికిన్. 361

వ. కోటియోజనవిస్తీర్ణంబును, చతుష్కోటియోజన దైర్ఘ్యంబును గలిగి విరజానదినాఁ బ్రసిద్ధంబగుట యెల్లరకుం దెల్లంబుగాదె. 362

చ. ఇరవున కేగు నన్నుఁగని యియ్యదిసూ యద నంచునెంచి చె
చ్చెఱ నదిఁ జేరనేగి తమిచే "విరజా! విరజా!" యటం చొగిన్
మొఱయిడు నీదు మొఱ్ఱవిని పూర్వపురూపము సిద్ధయోగమున్
దొరసినయంత నాచెలువతో రమియించితిగాదె యచ్చటన్. 363

క. అరమణితో రమించిన, కారణమున వార్ధిసప్తకం బాత్మజులై
ధారుణి విలసిలుచుండుదు. రారయఁ బ్రత్యక్షసాక్షులై యిప్పటికిన్. 364

చ. తతకుసుమాంచితం బయిన తల్పమునం బవళించి నీవునుఁగా
గుతుకముమీఱ శోభ యను గోపికతో రమియించుచున్ దిరో
హితుఁడవుగావె నన్నుఁ గని? యింతి తటాలున చంద్రమండల
స్థితిఁ గొనదే? మదిం గనరుఁజెందితినే? యపుడైన నచ్యుతా. 365

వ. శోభాసంత్యక్తంబగు శరీరం బతిస్నిగ్ధ ప్రభాన్వితంబై యుండంగాంచి డెందంబునందు వందురి యద్దేహంబు పైకంబు పైకంబుగ విభజించి రత్నంబులకును స్వర్ణంబునకును రమణీమణి ముఖంబులకును జంద్రునకును గిసలయంబులకును సుమంబులకును బక్వఫలంబులకును రాజగృహంబులకును దేవాలయంబులకును నూతనపత్రంబులకును దుగ్ధంబులకును నీవిచ్చితి. మఱియును, 366

మ. మును బృందావనవాటిలోనఁ బ్రభయన్పూఁబోఁడితోఁ గూడియుం
డినచో నచ్చటికేగుదెంచిన ననున్వీక్షించి యంతర్ధినిం
గనవే! యాప్రభ దేహముం దొఱఁగి శోకంబూరఁగాఁబోయి యా
వనజాప్తుని మండలంబుననె యావాసంబుఁ గావింపదే. 367

వ. ప్రభావిసృష్టంబైన దేహంబు తేజస్సముజ్వలంబై తీవ్రంబై యుండుటం గాంచి యారమణి యందలి ప్రేమాతిశయంబునఁ దోడెంబుగా విభజించి కొంత హుతాశనునకును యక్షులకును దేవతలకును విష్ణుభక్తులకును సర్పంబులకును బ్రాహ్మణులకును మునులకును రమణులకును బంచియిచ్చుట లిప్పటి కయినను మఱవ వచ్చునే. 368

చ. అలరు వసంతకాలమున యందు మనోజ్ఞమణీగణప్రభో
జ్జ్వలమగు హర్మ్యమం దలరుశయ్యపయిం దమి నీవు కాంతియన్
లలనయు ముచ్చటం దవిలి నాదగుశబ్దము విన్నమాత్ర నా
వల కరుదెంచినా వెఱుఁగవా ! చెలి పీడెను దేహమయ్యెడన్. 369

వ. వసంపడి యాసతి శరీరంబు విడిచి విపినంబులయందును సదనమందును శుద్ధ సత్త్వస్వరూపిణి యగు మహాలక్ష్మియందును దానవమంత్రోపాసకులయందును శాక్తేయులయందును తపోనిరతులయందును ధర్మతత్పరులయందును వివసింపంజేసి తిరియునింగాక. 370

మ. క్షమతోడంగా రమియించి యామములఁ జెజ్జం జేసి యశ్రాంతవి
శ్రమలై మున్నొకనాఁడు మైమఱచి నిద్రం జెందియున్నట్టియా
సమయంబుంగని నెచ్చెలుల్ దెలుప నిశ్శబ్దంబుగా వచ్చి నే
నిను మేల్కొల్పుట నీవెఱుంగనిదియే, మెత్తేలు నీచెయ్దముల్. 371

ఉ. అప్పుట నిద్రఁజెందునపు డల్లనఁ బూపుల సెజ్జపజ్జరున్
డించియు కౌస్తుభంబు మణిశోభితకుండల యుగ్మకంబునున్
బచ్చని మేల్మివల్వ వనమాలయు ద్రుచ్చితి మీరు మేల్కొనన్
నెచ్చెలిపిండు డెబ్బ గరుణించి యొసంగనె? నీ వెఱుంగవే. 372

వ. అప్పటి పాపంబును బాపికొననో యిది కాదే కృష్ణ వర్జుండవైతి; క్షమయును దేహంబుఁ ద్యజించి పుడమికిం బోయినఁ దత్తనూ విలాసంబు లతిరమణీయంబు లగుటంజేసి వాని పరిరక్షించి వైష్ణవులును బుధులును దేవతలును బందితులును బంధి యొసంగితి; వింతను వీడొప్పదుఁ బులు దెలుప సనంతంబులైన గాథలై చనునని పలికి లజ్జావనతాననయై యున్నగంగ కఠినమతియై క్షణక్షణప్రవర్ధమానకోపరాక్షేక్షణయై యొద్దిమే నొక్క మిడి వల్క నమియఁబున. 373

ఉ. గంగయు సిద్ధయోగమును గైకొని "ప్రోవు మనాథనాథ" యం
చుం గమలాక్షుపాదమునఁ జొచ్చెను; రాధయు రోసమెత్తి యు
త్తుంగమహాఘంబులును దోయధుల న్నదు లుర్విగఁ బ్రాత
త్కుండగలఁ దోటులఁగా నెమకి కోరి తిరిగ యాగ్రహంబునన్. 374

క. వైకుంఠంబున ద్రుహిణుని, లోకంబున యందు స్వర్గలోకంబున నా
యాతడలఁగా వెదకియు మం, దాకిని గన్గొనక విసిగెఁ దత్కాలమునన్. 375

ఉ. ఇలయెల్లన్ జల మిల్లయయ్యె; మృతదేహివ్రాత దేహచ్ఛటా
కులమై యెల్లెడలందు మానవులయాక్రోశంబు మిన్ముట్టగా
జలజప్రోద్భవచంద్రశేఖరులు నాశాపాలురుం గృష్ణుతోఁ
దెలుపంగావలెనంచు వేచసిరి తద్వీక్షాసముత్సాహులై. 376

క. గోలోకంబున గోపిక, లోలిన్ భజియింప రాధయు న్మణిపీఠికా
గ్రాలంగఁ గొలువుండిన గో, పాలుని దవుదవులఁ గని యవారితభక్తిన్. 377

వ. కని కరకమలంబులు నిటలతటంబున ముకుళించి యనేక ప్రకారంబుల వినుతించిన
నమ్మహాత్ముండు వారల నీక్షించి యాదరంబున నిట్లనియె. 378

ఉ. వ్యాళశయాన! స్వాగతమె, వారిజసంభవ! సేమమే, దిశా
పాలకులార! మీకును శుభంబకదా, భయసంభ్రమంబు లి
ట్లేల మదంఘ్రియందు వసియించె భగాంబున గంగ; దీనికై
చాలశ్రమంబుఁ జెందితి రొసంగెదఁ దోద్భ్యానిపొంద చెప్పుఁడీ. 379

ఉ. లోకొనిపోయి దీని నకుతోభయుగా నొనరింపుఁ డన్నఁ జా
మీకరగర్భుఁ డాత్మ మితిమీఱిన సంతసమంది రావన
స్తోకపుభక్తితో ముఖచతుష్టయనిర్గతవేదఘోష మా
శాకుహరంబుల న్వెలయ సంస్తుతిఁ జేసె నతోత్తమాంగుఁడై. 380

ఉ. శౌరియు నీవు గొల్లయెలచానలునుం గుమిగూడి రాసకే
ళిరతి నున్నవేళఁ గడలేని శ్రమాంబువు మీకు మేనులన్
సారెకు నుద్భవించి యొకచాయ సమేళనమొంది గంగయై
చారువిలాసమొప్పఁగ ద్రవప్రకృతింగనెఁ జుమ్ము రాధికా. 381

గీ. యుష్మదంగంబువలన సముద్భవించెఁ, గాన నీగంగఁ గూఁతునుగా ననుగ్ర
హించు టుచితంబుగాని కోపింపఁదగదు, గర్వవైరంబు తల్లి కక్రమముగాదె 382

చ. నిరతము నీ పదాబ్జములు నెమ్మి భజించుచు నీము మంత్రసం
స్మరణము చేయుచున్ లవణసాగర ముర్విఁ జరించువేళలన్
వెఱఁదయి యాదరించును గృపామతితోడ జనార్దనుండు నిన్
గురుతగు ప్రేమఁ జూచును వికుంఠపురంబున నీకు నాథుఁడై. 383

గీ. ఎచటికేతెంచినను గంగ కీడుగాదె, తల్లిదండ్రులు పతియు సద్గతియు నవిన
దాతలు నిల కులికి రాధాతరుణియుఁ, గృష్ణుఁ గీర్తించె నంత రోచిష్ణుభణితి. 384

క. కాంచి సతీయుతుఁడగుచు వి, రించి మురారికి నమస్కరించి వినుతిఁ గా
వించి నెఱి నిట్లనుచు వచి, యించుట కుత్సాహమందు నీనమయమునఁ. 395

క. తేజస్విని యతిమానో, ద్వేజితయగు రాధవలని భీతిఁ గంగాం
భోజాక్షి విష్ణుచరణాం, భోజములన్ డాఁగె నాత్మఁ బొదలెడు నార్తిన్. 396

క. అపు డెల్ల భూమిభాగము, లపగతనీరమ్ములగుట నాత్మ నెఱిఁగి త
ద్వపదపనోదార్థము నే, నపరిమితానంద మెనసి యుద నిచి యనుచున్. 397

ఉ. సరసిజనేత్రు సన్నిధిని సాంతముగా వివరించిచెప్పఁ ద
చ్చరణసరోజమం దణఁగి శాంతివహించిన గంగఁ దా బహి
ష్కరణమెనర్చె విష్ణు వదిః గ్గొని రాధికమంత్ర మిచ్చి స
త్వరముగఁ జేసితిన్ ధరణిభాగములన్ జలపూరితంబుగన్. 398

క. ఈగతి సమస్తగోళక, భాగంబున నీరు నించి పనజాక్షునకుఁ
సాగిలి యీసతిదోడ్కొని, యాగతుఁడునైతి నీ సమక్షమ్మునకుఁ. 399

వ. అని యిట్లు పలికి కృతాంజలియై. 400

చ. రసుల నగ్రగణ్యుఁడవు జాణవు నీవును నీమెయిన్ బర
స్పరమనుకూలమౌను జెలువం బనఘం బది యట్టులుండ నీ
తరుణిని నాదరించు మిది తద్ద మరులొక్కవివచ్చెఁ గాన నే
కరణివి గాని యీసతిని గాదన కీవు పరిగ్రహింపుమా. 401

క. తన యంత వలచివచ్చిన, వనితామణిఁగూడి భోగపరుఁడై యుండన్
జనుఁగాని యొల్లననుచో, ఘనతరసౌఖ్యంబు లెట్లుగలుగుం జెపుమా. 402

క. నూతనయౌవనరేఖో, పేతశుభాకారయైన యీసతిని గృపా
న్వీతుఁడవై యిపుడ జగ, త్ఖ్యాతిగ వరయింపు మీవు గాంధర్వవిధిన్. 403

చ. అని వచియించి గంగను సమర్పణఁజేసి సరోజసూతి దాఁ
జనియె; ననంతరంబ హరి సంతసమంది ప్రపుల్లపుష్పచం
దనసమలంకృతంబయిన తన్వికరాంబుజముల్ గ్రహించినం
తన జనియించెఁ గాంతకు నితాంతము సాత్వికభావముల్ మెయిన్. 404

చ. అది యదనంచు నెంచి యసురారి సురాపగఁ గౌఁగిటన్ ముదం
బెదఁ గదురంగఁ దార్చుచు నహీనశుభోన్నతిఁ బొందుచుండె నిం

పొదలెదు దాఁపున న్నతత ; మర్వికిఁ బోయినగంగ యీగతిన్
బదపడి పద్మనేత్రునకు భామినియై సుఖమందె నారదా! 405

గీ. తోయజాతాక్షపదనఖోద్భూతయగుట, విష్ణుపది యన్న పేర్లగద్విదితమయ్యె
సరససంభోగసౌభాగ్యగరిమ నెనసి, యరుతరానంద మొందుచునుండె గంగ. 406

ఉ. ఈగతి కొన్నివాసరము లేగినపిమ్మట గంగ భర్తృసం
యోగము గల్గియుండుటకు నోర్వక పల్కె-పెలంది లోన నీ
ర్ష్యాగరిమంబునం గడుగయాళితనంబున నుండెఁ; గాంతలే
లాగునసహింతు రాత్మపతిలాలితమానవతీ సమున్నతిన్. 407

క. ఇలకుంబోయిన కలుముల, చెలితోడ న్నతులు మువురు శ్రీవిష్ణునకుజా
దులసీసతితోఁ గదుకొని, వలుపురు సతులందు దుర్వి నారదమౌనీ. 408

వ. అనిన నారదుం డిట్లనియె. 409

క. శ్రీమన్నారాయణప్రియ, కోమలి తులసి యగు టెట్టు? కులమెద్ది? హరిం
గామించుటకై తానే, మేమి తపమొనర్చెనో వచియింపు మహాత్మా! 410

వ. అనవుడు నారాయణుం డిట్లను. తొల్లి భగవదంశసముద్భూతుండగు దక్షసావర్ణి
యను మనువు గలండు. అతనికి బ్రహ్మసావర్ణియు నతనికి ధర్మసావర్ణియు నత
నికి రుద్రసావర్ణియు నతనికి వృషధ్వజపాదసేవనాపరాయణుండగు వృషధ్వజుండును
జన్మించిరి. 411

ఉ. అద్రిసమానధీరుఁడగు నావృషకేతుఁడు శర్వభక్తిని
ర్నిద్రమనఃప్రమోదము గణించుచుఁ దత్కరుణానమాగతా
క్షుద్రసమస్తభోగముల శోభితవైభవుఁడై చెలంగుచున్
భాద్రపదంబునందు వలువందు రమాపదపూజనావిధిన్. 412

ఉ. శర్వమయంబు సర్వమని స్వాంతమునం దలపోసి తత్కృపా
గర్వితచిత్తవృత్తి నొకకాలమునందును గొల్వఁబోఁడు సౌ
పర్వచయంబు వాణిఁ గొలువం దొనరింపఁడు జన్నముల్ సువ
ర్ణార్చనిపూజయన్నఁ బరిహాసముజేయును బుద్ధిహీనుఁడై. 413

క. ఒండుఁ దలపోయఁ డెద బ్ర, హ్మాండం బఖిలంబు నిందుమయంబు సతం డు
ద్దండత నుండుటఁ గని మా, ర్తాండుం డురువిలయభీకరాకారుండై. 414

ఉ. లోకవిలోచనమ్ము మదిలోపల మాటికిఁ బుట్టు కిన్కమై
"నో కలుషస్వభావ! వినకోరి సదంబున సర్వదేవపూ
జాకలనంబులన్ దొలఁగి జాల్మునికై యిడి యంతటన్ హుత
శ్రీకుఁడవై చరింపు" మని చెప్పిరి శాపమొసంగి యంతటన్. 415

ఉ. భవుఁ డశ్రాంతవివర్ధమానగురుకోపప్రస్ఫురద్దీప్తభై
రవుఁడై శూలము కేలఁ దాల్చి యలిసీప్రాణేశు భంజింతునం
చు వెసం బోవుడు నేఁడుగాదె తుదియంచుం గశ్యపోపేతుఁడై
రవి వెన్నిచ్చి సరోజసూతి సభఁ జేరంబోయె ఖిన్నాత్ముఁడై. 416

మ. విధుజూటుండు పలాయితుండగు రవి న్వీక్షించి తర్జింపుచు
న్విదిగోష్ఠిస్థలిఁ జేరె; ధాతయుఁ గడున్ భీతిల్లి తద్వీక్షణ
వ్యథితస్వాంతసమేతకశ్యపతదీయాత్మోద్భవోపేతుఁడై
మధువిద్వేషణు దర్శనంబుఁ బొనరింపంబోయి కాంచెన్ హరిన్. 417

మ. భయమున్ భక్తియు సంభ్రమం బెసఁగఁ బర్వన్గశ్యపుండున్ హరి
ద్దయుఁడుం బంకజసూతియు స్మరజటరత్నాభీషణున్ దత్పద
ద్వయికిన్ హారతులిచ్చి మ్రొక్కులిడి సంత్రాసంబుతో సంహృత
స్మయులై తెల్పిరి భర్గకోపగతబీజంబెల్ల నాద్యంతమున్. 418

ఉ. కాంచనచేలుఁ డర్యముని కాతరవృత్తినిదానమెల్ల నా
లించి యభీతిముద్రనిడి లేనగ వొప్ప వచించె నిట్లు "చ
క్రాంచితపాణినై కడుభయంబున నచ్చటికేగి నన్ను సే
వించినవారి కార్తి ప్రభవించిన పట్టునఁ బ్రోచవచ్చెదన్. 419

మ. నలుమోములగలవేల్పునై జగములన్ గల్పింతు, శిక్షింతు న
య్యళికాక్షాకృతి, సర్వలోకములు నేనై యుందు; నాకుక్షిలో
పల డాఁగు న్జగముల్ లయాంతమున సర్వవ్యాపినౌదు న్నని
శ్చలవృత్తిం ద్రిగుణాత్మకంబయిన తేజంబూని వర్తించెదన్. 420

ఉ. ఇంచుక భేదమెన్నఁగలరే శివుఁ డన్నను నేనన న్వివ
ర్జించినచో శివుండనఁగఁ గేవలుఁడే యవిషహ్యవిక్రమా
ఢ్యుం డతతేజుఁ డెందు నొకఁడైన నరాధ్యములే దతండ సృ
ష్టింపను సూర్యకోటిఁ బ్రకటించు విరించనకోటి నొక్కటన్. 421

చ. అతఁ డతిలోకశక్తియుతుఁడై నను నంతరవృత్తి మద్గుణ
స్తుతి నొనరించు మన్మనువు చూచుచు నాదృతిమై దివానిశం
బతులితభక్తిఁ బంచపదనాబ్జములన్ వచియించు వాని కే
వతులొనరింతు వానికిని నాకును లేదు ప్రభేద మెంచినన్. 422

క. నను సేవించెడు మనుజుల, కనుపమభోగంబు లీను నాకాంక్షింతున్
జనుఁ డింక మద్వరంబున, వినిహతభయులగుచు వేగ స్వేచ్ఛావృత్తిఁగా. 423

వ. అని బ్రహ్మాదుల మూరార్చె నట్టి సమయంబున, 424

మ. శయకంజంబున శూలమున్ త్రిపురరక్షఃకాల మొప్పంగా జగ
త్త్రయసంక్షోభనిలామధావనకళాఘోరేయముం గా వాహముంగా
రయమారంగా దుమికించుచుం గమలినీప్రాణేశు నిర్జింపఁగా
లయకాలాకృతిఁ జొచ్చె రుద్రుఁడు మహాలక్ష్మీపతిస్థేమముగా. 425

ఉ. వాసుకిభూషణుండు వృషవాహముఁ జయ్యన డిగ్గి భక్తిసం
వాసితచిత్తుఁడై కనకవాసునకున్ నతులాచరించె వా
ణీసఖుఁ డట్లు గశ్యపుఁడు నీరజబంధుఁడు భక్తియుక్తి సం
త్రాసితులై యొనర్చిరి కృతాంతవిరోధికి వందనంబులన్. 426

ఉ. బాలశశాంకశేఖరుఁడు వాసవరత్నచిరత్నకాంతులం
గ్రాలెడు గద్దెయం దసురఖండనపార్ష్ణ దపాణివాసురాం
దోళనజాతవాతపరిశోషితుఁడై వసియించియుండ నా
వ్యాళశయానుఁ డర్యమసమానుఁడై హరిఁ గాంచి యిట్లనెన్. 427

మ. "నిటలాంతస్స్ఫుటదగ్నివీక్షణ! భవానీనాథ! నీ విప్పుడె
ట్లిటకుం బోవఁదలంచి, తేమిపని యిచ్చోటున్నదే! రోష ము
త్కటమై మోమునఁ దోఁచుచున్నయది దైత్యశ్రేణి దర్పంబునన్
జటిలోకంబున కెగ్గుఁజేసిరొకొ రోసంబూన నీకేటికిన్." 428

ఉ. శ్రీవరుఁ డెగ్గి యుండియు వచించిన పల్కుల నాలకించి యా
భూధరధన్వి యిట్లనియెఁ బూజ్యుఁడు భాగవతుండు నాకుఁ బ్రా
ణాధికుఁడైనవాఁడు కలఁ డావృషకేతుఁడు వానిఁ గాంచి భా
యాదవుఁ డాదరింపక దురంతముగా శపియించెఁ గావునన్. 429

ఉ. వాని వధింపనెంచి యనివార్యముగా నిటువంటి కోపముల్
బూనితి నేఁడు; వాఁడు కితవుండయి తావకసన్నిధానమం
దే వసియించుటం గని వధింపఁ దలంపక యుంటిఁగాని త
న్మానము ప్రాణముం గొనక మానుదునే మఱియెందు నిల్చినన్ । 430

ఉ. ధ్యాననిరూఢినైన హృదయంబుననైనను స్తోత్రపఙ్క్తిచే
నైనను నాపద ల్గలుగునప్పుడు నిన్ శరణన్నమాత్ర ద
న్యైనను బోయి ప్రోతువు జరామయమృత్యువివర్జితాంగులం
గా నొనరించి సన్నిధిని గల్గెడివారలఁ బ్రోవకుందువే । 431

క. నాభక్తుఁడు వృషకేతున, కీ భానుఁడు గడఁగి శాపమిచ్చెను "నిహత
శ్రీభాగ్యుండవు" కమ్మని, యా భూపతి కింక బ్రతుకనగునే ధరణిన్. 432

వ. అనినఁ జిఱునవ్వెలయ నారాయణుండు హరున కిట్లనియె. 433

క. అరగడియ యయ్యె నిచ్చట, తెరగంటులమానమున నదిం గన ధరలో
నిరువదియొక్క యుగంబులు, జరిగెను జను మింక హర । నిజనిలయమునకున్.

గీ. చచ్చి చిరకాలమయ్యె వృషధ్వజుండు, నాతనికిఁ బుత్రుఁడగు రథకేతుఁ డీల్గెఁ
ధర్మకేతుండు మఱి కుశధ్వజుఁ డనంగఁ, గలరు పుత్రకు లిద్ద రాజ్యోద్భవునకు. 435

ఉ. వారును సూర్యశాపమున భాగ్యవిహీనతచే రమాతప
స్యారతులై సదాసుజనసంగతులై మునివృత్తులైరి త
ద్దారలలోన నొక్కతెకు ధారుణి లక్ష్మి జనించి దుఃఖని
స్తారక మాచరించు వసుధావరులం దగఁజేయు ధీరులన్. 436

మ. మృతుఁడయ్యె న్నవదీయదాసుఁడిఁకఁ బొమ్మి । కోపమేలంచుఁ బ
ల్కి తిరోధానమొనర్చె మాధవుఁడు; పంకేజోద్భవుండుం దిరో
హితుఁడయ్యెన్; రవికశ్యపుల్ సనిరి; భూభృద్వంశ్యయుగ్ శాంతిపూ
ర్ణతముండై తపముం బొనర్పఁ జనియెన్ గైలాసశైలంబునన్. 437

వ. అనిన మహాత్మా । ధర్మధ్వజకుశధ్వజుల చరిత్రంబు వివరింపుమనిన నారాయణుం
డిట్లనియె. 438

ఉ. ధర్మకుశధ్వజాఖ్యవసుధావరు లుగ్రతపంబొనర్చి యా
ఖర్మదుకూలు బ్రేయసికృపన్ ధనధాన్యసుతాదిలాభము

ల్పేర్మి గ్రహించి యెల్లపృథివిం బరిపాలన మొప్పఁజేసి దు
ష్కర్మవిదూరులై సకలసంపద లందుచునుండి రిర్వురున్. 439

క. అంతఁ గుశధ్వజభూపతి, సుందరి గర్భంబుఁదాల్చి శుభదినమున న
య్యందిరకళచేఁ దానొక, నందని సుజ్ఞానలక్షణం బ్రసవించెన్. 440

వ. అబ్బాలామణి వేదవతినాఁ బేరొంది దినదినప్రవర్ధమానయై శ్రీనాథుండు తనకుం బ్రాణనాథుండు గావలయునని తలంచి, 441

మ. ఒకమన్వంతర మంబునం దపము నత్యుగ్రంబుగా నల్పి నా
కక్క రూపప్రతిభావయఃకలనఁ జక్కన్మించుచున్నట్టి బా
లికతో నయ్యశరీరవాణి తగఁబల్కె "నీకు శ్రీవిష్ణు విం
కొకజన్మంబున భర్తయౌ" నని వ్రతోద్యోగంబు మాన్పింపఁగన్. 442

క. ఆనాదము విని తపముఁ, మానక ముదమంది గంధమాదనశైల
స్థానంబునం దుఁ బిదప న, నూనముగాఁ దపముసేయుచుండఁగ నంతన్. 443

క. రావణుఁ డేతెంచుటయును, భావమునం గలఁగి యర్ఘ్యపాద్యావ్వితునిం
గావించిన బాలామణి, తో వాఁ డిటుపల్కె నెదఁగుతూహలమొదవన్. 444

చ. కలకలనవ్వునెమ్మొగము గామ్మొగులం దులకించు పెన్నెరుల్
తళతళ లీను మేను దెలిదామరల న్నిరసించు కన్నులున్
గలిగిన ముద్దులాడి విటు కాఱడవిన్ జడదారితీరుగా
వెలకొని యొంటిమై నిలువ నీకిది యేకత మంబుజాననా. 445

క. ఈరీతిం బలికి తిర, స్కారము గొంచియును విడువఁ జాలక వేశ్యం
గారక్రియ కతఁడు బలా, త్కారంబున దాని కేలుఁదమ్మి గ్రహించెన్. 446

గీ. మానవతి దానఁ గోపంబుఁబూని వాని
స్తంభితునిఁజేయ హస్తపాదంబు కదల
కుండుటయుఁ జేయునంలేక యువిద కపుడు
నతులొనర్పఁగసాఁగె నన్నరభుజుండు. 447

ఉ. నీదు మహత్త్వ మేనెఱుఁగనేరక యూరక తెచ్చికొంటి నీ
ఖేదము ఖేదమెంచక యకృత్రిమబుద్ధిఁదలంచి కావు ము
న్మొదవి నన్నటంచుఁ బలుమాఱు నుతించెడు రాక్షసాధమున్
మోదముతోడ బంధనవిముక్తునిఁజేసి యనుగ్రహించియున్. 448

క. నను స్పృశియించిన ఫలముం, గను(గొనుము సబాంధవంబుగా(గ మదర్థం
బున నీవు ద్రెళ్ళుదువు ముం, దని యోగముకతన దేహ మప్పుడ విడిచెన్. 449

గీ. వెల(ది దేహంబు గంగ నర్పించి నిజని, వాసగృహమున కేగి రావణు(డు మిగుల(
దా నొనర్చినపనికి సంతప్యమాన, మానసుండయి యాశ్చర్య మూనియుండె. 450

క. ఆమగువ జనకధరణీ, స్వామితనూజయయి పూర్వజన్మకృతతప
స్సామర్థ్యంబున దశరథ, రాముని వరియించి సుఖతరంబుగ నుండెన్. 451

ఉ. కోమల విగ్రహుండు రసికుండు మనోహరు( డుత్తముండు ను
ద్దాము(డు శాంతిదాంతిగుణధాము(డు లోకవిభుండునైన శ్రీ
రామునితోడ(గూడి యనురాగముతో సుఖియించుచుండె నా
భూమిజ మున్ దపంబునను బొందినవంత( దలంప కెప్పుడున్. 452

సీ. జనకాజ్ఞ రామలక్ష్మణు లరణ్యమునకు • సీతతో(గూడి వేంచేయుటయును
విప్రవేషమున హవిర్భుజుం "డెదురుగా( • జనుదెంచి యోరామచంద్ర ! యింక
జనకజాహరణమౌ సమయ మేతెంచెను • గాన సురల్పంప(గా రయమున
వచ్చితి నన్ను వైశ్వానరుం డంద్రు నా • యంద సీతను డాచి యగ్నిశుద్ధి(

గీ. జేయుతఱి మీకు నర్పింతు ఛాయ దీని(
గొను"మనిన రఘువరు( డియ్యకొని తదీయ
కృత్రిమావనిపుత్రి గ్రహించి నైజ
సీత నాతనిలో నివసింప(జేసి. 453

క. జననాథు( డరుగ నొకయెడ(, గనకమృగం బొకటి యెదుట( గాన్పించిన దా
నిని సీత తనకు( దెమ్మని, కనికర మొదవంగ రాము( గని పల్కంగన్. 454

చ. జనకజ( గావ లక్ష్మణుని శ్రద్ధమెయి న్నియమించి శాంబరీ
కనకమృగంబు( బట్టుకొన(గా నతిదూరము వోయి మాయగా
మనమున యోజచేసి యొకమార్గణ మేసిన దాన 'లక్ష్మణా'
యని మొఱవెట్టి చచ్చె; జనకాత్మజకున్ హృదయంబు జల్లనన్. 455

క. భూమిసుతాచోదితు(డై, సౌమిత్రి రఘూద్వహుని వెనం గను(గొన(బో(
గామాంధు(డు రావణు( డ, క్కోమలి గ్రహియించి లంకకుం గొనిపోయెన్. 456

క. చనుదెంచిన లక్ష్మణు( గని, మనమున శంకించి యాశ్రమస్థలికి వెసం
జని కనికర మొదవించుచు, జనకజ లేకున్న పర్ణశాలం గాంచెన్, 457

గీ. చూచి మూర్ఛిలి యంత నచ్చోట సీతఁ, గానక విచారమంది యక్కాననమునఁ
దిరిగి తిరిగి గోదావరీతీరమందు, వానరాధిపుతో సహవాసమంది. 458

ఉ. సేతువుఁగట్టి వీరకపిసేనలు గొల్వఁగ లంకకేగి యా
ఘాతుకుని న్రణాంగణముగా ననిఁ ద్రెళ్ళఁగనేసి లోకవి
ఖ్యాతయశస్కుఁడై జనము లచ్చెరువంద సురల్ నుతింపఁగా
సీత కృశానుకీలల వసింపఁగఁజేసినఁ దత్క్షణంబునన్. 459

క. అనలుఁడు నిజసీతను రా, మున కర్పణసేయ ఛాయ మునుకొని "యే నే
పని యొనరుతు" నన దానిం, గనుఁగొని రామాగ్ను లనిరి కరుణాన్వితులై. 460

క. దుష్కృతహరమగు దేవీ, పుష్కరమునఁ దపమొనర్చి పుణ్యఫలం బా
విష్కృతముగ స్వర్లక్ష్మివి, నిష్కర్ష న్గాఁగలవు వినిశ్చయ మనినన్. 461

గీ. వారి పేర్కొని ఛాయ దివ్యంబులగు త్రి, లక్షవత్సరములు తపోదీక్ష నుండి
స్వర్గలక్ష్మియై మరలఁ దపంబుసేసి, యగ్నికుండసముద్భవయయ్యె నంత. 462

క. ద్రౌపది నాఁ బేరొందెఁ బృ, థాపుత్రుల కేవురకును దార యగుచు ను
ద్దీపించుచుండె జనులు మ, హాపతిరత యంచు ధరణి నభినుతిసేయన్. 463

గీ. వరుస కృతయుగమునఁ ద్రేత ద్వాపరమున, వేదవతి సీత కృష్ణనా వెలఁదులై కు
శధ్వజ జనక ద్రుపదవిశ్వంభరాధి, పుల గృహమ్ముల జన్మింపఁగల రనంగ. 464

క. అంగన యొక్కతె పాండవ, పుంగవు లేవురకుఁ దా నపూర్వంబుగ న
ర్ధాంగ మగుటెట్టులొకొ యా, సంగతి వివరింపుమనిన జటిలున కనియెన్. 465

క. ఓమునివర! నిజసీతగా, రాముఁడు గ్రహియింపఁ జాయ రామాగ్న్యాజ్ఞన్
గామహరు గురించి తపమును, నేమముతో సల్పె యాతనిం గని మెచ్చన్. 466

క. "పతి పతి పతి పతి పతి" యని, యతికామాతురతఁ బల్కె నతివం గని స
స్మితముఖుఁడై శితికంఠుఁడు, పతిపంచక మొసఁగితి నని పలికెన్ బ్రేమన్. 467

క. అది కారణముగ నా ద్రౌ, పది పాండవు లేవురకును భార్యామణియై
పొదలెఁ; బిదియెల్ల నీకుం, బదిలంబుగఁ జెప్పవలసెఁ బ్రస్తావముగన్. 468

సీ. లంకయందలి యచలాకన్య రాముఁడు • పేర్మిగ్రహించి విభీషణునకు
లంక నొసంగి చెలంగుచుఁ దనయయో • ధ్యాపురి కేతెంచి ధారుణీశు
లెల్లరుఁ గొలువంగ నేకాదశసహస్ర • వత్సరంబులు రాజ్యవైభవమున
వఱలి సర్వంబుతో వైకుంఠమున కేగె • నలవేదవతి లక్ష్మి యందుఁ గలసె

గీ. వేదములునాల్గు జిహ్వపై వెలయునట్టి, వేదవతి పుణ్యకథనంబు వీను లలర
వినినవారికిఁ బాపనాశనము గాదె, మంజుగానవినోద! యోమౌనినాథ. 469

క. అజపుత్ర! వినుము ధర్మ, ధ్వజభూపతి న్యాయమతియు దారుణరణరం
గజితాఖిలారాతియై తన, విజయాంకము లెల్లయెడల వెలయించె రహిన్. 470

ఉ. అర్ణవమేఖలాధిపతు లందఱుఁ దా మరిగాపులౌట సం
పూర్ణమనోరథంబునను ముద్దియతోఁ జని గంధమాదనా
భ్యర్ణసమంచితోపవనవాటికలోనఁ బ్రఫుల్లపుష్పసం
కీర్ణనికుంజపుంజములక్రేవలఁ దావులదీవులం గనెన్. 471

చ. ప్రిదులని హాళితో నచటఁ బేశలకోకిలకాకలీరవా
స్పదపదముల్ గనుంగొనుచు భామినిఁగూడి రతాభిలాషముల్
మదిని దిటంబులౌచుఁ బొదమంగ సుగంధిలపుష్పశయ్యపై
ప్రిదులనివేడ్క లుప్పతిలఁ బెక్కువిధంబులఁ గేళిసల్పుచున్. 472

సీ. కాసారముల మరందాసారములయందు, నారజంబున నోలలాడి యాడి
పొంపిరిగాఁ బూచి యింపుల నింపు స, పెఁగల మాటునఁ గేళిఁ దగిలి తగిలి
మేలిమిజాళువాడాలచేఁ గ్రాలిన, గట్టులపట్టునఁ గలసిమెలసి
చాలుగాఁ బ్రాలిన యేలాలతల లాగి, తూఁగుటుయ్యేలల నూఁగి యూఁగి

గీ. యిట్టులా దంపతులు కుసుమేషుకేళి, కేలదంవహ్యమానులై కేళులందు
సంతతామోదసంభృతస్వాంతులగుచు, వెలపి రజ్ఞాతదిననిశాభేదు లగుచు. 473

క. ఒడలనలఁది గంధము మణి, తొడవులును బూని హొయలుదూఁగఁగ నచటన్
బడఁతుకలమిన్న మాధవి, కడు ముద మొనరించెఁ బతికిఁ గలయికలందున్. 474

చ. వినువొకయింతలేక యలివేణియుఁ దాను మనోజకేళి దు
ర్వ్యసనమనస్కులై తనర నామరవర్షశతంబు జాఱె; మా
నస మెరియంగ మన్మథరణంబునఁ దృప్తినిజెందె బూపుఁ; దా
బిసలసరోజకున్ రతులఁబాయనికోర్కెలు పేరె సారెకున్. 475

క. సురసుపతోఁ జిరకాలము, సురతంబున మెలఁగి తృప్తిఁ జొప్పడకుండెన్
బురుషులకన్నను మోహము, తరుణుల కష్టగుణ మన యథార్థముగాదే. 476

క. ఈలీల నుండ సద్యః, కాలమ్మున విధివశమునఁ గాంతామణి చూ
లాలై శతవర్షమ్ములు, దాలిచె శుభలక్షితమ్ముఁ దద్గర్భమ్మున్. 477

మ. అకలంకగ్రహబుధయోగశుభలగ్నాంశక్షణంబైన కా
ర్తికపున్నమ శుక్రవారమునఁ బుత్రీరత్న మొక్కర్తు బో
టికి వారాశితనూభవాంశమునఁ బుట్టెన్ దుందుభిధ్వానముల్
ప్రకటంబయ్యె దివంబునందు సుమము ల్వర్షించి రద్దేవతల్. 478

సీ. శరదిందునిభమైన చక్కనిమోముతోఁ • గంజంబులను బోలు కనులతోడఁ
బక్వబింబప్రభాభాసురోష్ఠంబుతో • మందముఁ దులకించుమించుతోడఁ
బల్లవారుణకరపాదయుగ్మంబుతో • భాభాసమానత్రివళులతోడ
నిందిందిరంబులనీను పెన్నెరులతో • వర్తులతరనితంబంబుతోడ

గీ. సీతున సుఖోష్ణమై, సుఖశీతలంబు • తపమునందున నై యొప్పు తనువుతోడఁ
బరిఢవిల్లుచునున్న యబ్బాల సోయ • గమ్ము నిరుపమ మనియె జగజ్జనమ్ము. 479

క. అచ్చిఋతతోడఁ బోల్ప వి, యచ్చరసతులైనఁ దగరటంచు ననుపమై
నచ్చెంతనున్న మౌనులు, వచ్చి తులసియనుచుఁ బేరుఁ బలికి చని రొగిన్. 480

వ. తదనంతరంబ కాంతలతలమానికంబగు తులసి భూమిఁ బడినంత శ్రీప్రకృతిం జేసి సర్వజనప్రసిద్ధయై మునిజనావాసపావనంబగు బదరికావనంబునకుం జని నారాయణుండు తనకుఁ బ్రాణేశ్వరుండై యున్నించుత మని తా భావంబున భావించుచుఁ దదేకాయత్తచిత్తయై దేవమానంబున లక్షహాయనంబులు ఘోరంబగు తపంబుఁ జేయంగదంగి. 481

సీ. గ్రీష్మంబునం దతిభీష్మపంచాగ్నిమ • ధ్యస్థయై ఫలజలాహారయగుచు
వర్షర్తువునయందు వానపంగుళ్ళలో • నాసీనయై దళాహార యగుచు
వడవడ వడఁకించు వలిగాడ్పులో సీతు • వందున మారుతాహారయగుచు
నేకపాదమునఁ దదేకనిష్ఠమనోజ్ఞ • ధారిణియై నిరాహారయగుచుఁ

గీ. దివిరి పది యిర్వదియు ముప్పదియును నల్వ
దియును వేలేండ్లు వరుసగా స్థిరతఁ బూవి
రాత్రియు దివమ్ము నాక ఘోరంపుటంగిఁ
దపమొనర్పఁగ సాఁగె సంతప్తయగుచు. 482

క. ఈరీతి నట తపోదీ, క్షాపరతయై యున్నతులసిఁ గన్గొని రహి వా
ణీపతి యేతెంచి సాక్షా, త్కారముఁ గావించె వరము దయ నీయంగన్. 483

క. ఆ జేజేపెద్దం గని, తా జేజే జేయుఁగా నతం డనె సతి యే
యోజను దపమొనరించెద, వే జడియక యెడఁదనున్న వితముం జెపుమా. 484

క. హరిభక్తియైన నిచ్చెద, హరిదాస్యంబైన నిత్తు నజరామరతన్
వరియించెదేని యొసఁగెదఁ, దరుణీ! మదిలోని వాంఛితముఁ గైకొనుమా. 485

మ. అనుచుం బల్కిన ధాత కిట్లనుఁ దులస్యబ్జాక్షి "యోహంసవా
హన! సర్వజ్ఞుఁడవయ్యు నన్నడుగ న్యాయ్యంబౌనె! లజ్జింప నా
కనువౌనే, యిదియెల్ల నీవెఱుఁగవే యౌఁగాక నీయానతిన్
వినిపింతు న్వినుమయ్య నాదగు పురావృత్తాంత మాద్యంతమున్. 486

సీ. తులసి యందురు నన్ను తొల్లి గోజగమున • గోపిని నాఁ గృష్ణుకూర్మిచెలిని
రాసకేళిని శౌరిరతిభుక్తను నతృప్త • మూర్ఛితనగు నన్ను మురవిరోధిఁ
గని రాధ హరిఁ దిరస్కారంబు గావించి • కోపంబు నాయందుఁ గూర్చిమిగుల
మానవయోనిసంభవవు గమ్మని శాప • మిచ్చిన హరిదయ నెడఁదఁ దాల్చి

గీ. భీతిఁ బొందకుము మదంశజాతుఁడైన
వానిఁ జతుర్భుజు భరతవర్షమందు
బ్రహ్మవరమునఁ దపముచేఁ బతిగఁ బొందఁ
గల వనుచుఁ జెప్పి చనియె నాగరుడహయుఁడు. 487

క. ఆదేవివలన భయమున, నే దేహము విడిచి ధారుణి జనించితి న
బ్జోదరు నారాయణుఁ బతి, గాఁ దలఁచుచు నుంటి నిచటఁ గరుణింపు ననున్. 488

క. కాంతుని సుందరవిగ్రహు, శాంతుని నారాయణుని యశస్కరుఁ బతిగా
నెంతయుఁ గోరితి వరమి, మ్మంతఃకరణంబునన్ దయంగొని" యనఁగన్. 489

ఉ. అండజవాహనుం డనియె నాహరివంశభవుండు మున్ సుదా
ముండను గోపకుం డొకఁడు పుట్టెను రాధికశాపయుక్తి మా
ర్తండసమానతేజుఁడు ధరాస్థలి భారతమందు శంఖచూ
డుండన మాధవాంశభవుఁడున్ ఘనుఁడున్ దనువంశజుండునై. 490

ఉ. వాఁడు చతుర్భుజుండు మగువా! మును గోభువనంబునందు నీ
పోఁడిమిఁ గాంచి మారశరపుంజవిభిన్నమనస్కుఁడయ్యు నిన్
గూడఁడు రాధికాసతి గనుంగొని తన్నదలింప వీని కీ
రేడుజగంబులందు సరి యేరును లేరు జనిస్మరుల్ భువిన్. 491

క. నీవును జాతిస్మరవై, యీ వృత్తాంతంబు నెఱుఁగు దివ్పు దళనికిన్
దేవేరి వగుదు పిమ్మట, గోవిందు వరింపఁగా నగు నిది ధ్రువంబౌ. 492

ఉ. శ్రీవరశాపయోగమునఁజేసి మహీరుహతాప్తి నీకగున్
నీ వెలియైనపూజ కడునిష్ఫలమౌను సుమంబులందు నెం
తో వరమౌదు, ప్రాణములతోఁ దులగాఁదలఁచు న్మురారి బృం
దావనియంచు నిన్బుధజనంబులు మ్రొక్కుదు రిచ్చ నిచ్చలున్. 493

క. నీపత్రంబులఁ జేతురు, గోపాలకదేవపూజ గోపకులు త్రిలో
కీపావనివై నెగడుదు, దీపించెదు హరికడఁ దరుదేవ్యాకృతితోన్. 494

గీ. నావరంబున నిన్నియు న్గలుగు నీకు
ననుచుఁ బల్కిన సంతోష మావహిల్ల
మోముఁదమ్మిని చిఱునవ్వు మొలకలెత్త
హంసహాయునకు మ్రొక్కుచు ననియెఁ దులసి. 495

చ. మనమునఁ దాఁకియున్న యనుమానము దెల్పక మిన్నకుండరా
దని వినిపించెదన్ ద్విభుజునందలి నెయ్యముఁబోలె నాకునే
యనువునసుం జతుర్భుజునియం దొనగూడదు మున్నశప్తనై
తిని శుచిలింగమొంది యదుదేవునిఁ గూడి రమించి సారెకున్. 496

ఉ. నాలుగుబాహువు ల్గలిగినన్ వరియించెద శంఖచూడునిన్
బోలునె శౌరియాన తలఁబూనక యేరికినైన; రుక్మిణీ
లోలునిఁ బెండ్లియాడుటకు లోఁగుదు నీవరయుక్తి రాధికా
లీలతయంబుఁజేసి యది వేగమె నాయ ననుగ్రహింపుమా. 497

క. అనవుడు నలినోదరుఁ డిట్లను గడుమోదమున షోడశాక్షరయుతమై
చను రాధామంత్రము గై, కొనుమా యనుమానమేల కొమ్మ! యొసఁగితిన్. 498

క. రాధకు నీకుం గలుగు న. సాధారణమైనపేర్మి; జలజాక్షునకున్
రాధాసమాన వగుదువు. రాధకెఱుఁగఁబడవు మీదు రతిమర్మంబుల్. 499

క. అని యానతిచ్చి రాధా, మనువు నొసంగి కవచక్రమంబును స్తోత్రం
బును బూజాదికముఁ దెలిపి, చనియెన్ మేల్దీవనల నొసంగుచు నంతన్. 500

క. ఆ మంత్రోపాసనమున, నామానిని తులసి సిద్ధురాలయ్యెఁ గడున్
దామరసావాసినిబలెఁ, దామరసోదరునిమహిమఁ దద్దయుఁ జెలఁగెన్. 501

మ. త్రిజగద్దుర్లభభోగభాగ్యములచే దీపించి నిర్ధూతఘో
రజపక్లేశయుఁ బ్రాప్తయౌవనయునై రాజర్షిమృష్టాన్న మిం
పుజనింప న్భుజియించి మై మలయజమ్ముం దాల్చి మల్లీసుమ
వ్రజశయ్యాంతరమందు సౌఖ్యమున నిద్రంజెందెఁజూ, నారదా! 502

మ. నిదురింప న్మదిరాక్షిగాంచి యపుడా నీరేజబాణుం డిదే
యదనంచుం బదునైనసాయకము లేయ న్శంఖచూడాఖ్య ము
న్మది నెల్లప్పుడుఁ గోరుచున్నకతన న్నారీవతంసంబు స్వ
ప్నదశం గాంచెను తత్పురారివిభు రూపత్రాసితానంగునిన్. 503

క. కాంచినయంతన మోహ ము, దంచితగతిఁ బొడముటయు నతం డద్దానిన్
బంచాయుధకేళిని దే, లించెన్ స్వప్నగతిఁ దెలియలే రెవ్వారున్. 504

ఉ. అంతట మేలుకాంచి హృదయాధిపుఁ గాన కొకింతవంతయున్
సంతసముం బెనంగొనఁగ సారసలోచన మాటిమాటిక
త్యంతవిషాదముంగొను "నహా" యను మెచ్చుచునుండు ; నంతలో
వింతఘటించిపోయెఁ గుసుమేషుఁ డిఁకేమనవచ్చు నారదా! 505

వ. అంత నక్కాంతామణి కంతు దురంతచింతాభరంబు సహింపంజాలక పరాధీన
చేతస్కయయి. 506

సీ. ప్రాణేశుఁ డెపుడు గన్పట్టునం చూరక • గ్రుక్కిళ్ళుమ్రింగుఁ దాఁ గొంతసేపు
అంతలో వల్లభుం డగపడెనని బయల్ • కూరిమితోఁ జూచుఁ గొంతసేపు
అటుపైఁ బరీరంభ మాచరించె నటంచు • గుబ్బ లుబ్బొంగించుఁ గొంతసేపు
తరువాత సంభోగదశఁ దేల్చెననుచు నె • క్కాను పరాధీనతఁ గొంతసేపు

గీ. ఏగెనని తాపమందు నొక్కింతసేపు • చింతగొను సంతసంబందు కొంతసేపు
కామకల్పిత మోహాంధకారమందు • సంచరించుటఁజేసి యాసారసాక్షి. 507

ఉ. ఒంటిగనున్న నాకడ కయో! చనుదెంచునే వాఁడు? వచ్చి న
న్నంటునె? యంటెనేని మునులందఱు దూఱరె? దూరకుండినన్
గంటికిదోఁచు వానిపయిఁ గల్గిన మోహము మేలె? యైన నీ
తుంటరియౌ ననంగు ననతూపుల తీపుల కోపవచ్చునే. 508

చ. తతమృదుమల్లికాకుసుమతల్పముఁ గాంచినమేని కంటకాం
చితముగఁ దోఁచుఁ, జెందిరము చిచ్చుగఁ గన్పడు, నాలయంబు ప

ర్వతగుహాపోల్కిఁ గాంచుఁ, దనవస్త్రము బర్వఁగ నెంచు; నెద్దియుం
వితయగుఁ గాదె కూర్మివిభునింగనఁ జిత్తముగల్గు చానకున్. 509

చ. అటు చటులాక్షి నెమ్మనము నంటిన మోహము నిల్పలేక తా
నటమటఁ బొందుచుండఁగఁ దదంతికశైలచరత్సురాంగనల్
తటుకున వచ్చి కొంతపరితాపము డిందుపడంగ నాతఁ డి
చ్చోట కరుదెంచుటల్ దెలిపి సుందరిఁ దేరిచి యేగి రంతటన్. 510

క. యోగియయి శంఖచూడుఁడు, జైగీషవ్యాఖ్యమౌనిసత్తమువలనం
దాఁ గృష్ణమంత్రముం గొని, యేగెం బుష్కరమునకు సమీహితబుద్ధిన్. 511

క. అచ్చట విధాత కృపచే, నిచ్చిన వరములనుగొని ద్రుహిణునానతి వాఁ
డచ్చోటు విడిచి ముదమునఁ, గ్రచ్చఱ విచ్చేసె బదరికావనమునకున్. 512

వ. అంత నాపనంబునఁ దులసీలలామంబు తపంబు సేయు వనాంతరంబునకుఁ జను
దెంచె నప్పుడు. 513

ఉ. సుందరవిగ్రహుండు పరిశోభితరత్నవిభూషణుండు సం
క్రందనవైభవుండు రసికప్రవరుండు మనోహరుండు శ్రీ
చందనచర్చితాంగుఁడు హసన్ముఖుఁడౌ నలశంఖచూడు నా
నందముతోడఁ గాంచె లలనామణి మోహరసాబ్ధి మున్గుచున్. 514

క. ఇని మనలజ్జావనతా, ననయై చెలువొందుచున్న నారీమణి న
ద్దనుజోత్తముఁ డప్పుడు గ, న్గొని యిట్లనిపల్కె లో ననూనప్రీతిన్. 515

ఉ. వారిదరాజివేణిముఖవైభవ మొందక కంజపుంజ మె
వ్వారిఁ గాంచ సిగ్గుపడి వారికి మధ్యమునన్ వసించియున్
వారిధిపుత్రుఁ డాక నలవారిజనేత్రముఖం బటంచొకో
వారితగంధమై ముకుళవైఖరిఁ బొందుచునుండు నెప్పుడున్. 516

చ. రమణిముఖాంబుజాతమకరందముఁ గ్రోలెదు నిచ్చ నేగి భ్రూ
ణమును సువర్ణమానము గనంబడ భీతినిఁజెంది యుత్తమాం
గమున వసించి తచ్చరణకంజములంగని వెన్కనుండి సం
భ్రమమున నేగుదెంచు భ్రమరంబులునాఁ దగి వేణి చెల్వగున్. 517

ఉ. తమ్ములమూసు మోము, కుముదంబులఁ జోదు కనుల్, మెఱుంగుట
ద్దమ్ములకీడు చెక్కుఁ, లదిదంబుల గోడునడంచు నారు, చిం

దమ్ములఁజేఁదు కుత్తుక, పదమ్ముల కోఁదు ప్రవాళ, మిట్టియం
దమ్ములఁబ్రోడ పూర్వసుకృతమ్మున నాకుఁలభించె నేఁడిటన్. 518

వ. అని యనేకభంగులఁ గొనియాడి తత్సమీపంబునకుం జని జిఱునగ పంకురింప మెల్లన నిట్లనియె. 519

ఉ. ఎక్కడిదానవీవు? కులమెయ్యది? నీతలిదండ్రులెవ్వ? రీ
విక్కడ నొంటిమై నిలువ నేమిప్రయోజన? మెట్టిచోటు నీ
యిక్క? దరిం జరించు చెలు లెవ్వరు లేరదియేమి కారణం?
బిక్కతయెల్లఁ దెల్లముగ నింతయు దాఁపక తెల్పు మంగనా. 520

క. అన సాధ్వి యిట్లనియె "దను, జనాథ! ధర్మధ్వజాఖ్యజగతీపతికిన్
దనయను నారాయణుని బ, తినిగాఁ దలపోసి చేసితిని దపమిచటన్. 521

క. భూమీశుఁడవని పలికితి, మోమోడక యింతవట్టు పురుషులతోడన్
రామామణు లేకతమున, నేమాటలు పల్కనేర్తురే, యిదితగునే! 522

ఉ. కోమలి సత్కులీనయగు కొమ్మ వివిక్తతలమ్మునన్ గుల
గ్రామణియైన పూరుషుఁడు గన్గొనఁబోవునె? పోయెనేని యా
భామినితోడ వేతొక నెపంబిడి పల్కునె? దుష్టవంశజా
ల్గాముకులైనయట్టి పలుగాకులఁబోలె, సురారిసత్తమా. 523

వ. ఇదియునుంగాక, స్త్రీజనం బతిగర్హితంబు; ప్రాజ్ఞుండగువాఁడు స్త్రీ జనాధీనుండు కానేరఁ" డని పలికి మఱియును, 524

ఉ. మంతనమందు మానినుల మచ్చికసేయఁగరాదు. చేసెనే
నెంతయు భీతిమాలి పతి హేళనసేయు దురాత్మకార్యము
ల్చింతనసేతు, రెప్డు నిరసింతురు కాంతులమాట, వింతలే!
యింతులకున్ మగండు చనవిచ్చినతోడనె నెత్తికెక్కుటల్! 525

ఉ. కామిని పొందులేనియెడ గ్రొర్యముఁ గోపముఁజూపు; విస్ఫుట
త్తామరసాక్షి సూక్ష్మసురతంబున మిక్కిలి దుఃఖమందుఁ; గాం
తామణి గాఢమౌ విధువనంబున సంతసమందు; వద్దిరా!
భామల కెద్దియు న్సురతభాగ్యముకన్నను దక్కువేకదా. 526

క. ఎలఁబ్రాయము సౌందర్యముఁ, గలిమియు రసికతయు సురతకౌశలముఁ గలల్
గలిగిన మగవిని ప్రాణం, బులతో సరిఁజూచెదరు ప్రఫుల్లాబ్జముఖుల్. 527

క. ముదుసలి, సురతాశయుఁ గని, ముదితలు నెపముంచి కలహమును బెంచి సదా
పదరుదురు; నరుల కింతుల్, గద కష్టసుఖంబులీయఁ గారణభూతల్ । 528

క. సారసగంధికి మిత్రులు, వైరులు గలరే । వినూత్నపరు వనుదినముం
గోరుచునుండ్రు సతీత్వా, చారంబులు వెలికిఁదోఁప సంప్రీతి మెయిన్. 529

ఉ. జవ్వని కాత్మలో నితఁడు చక్కనివాఁడని తోఁచెనేని తా
నెవ్విధినైన వాని వరియింపఁదలంచును గాని బంధువుల్
నవ్వుదురో, మరేమను నొనాథుఁడు, లాఁతులుదూఱరొక్కొ, యే
నెవ్వము గల్గునో? యని గణింప దొకించుక రాక్షసోత్తమా. 530

క. కార్యముగలయప్పుడు పరి, చర్యలుగావించి విభుని సమ్మతిగా సౌం
దర్యము ధరించి తలఁచిన, కార్యంబగుఁబిదపఁ దృణముగాఁ గండ్రు చెలుల్."

వ. అనవుడు. 532

ఉ. ఇందునిభాస్య నీవు వచియించిన పల్కులవెల్లఁ గల్లగాఁ
వందువిశేషముండె జనులందఱు మోహపడంగ ముఖ్య శతా
నందుడు సృష్టిఁజేసె లలనాజనరూపము రెండురీతులన్
బొందుగ మంచిచెడ్డలను బోల్చి గ్రహించిన యుక్తి మిమ్మహిన్. 533

గీ. రాధ సావిత్రి లక్ష్మి సరస్వతియును, దుర్గ మున్నగునట్టి సతులు విధాత
చేత నిర్మింపఁబడి రాదిసృష్టియందు, అఖిలమంగళసంధాత్రులగుచుఁ దరుణి. 534

క. వీరలకళచేఁ బుట్టిన, స్త్రీరూపము మంచిదని పఠింతురు విబుధుల్
వారల పేర్వేఱుగ నే, వారసి చెప్పెదను విను సమాహితబుద్ధిన్. 535

సీ. తార మందోదరి దమయంతి మేన వే । దవతి కౌశిక యరుంధతి యహల్య
శతరూప దక్షిణ స్వాహా ఛాయావతి । శచి దేవహూతి యనసూయ యదితి
వరుణాని తులసి లోపాముద్ర కోటవి । దితి రోహిణియు పతివ్రతలు; మఱియు
గంగ ధరిత్రి మంగళ చండి స్మృతి మేధ । ప్రభ శోభ కీర్తి సంపత్తి శాంతి

గీ. క్షాంతి నిద్దుర క్షుత్పిపాసలు దినంబు । పుష్టి తామసి కాంతి సంతుష్టి శ్రద్ధ
యనెడు వివియెల్ల స్త్రీరూప మందినవి యుగయుగంబున జరియించు నుత్తమగతి

వ. అది గావున. 537

ఉ. పండితుఁ డుత్తముండు పరభామను గోరునె యెవ్వఁడైన నో
యందజయాన । యానబుధ యానతి వచ్చితి, నేను శంభుచా

డుండను రాక్షసేంద్రుఁడఁ; గడు న్ముదమారఁగ విన్నవిచ్చటం
బెండిలియాడఁ గోరితిఁ జూమీ! మది సంశయ ముజ్జగింపుమీ. 438

క. తొలిపుట్టువున న్విష్ణువు, కలచేత సుదాముఁడనఁగ గణుతింపంగా
వలరితి గోపకులంబునఁ, బొలతిందిని రాధశాపమున నిపుడైతిన్. 539

క. మును నీవు తులసి వా కృ, ష్ణునిచే సంభుక్తవగుటఁ జూచి మనమునం
గినుక వొడమ రాధిక భువి, జనియింపఁగ శాప మపు డొసఁగెను నీకున్. 540

వ. అపుడు నీయందు బద్ధానురాగుండనయ్యును రాధికాభయంబున నిన్నుఁ గలయనైతి; నిదియెల్లఁ గృష్ణమంత్రప్రభావంబ; యే నెఱుంగుదు నీవును జాతిస్మర వగుటం జేసి యీ వృత్తాంతంబంతయు నెఱుంగు దనవుడు, 541

గీ. మగువ పిన్ననవ్వు నగి యిట్లనియె దాన. వేంద్ర! కామవశత నివ్విధమునఁ
దెలివికల్గువాఁడు స్త్రీజితుం డగునయ్య!, యైన శుద్ధుఁ డందురయ్య వాని! 542

చ. అమలమనస్క! విప్రుఁడు దశాహమునన్, క్షితిభర్త ద్వాదశా
హమునను, నూరుజుండు పదునైదవ ప్రొద్దునఁ, బాదజుండు మా
సమునను శుద్ధిజెందుదురు జాతమృతమ్ములఁ; నంగనాజితుం
డమలినుఁడౌఁ జితాదహనమందని పెద్దలు సెప్ప విన్పడున్. 543

గీ. స్త్రీజితంబగు నెవ్వనిచిత్త మాతఁ, డిడిన పిండోదకంబుల నిచ్చఁగొనరు
పితరు; లమరులు పూజాదివిధులఁ గొనరు, జపతపోజ్ఞానవిద్యాయశంబు లున్న.

ఉ. హీనున కంగహీనునకు వృద్ధున కామయదుష్టదేహి కా
జ్ఞానునకుం దరిద్రునకు షండున కంధునకుం బరాంగనా
ధీనునకుం బ్రకోపికిని దీనునకుం దనకన్య నిచ్చు న
మ్మానవుఁ డొందు నుర్వి నవమానము రౌరవముం బరంబునన్. 545

క. శాంతునకున్ వర్ణికి గుణ, వంతున కనురూపవైభవునకు ధీ
మంతున కాత్మజ నిచ్చిన, సంతసమున వాఁడు గను దశక్రతుఫలమున్. 546

మ. మనుజుం డెవ్వఁడు కూఁతు నమ్ముకొని సంపాదించు విత్తంబు వాఁ
డనిశంబున్ యమకింకరాహతుల హాహాకారముం జేయుచు
న్వెనువంతంబడు భీకరంబయిన కుంభీపాకమందుం బువ
ర్జని దుష్టామయపీడితాంగుఁడయి మాంసం బమ్మి జీవించెడున్. 547

వ. ఈప్రకారంబున నొండొరులు వివాదంబుచేయు చక్కటికి వేల్పు పెద్ద విచ్చేసి వారలం గనుంగొని. 548

మ. దనుజాగ్రేసర ! వాదమేటి కిఁక గాంధర్వంపుఁ జందాన నీ
వనితం బెండిలియాడు మిర్వురకు దాంపత్యంబు మేలౌ సతీ
జనరత్నంబగు నాలతాంగి పురుషశ్లాఘ్యుండ వీవున్ మహా
జ్జనితంబైన ఫలంబుఁ బోవిడిచినన్ సౌఖ్యంబు చేకూరునే. 549

క. ఏల పరీక్షించెదవో, బాలామణి ! యిట్టి సుగుణవంతునిఁ బతిగా
నేలోకంబునను గనం, జాలవు వరియింపు మితనిఁ జాలమిఁ కేలా. 550

చ. గణపతిపుష్టి, యయ్యదితి కశ్యపుఁడున్, జ్వలనుండుస్వాహ, రో
హిణి శశియున్, శచీపతి మహేంద్రుఁ, డహల్యయుగౌతముండు, ధా
రుణియు వరాహమూర్తియు, నరుంధతి మత్సుతుఁ డట్ల మీరలుం
గణనవహింత్రు నీకు పతి కాఁగలఁ డాహరియుం బునర్జనిన్. 551

గీ. వనిత యీతడు మింక శోభనముగల్గు, నాదు వచనంబు వితథయగునా యటంచు
దీవనల నిచ్చి చనియె వాణీవరుండు, భావజాతార్తి దైత్యుభావంబు జెందె. 552

క. అందములప్రోదయగు తుల, సిం దానవచక్రవర్తి చిత్తములో నా
నందము మీఱఁగ నప్పుడు, గాంధర్వవిధి న్వివాహకౌతుకమెసఁగెన్. 553

క. అసమయంబున నాకని, వాసులు గురిసిరి ప్రసూనవర్షము గంధ
ర్వీసముదాయము నాట్యము, చేసెను దుందుభులమ్రోఁత చెలఁగెను బిట్టై. 554

ఉ. అంతట శంఖచూడదనుజాధిపుఁ డంగన చేయిపట్టి త
త్ప్రాంతకిసాలజాలకలతాంతవితాంతవిభాసిబంభరా
క్రాంతవితాయమానహృదయంగమగానవిలోలవృక్షవా
ట్యంతరభాసమానమగునట్టి లతాగృహసీమఁ దారిచెన్. 555

క. తారిచి యందులఁ దత్సుమ, వారంబుల నొక్కసెజ్జ భద్రముగాఁగన్.
పే రచియించి తటాలున, నారీమణిఁ జేసెఁ గురువున న్వసియింపన్. 556

చ. కుసుమునఁ జేర్చి యంత నెఱికొప్పువయి న్సవరించి కమ్మపూ
సరులు ఘటించి చెక్కులఁ బసంపుగ లేనెలవంకలుంచి మో
విరసము గ్రోలి సిబ్బితిని ప్రీలిచి మైపులకింపఁగాఁ గళల్
కరముల నంటుచుం బడఁతుకం గరగించెను మించుపక్కలన్. 557

ఉ. పమ్మిన కూర్మి దానవుఁడు పార్వణచంద్రముఖిం బిరాన గా
ఢమ్ముగఁ గౌఁగిలించి ప్రకటంబుగ వాతెఱ ముద్దొనర్చి యా
కమ్మనివింటివాని బలుకయ్యమున న్సుఖియించె నెద్దకున్
సమ్మతియైనపోల్కి నెఱజాణతనంబునఁ గోర్కి దీఱఁగన్. 558

ఉ. అత్తఱి నత్తపస్విని రతాంతమునం గనుమూసి యెంతయున్
జిత్తము రిత్తయైతనరఁ జెందెను మూర్ఛ నతండు లేచి యా
బిత్తరి తాళవృంతములవీవఁగ మెల్లన మూర్ఛఁదేఱి తాఁ
జిత్తహరుం గనుంగొని వసించె పునారతి కిచ్ఛగించుచున్. 559

మ. అవునా, గాఢరతిన్ శ్రమంపడఁగఁజేయం గాంత ! నన్నంచు నా
నవలారత్నము ధీరత న్మనములోన ప్మెఱి పుంభావకే
ళి వొనర్చెన్ చలదున్నతస్తనచలల్లీలామణీహారకాం
తవదర్పోజ్జ్వలనేత్రకోణయయి యాత్మ న్నాథుఁ దగ్గింపఁగన్. 560

వ. ఇటు లవ్వీరాయిత మ. క్కుటిలాలక తానొనర్చి కొండొక వడికిన్
దటుకున వ్రాలెను తామ. న్యటు పేరురమందు మాలికాకృతి దోఁపన్. 561

ఉ. ఆతరుణీలలామయు సురారియు నవ్వనవాతపోతవి
ద్ధూతరతిశ్రమాంబుఌయి తోరపుఁబ్రీతి మనంబు లూరఁగా
ద్యోత మొకింత సోఁకని మధువ్రతకోకిలమంజుగీతికా
స్ఫీతరసాలసాలసరణిందగు గొజ్జఁగినీటికాలువన్. 562

చ. కనుఁగొని లేచి యయ్యసుర కామినికిం గయిదండ యిచ్చి మె
ల్లన నడిపించుచో వవివిలాసములెల్లను గానిపించి క
మ్మని వలిపెంపుఁదెమ్మెర సుమాళముగా శ్రమ నార్ప నాసర
మ్మను దఱియంగవచ్చి దరి బోటిని నిల్పి ముదాన నిట్లనెన్. 563

క. కొమ్మా ! యల్లది కాంతే, తుమ్మెద యాతమ్మిలో మధువు నాని పెసన్
గొమ్మని యళి కందిచ్చుట, జుమ్మని తా రొదనుజేయుచుం బ్రియమారన్. 564

క. అదె జక్కవఁ గనుగొంటే. పదముల నొకతమ్మిమొగడపై నిడి మోదం
బెదఁగదురఁగ నొకతమ్మిం. బదిలంబుగ మధువు నానుఁ బద్మదళాక్షీ. 565

క. లలనా ! యీనదిలోపల. జలకం బాడుదమె మధురసలిలాంతరకే
ళిలదృంగివిరచిత, కలనాదంబులు వినంగఁ గడుఁ బ్రియమయ్యెన్. 566

ఉ. ఆనళినాక్షి వల్లెయని యప్పుడు తామరపాకు గోరఁ బూఁ
దేనియ వంచి తెచ్చి కరదీపితమంజులరత్నకంకణ
ధ్వానము వీనుదోయికి ముదంబొదవన్ సిర సంటి యంత నె
మ్మేను సరోజపాంసువుల మెల్ల నలుంగిడి ప్రేమమీఱఁగన్. 567

క. జానగు గొజ్జఁగి నీటం, దానంబాడించి నెరుల తడియొత్తి సుగం
ధానూనధూపమున నా, మానిని దా నొంసిక సుమంబులఁ జుట్టెన్. 568

క. కస్తురిఁ దిలకము నుదుటను, గస్తురిచే నుంచి మేనఁ గలప మలఁది మే
ల్దుస్తులు కట్టఁగ నిచ్చి ప్ర, శస్తమణీభూషణములు చక్కఁగ నునిచెన్. 569

గీ. లలన యాగతి మగని నలంకరించి, యొక్క యెలమావిక్రిందఁ గూర్చుండఁజేసి
మజ్జన మొసర్చి తాను మరలివచ్చె. అంగజుఁడు సానఁబట్టిన యమ్మనంగ. 570

సీ. తడియార్చి నెఱుల క్రొమ్ముడివైచి వాసించు • మొగలిపూఱేకుల ముడిచి చుట్టి
కుఱుకుచన్గొండలఁ గలపంబుఁ దాలిచి • జిలుఁగుపైఠాణికంచెలము దొడిగి
హారంబు మెడ నంగహారంబు మేన కే • యూరముల్ రెండు బాహువుల నుంచి
బంగారు రంగారు చెంగావిపుట్టంబు • సింగారమార వాసిగ ధరించి

గీ. తళుకుఁజెక్కుల మకరికల్ దులుపఁజేసి • కనుల కాటుకయును దిలకంబు నుదుట
నడుగుఁదమ్ముల లాక్షయు నమరించి • సరసిదరినుండి సరసుని సరస కరిగె. 571

చ. చని హృదయేశు నంఘ్రులకు సాఁగిలిమ్రొక్కి ప్రియంబెలర్ప నీ
వనముననున్న తేనెయును బండ్లును దెచ్చెద నారగింతువే
యనవుడు వల్లెయన్న జలజాయతలోచన యవ్వనస్థలిన్
జని యడి పూవుఁదేనియలుఁ బండ్లును దెచ్చి యొసంగెఁ జెచ్చెరన్. 572

క. తెచ్చియొసంగిన పండ్లును, నచ్చపుఁదేనెయును వారిజాక్షియుఁ దానున్
మచ్చికతోఁ ద్రుత నచ్చట, ముచ్చటదీఱంగ నపుడు భుజియించి రొగిన్. 573

వ. అనంతరంబ శంఖచూడుండు తులసీమణిసతితో. 574

ఉ. ఓచపలాక్షి! యింక నిట నుండఁగ నేటికటంచుఁ బల్కి వే
లేచి ముదాన దారము శిబంబుజంబున నుంచి చూచితే
లోచనపర్వమయ్యె నవలోకగలం బోధ్యపమలంచు దట్టపై
పూచిన పూవుతీఁగలములెంతొ నె బోవుచు నేర్పుమీఱఁగన్. 575

సీ. పరభృతత్రోటీవిపాటితపాటలీ • కోరకంబులఁ దేనె కురియునెడలఁ
గమ్మనితావులు గ్రుమ్మరించుచు వలి • తెమ్మెరల్ వీతెంచు తెరువులఁ జని
మదముమీఱిన తేటికొదమల జిలిబిలి • రొదల నింపగు పూవుఁబొదలు దూరి
కపురంపుటనఁటి చొక్కపుదుమారంపుమొ • క్కలపుఁదిప్పల సరాగమునఁనెక్కి

గీ. కలువరామానికంపుఁ జెక్కడపుఁబనుల • నిద్దమైయొప్పు సావడియొద్దఁ జేరి
చివురుకైదువుపాదుషా చెయ్వులందు • సుదతి నలరించె నాశంఖచూడుఁ డనఘ.

క. ఇటులే దినదిన మట న, చ్చటులాలకఁ గూడి సురతసౌఖ్యాబ్ధినము
త్కటమతితో నుండఁగ నం, తట నొక మన్వంతరంబు తిటుకున దాఁటెన్. 577

ఉ. వెండి యనంతవిక్రమము పేరిచి యాఖొలదిండి దండియై
భండనమాచరించి బుధవల్లభుఁ బాఱఁగఁద్రోలి మౌనిమా
ర్తాండవితాయమానసవనాగ్నుల నాఱిపి హవ్యముల్ సము
ద్దండగతిన్ హరించి మునితల్లజులన్ వడిఁ జెండి యార్చుచున్. 578

ఉ. ఆకలుషాత్మఁ డాత్మఁ గొలయంచుఁ దలంపక క్రొవ్వియేర్చి నా
నాకులకాంతలన్ జలమునం గొనితెచ్చి తదీయబాంధవుల్
శోకముపెల్లున న్వనరుచుం బఱవం జెఱసాలనుంచి చీ
కాకుపడంగఁజేసెను జగంబును బెల్లగుదుండగంబునన్. 579

చ. మనమున నించుకేని నెఱి మాని మగంటిమి దిక్కులెల్లెడన్
గనుఁగొనఁ దానయొాచుఁ ద్రిజగంబుల నేచుచునుండఁగా సురల్
దనుజు జయింపలేక ధృతి తద్దయుఁదూలి హృతాధికారులై
వనరుచు ధాతఁ గన్గొన జవంబున నేగిరి పాదచారులై. 580

చ. చని యవిమేషు లవ్విధిహజారముముంగిట ద్వారపాలురన్
గనుఁగొని ధాతయానతిని గైకొని లోనికి వేగఁబోయి ధా
తను బొడఁగాంచి తచ్చరణతామరసంబులకున్ జొహారు జే
సి నిలిచి భక్తిదోఁపఁగ వచించిరి వారు విషణ్ణచిత్తులై. 581

మ. ప్రమదారంభుఁడు శంఖచూడుఁడను దేవద్వేషి క్రూరుండు దు
ర్దమదోర్దర్పమెలర్పఁ గయ్యములఁ గోదండోరుశింజాధ్వనిన్
సుమనస్సంఘము పీఁచమాఱిచి బిడౌజున్ వీఁక నిర్జించి తా
నె మహారాజయి మాఱులేక మెలఁగు న్విరేజసింహాసనా. 582

సీ. చరియించు నొకవేళ సురరాట్తరంగిణీ • పరిసరవాలుకాపదములందు
విహరించు నొకమాఱు వివిధరత్నప్రభా • స్ఫురహిమ శైలకందరములందుఁ
గ్రీడించు నొకతూరి బృందారకీగాన • బంధురనందనోపవనసరణిఁ
గ్రుమ్మరు నొకసారి ఋత్విగ్వషట్కార • కలనాసవనవాటికలఁ జెంత

గీ. అచ్చటఁ జరించువారు వెన్నిచ్చి పాఱఁ • ద్రోలి కంటికింపగు వెలందులను గడిమి
బట్టుకొనితెచ్చి చెఱసాలఁ బెట్టిపొందుఁ • గటకట రక్కసి యెదఁ గనికరము మాలి.

ఉ. అమ్మెయి నుక్కుమీఱి సకలావనిభాగములందు హేళిమై
గ్రమ్మరుచుండి జన్న మొనరించెడిచోటికిఁ బోయి బల్మి హ
వ్యమ్ముహరించి యుద్ధపడువారల బిమ్మరిపోవఁ గ్రుమ్ము వాఁ
డిమ్మెయిఁ దాళువార మిఁకనెట్టి యుపాయము పద్మసంభవా. 584

చ. కలుదల నెన్నియేఁ గలచి క్రాలెడు నావొలదిండిధాటికిన్
వెలచి కదింపుచో సతని పేరఱుఁదక్కనమ్మఁ గనుంగొనన్
బరచి యుఱేగుదెంచితి మహాంకృపామతిఁ బ్రోవకున్న నె
త్తెఱఁగున నుండుమింకెవ్వయదిక్కు మహాత్మ! వచింపు నాపుడున్. 585

చ. చిఱునగ వాననాబ్జమునఁ జెన్నువహింపఁగ నజ్జ పల్కె. నే
నెఱుఁగుదు శంభుమాడు నతఁ డేచి బుధావళి నొంచుచుంట యే
నెఱుఁగుదుఁ గాని యాదనుజునిన్ వధియింపఁగఁజాల మాయలం
గఱచినవాఁ డనేకము లఖండసహస్రము లాహవంబులన్. 586

చ. వెఱవకుఁ డీరు డెందముల పేరముఁదక్కకుఁ డుక్కుమీఱి యె
త్తెఱఁగుననైన వానిని వధింపఁగ నాత్రిపురాంతకుండ పో
నెఱిగలఁడాతనిం గనిన నెవ్వగలన్నియుఁ దీర్పఁజాలు నే
డ్తెఱఁ జనుఁ డింక నేను జనుదెంచెద శంకరుపాలి కింతలో. 587

వ. అనవుడు. 588

క. "దేవరతోఁ జనుదెంతుము", నా పల్కుచుటంబుఁ బల్కి నానామణిశో
భావిభావితమగు తన, యావాసము వెడలె నిర్జరాగ్రేసరుఁడై. 589

వ. ఇట్లు కృత్తివాసోదృక్షతత్పరుండై. 590

మ. జలజప్రోద్భవుఁ డంతఁ గన్గొనియె శశ్వచ్ఛర్వపీఠాద్భుతా
హలనిస్తంద్రగతాగతాఖిలమునీంద్రావశ్యపన్యాసమున్

ఫలితోత్ఫుల్లకిసాలితావనిజసంవాసంబు విద్యాధరీ
లలితాంగీక్రియమాణనర్తనసముల్లాసంబుఁ గైలాసముౘ. 591

శా. నీరేజాతభవుండు తద్గిరి సుధానీకంబుతో మెల్లనౘ
జేరంబోయి తదగ్రభాగమున నక్షీణప్రభాభాసుర
గ్లౌరత్నోరువితర్దికాంతమున లీలం గౌరితో నర్మవా
చారంభం బొనరించు నీశ్వరుని విశ్వారాధ్యునిౘ గన్గొనెన్. 592

ఉ. కాంచి విరించి నిర్జరనికాయముతోఁ దనమోడ్పుకేల్నిటా
లాంచితముం ఘటించి శివు నంఘ్రియుగంబులకుౘ జోహారు గా
వించి నుతించి నిర్జరుల వెగ్గలపాటును విన్నవింప నా
లించి విరించితో ననియె లేనెలదాల్పు ముదంబుమీఱఁగౘ. 593

క. సారససంభవముఖ్యులు, దారకవరులార! దనుజు దండింపంగా
నేరను; నేనుమ వచ్చెద, నారాయణు దర్శనం బొనర్పఁగఁజనుఁడీ. 594

లయగ్రాహి.

వార లటులేగి ముదమార హరిపత్తనపు, ద్వారమును జేరి యటఁ జారుమణిమాలా
హారులను స్మేరముఖసారసులఁ జక్రదర, ధారులను ధీరుల నుదారుల మనోజ్ఞా
కారులఁ జతుర్భుజుల మేరుధరణీధ్రసమ, ధీరులను శ్యామలశరీరులను రమ్యా
చారులను శౌరి ప్రతిహారులను జూచి విధి. జేరి తనరాకకును గారణము దెల్పెన్.

గీ. తొడరి వారల యనుమతి వడసి యచట, కడమ పదియాఱు గవకులు గడచిచనియె;
భూతపతిముఖ్యదేవసమేతుఁ డగుచు, ధాత వారల కభయప్రదాత యగుచు. 596

మ. శతపత్రప్రతిపక్షరత్నమయకక్ష్యాభాగముౘ గాంచనాం
చితసోపానపరంపరాకలితరాజీవాప్తమాణిక్యముౘ
దతవిస్ఫూర్జితనీలరత్నఖచితస్తంభంబుఁ జంద్రాభముం
జతురశ్రంబును బూర్ణకుంభయుతమౌ సౌధంబునం దొక్కఁ జో. 597

సీ. పొందమ్మిరుచిఁ బోలి యందమైతగు పద • ద్వంద్వంబు సిరి కేలఁ బట్టియొత్తఁ
బు ఁగునా రా కదెంబులు ఘల్లునిమ్రోయ • వలచేత గంగ వీవనలు వీవ
నెలనవ్వు మోమున మొలకలెత్తఁగఁ బల్కు • బోటి కప్రంపుఁదాంబూల మొసఁగ
పదనూపురధ్వనుల్ పొదల నచ్చరబోంట్లు • నర్తనాదికములొనర్చుచుండ

గీ. నవ్యమాణిక్య సింహాసనంబునందు • వేడ్కమీఱఁగఁ గొలువున్న వేదవేద్యు
భక్తలోకసంరక్షణభద్రదీక్షు • శౌరిఁ గన్గొనె విధి బుధసహితుఁ డగుచు. 598

చ. నలువయు వేల్పులున్ శివుఁడు నైజవినూత్నకిరీటరత్నకాం
తులు జలజాక్షునంఘ్రులకుఁ దోఁపఁ గాన్కలుగా నొసంగి మై
పులకలు గ్రమ్మ బాష్పజలపూరితలోచనులై సగద్గదా
వలితశిరోధులౌచు వినయంబడి రందఱు విన్నబాటుతో. 599

క. పలుకంగ నేమి తోఁచక, నిలువంబడియున్న వేల్పునికరముఁ గని యా
జలజాతోద్భవుఁడు కృతాం, జలియై వచియించె నిట్లు శార్ఙ్గధరునితో. 600

శా. పాపారణ్యకుఠారదండ! మ్రొసినలినా! భావత్కకారుణ్యపీ
యూషీయూషరసంబు మారజము నిష్ఫారంబుగా నాఱిపెన్;
నీపాదాబ్జనఖేందుచంద్రప్రభలు ఖండించెన్ దమంబున్ సుఖం
బాపూర్ణంబగు నింక నీమధురవాచారూఢి విన్నంతటన్. 601

క. అని సన్నుతించి తా మా, దనుజునిచేఁ గన్న దీనదశ నెఱిఁగింపన్
విని సర్వజ్ఞుండగు హరి, వినిపించె న్వారి కసురవిధ మతికరుణన్. 602

క. ఉరుబాహుబలుండగు క, ర్బూరనాథుఁడు చేయు క్రౌర్యముల నెఱుఁగుదు నో
సురలార! యైన వానిం, బరిభవమొనరింప నాదు భక్తుండగుటన్. 603

ఉ. ఆరజనీచరేశ్వరుఁ డనన్యవిజేయుఁడు గాన వాని నీ
మారహరుండు ద్రుంపఁ దగు మాయుధశూలముచేతఁ గావున
స్మేరుఁడు దుఃఖమందకుఁడు మేల్పనుచేరుఁడు నటంచు వారిఁ దా
సూటిపెలంగఁజేసి హరి యుగ్రునకిచ్చెఁ ద్రిశూలముత్తటిన్. 604

గీ. ఇప్డు సురలార! వేగమె యేగుఁ డింక, నేను బ్రాహ్మణవేషమ్మూని వాని
నడిగి కోపితెచ్చు మున్ను నే విడిచి వచ్చ, ముంత పట్టుండు మీకగు నద్దనుజుఁడు.

వ. అదియునుంగాక వాని భార్య కెన్నండు సతీత్వహాని సంభవించు నప్పుడ వాని మర
ణంబు సిద్ధించుఁ గావున మదీయంబగు తేజంబు తద్గర్భంబున నిక్షేపింపవలయు.

గీ. అనుచుఁ బల్కిన సంతోషమంది వృత్తి, హానుఁ డాశూలమును గొని పసజసంభ
వాదిసురసంఘముంగూడ నరిగె దైత్య, నాథు నాశంబుకై యత్నము లొనర్ప. 607

ఉ. దానవు సంహరింపఁ బ్రమథప్రభుని న్నియమించి తా యథా
స్థానముఁ జేరె ధాత దివిజప్రవరుల్ దని రంత పుష్పభ

ద్రానదియొద్దున న్వటధరాజముక్రింద వసించి శంఖుఁడా
దానవనాథుపజ్జ కుచితంబుగఁ బంపెను దూత నొక్కనిన్. 608

వ. వాఁడు నతిత్వరితగమనంబునఁ దత్పట్టణంబుఁ జేరం జని. 609

సీ. దశపంచయోజనదైర్ఘ్యవైశాల్యంబు • విపులస్ఫటికయానవేష్టితంబు
నతిదుర్గసప్తఖేయాసమంచితమును • సముదగ్రతరవప్రసప్తకంబు
తతరత్నవీధీశతకభాసమానంబు • సద్వస్తుయుతవణిక్శోభచయము
సిందూరసన్నిభోచితరత్నఖచితది • వ్యాశ్రమకోటిసమన్వితంబు

గీ. సతతఫలభూరుహవితానసంయుతంబు • లలితవిహగాళికూజితకలకలంబు
నయుతకింకరరక్షితం బగుచు మిగుల • దంబుమీఱిన తత్పట్టణంబు నందు. 610

సీ. పూర్ణేందుమండలస్ఫూర్జితాకారంబు • పరిఘాచతుష్కవిభ్రాజితంబు
సుహృదావళీమహాసుముఖప్రవేశంబు • దుర్హృత్ప్రవేశసుదుర్గమంబు
రమణీయశృంగవిరాజితాభ్రతలంబు • ద్వాదశద్వారవిభాసితంబు
మాణిక్యకాంచనమండలీమండిత • సుందరతరలక్షమందిరంబు

గీ. రత్నసోపానసంచయరంజితంబు • మణిమయస్తంభశతకసమన్వితంబు
నగుచుఁ జెలువొందు నారాచనగరి కరిగి • ద్వారపాలకు నాజ్ఞ లోపలకుఁ జనియె.

మ. తనరారందగు భృత్యుఁ డొక్కరుఁడు శ్వేతచ్ఛత్రముంబట్ట వీ
వనల వీవఁగఁ బార్షదు ల్బుధులు విద్వాంసుల్ ప్రవేష్టింప వీ
ర నికాయంబులు క్రేవలం గొలువఁ దోరం బొప్పఁగా రత్నకాం
చనపీఠంబున నున్న దైత్యపతి పజ్జంబోయి వాఁడిట్లనెన్. 612

క. దానవనాయక యే నీ, శానుని యానతి గ్రహించి చనుదెంచితి నా
పై నేరముంచ కిప్పుడు, మానుగ వినవలయు నాదు మాటలు గూర్మిన్. 613

శా. హరికిన్ శూల మొసంగి రక్షణముకై యాజ్ఞప్తినీయంగ నీ
శ్వరుఁ డేతెంచెను బుష్పభద్రకతటిన్ స్వారాజ్య మీ విప్పుడే
సురసంఘంబుల కిచ్చి వర్ధిలుము రక్షోనాథ! కాదేని నం
గరరంగంబున నీయొడ ల్జిదిమి జక్కంజేయు నిక్కంబుగన్. 614

గీ. అనిన దూతపల్కు లాలించి నవ్వుచు, నెల్లి వేగ నే మహేశుకడకు
నరుగుదెంతుఁ జనుమి యనఁగ వాఁ డంతట, వేగె శంభుఁడున్న చోటికడకు. 615

వ. ఆ సమయమున. 616

మ. అల సేనానియు వీరభద్రుఁడు విశాలాక్షుండు బాణుండుఁ బిం
గళనేత్రుండు వికంపనుండును మహాకాయుండు భద్రుండు బా
ష్కళుఁ డుందుర్ధ్యుఁడుం గుటీచరుఁడు దుర్గమ్యాఖ్యుఁడున్మన్నుగాఁ
గల యోధప్రవరుల్ పదిన్ విజయకాంక్షన్ వచ్చి రచ్చోటికిన్. 617

చ. స్ఫురదురుభీషణంబగు త్రిశూలము దారుణవర్తులంపుఁ గ
ర్పరము శరాసనప్రఖరపద్మగదాముసలోజ్జ్వలాసియు
గ్గ్రములు రక్తమాల్యపరిధానముఁ దాల్చి విమానమెక్కి భీ
కరతరమూర్తియై తనరఁ గాళి వచ్చె ససంభ్రమంబుగన్. 618

వ. మఱియు శస్త్రాస్త్రసముదయంబులు వచ్చి మహాదేవు సన్నిధి నిల్చె నంత నక్కడ.

క. సంతసమున దనుజాధిపుఁ, డంతఃపురి కరిగి మాత యరుదెంచిన వృ
త్తాంతం బంతయుఁ దన ప్రియు, కాంతకు వినిపించెఁ బ్రథనకౌతుకమతియై. 620

క. వినిచిన రిపుయత్నము విని, కనుఁగవ నశ్రువులు నిండఁ గంఠం బెండన్
బెనిమిటిఁ గౌఁగిటఁ జేరిచి, యనియెం దలనీపఘాటి యతివినయముతో. 621

శా. "ప్రాణేశా! శితికంఠుతోఁ జనునె వైరం బెన్నఁడే భక్తసం
త్రాణప్రౌఢుఁడు లోకసంహరణవిద్యాపారగుం డాతనిన్
బాణా మిక్కుటశక్తిఁ గొల్చి పిదపం ద్రైలోక్యసామ్రాజ్య మ
క్షీణప్రక్రియ నొందరే, యటుల సంసేవింప నీ కొప్పదే! 622

వ. అదియునుం గాక. 623

చ. అమరవిరోధులైన త్రిపురాసురుల న్వధియించినాఁడు సం
యమనుల నంచు రాక్షసచయంబుల గర్వ మడంచినాఁడు మృ
త్యుముఖము సొచ్చు బాయసపతోలయుఁగా నొనరించి లీలమై
జము నెద మీర్చినాఁ డతని సంగరమందు జయింపవచ్చునే." 624

ఉ. ప్రేమ దలిర్ప నయ్యసురుఁ బ్రేయసి పల్కుల నాలకించి నె
మ్మోమున నెల్ల నవ్వొలయ బుద్ధియఁ గన్గొని యో వెడంగుకాం
తా! మహి కాలకర్మగతి దప్పునె యేరికినైన దీనికై
వేమఱుఁ జింతనొందెదు వివేక మెఱుంగని దానికైవడిన్. 625

ఆ. వె. భూమిరుహములెల్లఁ బుష్పఫలాదికం, బులను గొంతదనుకఁ బొదలుచుండి
కాల మగ్గలింపఁ గాలిచేనైనను, చిచ్చుచేతనైనఁ జెటుగనవె. 626

క. జనములచే జనసంతతి, జనియింపఁగఁ జేయు నెవఁడు జనుల జనులచే
హననంబొనరుచు నెవఁ డా, తని నీ మదిలోన నెపుడుఁ దలఁపుము తరుణీ. 627

సీ. ఎవ్వని దయచేత నీరేడు భువనముల్ • నిరుపద్రవంబుగా నిలుపఁబడియె
నెవ్వని యానతి నిందుసూర్యులు శీత • తిగ్మప్రభలచేతఁ దేజరిలిరి
యెవ్వనియాన వహ్నియు వేఁడిమిని జిల్కు • గాడుపు తా శీఘ్రగామియయ్యె
నెవ్వని యాజ్ఞచే నింద్రుండు వర్షించె • నెల్లజంతులమీఁద మృత్యు వేగె
గీ. అట్టి యాద్యంతరహితు సర్వానుగమ్యు • గాలకాలు నణూపము స్థూలదేహు
సతతసృష్టిస్థితిలయప్రసక్తశీలు • నామహామహుఁ దలఁపు మో కోమలాంగి. 628

క. వాలతిండివి నేనెక్కడ ?, విలాపతి కుమారివైన యీవెక్కడ ? హా
తలపోయఁగ మన కలయిక, కలికీ ! జలకాష్ఠరీతిగాదే తలఁపస్. 629

గీ. తొల్లి గోలోకమున శౌరితోడ నుండి, రాధికాశాపమున నిర్వ్వరమును నింత
దనుక నుండితి మిచట, బృందావనమున, కింకఁ బోవుద మీదుఃఖ మేల యనుచు.

క. పలువిధముల బోధించినఁ, దులసి తెలియలేక వగపుతోఁ బ్రియుపక్ష
స్థ్సలిపైఁ బడి పెల్లగు ను, వ్మలికం గొన నపుడు గృష్ణమంత్రము సెప్పెన్ 631

గీ. అఖిలదుఃఖహరంబగు నట్టి కృష్ణ, మంత్ర మాతఁడు దెల్పిన మాత్రముననె
దివ్యవిజ్ఞానబుద్ధితో ధీరయగుచు, వెలఁది సంతోషమున నుండె విభుని బ్రోల, 632

ఉ. అత్తటి నయ్యనుంగుజెలి నాదటఁ గౌఁగిట నాదరించుచున్
మెత్తని పూలసెజ్జపయి మించిన వేడుకతోడ గాఢమౌ
చిత్తజుకేళిఁ దేలి సతి చీరచెఱంగున వీవఁగాఁ బరా
యత్తమనస్కుఁడై నిదురనందె సురారి విచారదూరుఁడై. 633

శా. ప్రాతఃకాలమునందు విష్ణువినుతిప్రారంభుఁడై లేచి సు
స్నాతుండై తెలిపట్టుపుట్టములు విన్నాణంబుగాఁ దాల్చి ని
ర్ధూతామంగళహేతువై తనరు చారుస్వర్ణమాణిక్యసం
జాతంబుల్ ధరణీసుపర్వులకు విద్యావృత్తి నిచ్చెం దగన్. 634

మ. గజరత్నంబుల నశ్వరత్నముల సద్గ్రామంబులన్ భూములన్
ద్విజసంఘంబులకున్ దరిద్రులకుఁ బ్రీతి న్వే సమర్పించి భూ
ప్రజఁ గావన్ సుతు రాజుఁ జేసి ప్రియభార్య న్వాని కొప్పించి తా
విజయోత్సాహవివర్ధితాంగవితతావిర్భూతరోమాంచుఁడై. 635

ఉ. లక్ష మతంగజంబులు త్రిలక్షతురంగమముల్ రథంబు లా
ర్లక్షలు వీర్యవిక్రమబలప్రథితుల్ ప్రధనప్రసిద్ధులౌ
రాక్షసనాయకుల్ శతపరంపరఁగా దనతోడఁగూడి రా.
క్షసభర్త భార్గవపురస్సరుఁడై నగరంబు వెల్వడెన్. 636

వ. ఇట్లు వెడలి పశ్చిమసముద్రప్రాంతంబునందలి భద్రవటీతటంబున నొక్క వటవిటపి
సమీపంబునకుం జేఁ సరిగి, 637

శా. భక్తాభీష్టవరప్రదాయకుని శుంభద్వ్యాఘ్రచర్మాంబరున్
భక్తాధీనహాలాహలాసితశిరోధిన్ గోత్రనాథాత్మజా
సక్తున్ శాంతు సహస్రసూర్యనిభతేజశ్శాలి వీక్షించి స
ద్భక్తిన్ సాఁగి నమస్కరించె నల దేవద్వేషి సైన్యంబుతో. 638

గీ. వామభాగంబునందున్న భద్రకాళి, నగ్రమందున్న యట్టి షడాననునకు
వందనము లాచరించి దీవనలు గాంచి, నిలుపఁబడియున్న నందిముఖ్యుల స్పృశించి.

వ. భయభక్తుల నిలుపంబడియున్న శంఖచూడుం గనుంగొని చంద్రచూడుం డిట్లను:
దానవేంద్రా! జగత్సృష్టికారణుండగు పద్మనాభు నాభీపద్మంబున విధాత జన్మించె
నతనికి మరీచి పుట్టె నతనికి వైష్ణవుండు నతనికి కశ్యపుండు నతనికి దర్మిష్ఠుండు
నతనికి దనువును నతనికి విప్రచిత్తియు నతనికి దంభుండును గ్రమంబున జన్మిం
చిరి. విష్ణుసేవాపరాయణులై బహుకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి పిదప
వైకుంఠంబున కరిగిరి. తొల్లి నీవా దంభునకుఁ బుత్రుండవై సుదాముండను నామం
బున నతిధార్మికుండవై యుండి రాధికాశాపంబున నిప్పుడు దానవేంద్రుండ వైతివి.
భగవత్సేవాపరాయణులైన వారీయఖిలంబుఁ దుచ్ఛంబుగాఁ దలఁచి ముక్తిచతుష్ట
యంబును జాలకసగాఁ జూతురు. ఇదియునుంగాక, 640

మ. హరిభక్తుండగు నీకు నాకపతి దాయాదుండు తద్రాజ్యమున్
హరియింపందగునే? స్వరాజ్యమున సౌఖ్యం బందఁగాఁ జాలదే!
దురితం బెట్టిదియుఁ దత్ప్రతిక్రియం బిర్ధూతంబగుం గాని సు
స్థిరమై పీడకయుండు నెప్పటికి జ్ఞాతిద్రోహపాపం బిలన్. 641

క. కావున సురాపతి నా, దేవతల కొసంగి హితమతి న్నీవెపు డీ
భూవలయంబున రాజ్య. శ్రీ వెలయఁగఁ బాలనంబు సేయఁగ రాదే. 642

గీ. సంపదకు హాని గలదని సంశయింప, వలవ దది కాలవశమున వచ్చుఁ బోవు;
హరిహరహిరణ్యగర్భులకైనఁ గాని, కాలమార్గంబు దాఁట శక్యంబు గాదు. 643

సీ. కాలవశంబునఁ గాదె ధాత తిరోహి • తత్వంబు మరల నుద్భవముఁ గనుట
కాలవశంబునఁగాదె చంద్రుఁడు కలా • వంతుఁ డౌటయుఁ గృశత్వంబుఁ గనుట
కాలవశంబునఁగాదె సూర్యుండు ప్ర • తాపహీనుండు సంతాపి యగుట
కాలవశంబునఁగాదె ధారుణి సర్వ • సస్యాఢ్యయగుట యూషరయు నగుట
గీ. కాలవశమున విశ్వంబు గానిపించుఁ • గాలవశమున సర్వంబుఁ గలయు నీటఁ
గాన సమరీతి నెవ్వండు గానఁబోఁడు • అక్షరుం డొక్కఁ డాపరమాత్మదక్క.

వ. నేనును దదీయధ్యానపారీణుండ నగుటంజేసి ప్రాకృతయుగంబు లనేకంబులం గనుఁగొంటి నింక ననేకయుగంబులఁ గనుఁగొందుఁ దదాజ్ఞా ప్రకారంబున బ్రహ్మవిష్ణులు సృష్టిస్థితు లొనర్చుచుండ నేను సంహారకారణుండనై యుందు ననిన శంఖచూడుం డిట్లనియె. 645

గీ. శమనదమన ! భవత్కథితములలోన, నన్యథాలాపములు గల్గనయ్యెఁ గ్రైన
నించుక యథార్థమును వచియింతు మీర, లాదరంబున వినుఁడు సమాహితముగ.

శా. జ్ఞాతిద్రోహము పాప మంటి; బలి రాజ్యభ్రష్టునింజేసి యా
పాతాళంబునఁ ద్రొక్కదే ? యసురులన్ వంచించి వారాశిసం
జాతంబౌ సుధఁగ్రోలదే ? యెపుడు రక్షశ్శ్రేణిఁ బీడించు నీ
నీతుల్ ము న్గలనైనఁ జూచెనె ! బుధానీకంబు శ్రీకంధరా. 647

క. కీడును మేలును వరుసం, గూడంగావలయు ధాతకును వశమగునే
వీడంగొన నీవిశ్వముఁ, క్రీడాభాండంబెకా ప్రకృతిపరున కొగిన్. 648

వ. కావున మున్ను దేవతాపీడితుల మయ్యును కాలక్రమంబున నిపుడుద్ధతుల మైతిమి. సురలకును మాకును సహజశత్రుత్వంబున నిర్నిమిత్తంబుగా నాలంబులు జరుగుచుండు; జయాపజయంబులు మేము యనుభవింతు; మట్లుండ శత్రుమిత్రసమభావులగు మీరలరుదెంచుటయె నా కరుదుగాఁ దోఁచుచుండె; నింతియకాని మీవలన జయమొందెఁ బరాజయమొందె నాకు కీర్తి హేతుకంబ కాని వేఱొండు కాదనినఁ ద్రిలోచనుండు ప్రహసితాననుండగుచు నిట్లనియె. 649

ఉ. రాక్షసనాథ ! తొల్లిటి సురద్విషులౌ మధుకైటభుల్ హిర
ణ్యాక్షహిరణ్యదైత్యులు వినాశముఁబొందు రెఱుంగవే సరో
జాక్షునిచేత నీవటుల నాలములోపలఁ గూలనేల సం
రక్షణసేతు నిర్జరులరాజ్య మొసంగి సుఖంబుఁ గాంచుమీ. 650

మ. తెగువ న్వి ల్లునుమాడి ఘోరమగు శ క్తి న్నుగ్గు గావించి తే
జిఁ గడుం జర్జరితంబుఁజేసి శరవృష్టి న్ముంచి నీహారమ
ధ్యగతుండౌ దిననాథుఁ బోల్పఁదగు క్రౌంచారిన్ లలాటంబు చె
మ్మగిల న్వైచినఁ జిమ్ముటంపఱస్మృతిం బాసెన్ క్షణం బంతలో. 659

చ. తెలిసి మహేశనందనుఁడు దివ్యవిచిత్రమణిప్రభావళీ
కలితరథంబు నెక్కి పటుకాండయుతంబగు నొండువిల్లు దా
ల్చి లయకృతాంతుపోలిక విశేషరుషాజ్వలనార్చు లొల్క ను
జ్వలదనలాస్త్ర మప్పుడు నివారణజేసెను వారుణంబుచేన్. 660

చ. దనుజుని విల్లు సారథి రథంబుఁ దురంగమముల్ సిడంబునుఁ
దునిమి మఱొక్క విల్గొనినఁ దుత్తుమురై చనునట్లు జేసి కాం
చననవరత్నకీలితలసన్మకుటంబును నుగ్గునూచగా
నొనరిచి యొక్కశక్తిని మహోగ్రత వైచె నురంబుప్రయ్యఁగన్. 661

చ. అది యశనిప్రపాతము క్రియం బడ మూర్ఛనుజెంది యంతలో
మదమున లేచి కొండొక విమానము నెక్కి మఱొక్క విల్లు స
మ్మదమునఁ బూని ఘోరతరమార్గణపంక్తులఁ గప్పి యంత నా
రద ! మఱియేమిచెప్పుదు సురప్రముఖు ల్భయమంది చూడఁగన్. 662

క. అత్యుగ్రంబు సహస్రా, దిత్యసకాశంబు శౌరితేజోవృతమున్
భీత్యావహమగు శక్తిం, దైత్యుఁడు గుహు నేసెఁ గ్రోధదర్పోజ్వలుఁడై. 663

క. ప్రళయజ్వలనజ్వాలా, వళివలె నది మండిపడుచు వచ్చి మహోర
స్థ్సలముం దాఁకుడు నతిదో, ర్బలుఁడు కుమారుండు మూర్ఛపడియెఁ గుమారా.

క. ఖోఁడిమిచెడి కయ్యంబునఁ, గాడుపడు కుమారుఁ గాంచి కాళిక తనదౌ
క్రోడంబున విడుకొని శశి, చూడుని సన్నిధికి నేగె శోకముతోడన్. 665

గీ. తూలిన కుమారు జూచి మృత్యుంజయుండు, జ్ఞానమున జీవవంతునిగా నొనర్చి
యగ్గలంబగు బలమిచ్చి యతనితోడఁ, గాళి నంపించె యుద్ధరంగమున కపుడు.

వ. అంత కార్తికేయుం డపూర్వబలసమన్వితుండై వెడలిన నందీశ్వరాదులును దేవ గంధర్వకిన్నరకింపురుషులును బఱతెంచి సింహనాదంబులు సేయుచుండ శాకినీ డాకిన్యుగ్రదంష్ట్రోగ్రదండలు రణమధ్యంబున మాధ్వీకపానంబు సేయుచున్న దైతేయులు భీతచేతస్కులై పలాయితులైనం దానవాధిపుం డోడకుం డని యభయం బిచ్చి కన్నెదుట నిల్చిన. 667

సీ. అంత కాళిక విలయాగ్నిసమానమై • పరఁగిన యాగ్నేయబాణమేయ
శంఖచూడుండు పార్జన్యశరంబుచే • దానినడంచిన మాన కపుడు
వారుణాస్త్రంబేయ వారించె గాంధర్వ • విశిఖంబుచే జగద్విదితముగను
మాహేశ్వరంబును మంత్రించి వైచిన • వైష్ణవాస్త్రంబుచే వ్రయ్యనట్లు
చేసిన పీసులోఁ జెచ్చెర నారాయ • ణాస్త్రంబు విడచిన నతఁడు సూచి

ఆ. వె. యాన పపుడు డిగ్గి యతివినయంబుతో • సన్నుతింప మగిడె సాధువగుచు;
మరల బ్రహ్మశిరము మంత్రపూర్వకముగ • నేయ దానిచేతనే యడంచె. 668

క. నృపుచేత సన్నియస్త్రము, లపహృతవీర్యంబు లగుట కచ్చెరువడి పా
శుపతాస్త్రం బరివోసిన, నపుడా వినువల్కుఁ బొలఁతి యనియె మునీంద్రా. 669

క. "పాశుపతంబున మృత్యువు, లేశం బితని దరిఁజేరలేమసుమీ; యో
హో! శాంకరి! తద్పూర్వ గు, ణాశయ యద్దానిఁ జెఱుప నాతఁడు త్రెళ్ళున్. 670

క. హరిమంత్ర కవచమును సు, స్థిరముగ వద్దనుజసతి సతీత్వముగలుగన్
హరిహరుల కజేయుండును, జరామరణరోగముల కసాధ్యుండు నగున్. 671

వ. అని యిట్లశరీరవాణి పలికిన నయ్యస్త్రంబు నివారించి ప్రళయాగ్నికలోపమానంబగు శూలంబువైచిన దాని నత్రపంబున వామహస్తంబునఁ బట్టుకొనుచుఁ గోపఘూర్ణమానసుండై యొక్క ముష్టిఘాతంబు వేసినఁ దత్క్షణంబున మూర్ఛంజెంది, 672

ఆ. వె. అంతఁ దెలివినొంది హర్షసమేతుఁడై, భద్రకాళి తెఱఁగి వానరాంత
మగుడు విశ్రమింప వానతిఁగైకొని, రథమునంద యుండె రాక్షసుండు. 673

తరల. కదనభూపతిశాసురారివిహాయకాయచయంబులన్
చిదిమి నెత్తురుఁ గ్రోలుచున్ హతశేషులం బరిమార్చి లోఁ
బొదలు రోసముతోడఁ బ్రేవులప్రోవుల న్మెడఁ జుట్టి తా
నవయుస్ఫూర్తిఁ జరించె లోకభయంకరంబగు నాకృతిన్. 674

వ. ఇట్లవర్గశతాక్రమంబున విహరించియు దానవేంద్రు సంహరింపనేరక క్రమ్మఱ శంకరుపాలి కరుదెంచి యిట్లనియె. 675

ఉ. శంకర నీ ప్రసాదమున శత్రువులం బరిమార్చితి న్నిరా
తంకముగా విశాచములు తప్పిరి యింకొకనూఱువేలు ని
శ్శంకగ దైత్యనాయకుఁ డసాధ్యుఁ డహంకృతు లెన్నిజూపినన్
జంకఁ డొకించుకేని యొక శస్త్రభయంబును లేదు వానికిన్. 676

వ. వాఁ డనన్యశస్త్రసాధ్యుం డగుటంజేసి పాశుపతం బభిమంత్రించి వైచుసమయంబున.

క. "పాశుపతంబున నితనికి, లేశంబును మృత్యుభయము లేదనుమీ యో
హో! శాంకరి తద్భార్య గు, ణాశయ యద్దానిఁ జెఱుప నాతఁడు త్రెళ్ళున్. 678

క. హరిమంత్రకవచమును సు. స్థిరముగ నద్దనుజుసతి సతీత్వము గలుగన్
హరిహరుల కజేయుండును, జరామరణరోగముల కసాధ్యుండు నగున్" 679

వ. అని యిట్లశరీరవాణి వల్కిన నయ్యస్త్రంబు నివారించి తనపుడు. 680

మ. నిటలాక్షుండు నిజం బెఱింగి ప్రమథానీకంబు గొల్వంగ ను
త్కటరోషంబున భూనభోంతరము లాక్రందింపఁగా వెల్వడెన్
బటుసంరంభ మెలర్ప సంగరధరాభాగంబుఁ జేరంగ నం
తట దైత్యోత్తముఁడున్ రథంబుడిగి యానందంబుతో మ్రొక్కెడెన్. 681

ఆ. వె. మరల వేగమున విమానం బధిష్ఠించె, నపుడు విలయసమయయమువికరణి
శూలి యొప్పె నంత చోద్యంబుగా సంగ, రంబు నూఱువత్సరములు జరిగె. 682

వ. అయ్యవసరంబున. 683

క. వడవడ వడఁకుచుఁ బదములు, తడఁబడఁగాఁ గేల నొక్కదండముఁ గొని సం
దడిచేయుచు పాఱుని కై. వడి వేసముఁ దాల్చి శౌరి వచ్చె నిజేచ్ఛన్. 684

మ. "కులజుండ న్విబుధుండ వృద్ధుఁడను రక్షోనాథ! పాత్రప్రియా!
చలిచే దస్సి నినుం గనుంగొనెడి యాసంజేరితింగాని యే
వలకుం బోవఁగఁజాల నింకఁ గడు స్వల్పంబైన, నీ మేని క
త్తిశమున్ నాకిడి ప్రాణదాతవయి సంధానింపు మానందమున్. 685

ఉ. కాసరుజల్ జనించు, వడఁకందొడఁగు న్మెయియెల్ల వీసమున్
గ్రాసము బోదు లోనికి, నర ల్గయివెట్టెడు, నెమ్మనంబునం
దీసొక కొంత పెచ్చు, తలయేరు ఘటిల్లు, ధనంబునందు పే
రాసలు గల్గు; నక్కట! జరాన్వితుపాటుల నేమి చెప్పుదున్. 686

గీ. అధిగుణుఁడవంచు నిన్ను నే నడిగివాఁడఁ, గాని వేవే లొసంగిన హీనమతికిఁ
జేయి చాఁతునె! నీ వి దిచ్చినను జాలు, సున్నజుట్టిన నా కంతకన్న మేలు". 687

మ. అన నొక్కించుక సంశయించి మది నాహా! ధారుణీదేవులన్
గవిసంత న్వినయంబుతో నెపుడు సన్మానింతు నే నిట్టివృ
ద్ధున కీఁగాంచుటకన్న వేఱొకటి యెందుంగల్గునే మోద మిం
కనుమానం బదియేల మైమరువు వే యర్పించెద న్వీనికిన్. 688

వ. అని తలంచి. 689

క. ప్రాణసమంబయిన తమ, త్రాణంబును దీసి సముద్రంబున మహిగీ
ర్వాణున కొసంగె దివిజ, శ్రేణులు గురియంగఁ గుసుమవృష్టి తనవయిన్. 690

గీ. దాని గ్రహియించి యతఁడు మోదంబుతోడ, శంఖచూడునిపోల్కిఁ దజ్జాయకడకు
వచ్చి దాని పతివ్రతాత్వంబుఁ గలఁచె, చక్రధరునకుఁ గలదె యసాధ్యమెందు. 691

వ. అంత నక్కడ, 692

క. దానవనాయకు ముందటి, సేసల నన్నింటి నల్పశేషముగా వీ
శానుం డొసరిచి నిహతని, జానీకము జీవవంతమౌగతిఁ జేసెన్. 693

ఉ. కాలము వేచి యంత శితికంఠుఁడు వైచె సురారిభర్తపై
శూలము గ్రీష్మకాలశతసూర్యనిభప్రభ ముద్ధతజ్వల
జ్జ్వాలము వజ్రతుల్యము నవార్యము లోకభయంకరమ్ముళీ
లాలలితాబ్దజాండముఁ బలాయితశాత్రవసైన్యజాలమున్. 694

గీ. దానిఁ గన్గొని యతఁడు శస్త్రములు విడిచి
యచ్యుతు భజించుచుండె యోగాసనమున
నపుడు శూలంబు పైఁబడి యురదమును న
తండు చూపట్టకుండ దగ్ధంబుసేసె. 695

ఉ. అంతట శంఖచూడుఁడు నిజాకృతి వీడి కిశోరరూపుఁడై
వింతగఁ దోఁచి యప్పుడ నపీసము గోభుపనాగతంబు న
త్యంతమనోహరం బయిన యానముపై వసియించి యేగెఁ గృ
ష్ణాంతికమున్ ముదంబుఁగొని రచ్చట రాదయు వాసుదేవుడున్. 696

చ. ఇల నల శంఖచూడదనుజేంద్రుని యెమ్ములు శంఖజాతులై
వెలసి సురార్చనంబులఁ బవిత్రతఁ గాంచె ననేకభంగులన్
గలుషుంబటోటి తద్వ్యమలు గల్గినచోటుల నుండుఁగాన శూ
ద్రులకును స్త్రీలకున్ సుఖముమాధిగనెక్కుడు గూర్చుఁదద్వసుల్. 697

క. హరుఁ డద్దానవపతి సం, హరణం బొసరిచి వెస వృషారూఢుండై
యరిగెఁ దనలోకమునకున్, సురలు న్నిజపురికిఁ బోయి సుఖియించిరొగిన్. 698

వ. అనిన నారదుం డిట్లను. 699

## తులసీసంగమ వర్ణనము

ఉ. మానుగ శంఖచూడునకు మానినియా సతియందు నింద్రియా
ధాన మొనర్చె నప్పు డలదానవహారి యటంచుఁ బల్కెఁ తీ;
వానలినాక్షిఁ గూడునెడ నాకృతి యెట్టిదిదాల్చె? నేక్రియన్
గానఁగఁబోయె? దాని నెఱుఁగ న్వచియింపు మహాత్మ నావుడున్. 700

శా. వీణాసంయమి! యాలకింపుమల గోవిందుండు గీర్వాణసం
త్రాణార్థంబుగ విష్ణుశాంబరిని తద్దైత్యాకృతిం దత్తను
త్రాణంబుంగొని తత్సతీగృహబహిర్ద్వారంబున న్నిల్చి ని
ష్ప్రాణంబే ద్దైల మ్రోయఁజేసె జయముంజాటించు చందంబుగన్. 701

చ. ముగుద పతివ్రతానియమముం జెఱుపన్ రజనీచరు న్నశిం
పఁగ నొనరింప లోఁదలఁచి మాధవుఁడాగతి దుందుభి న్స్వరం
బుగ వినదంబుఁజేయ ననఁబోటి మనంబున మోదమంది సౌ
ధగతగవాక్షమార్గమునఁ దప్పక కన్గొనె రాజమార్గమున్. 702

ఉ. పైదలి వానిఁ గాంచి తనభర్త యటంచుఁ దలంచి పొంగుచున్
బీదలకున్ ద్విజావళికి భిక్షులకున్ ధనవస్త్రముఖ్యముల్
సాదరవృత్తి నిచ్చి వినయంబున నుండె; రథంబుడిగ్గి దా
మోదరుఁ డాసతీమణిసముజ్జ్వలసౌధముఁ జేరె నంతటన్. 703

క. దానవుఁడంచును బ్రత్యు. త్థానం బొనరించి తత్పదంబులఁ గడిగెన్
మానిని జలములఁ దనపరి, ధానముచేఁ దడియు నార్చెఁ దత్తఱపడుచున్. 704

ఉ. ఆలలితాంగి తా మణిమయాసనమందు మురారి నుంచి తాం
బూలమొసంగి యిట్లనియె ముద్దులుగుల్కుచుఁ "బ్రాణనాథ! నేఁ
జాలఁ గృతార్థనైతి నిఁక జన్మము సార్థకమయ్యె నాకు ని
ష్టాలము పేయఁగా జని రయంబున వచ్చిన నిన్నుఁ గాంచుటన్." 705

క. స్మితవదన యగుచు సతి శ్రీ, పతిఁ గని యతిశూరులైన బర్హిర్ముఖసం
తతితో జరిగిన యుద్ధ, స్థితి విన మతివొడమెడు న్వచింపుము కరుణన్. 706

క. నానాసేనాయుతసే, నానియు బలవంతుఁడై తనరినట్టి శచీ
జానియుఁ దక్కుంగల సే, నానికరము గల్గఁగా రణము బరముగదా. 707

ఉ. అందఱు నొక్కయొద్దు నిటలాంతరవిస్ఫురదుగ్రహేతికా
స్పందకృశానులోచనుఁడు శర్వుఁ డొకం డొకయొద్దు; వారితోఁ
గ్రందెటులయ్యెఁ జెప్పుమనఁగా విని శౌరి స్మితాననాబ్జుఁడై
సుందరితోడ నద్దనుజుఁబొప్పునఁ బల్కెను నేర్పుమీఱఁగన్. 708

మ. దళదంభోజవిశాలాక్షి! వినుమా సమరోదంతంబు వాక్రుత్తు నే
జలజాతాప్తవిరోధి పోరునెడ పర్వంబయ్యెఁ బూర్ణంబు సం
కులయుద్ధంబున ప్రుంది రయ్యఖిలరక్షోనాయకు ల్లోక మా
కులమయ్యె న్విధి చేసె మమ్ము విగతక్రోధాత్ములం జెచ్చెరన్. 709

ఉ. ధాత యనుజ్ఞఁ బూని విబుధప్రభురాజ్య మొసంగితిన్: శివా
నేత యథేచ్ఛగాఁ జనియె, నే నరుదెంచితి నిన్నుఁ జూడ సం
ప్రీతి మెయిం బనింగొనిరి వేల్పు లటంచు లతాంతగంధిని
ప్రీతివిశాలమై తనరుచోఁ దలిమంబునఁ బండెఁ గాంతతో. 710

క. ఆతఱి నాతరుణీమణి యాతనితోఁ గూడి కలయునప్పు సుఖము పూ
ర్వేతరముగఁ గని పలికి, బ్రాతురతం బలికె నిట్టులనుచున్ హరితో. 711

చ. మతకరి చంద మేర్పడియె మానుగ నీయెడ నాపతివ్రతా
వ్రతమును గొలుపుచ్చితి వెసందవు నీ వెఱుగంగఁజెప్పు మం
చతికఠినంబుగాఁ బలుక నప్పుడు శాపభయంబుచేత నై
జతనువు మాని మాధవుఁడు చానకుఱంగట నిల్చె నంతటన్. 712

సీ. పచ్చనివన్నెదువ్వలువపైవలెవాటు • నుదుటఁ గస్తూరిబొట్టు పొదలువాని
రహిమించు కౌస్తుభరత్న మురంబున • నొడలెల్లఁ దొడవులు దొడరువాని
నల్లని మొగులుల మల్లసంబాడెడు • మైదాయ మిఱుమిట్లు మలయువాని
మొలకనవ్వులపెదు మోముదమ్మియు వన • మాల గళంబునఁ గ్రాలువాని
గీ. దేవదేవునిఁ గాంచి సందేహ మెడలి • మూర్ఛఁగొని చేతనత్వంబుఁ బొంది మరల
శౌరిఁ గన్గొని పల్కె నాసారసాక్షి • కోపపరితాపములు మదిఁ గుందఁజేయ. 713

మ. కృప యొక్కింతయులేక యుండు టిది చన్నే! నీకు నొక్కింతయే
నపవాదంబు నొనర్పఁ దట్టిఁడు మదీయాత్మేశుఁ డన్యార్థమై
కపటోపాయముఁ బూని వాని ననిలోఁ గాఁజేసితి వక్కటా
యుపలప్రాయమొ నీహృదంతరము? మేలోర్వంగఁ జూపోపదో: 714

■■

క. దోషం బెఱుఁగని నాపతి, రోషముతోఁ జంపితీవు క్రూరుఁడ వగుటన్
బాషాణత్వముఁ బొందుము, భాషలు వేయేలయంచుఁ బల్కెన్ బెలుచన్. 715

క. తరుణి శపియించి యిట్లతి, కరుణము దోఁపంగ నేడ్వఁగడఁగిన విని యా
కరుణారససాగరుఁ డగు, హరి యిట్లని యానతిచ్చె నాసతితోడన్. 716

మ. మునుదాఁ జేసెను శంఖచూడుఁడు తపంబు న్నిన్నుఁ గామించి నీ
వును నన్గూర్చి తపంబొనర్చితివి పూవుంబోఁడి యద్దాన నీ
దనుకన్ దానవుఁ డిచ్చ నిన్గలసి మోదంబంది యీగ్తె; న్మదం
బున నీదేహముపీడి నిశ్చలసుఖంబుం బొందు నిశ్చింతతో. 717

క. నీ వొనరించిన తపమున, కీవును ఫలమందు టొప్పు నెట్లును సతి యీ
మై పీడినంతటనె నా, దేవివి కాఁగలవు నీవు దివ్యతనువుతో. 718

క. చిరకాలము నాతో సు, స్థిరభోగము లొదవు నీవిసృష్టమగు కళే
బరమది గండకి యనఁగాఁ, బరఁగును బుణ్యప్రదప్రవాహినియనఁగన్. 619

వ. నీ పెన్నెఱిగుంపు తులసినా దనరి త్రిలోకీజనతాఘనతాపత్రయలతాలవిత్రంబగు పత్ర
లతాంతంబులనొప్పి తత్పత్రసుమంబుల దేవతారాధనం బొనర్చినవానికి సర్వకాము
దంబై యెసంగు; గోలోకవిరజాతీరరాసబృందావనంబులను, చందనచంపకమాధవ
కేతకీమాలికామాధవీకుందకురువకవకుళముఖానేకలతాపరివేష్టితంబైన యావాసంబు
నీకగుఁ; దులసీతరుమూలంబున సమస్తదేవతీర్థంబులు నెలకొనియుండుఁ; దులసీ
దళసంస్పర్శనమాత్ర నరుండు ఘోరదురితక్షయసిద్ధింబొందుఁ; దులసీపత్రతోయ
సేవనంబువలనఁ గోటితీర్థంబులఁ గ్రుంకులిడిన ఫలంబు దొరకొనుఁ; దజ్జలంబుల
నిష్టదేవాభిషేచనంబు లొనర్చిన సుధాఘటసహస్రాభిషేకంబున కెక్కుడు ఫలంబు
నెక్కొనఁజేయు. కార్తికియం దొక్క తులసీదళంబు పాత్రువ కీగి మాత్రంబున
గోసహస్రదానఫలంబు లభియించు; మృతికాలంబునఁ దులసీపత్రతీర్థం బించుక
సేవించు నరుఁడు నిరస్తసమస్తకిల్బిషుండై శాశ్వతవిష్ణులోకనివాసుండగు. నిర
తంబుఁ దులసీతీర్థంబు సేవించువాఁడు లక్షాశ్వమేధఫలంబు లనుభవించు; దులసీ
దళధారులును దత్కాండనిర్మితమాలికాధారులును నిరతవైకుంఠనివాసులై పీఠోగం
బులగుభోగంబు లనుభవింపగలరు; తులసీదళంబులపై దొలంగంద్రోఁచిన నరుండు
కాలసూత్రంబునంబడి యాచంద్రార్కంబుగా యాతనలం బొందుచుండుఁ; దులసి
ముంగల మిథ్యాశపథంబులు పలికినవాఁడు కుంభీపాకంబునఁ గూలుఁ; బూర్ణిమా

మాద్వాదశీ సంక్రమణములఁ దైలాభ్యంగనం బొనర్చెనేని త్రిసంధ్యలందుఁదులసీపూజా
పరతంత్రుండగు నరుండు హరిపార్శ్వవర్తియై యుండు. నీవు ద్వీపినీరూపంబున
లవణాంభోరాశికి దేవివై యుండుతఱి నీ శాపంబునఁజేసి నేనును భరతవర్షంబున
శైలరూపధారినై గండకీతీరంబున వసియింతునని చెప్పి యంతర్ధానంబు నొందె
ననవుడు, 720

## సావిత్రీ పూజాది కథనము.

క. పావనమై మీఱిన తుల, సీవృత్తాంతంబు వింటిఁ జెవు లలరారన్
సావిత్రీకథను విన నెం, తే వేడుక వొడమె దానిఁ దెల్పు మహాత్మా. 721

గీ. ఎవనిచేత సావిత్రి యుద్భవముఁ జెందె, వేదమాతృక యను వార్త వెలయనేల
మొదల నెవ్వాఁడు సేసెఁ దత్పూజనంబు, పిదపఁ దత్పూజనంబుఁ గావించిరెవరు

క. నా విని నారదమునికిం, దా వినుపం గడఁగె నిట్లు నారాయణుఁ డా
సావిత్రిచరితమును విను, మా వేదసవిత్రి యన యథార్థము వత్సా. 723

చ. మొదలను దత్త్రియూజనని పూజనముం బొనరించె భక్తిలోఁ
గుదురఁగ ధాత ప్రాఁత పలుకు ల్వచియించె; నటన్ సమస్తకో
విదులు భజించి; రశ్వపతిభూపతి గొల్చె ననంతరమ్మునన్
బదపడి నాల్గువర్ణములవారు భజించిరి ప్రేమమీఱఁగన్. 724

క. అన నారదుఁ డానారా, యణునిం గని యిట్టు లనియె నశ్వపతి యనం
గ నెవం, డతండు సావి, త్రిని బూజించుట యదెట్లు? తెలుపు మహాత్మా, 725

వ. అనవుడు నారాయణుం డిట్లు వచించెఁ దొల్లి భద్రమండలమ్మున నశ్వపతి
యనురాజు ధర్మనిరతుండును రిపుశాసనుండునునై రాజ్యం బొనరించువాఁడు. 726

క. మాలతి యనఁగా నొప్పెడు, లీలావతిఁ దొల్లి శౌరి లిబ్బులచెలియన్
బోలి వరించెను నానతిఁ, బోలిన పువ్వారుఁబోఁడిఁ బొడఁగన మెచటన్. 727

క. ఆపతికి దైవయోగము, చే సంతతి గలుగదయ్యెఁ జిత్తములోనన్
దా సంతతిపొందమిను నెం, తే సంతాపింపఁదొడఁగె దేహము దఱుఁగన్. 728

ఉ. పుత్రులు లేరటంచు మది పొక్కుచునుండి వసిష్ఠునాజ్ఞ సా
విత్రిని భక్తిఁ గొల్చియును బిడ్డలఁ బొందఁగలేక తా నహో
రాత్రము మానసంబున భరంబుగఁ జింతవహింపుచుండె నీ
ధాత్రిని బుత్రులం గనని తన్వికిఁ జింతయనంగ నబ్రమే. 729

చ. నిరతము చింతచేఁ జివుకు నీరజలోచనఁ గాంచి యశ్వభూ
వరుఁ డను బీరమేది తగవా మగువా నెగు లూనఁ నింక నే
వెరవుననేనియుఁ శ్రుతిసవిత్రిని గొల్చినఁ గల్గు పుత్రుఁ డం
చురువడి బోధ చేసెను సయోన్నతి మీఱఁగ సారసాక్షికిన్. 730

క. సావిత్రీపూజనమును, గావింపఁదలంచి బుధనికాయంబులతో
దేవేరితోడఁ జనియెను, భూవరుఁడు తపంబుసేయఁ బుష్కరమునకున్. 731

మ. సతితోడన్ శతవర్షము ల్నియతిమై సావిత్రిఁ బూజించియుఁ
సుతులం గాంచఁగలేక యాతఁడు కడు న్శోకించుచున్నంత నీ
వతిభక్తిం బదిలక్ష లిక్కరణి గాయత్రిన్ జపింపంగ వాం
ఛితముల్ సేకుఱునంచుఁ బల్కె కటిదోఁచెన్ వ్యోమమార్గంబునన్. 732

క. అచ్చోట కయ్యవసరమున, విచ్చేసెఁ బరాశరుండు పృథివీపతి యా
సచ్చరితుని కర్ఘ్యాదిక, మిచ్చి శుభప్రశ్న లడిగె నేచినభక్తిఁ. 733

వ. అంత నాపరాశరుండు సంతసించి రాజున కిట్లనియె. 734

క. రాజర్షి! వినుము నీవీ. యోజను సంకల్పసిద్ధి నొందెదు గాయ
త్రీజపముం బదిలక్షలు, గాఁ జేసిన నరున కెల్ల కామ్యము లబ్బున్. 735

సీ. ఒకమాఱు గాయత్రి నుచ్చరించినచో న • హర్నవంబగు పాప మణఁగిపోవుఁ
బదిసార్లు గాయత్రి పఠియించినంతనే • పాపం బహర్నిశాభవ మడంచు
వేమార్లు జపియి ప వృజినంబు వత్సరా • ర్జితమైన నపుడ నశించిపోవు
లక్షగాయత్రి దలంచిన జన్మకృ • తంబగు బలుదురితంబుఁ దొఱఁగు

గీ. అన్యజన్యజమగు పాప మణఁగును దశ • లక్షలు స్మరింపఁగా శతలక్ష లాత్మ
నెలకొలుప సర్వజన్మసంకలితమైన • పాతకం బపనీతమౌ భూతలేంద్ర. 736

చ. అనుదినమందు సంధ్య విడనాడక భక్తిని మూఁడువేళలం
బనిగొనిచేయుమీ వది శుభంబగు సంధ్యఁ ద్యజించువాని శూ
ద్రునివలె విప్రకార్యముల దూషితుగాఁ గనుఁగొందు రట్టివాఁ
డొనరుచు పుణ్యె మానరుని నొందదుసూవె తురంగభూవరా. 737

క. యాజ్ఞీనంబును సం. ధ్యావందన మెవఁడుసేయు నాతం డుర్వీఁ
జీవన్ముక్తుండై తే. జోవంతుం డగుచు వెలయు క్షోణీనాథా. 738

మ. హరిమంత్రాహితుఁ డప్రజీవియును సంధ్యాహీనుఁ డజ్ఞానియున్
హరిపూజారహితుండు క్రూరుఁడు ఋతుస్నాతాస్నవీరాన్నత
త్పరుఁడు న్వార్థషికుండు ధావకుఁడు విద్యాకన్యకాక్రేతయౌ
ధరణీదేవుఁడు దర్పమేది విషరిక్తంబైన సర్పం బగుఁజా. 739

గీ. బ్రాహ్మణుండయ్యు సంధ్యను వార్వఁడేని, వాఁ డొసర్చిన పిండతర్పణముఁ గొనరు
పితరు; లవ్వాఁడు పూజఁగావించెనేని, సురలు గైకొన నొల్లరు ధరణినాథ. 740

క. ఇనుఁ డుదయంబును గాంచుట, యును నిద్దుర వీడనట్టి యుర్వీదేవుం
డనుపమకళాఢ్యుఁడైనను, విను కోఱలులేని పాము విధముగ నుండుఁగా. 841

క. ఈవిధి గాయత్రీపూ, జావిధి యంతయును భూమిజానికిఁ దెలియం
గా వివరించి వెసం దన, యావాసంబునకు మౌని యరిగె మునీంద్రా. 742

ఉ. తాపసుఁ డేగునంతట ముదంబు ఘనంబుగఁ జెంది యశ్వధా
త్రీపతి మూఁడువేళల సరిత్తటమందు వసించి వేయివే
తేపలు సంజపూజనము దీక్షితుఁడై నెరవేర్చ లోనిసం
తాపము వాయఁగా నభిమతంబును బొందె జగద్ధితంబుగన్. 743

వ. అది యెట్లన్న. 744

క. మిత్రప్రభాన్వితను సా, విత్రిని భక్తిప్రపత్తి వినుతించిన యా
ధాత్రీరమణునిఁ గని సా, విత్రియు దయమీఱఁ దల్లి విధమునఁ బలికెన్. 745

మ. క్షితిపాలోత్తమ! నేనెఱుంగుదును మీచిత్తంబులం బొల్చు వాం
ఛితముల్ పూఁతను బొందఁగాఁదలఁచి చేసె న్నిష్ఠ నీకాంత స
త్సుతుఁ బొందం దప మీ వొనర్చితివి సంతోషంబు వాటిల్లె వి
ష్ఠ తనూజాతను బొందుమా, కడపటం బుత్రుండునుం గల్గెడుఁగా. 746

క. అని దీవించి చివాలునఁ, జనె నాసావిత్రి ధాతజగమునకు నృపుం
డును నవఁబోఁడియు నంతటఁ, జని రాత్మనివాసమునకు సంప్రీతిమెయిన్. 747

మ. చని యాదంపతు లిర్వు రత్యధికనిష్ఠం బూని సావిత్రిపూ
జనముల్ సల్పుచునుండ నొక్కతటి నాచంద్రాస్య గర్భంబునన్
వనితారత్న మొకర్తు పుట్టె శుభలగ్నంబందు సావిత్రి సొం
పున రాజిల్లుట నట్ల నామకరణమ్ముంజేసె రాజయ్యెడఁగా. 748

క. లాలన మొప్పఁగ దాదులు, పాలింపం బెనుచుచుండ వర్ధిల్లె శర
త్కాలాదిపక్షశశికళ, పోలిక నంతంతకు న్నృపుజ్జ్వలకలలన్. 749

ఉ. మానవనాథు కూఁతు రసమానవిలాసవిభాసిరూపరే
ఖానవమోహనాంగియయి గానకళ న్నెఱికల్గి సర్వథా
శ్రీనరనాథమౌళిమణిదీధితిదీప్తపదాబ్జునిఁ రతీ
మానవతీమనోహరసమానవిలాసు వరింపనెంచుచున్. 750

మ. సరసాళీజనసేవ్యమానయయి యిచ్ఛాగోష్ఠి నుండంగ స
ర్వరసామండలిఁ బొల్చు రాసుతులలో రమ్యుండు కారుణ్యశాం
తరసానూనమనస్కుఁ డంగభవసౌందర్యాన్వితుండౌ ధరా
వరసూనుండెవఁడొక్కొ పేర్కొనుఁడు మీప్రజ్ఞల్ విచారింపుఁడు. 751

మ. అని సావిత్రి వచింపఁగా నొక వయస్యారత్న మూహించి యి
ట్లనియె న్సర్వదిగంతరాఖిలధరాధ్యక్షాత్మజాతాళిలో
ననఘుం డాకృతిమీనకేతనుఁడు విద్యావంతుఁడు స్వీరుఁడుఁ
దిననాథప్రతిమానతేజుఁడు ద్యుమత్సేనాత్మజుండౌఁ జుమీ. 752

చ. అతనికి సత్యవంతుఁడను సార్థకనామ మెసంగు వాని కె
వ్వతె సతియై నిరంతర మపారసుఖంబులఁ బొందనున్నదో
మతి కెఱుఁగంగరా దనిన మానవనాథతనూజ యెంతయుఁ
గుతుకముఁబొంది తండ్రికడకుం జని చెప్పెను దచ్చరిత్రముఁ. 753

శా. భూమీశుండు తదీయజల్పముల కామోదించుచుం బుత్రికఁ
ద్యుమత్సేనికి నిచ్చి పెండిలి శుభోదర్కంబుగాఁ జేసి యా
జామాతం గడుసత్కరించి వివిధాజానేయగాణిక్యనా
నామాణిక్యము లాదిగాఁగలుగు కానుకల్ పెక్కు లిచ్చెంగృపన్. 754

చ. కొమిరెకు నట్లుకానుకలు కొల్లలుగాఁగ నొసంగి భర్తృదే
శమునకుఁ బంపఁగాఁ దలచు సందడినుండఁగ లేకలేక య
ట్రముగను గాంచి పెంచి యచిరంబుగఁ బెద్దగఁజేసినట్టి ప్రే
మముగల తల్లి ముద్దులకుమారిక నంకముఁ జేర్చి యిట్లనున్. 755

ఉ. పుత్రులు లేకలేక తలఁపుల్ మునుముట్టఁగ నెట్టకేని సా
విత్రిని గొల్చి కాంచి నినుఁ బెంచియుఁ బెద్దగఁజేసి యిందిరా
పుత్రునిబోని నీమదికిఁ బోలినవానికిఁ బెండ్లిజేసి లో
కత్రయమాన్యుఁడై వెలసెఁగాదె భవజ్జనకుండు నేటికిన్. 756

ఉ. మానితవైఖరి న్మగనిమాటలకుం జవదాఁటకుండి యా
జ్ఞానుగుణప్రచార మది సద్వ్రత మంచుఁ దలంచి భర్తృసే
వానిరపాయవై సకలబంధుసుహృజ్జనకోటిఁ బ్రోవు మా
నౌనని లోకము ల్పొగడ నొప్పెడు దాన యశంబు పుత్రికా. 757

క. భావిశ్రేయఃపికకే, కీవనములు కలుషపవనలేలిహానముల్
జీవనములు జన్మత్రయ, పావనములు ప్రాణనాథపదసేవనముల్. 758

శా. ఏపుణ్యంబు నెఱుంగ వింతకును బ్రాణేశుండు దైవంబు సు
మ్మీ! పుట్టింటికి మెట్టినింటికిఁ గడున్మేల్పేరు దేవమ్మ! సే
వాపారీణత నత్తమామలయెడన్ బాటింపు మాయమ్మ! నిన్
తేపే క్రమ్మఱఁ దోడితెచ్చెదఁ గుమారీ! చింతలంటోకుమీ. 759

చ. అని విహితప్రకారమున నాత్మజకు న్మతిచెప్పి యంత జా
లిన నెఱిమంచు గోట నవరించుచు ముద్దిడి వీడుకొల్పిన న్
ఘనతరతూర్యరావము లఖండములై చెలఁగంగ నాథుతో
ననుదివసప్రయాణమున నాత్మపురి న్వసియించి యచ్చట న్. 760

ఉ. సంతత మాశుభాంగి పరిచర్యల నెంతయు నత్తమామలన్
సంతసమందఁజేసి పరిచారకులం దయఁబ్రోచి రేపగల్
కాంతునకు న్ముదం బొదవఁగా నతిభక్తిఁ జరించుచుండె ని
శ్చింతత సత్యవంతుఁడును జేడెను గూడి సుఖించెఁ బ్రేమతో. 761

మ. యువరాజై కవిరాజులన్ మనుపు చతుర్యోత్కృష్టకార్యంబులన్
భువి నిష్కంటక మాచరించి యతులాభోగంబులం బొంది కా
లవిధిన్ రాజ్యముఁ గోలుపోయి పురినిల్వన్ సిగ్గుచేఁ దాపసా
టవికిన్ వృద్ధులు తల్లిదండ్రులకుఁ దోడ్పాటై చనెం గాంతతో. 762

క. వన్యాహారమొనర్చు చ, వన్యాదృశశక్తిఁ బితల నరసికొనుచు సా
మాన్యప్రక్రియ నయ్యరా, ట్కన్యామణిఁగూడి దినముఁగడపుచునుండెన్. 763

క. ఈరీతి సత్యవంతుఁడు, నీరజసఖుఁ డుదయశిఖరి నెలకొనుడుం గాం
తారమున ఫలసమిత్కుశ, లారసి తెచ్చుటకు జనకునానతిఁ జనుచో. 764

చ. అరనిమిసంబు నాథవిరహంబు సహింపనిదౌటఁ గాంతుతో
వరిగెఁ దదీయపత్ని; యతఁడట్లు వనంబున కేగి యొక్కచో

హీరుహమునుండి జాఱిపడి మేనుదొఱంగినఁ జిత్తమందు న
త్తరుణియుఁ జింతనొంద కతిధైర్యమున న్వసియించె ముంగలన్. 765

ఉ. కాటుకకొండఁబోలి తనుకాళిమదక్కులఁ జిమ్మచీఁకటుల్
దీటుకొనంగఁ బెల్లెరగలి న్వెదఁజల్లెడు కన్నుదోయియై
మాటికి మెల్కువారి విషమంబగు దంష్ట్రలు దీటుకొంచు న
చ్చోటికివచ్చెఁ గాలుఁ డొకశూలము కేలధరించి యుగ్రుఁడై. 766

క. మృతినొందిన రాసుతు నం, చితమతి నంగుష్ఠనిభునిఁ జెచ్చెరఁగొనుచుం
బితృపతి క్రమ్మఱఁజనుఁచో, వెతగొనకయె తరుణి యముని వెనువెంట జనెన్.

క. తనవెంబడిఁ జనుదెంచెడు, వనిత వీక్షించి మధురవాక్యముల యముం
డను నిట్లు పాంచభౌతిక, తనువున నీవెందుఁబోవఁ దలఁచితి వబలా. 768

చ. మగనిని గూడివచ్చుటిఁక మానుము, మానుషు పాంచభౌతికం
బగు తనువున్ బిరాన హృదయాధిపుకోడఁ జనందలంతువే
మిగుల నశాశ్వతంబయిన మేనున నాపురి కిట్లు వచ్చుటల్
నగవగుఁగాదె నాపుర మ్మనశ్వరమంచును నీవెఱుంగవే. 769

క. ఆయువు పిండిన నీపతి, కాయంబుఁదొఱంగె నిఁక స్వకర్మఫలములన్
నాయింట ననుభవించుట, కైయరుదేరఁగలఁ డింకఁ గలగఁకుము సతీ. 770

సీ. కర్మంబులనుజేయఁ గల్గును జన్మంబు • మరణంబు భూరిసంపదలు గల్గు
నిడుమలు సంధిల్లుఁ బొడవగుదుఃఖంబు • లడఁగును సౌఖ్యముల్ దొడరుచుండు
బౌరందరపదంబుఁ జూఱఁగాఁ గొనుటబ్బు • బ్రహ్మపుత్రత్వంబు బడయనగును
హరిదాసుఁ డగును జన్మాదిహీనుండగు • నమరును సర్వకామ్యములసిద్ధి
గీ. పొసఁగు విష్ణుసాలోక్యాదిముక్తులెల్ల • విబుధమునిరాజమనురాజవిప్రరాజ
రాజశేఖరతావాప్తి రాజిలంగఁ • జెలఁగు నెయ్యెడలను జూడ జీవునకును. 771

క. ఇమ్మహిఁ జేసిన కర్మవ, శమ్మున సుఖదుఃఖములు యశమ్మపయశమున్
బమ్మెరయగు రూపము స, ర్వమ్మును గర్మమున ననుభవంబగుఁ దరుణీ. 772

చ. కడమయొకండు లేదిఁక జగంబున జీవునికర్మమూలమై
బడిబడి సర్వభాగ్యములఁ బ్రాప్తములౌను నశించు దాన నీ
యెదయఁడు ధాత్రిలోనఁ దదవాంది చరించి గతించెఁ దీనికై
యడలఁగనేల గోలవయి యంగన! యూఱడుమింక నావుడున్. 773

క. కాలుని వచనం బాసతి, యాలించి ముదంబుతోడ నప్పుడు తనదౌ
గోంతనంబున నతనికి, జాలిం బుట్టించి యొక్క సందియ మడిగెన్. 774

వ. మహాత్మా! కర్మ మనునది యెద్దాన జనించు? దానికి హేతువెద్ది? తత్కారణం బెవ్వండు? ప్రాణంబులు బుద్ధియు జ్ఞానంబు నింద్రియంబులు ననునవి యెట్టివి? తద్దేవత లెవ్వి? జీవాత్మకుఁ బరమాత్మకుం గల్గిన తారతమ్య మేమి? యనుగ్రహింపవే యనుడు దండధరుండు వెండియు నిట్లనియె. 775

చ. పరమపతివ్రతామణి శుభంబగు ప్రశ్నముఁజేసి తిట్టు లె
వ్వరు ననుఁ గోరఁబోరు విను వారక కర్మఫలానుభావియై
హరిపదభక్తిగల్గి తృణహాటకముల్ సరిగాఁగఁజూచు నే
నరుఁ డతఁడాధిమృత్యుజననప్రతిపక్షుఁడు ముక్తుడుం జుమీ. 776

గీ. వేదచోదితకర్మంబు విహితమగును, శ్రుతిరహితకర్మ మెపుడు సంగతముగాదు
హేతురహితంబు సంకల్పహీనమైన, దేవసేవయె పరమభక్తిప్రదంబు. 777

వ. ఓసతీమణీ! భగవంతుండగు పరమాత్మయే కర్మస్వరూపుండు హేతుభూతుండు నగు. సదసద్భేదరూపంబగు జ్ఞానంబు నానావిధంబై పరఁగుచుండు; బుద్ధియు జ్ఞానబీజంబు; దేహికి బలరూపంబులు ప్రాణంబులు; రూపంబును జ్ఞానభేదంబై పరఁగుచుండుఁ; బ్రకృతిపరంబు సర్వవ్యాపకంబును నిర్గుణంబు నగునదియే పరమాత్మ యనంబడుఁ; బ్రాణదేహాదుల ధరించునదియే జీవాత్మ యనఁబడు; నోపతివ్రతారత్నమా! దీన నీసంశయము దొలంగెఁగదా! యింక యథేచ్ఛం బొమ్మనుడు సావిత్రి యిట్లను. 778

ఉ. ఎచ్చటికేగుదాన హృదయేశ్వరుఁడుం దగు జ్ఞానసింధువీ
విచ్చటనుండఁ; జెప్పఁదగునే యొకప్రశ్నకు నుత్తరంబు వా
క్రుచ్చి యనుగ్రహింపుము వియాధిగ నావుడు దానిమాటకు
న్మెచ్చి సతీమణీ! యడుగుమీ మది సంశయమంచు విల్చినన్. 779

సీ. జీవుఁ డేకర్మంబు సేసి యేయేజన్మ • లందు దా నద్భవం బందుచుండు
ఎట్టికర్మంబుచే నింద్రత్వముంగాను • నరక మెద్దాన సందర్భమగును
ఏకర్మమున ముక్తి చేకొనఁదగియుండు • గురుభక్తి యెద్దానఁ గుదురనగును
సుఖదుఃఖములఁ జేయఁజూచు నేకర్మములు • లామయ మెద్దాన నావహించు

గీ. అంధుఁడును కాణుఁడును పంగు వంగహీనుఁ, డల్పజీవుండు దేనిచే నగుదు రిలను
పదవు లెద్దానివలన సంప్రాప్తమగును, దెల్పవే నాకు దయతోడ ధీవరేణ్య. 780

మ. సదయుండౌచుఁ గృతాంతుఁ డిట్లనియె నోసాధ్వీశిరోరత్నమా
పదుమూఁడేడుల ప్రాయపుంగలికి విద్వద్ జ్ఞానియోగీంద్రులుఁగా
మదినూహింపనిప్రశ్నఁజేసె దిదియానందంబు చేకూర్చె నీ
కెది యిష్టం బది దెల్పు మిచ్చెదను నీయాత్మేశుసంగాకిఁకన్. 781

గీ. భర్తలేఁడటంచుఁ బరితాపమందకు, మఖిలసాధ్వులందు నగ్రగణ్య
వై నుతింపఁబడుదు వా రతిపొల్కు మాం, గళ్యసిద్ధి నీకుఁ గలదుసుమ్మ. 782

వ. అనవుడు సంతసిల్లి సావిత్రి యిట్లనియె. 783

ఆ.వె. సత్యవంతువలన సంతతి నాకును, నాదుమామకు నయనములు మఱియు
రాజ్యలాభమును దిరంబుగ నాతండ్రి, కాత్మజనులు గలుగునట్లుగాఁగ. 784

వ. అనుగ్రహింపవలయు. 785

క. అనవుడు నట్లయ్యెడు నీ, మనమునఁ గలకోర్కు లని శమనుఁ డనఁగా దే
వనరులకర్మవిపాకము, వినిపింపుమటంచుఁబల్కె వినయముతోడన్. 786

ఉ. జీవుఁడు కర్మశేషములచే సుఖదుఃఖములన్ భరించి నా
నావిధయోనులందు జననంబయి సంచితకర్మలోలతన్
దేవవిభుత్వము న్నరపతిత్వము భోగము రోగమందు రా
జీవదళాక్షి! సూక్ష్మముగఁ దెల్పితిఁ దత్క్రమ మెంచి చూడుమా. 787

వ. అనవుడు, 788

ఆ.వె. ధర్మరాజ! యెట్టి కర్మంబు లొనరించి, త్రిదివలోకముఖ్యపదవులెల్ల
ధరణిజనులు గాంత్రు దయనానతీఁగదే, యనిన నతఁడువలికె నతివతోడ. 789

క. దానంబులందు నుత్తమ, దానము లోకమున నన్నదానముసుమ్మా
దాఁవికిఁ గాలక్రమమును, న్యూనాధికవర్ణభేద ముండదు సుదతీ. 790

సీ. అన్నదానంబుచే నలవిష్ణులోకంబు, వస్త్రదానంబుచే వాయుపదవి
తల్పదానమునఁ జంద్రజగన్నివాసంబు, యానదానమునఁ దోయపతిజగము
దీపదానమున స్వాహాపాలువాసంబు, ఫలదానమునఁ ద్రిదివస్థలంబు
తిలదానమున పార్వతీదవావసదంబు, దంతిదానమున నింద్రత్వమబ్బు

గీ. విను శిరోవ్రతమున స్నానమును బొనర్చి, పూతుఁడగువాని కుపదేశమును బొనర్పఁ
కుండు నెవ్వఁడు వాఁడు దుష్టుఁడు వాని, విద్య నశియించునని తత్వవేత్తలంద్రు.

గీ. భస్మము పవిత్రమీ సంపర్కశుద్ధ, ముగ నలిపి నిత్యము లలాటమును దిర్య
గంచితమ్ముగ ధరియించు టభిమతంబు, బ్రహ్మజాత్యుద్భవునకని పలుకు శ్రుతులు.

క. శ్రుతిసిద్ధభస్మధారణ, మతులితశివలింగపూజ యను నియ్యవి తా
మతిమంతుఁ డెప్పుడును మా, ని తగన్ మానితవిభూతి నెగడఁడు మౌనీ. 133

క. తెలుపగు భస్మమ్మున నొడ, లలమిన మనుజుండు వేగ మఘ మెడలి రజః
కలనంబు వీడి శుద్ధిన్, జెలఁగున్ సంశయ మొకింత చేయకు మిచటన్. 134

వ. అగ్నిహోత్రాగ్నిజమ్మును విరజానలజమ్మును నౌపాసనసముత్పన్నమ్మును బచనాగ్నిసముద్భూతమ్మును దావానలసముద్భవమ్మును, సమిదగ్నిసంజనితమ్మును నై భస్మమ్మాఱు దెఱఁగులు గలయది. ఇందుఁ ద్రైవర్ణికులకు మొదటిరెండును ధార్యంబులు, గృహస్థులౌపాసనసముద్భవంబగు భస్మంబు ధరియించు టభిమతంబు, సమిదగ్ని సంజనితంబు భస్మంబు బ్రహ్మచారులు ధరియించుట సమ్మతంబు, శ్రోత్రియాగారపచనాగ్ని సముద్భూతంబగు భస్మంబు శూద్రులకు ధరింప నర్హంబు, తదితరులకు దావానలోద్భవంబు శాస్త్రచోదితంబని వెండియు. 135

ఆ. అనఘ! పూర్వత్రయోదశి యందు స్నాతుఁ
డగుచు సుకృతాహ్నికుండయి యార్యుఁడైన
గురుని పూజించి యీవ్రతము రహిఁ జేయు
వాఁడ నంచు సంకల్పింపవలయు వినుము. 136

సీ. తను వుండునంతకంచును నొండెఁ బదియు రెం, డేఁడు లవియు నొండె నెలమి నాఱు
సంవత్సరము లొండె సగ మొండె నద్దాన, వత్సరం బొండెఁ దద్వత్సరమున
సగ మొండె నొక్క మాసం బొండెఁ బదియు రెం, డహములు నొండె నాఱహము లొండె
నద్దాన సగ మొండె నహ మొక్కఁ డొండెను, సంకల్పమున కవసానముగను

ఆ. విశ్రయించియు మఱియు నగ్ని నతిభక్తి
వఱల విరజాహవనమున వలయుఁ దృప్తిఁ
జేయ నాహోమసత్కృతి సేయు నపుడు
మూలమంత్రస్మరణ మతిముఖ్య మనఘ. 137

గీ. మఱియు నయ్యగ్నియంద గోమయము నుంచి
నాఁటికి హవిష్యభోక్తయై నవసి తాఁ జ
తుర్దశిని నుదయమ్మునఁ దొల్లిటి కృతు
లాచరించి నిరాహారుఁడయి పదపడి. 138

వ. పూర్ణిమయందు నిర్వర్తితకృత్యుండై యగ్ని నుపశమింపఁజేసి యందలి భస్మమ్ము గ్రహియించి నియతుండై తత్తదవయవమ్ముల యథావిధి భస్మోద్ధూళనం బొనర్చి జపియింపవలయు. 139

గీ. మూఁడు సంజల నీగతి మూఢుఁడేని, పాశుపతమగు వ్రతమును భక్తిజేసి
తనపశుత్వమ్ము విడనాడి గనెడి భుక్తి, ముక్తులను నిక్క మియ్యది మునివరేణ్య.

ఉ. ఆయు వొసంగు సౌఖ్యముల నంద నొనర్చు బలమ్ము నిచ్చు సు
శ్రీయును బుష్టియుఁ గా శుభసమృద్ధియు రోగనివృత్తియున్ సదా
చేయు మఱింత యేటికిఁ జెందదు మారిభయమ్ము భక్తిమై
నే యనఘుల్ ధరింతు రిటు లెప్డును భస్మము వారి కెయ్యెడన్. 141

క. స్నానం బొనర్చి భస్మ, మ్మూనంగా వలయు శక్తి యొలయని మనుజుం
డీ నియతి విడిచి కరచర, ణాననములు గడిగియైన నది గొను టొప్పున్. 142

క. కరచరణాననానం, తరమునఁ దగ నాచమించి తాల్చిన యయ్యం
బరము విడిచి పరిశుద్ధాం, బరమున్ ధరియింపవలయు పరమమునీంద్రా! 143

క. శిరము లలాటమ్మును గం, ధరమును గర్ణమ్ములును హృదయమును బాహుల్
ధరియింపం దగు చోట్లని, పరమమునీంద్రులు వచింత్రు భస్మమ్మునకున్. 144

క. సరసిజభవసరసిజనయ, నరుద్రులై మూఁడునుం దనర్చును రేఖల్
ధరియించునెడ నిగమము, చ్చరించు నతిగర్హితము ద్విజన్మలు దక్కన్. 145

క. పదివేలు చెప్ప నేటికి, సదమలమగు భస్మ మెవఁడు స్నాతుండై తా
ను ధరించు నమ్మహాత్ముఁడు, మదనాంతకుఁ బోలుఁజాలు మహిమము కలిమిన్ 146

గీ. వైదికోత్తములొండె శైవులొండె
నొనఁగు భస్మమ్ము భక్తి పెంపెసఁగఁ గొనఁద
గును తిరిగిరు లిడిన దాని గొనఁగఁ దగ ద
టంచుఁ బెద్దలు వచియింతు రమలచరిత 147

క. కరణమ్ము లెన్నియే శం, కరుపూజకు సంగ్రహించుఁగాక నరుఁడు భ
స్మరహితుఁ డగునెడ నన్నియుఁ, బరమమునీ! వ్యర్థములయి పొదరుఁజుమ్మీ.

చ. జపము తపమ్ము హోమమును శ్రాద్ధము నన్యము సర్వము న్వృథా
త్వపదవిఁ గాంచు భస్మమును దాల్పనిచో నది తాల్చి విప్రు లె
ట్టిపను లొనర్చిరేనియుఁ గడింది పవిత్రత కాకరమ్ములై
యపగతరోగులై విగళితైనసులై చరియింతు రెప్పుడున్. 149

గీ. సర్వవర్ణమ్ములకును భస్మము ధరించు, టతిహితమ్మని చెప్పుట యనవసరము
హరిహరాదులు దేవత లఖిలమునులు, దీని ధరియింతు రెల్లప్డు దేవమౌని. 150

క. ఎవని లలాటమ్మున భ, స్మవిలేపన మొప్పువాఁడు చతురాస్యుని దు
ర్వ్యవసాయాక్షరపంక్తుల. నవలకుఁ ద్రోఁచి సుఖము లందు మునీంద్రా! 151

క. వాతము శ్లేష్మము పైత్యము, హేతువుగాఁ గల్గు వ్యాధు లెల్లను భస్మో
పేతశరీరులఁ జెనకం, గాతరతం జెందు హరినిఁ గను కరులగుచున్. 152

క. విను భస్మస్నానమ్మున, కనఘా! వేఱొండు తుల్య మనుకొన సుము భు
క్తి నిడుఁ జా ముక్తినిడున్ బా, వనతం గలిగించు నెట్టి పాపాత్ములకున్. 153

క. మణికన్న నెక్కుడుగ బ్రా, హ్మణుఁ డెవ్వఁడు భస్మసంగ్రహము సేయు ద్విజా
గ్రణి! యాతం; డితరుఁడు బ్రా, హ్మణేతరుఁడు పాపకర్ముఁ డపవిత్రుండుఁజా.

క. జందెములు లేక సంధ్యా, వందనము లొనర్ప నెట్టి ఫలమబ్బునొ భూ
తిం దాల్పని యాక్రియ యా, చందమ్మున వమ్మగున్ ద్విజప్రవరులకున్. 155

క. దానమ్ములొండె భోజన, పానాదిక మొండె నెవఁడు భస్మరహితుఁడై
తా నొనరుచు నింద్యుం డ, మ్మానవుఁ డవ్వానికంటె మాలఁడు లగ్గా. 156

గీ. శ్రౌతభస్మమ్ము స్మార్తభస్మమ్ము నేని, లౌకికంబేని మేన నందదపలయు
జపము వేళ భస్మశిష్టాగరిష్ఠుఁ, జేరఁగారావు ఘోరంపువృజినచయములు. 157

వ. ఇయ్యెడ నొకపురాతనేతిహాసమ్ము గలదు వినుము. 158

మ. అనిపై యొప్పు విభూతితోడ ధృతరుద్రాక్షసూత్రమ్ముతో
ముని దుర్వాసుఁ డొకప్డు పైతృకజగమ్ము న్గాన నేగెఁ జగ

జ్జననీ ! శాంకరి ! శంకరా ! త్రిజగదీశా ! శర్వ ! యంచున్ మహా
నినదం బొప్పఁగఁ గల్యవాలముఖమౌని శ్రేష్ఠుఁడా దవ్వులన్. 159

క. వచ్చెడి మౌనికి నెదురుగఁ, జెచ్చెరఁ జని వందనములు చేసి విడిదికిఁదా
దెచ్చి రహి నర్ఘ్యపాద్యము, లిచ్చి మహార్హాసనమ్ము లిచ్చిరి భక్తిన్. 160

క. ఆకాలమ్మునఁ గుంభీ, పాకనరకవాసులైన పాపాత్ముల హా
హాకారంబులు పెల్లుగ, నాకాశము వ్రయ్యలైన యటులు వినఁబడెన్. 161

క. మునిమణియును నాకరుణా, నినదంబుల నాలకించి నెగులొదవ మనం
బున నూఅడిల్లి పితరుల, కనిమె నిదెవ్వారి రోదనారావమొకో. 162

చ. అనవుడు మౌని కిట్టులని రయ్యది సంయమనీపురంబు దు
ర్జనులను శిక్షసేయు యమరాజట భీకరరూపు లెందఱో
యనుచరవర్గముల్ దను నిరంతరము న్గొలువంగ నుండు యా
తన బహుభంగులన్ గొలుపు తావులటన్ షడశీతి చొప్పడున్. 163

క. ఆకుండమ్ములఁ గుంభీ, పాక మ్మతిదుస్సహం బపారం బచటన్
వ్యాకులత దానఁ గలిగెడి, శోకం బిదమిద్ధమనఁగఁ జొప్పడ దనఘా! 164

సీ. విష్ణునిందకులును వేదదూషకులును ♦ గణపతిద్రోహులు గమలబాంధ
వద్వేషులును విప్రవంచరులును దప్త ♦ ముద్రాంకితులు శూలమునుధరించు
వామకామాచారపరులు స్మృతిపురాణ ♦ ధిక్కారకులును బితృగురుదుహైరు
లును ధర్మవిరహితులును భ్రాతృగర్హకు ♦ లను మాతృపూజానులోమమతులు

గీ. కూలుదురు వీరలెల్ల నక్కుండమందు ♦ శ్రవణదారుణమైన్న యాశబ్దజాల
మనఘ! యవ్వార లొనరించు నట్టి దెద్ది ♦ వినినమాత్రన వైరాగ్య మనుఘటించు.

క. అనవిని దుర్వాసుఁడు కుం, దనికటమున కరిగి కటకటా యను నాలో
నని వారికెల్ల స్వర్లో, కనివాసముగల్గె నతని కారుణ్యమునన్. 166

క. కొందఱు నగుమెరు నాట్యము, కొందఱు సల్పుదురు వీణ కొందరు వాయిం
పం దలకొందు రమందా, నందమ్మది మానసమ్మునన్ వెలివిరియన్. 167

చ. అదిగని మౌని యక్కజమునందె యమానుచరుల్ మహాద్భుతా
స్పదులయి వేగ మ య్యమునిసన్నిధికేగి యుదంతమంతయున్
విదితముచేయ నవ్విభుఁడు విస్మయమంది ఉలాయవాహుఁడై
మునిమలరింగ నమ్మెదకుఁ బోయి కనుంగొని శంకితాత్ముఁడై 168

••

క. ఆవార్త దూతముఖమున, నవ్యాసపున కెఱిఁగింప నయ్యనఘుండున్
దవ్వనక చిత్తమెంతయు, నువ్విళ్లూరంగ నచటి కొయ్యనఁ జనియెన్. 169

క. హరియు విరించియు దిక్పా, లురు నట కరుదెంచి యచటిలోపల సౌఖ్యం
బరసి నిమిత్తాన్వేషణ, పరతన్ హృదయంబు మిగులఁ బరువులు వారన్. 170

క. ఈ కుంభీపాకం బతి, శోకదమై పాప పరిపకుల కొఱకై రా
సైకద యున్నది దీనన్, నాకాధిక సుఖము గల్గె నత్యద్భుతమౌ. 171

క. ఇఁకఁ బాపమ్ము కతన భయ, ము కలదె యకటకట! వేదపుణ్య మర్యాదల్
వికలమ్ములయ్యెఁ బరమే, శకృతమగు వ్యవస్థ కీ దశయుఁ గల్గెనే. 172

క. తన చేసిన సంకల్ప, మ్మునకు ముధాత్వమ్ము సర్వ మోదించునె య
య్యనఘాత్ముఁ డంచు నెల్లరు, మనమున యోజించుచుండ మాధవుఁ డంతన్. 173

చ. రయమునఁ బార్వతీశ్వరు పురమ్మున కేగి గిరీశుఁ గాంచి మ్రొ
క్కి యనఘ! యిట్టి చిత్రము నొగిన్ గనుఁగొంటిమి నేఁ డటంచుఁ బ
ల్కి యఖిలవృత్తముం దెలుప లీలమెయిన్ నగి యువ్విభుండు సం
శయహరణమ్ముగాఁ బలికె సారసలోచనుతోడ నీగతిన్. 174

సీ. అనఘ! దుర్వాసుఁ డొక్క నిమిత్తమున దారిఁ, జనుచుఁ గుంభీపాక సంగతులగు
జీవుల నీక్షింపఁ జెచ్చెర నస్మావ, కుంఠితమగు మోము కొంతవంచె
నయ్యెడ వాయుదేవాధూతమై భస్మ, మొక్కింత పడియెఁ గుండోదరమున
నక్కతమ్మునఁ బాపులయ్యును గతపాపు, లై వారలట్టి సుఖాతిశయము

గీ. నెనసి రియ్యది భస్మమహిమము నేఁడు, మొదలుగా నద్ది పితృలోకమున వసించు
వారలకు నెల్లఁ దీర్థమై వఱలు నచట, స్నానమొనరింప నత్యంత సౌఖ్య మొదవు.

క. పితృతీర్థనామమున న, ద్ది తనరు నిది మొదలు నన్ను దేవిని నట స్థా
పితులుగఁ జేయందగుఁ ద, త్పితృలోకనివాసులెల్లఁ దివిరి యజింపన్. 176

వ. ఇయ్యది త్రిలోకమ్ముల నుత్తమతీర్థమ్ము నావుడు హరి యమ్మహేశు ననుజ్ఞవడసి మున్నుండు నెడ కరిగి కడచిన వృత్తాంతమ్ము నొడువుటయు వారలెల్ల శిరఃకంపమ్ము లొనర్చుచు భస్మమహిమమ్ము ప్రశంసించిరి. పితరులును దీర్థలాభమ్ము కతన సంతుష్టులైరి. పదపడి యయ్యెడఁ బరమేశు నాజ్ఞఁ బడసి వారి యిరువుర స్థాపించి యమరుల యజించుచుండిరని మఱియును, 177

క. ఏ పాపాత్ము లచట మును, పాపానుభవమున విడువ వడుచుండిరో వా
రే పూతులగుచు హరుని స, మీపమ్మున నిత్యపదవి మెకొని రనఘా. 178

వ. వార లిప్పుడును గైకొనమ్మున భద్రగణనామమ్మున నొప్పుదురని వెండియు. 179

క. ఆకారణమునఁ గుంభీ, పాకము మఱియు క్రిచోటఁ బాపాత్ముల కా
లోకమున నేర్పడుచుఁబడె. నీకీతమున శైవు లచటి కేగరు మరలన్. 180

క. ఇది భస్మవిశేషం బి. ట్టిదియని యెవ్వాఁడు చెప్పెడిఁగా భస్మం బె
ట్టిదియైనను నగు దానికి, సదృశముగ వచింప నొండు జగమునఁగలదే. 181

వ. ఇంక నూర్ధ్వపుండ్రవిధానం బాలింపుము. 182

గీ. శ్యామమిదుఁ గాంతి, యెఱుపు వశ్యమ్మొనర్పుఁ, బీతవర్ణంబు శ్రీకరమై తనర్పు
ధర్మవృద్ధికరమ్ము శ్వేతమ్ము లంచు, మును లనుటఁ గోర్కె కనుగుణముగఁ గొనఁదగు

వ. పవిత్రతరస్థలమ్ములందలి మృత్తు గ్రాహ్యంబని యెఱుంగునదియని వెండియు. 184

గీ. పర్తి వెలిగించిన ట్టి దీపమ్ముపగిది
వెదురుటాకుపంటి శంఖవిధమున సర
సిజముకుళవింగి మత్స్యంపు సిరినిఁ గూర్మ
సామ్యమున నూర్ధ్వపుండ్రమ్ము సలుపవలయు. 185

సీ. ఇమ్మగుగతి లలాటమ్మునఁ గేశవు, రహి నుదరమున నారాయణు హృద
యమున మాధవుని గళమున గోవిందునిఁ, గుడిప్రక్క విష్ణుని నెడమప్రక్క
వామను దక్షిణవామబాహుల మధు, సూదను శ్రీధరు నాదికర్ణ
మునను రెండపకర్ణమునఁ త్రివిక్రము హృషీ, కేశు నళిననాభుఁ బృష్ఠమునఁ గ

గీ. కుత్తుకందు దామోదరు నెత్తి వాసు, దేవుని స్మరించి పుండ్రముల్ దీర్పవలయు
పీవిఁదాల్చిన సశుచియు నేని శుచియు, వానికి మదీయలోకమ్ము వచ్చు నిజము. 186

చ. ఇడఁవగు నూర్ధ్వపుండ్రముల వించుక యంతర ముండునట్టు లె
వ్వఁ డెడనిడందొ దుర్గతికి భాజనమాతఁడు పుండ్రమధ్యమం
దెడపక లచ్చియున్ హరియు నెప్పుడు నొప్పుదు రంతరాలమున్
విడుపని మూఢమానవుఁడు విష్ణునికిన్ మఱి శ్రీకి ద్రోహియౌ. 187

క. సిగయు నుపవీతమును నె. వ్వగ ముఖ్యములౌను విప్రవర్యుల కటు లౌ
వ్వగుఁ బుండ్రధారణము దీ, నిఁ గడచి కర్మమ్ము సేఁతనిష్ఫలమనఘా. 188

గీ. అర్ధచంద్రాది చిహ్నము లాగమజ్ఞు, లైనవారలు ధరియించు టనభిమతము
గానఁ బాహ్యోర్ధ్వపుండ్రముల్ గాక యెట్టి, దేని మఱియొండు దాల్పుట హితముగాదు.

గీ. వేదసిద్ధదేవతలకు వేదవిహిత, చిహ్నములు న్యాయ్యములుగాన శ్రీపతిపశు
పతుల తత్సిద్ధులగుటఁ దత్పద్ధతిరహి, తములు వారెట్లు ధరియింతురు మునినాథ

క. తత్తద్భక్తజనములకుఁ, దత్తచ్చిహ్నములు ముక్తిదమ్ము లగుట వా
రి త్తెఱఁగు తెలిసి తాల్చుట, యుత్తమగతి నొసఁగు నన్యమొండుగతి నిడుఁగా. 191

## సంధ్యోపాసనా మహాత్మ్యము

వ. ఇంక సంధ్యోపాసనమ్ము వినుము. 192

గీ. అక్కడక్కడ నొలసెడి రిక్కగముల
నగు మొదటిసంధ్య రెండవయది యహస్క
రుండు గగన మధ్యమ్మున నుండు వేళ
మూఁడు సూర్యాస్తమయకాలముగ నెఱుంగు. 193

గీ. తారకోపేతమైన నుత్తమము తద్వి
రహితమైన మధ్యమము సూర్యయుతమైన
నధమ మీరీతిఁ ద్రివిధమై యలరుఁ గల్య
సంధ్య యీమూఁటికిని దాఁటఁ జనదుమౌని! 194

క. తరణియుత ముత్తమము త, ద్విరహితమగు మధ్యమమ్ము విస్ఫురదుడుకం
బరయ నది యధమ మీగతి, నరయుము సాయంపుసంజ యనఘవిచారా! 195

గీ. ద్విజుఁడు వృక్షము, సంజ వే, ర్వేదములు వి
టపము, లాకులు ధర్మకర్మపటలములు;
మూలవిరహితమగు చెట్టు నేలఁగూలుఁ
గాన నతియత్నమున సంజఁ గావవలదె. 196

క. తెలియమియుఁ దెలిసినలుపమి, యలవడు ద్విజుఁడెట్టిఁడేనియగు శూద్రుం డ
మ్మలినుండు చచ్చి శ్వాన, మ్మలలోఁ బడుఁగాన సంజ ముఖ్యమ్మనఘా! 197

గీ. ఉదయమున కస్తమయమున కూర్ధ్వమొక్క
మూఁడుగడెలలోఁ దదుపాస్తికూడు నట్టి
కాలము నతిక్రమించి యర్ఘ్యమ్మొకఁ డధి
కముగ నీఁదగుఁ దత్పాతకము హరింప. 198

క. కాలాతిక్రమ మొనరుచు, బాలిశులకు నింక నొక్క ప్రాయశ్చిత్తం
బాలింపు మెన్మిదియు నూ, ఱోలిన్ మొదలన మనుజప మొనరింపవలెఁగా. 199

క. ఏకాలమ్మున మనుజుం, డేకర్మము సేయఁ బూను నేకాగ్రతఁ దా
నాకాలమున కధీశ్వరి, నాకర్మమునకు మొదల నుపాసింపఁదగున్. 200

క. ఒకఁ డనఁగనేల నానా, వికచసుమమ్ములను భక్తివివశుండై యం
బికఁ బూజసేయనగుఁ ద, త్సుకృతము వర్ణింపఁ దరమె శూలికినేనిన్. 213

గీ. అగురు కర్పూర ధూపమ్ము లధిఃనియతి, నంబ కిడఁదగు; దాన నత్యధిక మోద
మంది భువనేశి భువనత్రయంబు నర్చ, కునకుఁ బ్రతిఫల మిచ్చు నో మునివరేణ్య!

క. కర్పూరఖండముల దీ, పార్పణసేయంగ నంబ యవ్వాని మన
స్తర్పణ మొనరుచు నిక్క మ, హార్పతిలోకమున వాస మనురించి మునీ. 215

వ. పదపడి భక్ష్యభోజ్యాదియుతమ్ముగ నైవేద్యమ్ము సమర్పించి.

గీ. పిదపఁ బానీయమిడి మదిముదము బొదలఁ, జేయు తాంబూలమిడి మహాగాయకులను
గాయనులు నాలపించెడి గానములను, వేదపారాయణములను విస్తరించి. 217

గీ. ఛత్రచామరముల నిడి సకలరాజ
సదృశగతి నుపచారముల్ సంతరించి
చేరువఁ బ్రదక్షిణము నమస్కారము నిడి
తన్ను క్షమియించుమంచు నెంతయు నుతించి. 218

క. ఏతాదృశోపచారము. లేతం డొనరించు వాని నీశ్వరి ప్రోచున్
మాత స్వతస్సిద్ధకృపా, న్వీతగదా! పూజసేయునెడఁ గొదువేలా. 219

సీ. ఇయ్యెడ నొక పురావృత్తము వచియింతుఁ • గలదొక చక్రవాకము హిమగిరి
నది దేశములయందు నటునిటుఁ దిరుగుచుఁ • గాశికి నేగి యొక్కటను సన్న
పూర్ణ గుడికిఁజని భుక్తికై యేదేని • దొరకునే యని కొంత తొట్రుపాటు
దనర నొక్కింత ప్రదక్షిణ మొనరిచి • తనయంతఁ జని పిమ్మటను భవాంత

గీ. రమున స్వర్గము జని యు భోగములు రెండు
కల్పములు గాంచి పిదప భూఖండమందు
క్షత్రియకులమునఁ బొడమి జన్మ సంస్మృ
తి విడక ప్రజాధిపత్యమ్ము దీర్చుచుండె. 220

క. నృపతి యొకఁడు పూర్వజ్ఞా, నపరీతుఁడు గలఁడటంచు నానామునిరా
జ పటలి విని చని కని పూ, జపడసి కూర్చుండి పలికె జననాథునితో. 221

క. ఓ నృపవర! పూర్వజ్ఞా, నానుభవము నీకుఁ గలిగెనని విని కవఁగా
మౌనుల మే మరుదెంచుట, గానఁ దెలుపు మదియు నీకుఁ గలిగినవలమున్. 222

గీ. అన నృపుఁడు సెప్పె బూర్వమం దన్నపూర్ణ
కొనరిచితిఁ బ్రదక్షిణము పక్షినయి తప్పి

భావమున స్వర్గమందుఁ గల్పద్వయంబు
నిలుచు, టిప్పు డీ జ్ఞానమ్ము గలుగు టబ్బె. 223

క. జగదంబచరిత మెవ్వఁ డె, ఱుఁగును బదస్మృతిఫలమ్మెఱుఁగువాఁ డున్నే
యగణితమది దావిం దల, పగ నాకానందబిందుపతనము గల్గన్. 224

చ. పలుకులు వేయునేల జనిపావనకారణమైన యంబికన్
గొలువక విష్ణునిన్ శివునిఁ గొల్చెదమంచు వృథా భ్రమించువా
రల జననమ్ము ప మ్మఘకరమ్ము పరమ్ము నిహమ్ములేక చం
చల మయిపోవు నిక్కముగ సందియమందకుఁ డింపుకేనియున్. 225

క. అను పల్కులు విని మును లా, ననములు తెలివొందఁ జనిరి నారద ! యే నెం
తని యాదేవిని పల్కిం, తును నుతియింతును నతులిడుదును వినుమొకటన్. 226

క. జననము సఫలమ్మగ నె, వ్వనికిన్ గానందు గల్గు వానికిఁ దద్భ
క్తినిదానమ్మగు శ్రద్ధ త, దనిచ్ఛ జనిసంకరతకు నగుఁ గారణమై. 227

వ. అయ్యదియు సంధ్యాత్రయమ్మున నయ్యంబ నర్చించుట పరమ తపంబై యొప్పెడి.

క. తపమున దేహమ్మును దా, పపరీతముసేయనగుఁ దపమ్మనఁ బిత్రుస
త్కృప గననగుఁ దపమిదు స్వ. ర్గపదవి ముక్తియును దపము గనఁజేయు మునీ

క. నృపతికి భుజబలమును ద్ర. వ్యపటిమ వైశ్యాంఘ్రిజులకు నాపత్తరణం
బు పొసగుచు నుపాయమ్ములు, జపహోమాదికము విప్రజాతికిఁజూమ్మీ. 230

క తపములలో నుత్తమమగు, తప మంగతనుత్వ మది యొదవఁదగుఁ గృచ్ఛ్రీ
దిపరిశ్రమమున వేణాం, డుపనులఁ దనుశోషణము గడున్ గర్శితమా. 231

గీ బిచ్చమెత్తి యన్నమ్మను దెచ్చి నాల్గు
భాగములుచేసి యందొక భాగము ద్విజు
లకు నిఁకొక్కటి యాలకు నొకటి యతిథు
లకు నొకటి తనకుఁ దన భార్యకును దగును. 232

క. ఒక దినమంత గ్రాసము, నకు మాన: వ్మవియు గేస్తునకు నెన్మిది, వ
ర్ణిగు య:థేష్టం బార, ణ్యకునకు గ్రాసములు నాలుగవిరి మునీంద్రుల్. 233

వ. ఇట్లు నియమితాహారుండై గాయత్రీపుశ్చరణం బొనర్పవలయు. నయ్యది ప్రారంభిం
చుటకు యథోక్తకాలంబు వెదుకఁదగునని వెండియు. 234

క. అనఘాత్ములు విప్రులు మం, త్రనిధులు స్వస్తిని వచింప నాందిశ్రాద్ధ
మ్మును నలుపవలయు భోజన, మున వస్త్రమ్ములను ద్విజులు ముదమందంగన్.

వ. పదపడి శివక్షేత్రమ్ముల నయ్యది గుర్వానుజ్ఞానుసరణమ్ముగ జపింపవగునని వెండియు

క. ప్రారంభదినము మొదలుగ, నైరంతర్యముగఁ దుదిదినముదనుక నొకం
డౌరీతి హెచ్చుతగ్గులఁ, గూఁడనిగతి జపముసేయఁ గూరెడి సిద్ధుల్. 237

క. ప్రాతఃకాలము మొదలు ని, రాతంకుండగుచు రెండు యామములు జపం
బేత్రీతిఁ బ్రతిదినము, చేతము నిశ్చలముచేసి చేయఁగవలయున్. 238

ఆ. వె. పాలవంటకమ్ము పత్రసుమమ్ములు, యవలు తిలలు గొనియు నధిక నియతి
తనరఁ దద్దశాంశమున హోమ మొనరింప, మంత్రసిద్ధి యశ్రమమునఁ గలుగు.

చ. అకుటిలబుద్ధి నిమ్మనువు నాత్మ మతెయ్యదిగోరి చేసినఁదా
వికలముగాక కోర్కె యది వేగమ వానికిఁ జేకుఱున్ సమ
స్తకృతులు సిద్దినొందు నిది సారె జపించెడి వారి; కిట్టి దిం
కొకఁడు జగత్త్రయిన్ దొరక దొప్పెడి దీన నశేషసౌఖ్యముల్. 240

క. ప్రతిదినము సహస్రము పరి, మితిగా జపియించు నరుఁడు మేలున్ ధనమున్
సుతులన్ బరమాయువరో, గతయున్గని సుఖ మిహమునఁగాంచుఁ బరమునఁదా.

క. వినిసంతమాత్ర దారి, ద్ర్యనివారకమైన దీనిఁ దత్పరుఁడై యే
మనుజుఁడు జపించు వానికి, ధనకనకసమృద్ధి యొందుఁ దఱుఁగుట కలదే. 242

వ. ఇంక వైశ్వదేవప్రకారమ్ము వినుము. 243

గీ. వైశ్వదేవమ్ము సలుపక బ్రాహ్మణుండు
భోజనము సేయునేని యమ్మూర్ఖు కాల
సూత్రమనియెడి నరకముఁ జొచ్చెడిఁ దల
క్రిందుగాఁ గాళ్ళుమీఁదుగాఁ గ్లేశమొలయ. 244

క. తానెయ్యది తిను జనుఁ డ, ద్దానిని వ్రేల్పంగనగు విధానమ్మున నో
మౌనిజనవర్య! శాకం, బేని ఫలమ్మేని పత్రమేనియు హితమౌ. 245

గీ. వైశ్వదేవమ్మునకుమున్న వచ్చెనేని, భిక్షువయ్యెడ నతనికిఁబెట్టిపంప
వలయు వైశ్వదేవమునకు వలసినంత, వేఱుగాఁ దీసికొని యవి ధీరులంద్రు. 246

ఆ. వె. వైశ్వదేవమందు వచ్చెడి దోషమ్ము, నడఁప భిక్షువగు సమర్థుఁ డట్టి
భిక్షుకులను గారవింపమినగు కలి, దీర్పలేదు వైశ్వదేవ మనఘ. 247

క. యతియును వర్ణియు వీ రధి, పతులగుదురు సిద్ధమైన వంటకమునకే
పతితుఁడు వీరి నెడపి తిను, నతఁడగుఁ జాంద్రాయణమున శుద్ధుఁడు మౌనీ. 248

వ. పదపడి గోగ్రాస మొసంగఁ దగునని మఱియును. 249

క. అతిథి మతి యెవని గృహమును, గతాశుఁడై విడుచు నతని కాలుష్యము త
త్ప్రతిశాత్మ జుట్టికొను దు. ర్గతి దాటఁదరంబె నతిథిఁ గడచినయేనిన్. 250

క. తల్లియుఁ దండ్రియు గురువును, బిల్లలు నన్నయును శ్రితులు భృత్యు లతిథులె
నెల్లరు నభ్యాగతులును, జెల్లుమరు గృహస్థపోష్యజీవనులఁగుచున్. 251

గీ. సోమయాగమొనర్చు భూసురున కెట్టి, ఫలము లభియించుఁ దాదృశఫలము పంచ
యజ్ఞములొనర్చు రిత్తులు నందఁగలరు, గృహికి నింతకు ముఖ్య మెందేనిఁగలదె.

క. ఇదియెల్ల నెఱిఁగియును బె. న్మదమున నేగేస్తు తాఁ బ్రమాదముగను న
య్యుదమునకు నిహపరములం. దొదవదు సుఖ మతఁడు నింద్యుఁ డోమునిచంద్రా.

క. ఇది యాచారక్రమ మి, య్యది సంక్షేపముగ నారదా! తెల్పితి భు
క్తిదమున్ ముక్తిదమును ని, య్యది దీని నెఱుంగువారి నంబిక బ్రోచున్. 254

క. ఆచారమిచ్చు సుఖముల, నాచారము పూతుఁజేయు నఘము నొనర్చున్
శ్రీచేర్పు విద్య నొసఁగెడి, నాచారమ్మునకు రాజ్ఞి యాయంబ జూమీ. 255

## స్కంధాంతపద్యములు.

ఇంద్రవజ్రా. నిత్యాన్నదానోన్నత! నిర్వికారా!
పిత్యాశ్రయా! సర్వమనీషిముఖ్యా!
సత్యాదరా! ధర్మవిశాలశీలా!
మత్యున్నతా! సూరిసమాజనుత్యా! 256

క. అస్మదవధానవిద్యా, విస్మితపండితసమాజవివిధస్తోత్రా
వస్మృతచిరకీర్తి! శ్రీ. తస్మార్తపథప్రవర్తి! దర్శనమూర్తీ! 257

మాలిని. సుకృతమయచరిత్రా! సూరిసంస్తోత్రపాత్రా!
అకలుషపథవర్తీ! అన్నదానప్రపూర్తీ!
ప్రకటమృదుతరోక్తీ! భావితానూనభక్తీ!
సకలనిగమధారీ! సద్గురుబ్రహ్మసూరీ! 258

గద్య

ఇది శ్రీ..........తిరుపతి వేంకటేశ్వరప్రణీ
తంబగు దేవీభాగవతంబను మహాపురాణ
మ్మునందు ఏకాదశ స్కంధము.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ

# దేవీభాగవతము

## ద్వాదశస్కంధము.

పరిపూర్ణకీర్తితేజ, స్ఫురితాష్టదిగంతరాళ! పుణ్యసుశీలా!
కరుణాకర! సాంద్రకృప, హృద్రసాదర! బ్రహ్మలోకమాన్యచరిత్రా! 1

వ. అవధరింపు మట్లు పురాణకథనోన్ముఖుండగు వ్యాసునకు జనమేజయుం డిట్లను. 2

## సురగర్వాపహరణము.

క. మునినాథ! ద్విజులకెల్లర, కును శక్తి యుపాస్యమంటి కొంకక యాశ
క్తిని విడిచి యితరులను గొ, ల్వనేల మఱికొంద ఱిడియు వదియింపఁదగున్. 3

వ. వైష్ణవులమనియు, గాణపత్యులమనియుఁ, గాపాలికులమనియు, బౌద్ధులమనియు,
ననేకు లనేకవిధమ్ములఁ బ్రవర్తింతురని వెండియు, 4

తే. గీ. బుద్ధిమంతులు పండితుల్ శ్రద్ధగలుగు, వారలే తర్కతత్పరత్వము వహించి
వేదముల నాస్థవిడిచి పల్వురములైన, మతముల మెలంగఁ గత మేమి? మౌనివర్య!

వ. ఇది యట్లుండ మణిద్వీపమహిమంబు విశేషించి వివరలతుఁ బ్రసన్నులగు గురువు
లకు శ్రద్ధగలుగు శిష్యులయెడ దాఁపఁదగు రహస్యముండదుగదా యన రాజునకు
ముని యిట్లను. 6

తే. గీ. శ్రద్ధగలవాఁడ వెక్కుడు బుద్ధి గలుగు
వాఁడ వగుటను నీకుఁ జెప్పని దొక విష
యమ్ము గలుగదు వచియింతు సమ్మదమున
వినుము రాజేంద్ర! యద్దానఁ గనుము శుభము. 7

క. మును రక్కసులును సురలును, బెనఁగిరి నూఱేండ్లు అందు విజయమ్మమరుల్
గొనిరి పరశక్తికరుణఁ, జని రసురులు దివము దిగి రసాతలమునకున్. 8

చ. విదపసురల్ మనమ్మున వివేకము దక్కి "పరాక్రమమ్ము లే
మి దనుజులెల్ల దీనత గమించిరి స్వర్గము వీడి నప్పనం
పదలుమ నస్మదీయమనబాహుపరాక్రమమే గడించె" నం
చుఁ దరతమత్వమున్ మఱచి సొక్కుచు నోలుచు విఱ్ఱవీఁగుచున్. 9

క. తనయావచ్ఛక్తియు నట, వినియోగము చేసి తుదకు విముఖుండై, ల
జ్జను గొని సురేంద్రు సన్నిధి, కిని జని వృత్తాంతమతనికి నొడివెనెల్లన్. 24

గీ. అంత సురలెల్ల "నీవు దేవాధిపతివి, గాన వీని వారినిఁ గనుఁగొనుఁడని
పంపనేటికి నీవేగి పరమచిత్ర, మైన యాతేజమెట్టిదో యరయుటొప్పు." 25

క. అనునంత నింద్రుఁడయ్యెడ, ఘనగర్వాంధత్వ మొలయఁగాఁ జని తనులో
నన యాతేజం బంత, ర్థినిగనె వాసవుని మద విఱిగె లజ్జితమై. 26

క. ఏ నేమని వెలవెలమను, నాననమున సురలఁజూడ నర్హంబగు నె
వ్వానికిఁ బ్రాణముకన్నన్, మానం బధికంబు దాని మాయుట మృతియౌ. 27

క. అని గర్వముడిగి చిత్త, మ్మున 'నియ్యది దేని తన మొనసెనొ, మఱి నా
కును శరణ మదియె యగుఁగా', కను నాలో నభ్రవాణి యాతని కనియెన్. 28

క. మాయాబీజ జపమ్మును, జేయుము సుఖమబ్బు జగదజేయుఁడవై సు
శ్రీయుతుఁడవగుచు నెగడెద, వో యమరాధీశ! యనఁగ నొగి నతఁడంతన్.

గీ. ధ్యానమీలితలోచనుఁడయి నిరశనుఁ, డగుచు నొక లక్ష వర్షమ్ము లా జపమ్ము
సలుప నయ్యంబ కరుణావిశాలయగుచు, మధునవమినాఁడు రెండు యామములవేళ.

క. వెనుకటి తేజోరూప, మ్మునసే పూర్వప్రదేశమునసే కన్ప
ట్టిన నంత వాసవుం డ, త్రినయనుఁడై కాంచి కలితరోమాంచుండై. 31

గీ. బాలశీతాంశురేఖావిశాలమకుట, బాలకోటిరవిప్రభ బాల దివ్య
శీల నవయౌవనోద్ధతఁ జిత్రతరవి, భూషణాంచిత మసృణకపోలయుగళ. 32

క. చేలాంతర్వ్యంజితకుచ, నాలోలకృపావిశాల నంచితఫాలన్
మాలాభిరామ వేద, శ్రీ లాలితనిరుపమానశృంగారాఢ్యన్. 33

క. తవదంతకాంతు లొలయు క, తన భూమిన్ బద్మరాగధామమ్ముగఁ జే
యు నొయారిన్ భక్తులు గో, రిన వరముల నొసఁగు కల్పవృక్షము నంబన్. 34

క. తత్తేజో మధ్యమ్మునఁ, జిత్తమ్ము వశమ్ముదప్పఁ జెచ్చెరఁ గని యు
ద్యత్తరభక్తి నమస్కృతు, లత్తల్లికి నొసఁగి నుతుల నలరించి యుమన్. 35

క. "ఆతేజం బెక్కడిది? య, వేఁడద్భుతమహిమ గలుగు టెక్కటమునఁ దా
నేతెంచు నంపె దానిఁ గృ, పాతత్పరవగుచుఁ దెలియఁ బలుకుము తల్లీ." 36

## అంబ యింద్రునకుఁ దన మహిమ దెలుపుట

క. అన నంబ పల్కె "నది లో, కనిదానము బ్రహ్మము ననఘము మాయకునుం
గని సాక్షియునై, తనరెడి మద్రూప మిది యథార్థం బింద్రా! 37

గీ. దేని వేదమ్ము లెప్పుడుఁ దెలియఁదిపుడుఁ, దపము లెద్దాని వచియించుఁ దపసు లెద్ది
గోరి బ్రహ్మచర్యమ్మునఁ గోర్కె నింతు, రప్పదము సంగ్రహమ్ముగఁ జెప్పెదవినుఁ.

గీ. బీజములు రెండు మన్మంత్రరాజమునకు, రెండు భాగములుగల నాసృష్టి యెల్ల
జగముగుటఁ గల్గె ద్వైవిధ్య మగణితప్ర, భావమునఁ బొల్చు నారెండు భాగములను.

క. ఒకఁ డతఁడు సచ్చిదానం, దకందమై ప్రకృతి సంజ్ఞఁదగు నొక్కఁడు చం
ద్రికయుం జంద్రునకుం బలెఁ, బ్రకృతికి నాకైక్యమొలయు వాసవ! యెపుడుఁగా. 40

ఆ. వె. శక్తిమంతునకు శక్తి వేఱుగ లద్య, మగుట యనవుభూత. మగ్యలతమున
దగు నభేద మెల్ల జగమును బ్రళయమ్ము, నందు నేన యగుచు నలరుదాన 41

క. అవ్యక్తమైన రూపమె, సువ్యక్తంబగుచుఁ దోఁచు సుంనావ! సదా
భావ్యమగుఁ బ్రాణి బహుక, ర్మవ్యాపారమ్ము కతనఁ గ్రమపరిపాటిన్. 42

వ. అంతర్ముఖ బహిర్ముఖభేదమ్మున మాయకును ద్వైవిధ్యంబొంయు, నందు రెండవది విమ శబ్దంబున వాడంబడు, దానికి తనఁ ద్రిగుణమ్ములుపుట్టె, బ్రహ్మాదులెల్లరును దదాత్మకులని దెలియుము. 43

క. అజునకు గుణత్రితయమున, రజమెక్కుడు హరునకుం బరఁగుఁ దమ మయ్యం
బుజనయనునకున్ సత్వం, బు జగత్త్రయనాథ! యధికముగఁ బొల్చుఁజుమీ. 44

క. స్థూలమజుఁడు సూక్ష్మము హరి, శూలియుఁ గారణమునేన సూ! తుర్యావ
స్థాలీల నాదు రూపం, బాలింపుము రెండు దెఱఁగులై యొప్పారుఁగా. 45

గీ. అందు సగుణంబు మాయతో నంటియుండు, నిర్గుణంబు తద్రహితమై నెగడువినుము
సర్వజగ మేర్పఱచి తదంతర్విలసిత, నగుచుఁ బ్రేరేపుదాన జీవగణమేన. 46

గీ. కాలకర్మములను బట్టి కంజజాదు
లను దదుచితకార్యమ్ములకు నియమింతు:
భీమ ననిలుఁడు, ననలుఁడు వేచు, రవియుఁ
దోఁచు, హరి ప్రోచు, మద్భయోద్భూతిగరిమ. 47

క. సురనాథ! కట్టబొమ్మల, కరణిన్ మిముఁ ద్రిప్పుచుందుఁ గనుమీ జయమున్
బరఁగింతు మీకొకప్పుడ, సురలకు నది యొక్కవేళఁ జొప్పడ నిడుదున్. 48

గీ. కాలకర్మానుసరణమ్ముగా సమస్త, కార్యములు నే స్వతంత్రనై గడపుచుందు
నట్టి సకలాత్మనగు నను నరయఁజాల, కిపు డహంకారములు మీఁదెసఁగఁజూచి.

క. కరుణింప నెంచి మీమీ, శరీరముల నుండి యక్షిసంజ్ఞదనర నే
నరయంగనైతి, నిపుడు నీ, తర తేజముగాదు, దాని దరిమే తెలియుఁడా. 50

క. ఇది మొదలు గర్వమెల్లను, గుదియించి విశేషభక్తి గొనసాగఁగ మీ
హృదయముల నన్ను శరణము, గఁ దలఁపనగు వేయుతలఁపు గాఁదగదిఁక దా. 51

క. అని పలికి యంబ యంత, ర్థినిగనె సురలదియు మొదలు తేఁకుప గాయ
త్రిని మూఁడు సంజలను భ, క్తిని జపియింతురు నియతవిధిగా శుభఫణితా. 52

గీ. ఆదియుగమున నీగతి నఖిలసేవ్య. యగుచు గాయత్రి యొప్పారె నంతకన్న
విప్రులకు ముఖ్యమేఁదును వెదకి చూడ, దది విడుచువారలఁగల్గ నధమగతులు.

## గౌతమకృత గోవధ.

వ. రాజా! వినుము. మున్ను పదునేను వత్సరమ్ములు లేకరీతి ననావృష్టిదోషమ్ము కలిగి క్షామం బొండుగలిగె, నప్పటి యుపద్రవమ్మిట్టిది యని చెప్పనలవిగాదు; దేగృహమ్మునఁ జూచిన శవమ్ముల సంఖ్య యపారమ్ము; కొందఱాఁకలిబట్టఁజాలమిఁ దవ్విక్షణమ్మున పొట్టలు నించికొందురు, కొందఱశ్వమహిషవరాహాది మృగమ్ములను మఱికొందఱు మఱికొన్ని వస్తువులను యథాప్రాప్తమ్ముగ భుజించుచుఁ బ్రాణమాత్రావశేషమ్ముగ నుండిరి 54

గీ. ఇంత చెప్పఁగనేల తానెంత జాతి, గుండెకల తల్లి యేనియుఁ గుక్షిఁబెంచెఁ
బదినెలలు మోసికన్నట్టి బాలుఁ దినుట, వింటిమే! నాఁడుదకృష్ణనో విభువతలన!

క. పురుషులు తరుణులఁ దిందురు, తరుణులు నిసువులను దినఁగదలఁతురు ఛీ! యె
వ్వరి నెవ్వని సేయింపము, మరియాద యెఱుఁగునె, యధము మనుజాధిపా! 56

గీ. అట్టి యిక్కట్టులందు బ్రాహ్మణులు గొంద
ఱెంతయేని యుపాయము నెంచువెదకి
తుదకు గౌతమముని మహాత్ముఁడు సుభిక్ష
మతని యాశ్రమమున నున్నదనుచుఁ దెలిసి. 57

క. గాయత్రీజపతత్పరుఁడై యే సేవఁ గృతదీక్షుఁడగు నతనిఁ గనన్
దోయము వారును దారసతీయుతులై యరిగి యట కతిథులై యుండన్. 58

గీ. దెసలు నాల్గిటినుండి యతిథులు వేన. వేలు వచ్చుటుంబ గోవధ కృత్యసహితు
లై యరుగుదేర దవ్వులవరస యూహ, మందు సంతోషమంది 'హారం' దలఁచు.

గీ. ఆమ్మునీంద్రుని యాశ్రమమంత నూఱు, యోజనమ్ముల విస్తృతి నొందె నచట
నెప్పు డుత్సవములకమ్మి యెసఁగు, రోగ, భయము దైత్యాదిభయము నెప్పటికిలేదు.

క. ఆయాశ్రమమున విప్రులు, చేయు మహాయజ్ఞముల నశేషసురలు మో
దాయత్తులగుచుఁ దనిసి మ, హాయశుఁ డొక గౌతముండె యని పొగడిరొగిన్. 74

గీ. అహహ, యేమంచుఁ దేవేంద్రునంతవాఁడు, తనకుఁ గల్పనగమ్ము గౌతముఁ డటంచు
నొక్క యెన్నేనిసార్లు పేరెక్కనట్టి, యల సుధర్మను గొలువుంచి సలిపె నుతుల.

క. ఈగతిఁ బంద్రెండేం డ్లను, రాగముమెయి గర్వగంధరహితుండై స్వ
ర్భోగం బొసఁగుచు గాయ, త్రీగాయకుఁ డమ్మునిమణి దేల్చెన్ వారిన్. 76

గీ. అప్పు డయ్యెడ మునియు గాయత్రి కొక్క
యాలయముఁ గట్టె మునివరు లచటనెపుడు
సలుపుచుండ్రు పురశ్చర్య; సద్భ్రుశమొందు
గాదు తద్ధ్యానమునకు నిక్కము నృపాల. 77

క. అటఁగన్పడు నంబిక యి, ప్పటికిని బాలికయుఁ దా యువతి వృద్ధయునై
జటిమండలికిఁ ద్రిసంధ్యల, నటనము గావించుచున్ గనద్భూషణయై. 78

గీ. అంతనొక్కెడ నారదుం డటకువచ్చి, యర్చితుండయి "గౌతమ! యహహ! నీయ
శమ్ము నేఁ విని పొగడుదు సత్యలోక, మందు స్వర్గమ్మునందుఁ దానెందు నిండె. 79

క. మొన్న సురేంద్రుఁడు సభ ని, న్నెన్నిన నేనాలకించి యిటకు వినుఁగనన్
గ్రన్న నరుదెంచితిని నీ, కన్నన్ గలదే యొకండు గొంపమునెరుగన్". 80

క. అని పొగడి పిదప గాయ, త్రి నికేతమ్మునకు నరిగి దేవికి హర్షా
శ్రునయనుఁడై మ్రొక్కిడి నుతు, లొనరిచి దివమేగె నంత నొక్కెడ విప్రుల్. 81

గీ. గౌతముని నారదుండింతగా మతింపఁ, జనె యసూయేర్ష్య నెమ్మనమును గలంప
నతని కపయశమును గూర్ప నాత్మనెంచి, రకట! యేమనవచ్చు బ్రాహ్మణుల చెయ్ది.

గీ. అంతఁ గొంతకాలమునకు నఖిలలోక, సౌఖ్యదాయకమగుచు వర్షమ్ము గురిసె
దానఁ గల వెల్లదేశముల్ తాన వికసిల్లె, నట్టి వార్తను వినిన బ్రాహ్మణజనమ్ములు.

మ. విని యేదేని నిమిత్త మేర్పఱచి యవ్విప్రేంద్రునిన్ వావక
గ్గునిజేయన్ సమకట్టిరక్కట! మహాత్ముల్ గారె! తాదృఙ్మహా
జనుఁ గాంచిన తల్లిదండ్రులు; లిపియున్ సామాన్యమే! తిన్నయిం
టను వాసమ్ములు లెక్కపెట్టుట నిమూఢం బెంచు విప్రాళికిన్. 84

గీ. అంత నొక్క వృద్ధగోవు మాయ నొనరించి
గౌతముని యజ్ఞశాల పంటకును దఱిమ
నది యతఁడు తపమొనరించు నట్టియెడకుఁ
జన నతఁడు ద్రాపఁదోలె 'హుం' మ్మనుచుఁ; నదియు. 85

క. ప్రాణమ్ములు త్యజియించిన, మౌనులు గుమిగూడి గౌతము మునికిఁ దగునే
యీ వికృతి నెట్టపంటగ, ధేనువు నిటు చంపె నకట! తేఁకువ వలదే. 86

క. అను పలుకులు విని గౌతముఁ, డనుకంపాకంపితాంతరంగుండై క్ర
న్ననఁ దపము విడిచి మృతగో, వునుగని యెంతయును నశ్రుపూర్ణాక్షుండై. 87

గీ. గతమునకుఁ జింత చేసినఁ గలదె ఫలము
కారణం బేమొ యూహింపఁ గడఁగు టొప్పు
ననుచు యోజించి నేత్రమ్ము లట్టె మూసి
జ్ఞానదృష్టిని గాంచె నిక్కమ్ము నెల్ల. 88

క. కను గొని యిది విప్రులు చే, సిన పని యని మనమునందుఁ జింతించి కటా!
యని లోనఁ గసలు గమురఁగఁ, గనుల ననలకణము లురులఁ గలుషితమతియై.

## గౌతముఁడు బ్రాహ్మణుల శపియించుట.

గీ. బ్రాహ్మణాధములార! యిప్పట్టునందు, నెట్టపంటగ నయశంబుఁ గట్టనెంచి
నట్టి దుష్కృతిచేసిన నఘముగలదె. యైన క్షమియించితిని మిమ్ము నతిథులగుట.

ఆ. వె. వేదమాత యగుచు వెలసిన గాయత్రి, జపము మీకు నింక సఫల మగుచుఁ
బొదలకుండుఁ గాక! పొసఁగదు వేదమ్ము, లందు శ్రద్ధ, పొసఁగ వధ్వరములు.

క. శివుని యెడ శివమహిమయెడ, శివశాస్త్రమునెడల మీకు సేవకభావం
బు వృథా యగు మీరిఁక నె, ల్ల విధమ్ములఁ గం దధము లిలఁ శూన్యులరై. 92

గీ. దేవియందుఁ దత్కథలను దేవి నిలయ, చోటులను దేవి సద్భక్తకోటులందు
దేవి యుత్సవములు సూడఁ దివురు నెడల, మీకు నధికార మీమీఁద లేకపోవు. 93

క. శివకల్యాణదిదృక్షయు, శివభక్తార్చనయు మఱియు శివభక్తులు దా
ల్చు విభూతిఁ రుద్రాక్షలు, ను విముఖులై మీ రధమత నూల్కొనుఁ డింకన్. 94

గీ. జ్ఞానముఁ శాంతి దాంతిని జన్మములను, నగ్నిహోత్రమ్మునను నిగమాధ్యయనము
వంబు సత్తమదానమ్ములందుఁ బితృసు, కర్మముల మీరు వింతవి గాంతురింక. 95

క. శ్రీదేవీతరులగు నా, యాదేవతలందు భక్తినంది యుదరచ
క్రాదికచిహ్నితులై పొలు, పేది యదమభావ మందుఁ దెల్లరు విప్రుల్. 96

క. కొందఱు కాపాలికులై, కొందఱు పాషండులగుచుఁ గొందఱు బౌద్ధా
నందులయి వేదవిద్యా, మందతగని చెడుఁడు నాదు మాటకతమునన్. 97

క. పితృమాతృసుతభ్రాతృ, త్మతనూజాభార్యలను వృథాద్రవ్యాస
క్తతఁజేసి వేదముల ధ, ర్మతతుల విక్రయ మొనర్చు మతిమెకబ్బుఁగా. 98

గీ. మాతృకన్యానుగాములౌ మందమతులు, భగినుల రమించునట్టి దుర్భగులు పరయు
వతులఁ జెఱవట్టు దుర్మార్గవర్తనులును, గాఁగలరు మీకొలమ్ములఁ గలుగు జడులు.

క. ఏనిడిన శాపమిది మీ, కీనాఁటనకాక మఱియు నెల్లయుపుడు మి
మీ నామరూపముల వం, శానుసరణ మొలయ నాశమందఁగఁ జేయున్. 100

క. పలుమాట లేల మీకుఁ గ, నలి గాయత్రి యెడఁ బొండు. నరకము మీవా
రలకెల్ల వాసముగు" నని, పలికి యతం డంబ గుడికిఁ బయనము వేసెఁగా. 101

క. చనియంబకు మ్రొక్కఁగ ద న, జ్ఞానియు ద్విజగణ మొనర్చు చర్యకు నాశ్చ
ర్యనిమగ్నచిత్త యయ్యెన్. గనఁదగు నిప్పటికి నట్టికళ యామెయెడన్. 102

క. జనని యిటు నవ్వుచును నా, తనిఁగని శాంతింపు మెందుఁ దగదే భుజగ
మ్మునకిడు పా ల్విషమగుట సు, జనత తదన్యతయుఁ గమ్మజన్యము లనఘా. 103

వ. అనుటయు, 104

గీ. గౌతముఁడు శాంతిజెందె; ద్విజాతులెల్ల. శాపమున భ్రష్టతేజత సంభవింప
నెంతయేనిఁ బశ్చాత్తాప మినుమడింప, సిగ్గుగొని గౌతముని నతుఁజేసి పిదప. 105

క. కరుణింపుము కరుణింపుము, కరుణింపుమటంచు నైక్యకంఠమ్ముగ నె
ల్లరు వేఁడిరి; తత్క్షణమునఁ, గరుణార్ద్రుండయ్యె నదిప! గౌతమమునియున్. 106

క. హరి కృష్ణుండై యెపుడవ, తరించు నంతాఁక మీఁకు దప్పదు నరక
స్థితివాస మ్మటుపైఁ గలి, దప్పై జనించి శాపాగ్నుండఁగుఁడీ. 107

క. నా శాపము దప్పఁ గొనెడి, యాశయమిది గలదయేని యున్నను గాయ
త్రీశక్తికిఁ గావింపుఁడు. నాశక్యమె భ్రమ్మగింప నాశాపమ్ముఁగా. 108

క. అని వారి విడిచి గౌతమ, ముని యిది ప్రారబ్ధమని సుముఖుఁడై శాంతిం
గనెఁ దత్కారణమున భువి, జనియించిరి నరకగులు ద్విజాకృతులౌ. 109

సీ. పంచితులయ్యును బరదారలంపటుల్, గాయత్రి నెఱుఁగని కష్టమతులు
తప్తముద్రాంకితుల్ ధర్మవిహీనులు, పాపంచవర్తనుల్ పరమపాత్రు

గీ. మితి నతిశయించి కాంస్యనిర్మితమయి గగ
నము స్పృశించుచు నాపైని నమరు నింక
నొక్క ప్రాకార మయ్యెడఁ బెక్కు గోపు
రములు వనములు నిరుపమానములు గలవు. 120

క. అట నొలసెడు పూలును ఫల, పటలములును గోకిలాది పక్షులును మృగీ
నటనములును మదికింపున్, ఘటియించుగ వానిఁ బొగడఁగా నాతరమే. 121

వ. ఇయ్యది వెనుకటిదానికన్న శతగుణతేజంబు గలిగియుండు నిద్దాని కవలఁ దామ్ర
సాలమ్ము వొల్చు; నియ్యది చతురస్రమ్మును సప్తయోజనోన్నతమ్మునునై యభేద్య
గతి నలరు. 122

క. ఈసాలములకు నడుమగ, భాసిల్లున్ గల్పవాటి బంగరుకన్నగ
భాసురములైన పూవుల, రాసులు చివురులును నచట రాజిలు నెపుడున్. 123

క. ఫలముల నెల్లెడ బీజ, మ్ములు రత్నములై తనర్చు భూమిక; పరీ
మళ మేతదీయ మెల్లెడ, నలమున్ బదియోజనముల యంతటిమేరన్. 124

గీ. పుష్పసింహాసనమ్మును బూలగొడుగు, బూలతొడవులుగలిగి యెప్పుడు వసంతుఁ
డవ్వనమునందుఁ బుష్పాసవాతఘూర్ణి, తాక్షుఁడై భార్యలనుగూడి యాడుచుండు.

వ. మధుశ్రీయని మాధవశ్రీయని యతనికి నిర్వురుభార్య లవ్వారల సౌందర్యం బనుప
మము; మఱియు నయ్యెడ. 126

క. అంగనలు దండమెఱయ మృ, దంగధ్వను లొలయఁగా సుపాంగాది రవం
బంగములఁ బరవశత్వం, బుం గొలుపన్ బాడికొం డ్రెపుడు గంధర్వుల్. 127

వ. దీని కవల సీససాలంబు వఱలు; నియ్యదియు నెత్తున నట్టిదియ. మఱియు వీరెంటికి
నడుమ సంతానవృక్షవాటిక యలరు. 128

క. ఆయెడఁ గాంతలు వీవన, లే యెడలగ వీవఁ దనకు నిరుదెసల శుక్ర
శ్రీయు శుచిశ్రీయును దగ, నాయకుఁడై గ్రీష్మఋతువు నందవ్వఁ బొల్చున్. 129

వ. దీని కవ్వల నిత్తడికోట యలరు; నియ్యదియు నున్నతి నట్టిదియ. ఈరెంటి నడుమ
హరిచందనవనంబు వొల్చు: దీనికి నాథుండు వర్షర్తువు నభశ్శ్రీ మొదలుగాఁగల
పండ్రెండుగురు భార్యలతో నలరెడి. 130

క. నవపల్లవముల నెప్పుడు, నవనిజములు లతలు నలరు హారితశ్రీవనమా
జవృతమై మ్రొదర యొలయు న, దవిశేష నదీతటాకతతు లొప్పు నటన్. 131

వ. సతులతో నియ్యెడ దేవత లెప్పుడును విహరింతు; రిద్దాని కవలఁ బంచలోహమయ

మ్మగు సాలమ్ము వఱలు; నిట మందారవృక్ష వాటిక తనరు; నియ్యెడ నిషలక్ష్మియు నూర్జలక్ష్మియు నను తనసతులతో శరదృతువు వర్తించు; నీమీఁద వెండికోట యొక్కఁడు సప్తయోజనోన్నతంబగుచు నొప్పు. 132

గీ. పారిజాతవనం బిట వఱలుఁ దత్సు మముల గంధమ్ము దశయోజనములు వెలుఁగు
సగణుఁడై, సాయుధుండయి సర్వరాగి, హితకరుం డట హేమంతఋతువు వొల్చు.

వ. ఇతనికి సహశ్రీయును, సహస్యశ్రీయును భార్యలు; ఈకోట కనంతరమున బంగారు కోట కలదు; 134

క. కలవు కదంబతరువు లటఁ, గలుగున్ మదిరారసమ్ము కడవలకొలఁదిన్
తలమే త్రాగనమ్మనఁ, గలిగెడి యానందమదియు గణుతింపంగన్. 135

వ. అటఁ దపశ్రీ తపస్యశ్రీలతో శిశిరర్తువు నిల్చు; మఱియు సిద్ధులనేకులు సకుటుంబ సపరివారులై సుఖం బనుభవింతు రిద్దాని కవలఁ బుష్యరాగమయమ్మగు ప్రాకారమ్ము వొల్చు; నయ్యెడ నుండు భూమియుఁ దక్కుంగల పదార్థమ్ములును దన్మణిమయమ్ములు కానెఱుఁగునది. ఇయ్యది తేజమ్మునఁ బూర్వసాలమ్మునకన్న లక్ష గుణితంబగు; నియ్యెడ నష్టదిక్కులను నింద్రాది దిక్పాలురు వసింతురు. ఈమీఁదఁ గుంకుమారుణంబగు పద్మరాగప్రాకారంబుగల దయ్యది పదియామడ పొడవుగలిగి యుండు. ఇచ్చట భూమియును దత్తత్పదార్థమ్ములును బద్మరాగమణి మయంబులై యొప్పు; నిట గోపురమ్ములును మండపమ్ములును ననేకమ్ములు తనరు; మఱియుఁ బింగళాక్ష్యాదినామప్రసిద్ధచతుష్షష్టికళల కీయది నెల; వక్కళలు. 136

క. యనలము గ్రక్కుచు సంద్రము, లను బ్రమింగుదుమో జగత్తులను ద్రుంతుమొ సూ
ర్యు నడంతుమొ వాయుస్తం, భన మొనరుతుమో యటంచుఁ బలికెడి నెపుడున్.

క. ఏకైకాక్షౌహిణి త, మ్మేకాలము చుట్టుఁ గొలువ నేపనియేనిన్
జేకొని యొనరుతు మనుచున్, గేకలు వేసెదిని సమరకేళిరతమై. 138

క. ఒకలక్ష బ్రహ్మాండము, లొకత్రుటిలో నమయఁజేయు నొకశక్తియు శ
క్తికలిగి యొప్పెడి భూపా, లక! సర్వైక్యంబు గల్గ లక్ష్యమె యెందున్. 139

వ. దీపకపుల గోమేదమణిమయమగు సాలమ్ము గల దయ్యదియును నౌన్నత్యమ్మున నిట్టిదియ; భూమ్యాది తత్రత్యపదార్థమ్ములును యథాపూర్వమ్ముగ దన్మణిమయమ్ముల. మఱియు నీమీఁద బిశాచవదనలును యద్రోత్పుకలును నిరుపమబల స[illegible]న్నలును నగు విద్యాదిశక్తులు ముప్పదియాఱువురు ప్రత్యేకముగఁ బదేసి యక్షౌహిణులు సేనలు గొలువ వసింతురు. 140

క. దీనికవుల వజ్రమయ, మ్మై నెగడెడి భిత్తికలను వలరెడి దుర్గం
బానందదాయకంబై, భూనాయక! వొలుచు వజ్రభూములతోడన్. 141

వ. ఔన్నత్యాదికంబు సర్వమును యథాపూర్వంబ; యీయెడ ననంగ రూపాదిక భువనేశ్వరీ పరిచారికలు కొందఱు ప్రత్యేకంబుగ నొక్కొక్కరి నొక్కొక్క లక్షచేటికలు గొలువ వసింతురు. 142

క. ఈ సాలమ్మున కావల, భాసిలు వైడూర్యజాలభాసురమై యెం
తే సొగసగు ప్రాకారము, కాసారములును వనులును గల వయ్యెడలన్. 143

వ. ఔన్నత్యాదికంబు యథాపూర్వంబ; యీయెడ బ్రాహ్మ్యాది మాతృకలు స్వస్వసేనాపరివృతలై జగత్కల్యాణదాయినులై యొలయుదురు. 144

గీ. అమరు నయ్యెడ నాల్గు ద్వారములయందు
నేనుఁగులు గుఱ్ఱములును ననేకములగు
వాహనమ్ములు సింగముల్ సాహసమునఁ
బొల్చెడి పదాతులు నగణ్యముగ నృపాల. 145

వ. దీని యనంతరమ్మున నింద్రనీలమణిమయమ్మగు ప్రాకారంబుండు నియ్యదియు యథాపూర్వోన్నత్యాదిభాసురంబ యని యెఱుంగునది. 146

క. నానాయోజనవిస్తృత, మై నెగడున్ షోడశారమగు పద్మ మొకం
డానెఱవున శక్తులు మఱి, దానన్ బదియాఱుగురు సదా యుంద్రు నృపా. 147

వ. ఈ కరాళ్యాదిశక్తులు దేవీసైన్యములు నడుపువారిలో నెల్ల ముఖ్యమగు వారలు; దీని కవుల ముక్తామయమ్మును దశయోజనపరిమితమ్మునునగు సాలంబు పూర్వోక్తలక్షణలక్షితంబై యొప్పు; నీయెడ దేవీసదృశాకారులగు ననంగకుసుమాదు లెనమండ్రు మంత్రిణులు గలరు. 148

క. జ్ఞానవతులు సుందరులు స, దానందలు నెల్లవార్త లరసెడి జాణల్
శ్రీనిధు లనూనభోగని, దానలు తచ్ఛక్తి పొగడఁ దరమే రికగుణా. 149

వ. వీర లెల్లపుడు నంబకుఁ బ్రపంచవార్తలఁ దెలుపుచుందురు; దీనికవుల మరకత సాలమ్మలరు: నియ్యదియుఁ బూర్వోక్తలక్షణలక్షితంబు. ఇట షట్కోణయంత్రంబుగల దద్దాన గాయత్రీసావిత్రులు బ్రహ్మ విష్ణు రుద్రాగ్ని కుబేర వరుణ మదన విఘ్నేశాదులు స్వపరివార సహితమ్ముగ నాయాకోణమ్ముల నివసింతురీ యెడలన వేదమ్ములును స్మృతులును బురాణమ్ములును మూర్తిమంతమ్ములై వెలింగెడి;

నిద్దాని కవుల శతయోజనోన్నతమగు ప్రవాళసాలమ్ము వఱలు. నియ్యదియుఁ దక్కు-
గల లక్షణమ్ములఁ బూర్వోక్తసాలతుల్యంబు. 150

గీ. అచటఁ బంచభూతములకు నాధిపత్య
మలరు నొకయైదుగురు శక్తు లలరుచుండ్రు
తనరు హృల్లేఖ గగనరక్తయుఁ గరాళి
కయు మహోచ్ఛుష్మ యనియు నాఖ్యలు నృపాల. 151

వ. వీర లందఱును దేవీతుల్యవేషమ్ములు గలవారు; దీని కవ్వల బహు యోజనవిస్తీ
ర్ణమ్మగు నొకరత్నమహాసాలమ్ము కలదు; దియ్యదియుఁ బూర్వోక్తలక్షణలక్షితం,
బీమెడ నామ్నాయదేవులు వసింతురు. 152

క. శ్రీదేవ్యవతారమ్ముల, నాదిమహావిద్యలును మహాతేజఃపుం
జాదీప్యమానముగ నచ్చోఁ దనరారెడు నృపాల! సొంపులగుంపై. 153

వ. సప్తకోటిమహామంత్రమ్ము లిటఁ దనర్చు; నీసాలమ్మునకావలఁ జింతామణిగృ
హమ్ము గలదు; దిట నుండు వస్తువులన్నియుఁ దన్మయమ్ములుగా నెఱుంగఁదగు. 154

క. ఇందూద్గారోపలముల, మందారోత్కూద్గారశిలల మఱి విద్యుత్కాం
తిం దన్నెడి తాలును జెలు, వొందం దగుఁ గంబములట నున్నతదీప్తిన్. 155

గీ. అదియు దేవీసదనమున నందు వేయి, కంబములఁ బొల్చు చెక్కుడు కాంతిగలిగి
మండపము లొక్కనాలుగు మలయువాని, యందచందమ్మును దెల్ప నలవి కాదు.

వ. అయ్యవి క్రమమ్ముగ శృంగారముక్తిజ్ఞానైకాంతనామమ్ములఁ బ్రసిద్ధమ్ము; లాయీ
మండపమ్ములఁ గాశ్మీరవనమ్ములాదిగ ననేక వనమ్ము లలరు. 157

క. ఆయావనముల తావుల, నేయెడఁ గ్రీడనల్పి యేతెంచెడి య
వ్వాయువుచే నా ద్వీపం, బీయెడ గమ్మరను తావి నెసఁగు నృపాలా! 158

క. శృంగారమండపమ్మునఁ, బొంగారెడి వేడ్కఁ దామెపుడు దేవులహో
సంగీతమ్ములు పాడుదు, రంగీకారమున నంబ యట సభ దీర్పన్. 159

గీ. ముక్తిమండపమున నంబ ముక్తినొసఁగు
జ్ఞానమండపమందు విజ్ఞాన మొసఁగు
నరయ నేకాంతమండపమందుఁ గార్య
తంత్రములు మంత్రిణులు చుట్టుఁ దనకు దనర. 160

వ. మఱియు విమ్మెడ శక్తి తత్త్వాత్మకమ్ములగు పదితొట్లుగల వద్దాన బ్రహ్మయు

విష్ణుండును రుద్రుండును ఖురమ్ములై సదాశివుండు పలకయునై యొప్పుదురు. దీనిపైఁ గోటికందర్పసుందరుండగు భువనేశుండు షోడశహాయనుండు మహాదేవుండు విలసిల్లు. 161

గీ. ఆయనఘు వామసక్థి స్థాయినియై ఫాల్గుని సంబ సంతతభూషా శ్రీయుతయై వర్ణింపఁగ, నే యయ్యుల కేనిగాని యెసకంబెసఁగన్. 162

క. చెలికత్తియ లెందఱో తన్. గొలువఁగ నిచ్ఛాజ్ఞానక్రియాశక్తిసహితయై వెలలేని విలాసమ్ముల, నమరు జగన్నేత్రిఁ బొగడ నట్టిరు గలరే. 163

వ. మఱియు లజ్జాది పీఠశక్తులును, శంఖాది నిధులును నమ్మంబికకు సన్నిధియందలరెడి 164

క. అసదృశుల వలనఁ బొడమిమ, హానను లోకయేడు కలియు నమృతాబ్ధిని నా యా నములు కాంచనమ్మున, నీనిన్ రత్నముల నెల్లయెడ సంనాథా. 165

గీ. ఆగృహమ్మున నద్దేవు నంతికమున, వామభాగమ్మునం దట్లు వఱలు నంబ యతఁడు సర్వేశుఁడగుట కీసతియు చమ్ము. కారణం బొందులేమ నిక్కముగ వినుము.

వ. ఈ గృహమ్ము సహస్రయోజనాయామమ్ముగలిగి యంతరిక్షమ్మున నిరాధారమ్ముగ నుండు; నిద్దానికిఁ బ్రళయమ్మున సంకోచమ్మును సర్గమ్మున వికాసమ్మును గలుగుచుండు. 167

క. మనుజుల దనుజుల నాగుల, ననిమిషులం దెవ్వ రెవ్వ రధికోపాస్తిన్ మును సలిపి సిద్ధిగాంచిరో, యనఘులు వారిచట నుందు రారీతి దగన్. 168

క. ఘృతకుల్యలు, మధుకుల్యలు, సతతము దధికుల్యలును బ్రశస్తగతి నటన్ శతముఖకోటిఁదగఁ బాలు న. మృతకుల్యలు నొప్పుఁదేలనేకములుండన్. 169

క. ఏకోరికఁ గోరిన నిను. లోకాతీతమగు తయుపులున్ గల వెపుడున్ శో. ము రోగము జరయును, నాశమునందేని గలుగు నటలేవు నృపా. 170

క. అందఱు యౌవనవంతులు, నందఱు కాంతాసమేతు లందఱు దిగులన్ సుందరులు నచటఁ గలవా, రిందరిమే యెన్న నెంత కృతపకకేవిన్ 171

వ. కొందఱు సాలోక్యముక్తులును, గొందఱు సామీప్యముక్తులును, గొందఱు సారూప్యముక్తులును, గొందఱు సాయుజ్యముక్తులును నై యుందురని వెండియు, 172

గీ. మూర్తిమంతమ్ములగుచు నెప్పుడును సప్త. కోటిమంత్రమ్ము లగ్గుణపేటి నంబ నుతులు సల్పుచునుందు రున్నతుల కతుల. గతులు గల్గు నెవ్వారికి తగుగతి జపింప.

గీ. ఇది మణిద్వీప వర్ణనమ్ము వ్వఁదేని. దీని స్మరియింపఁ బాపముల్ మాయఁ బ్రాణ మెదలునెడ స్మృతికిఁ దగుల నిది గతియగు, సకలశుభములు నిద్దాన సంభవించు.

వ. ఈమణిద్వీపవర్ణనమ్మును నిత్యమ్ము పఠింపనగు; విశేషించి యియ్యది నూతన గృహనిర్మాణమ్ములఁ బఠించిన నట వసించు వారలకు భూతాది బాధలు దగులక కళ్యాణసమృద్ధి సులభం బగునని వెండియు. 175

## జనమేజయుఁ డంబాయజ్ఞ మాచరించుట.

క. నారాయణముని మున్నుల, నారదునకుఁ జెప్పెనిట్లు నరనాయక! యా
ఘోరకథ వచించితిని నీ, కారయ ధన్యుండవైతి వఖిలవిధములన్. 176

క. అంబామఖ మొనరించి సు, ఖంబుగ నీ జనకున కిఁకఁ గావింపుము సా
రంబైన యంబికామం, త్రంబుం గొను మిచ్చెదను యథావిధిగ నృపా! 177

క. అని యాతఁ డొసఁగు మంత్రం, బును దీక్షాపూర్వకముగ భూపతి గొని ధా
న్యుని సన్నుతులైన మునులను, బనిగొని పిలిపించి మఖము ప్రారంభించెన్. 178

క. నవరాత్రరాల మందును, లవనీసురవరులు జపము సదిగా శ్రీ భా
గవతము పఠియింపఁగ వై, భవమున మఖ మాచరించె భాగ్యాన్వితుఁడై. 179

క. సంపద నేనియు బ్రాహ్మణు, లం దనియించెన్ మఖమున లక్షల కొలఁదిన్
పింపుగను దక్షిణల నిడి, యింపు దగుగతి భోజన మిడియున్ దత్పరుఁడై. 180

గీ. అంత నారదుఁ డరుదెంచి యధిపుచే న, మర్చితుండయి వలుకు నో మానవేంద్ర!
సురగణుఁడైన నీతండ్రి సురలు గొలువఁ, జనె మణిద్వీప మంబికాసదనమునకు.

క. కృతకృత్యుఁడవైతివి నీ, కతనఁ గులంబెల్ల సుకృతఖని యయ్యె యశ
మ్ము తతంబై స్వర్గమ్మునఁ, బ్రతిలేని వికాసమునకు భాజనమయ్యెన్. 182

గీ. అనెడి నారదు వచనము లాలకించి, వ్యాసు పదములఁ బడి గద్గదారవముగఁ
బలికె జనమేజయుండు నీవలన నింత, సుకృత మలవడెఁ దండ్రి సుగతికిఁ జనియె.

క. పతియొకటి దక్కఁ బ్రత్యుప, కృతి నే నేమాచరింతుఁ గృపఁజూడుఁ డటం
చతివినయమ్మున వేఁడు నృ, పతికిన్ వ్యాసుండు పల్కె బహుకృప యెసఁగన్.

క. విను మంబామఖ మెల్లపుఁ, డొనరింపుము దేవిగొలుపు మొందొక చింతన్
గన కీడాగపతమ్మున, మనుజుఁడు మిది సర్వలోకమాన్యం బధిపా! 185

వ. అని యిప్పురాణమాహాత్మ్యంబు వేనోళ్ళ వక్కాణించి వ్యాసుండు చనియెఁ బిదప భూసురాదులును దత్కృతబహూకృతుల నలరుచు స్వనికేతనమ్ముల కరిగి రని వెండియు, 186

క. జనమేజయుండు రాజ్యం, బొనరించెఁ బ్రజలకెల్ల నున్నతసౌఖ్యం
బును గూర్చుచు భాగవతం, బును దఱచుఁ బఠించుచున్ బ్రమోద మెలర్పఁ. 187

క. శ్లోకార్ధరూపముగ మును, లోకాంబిక మొగమునుండి లోకాతిగమై
యేకత వెలువడెఁ బదపడి, శ్రీకాంతున కెది లభించెఁ గృతకృత్యతకై. 188

గీ. దాని శతకోటిపరిమితి తనర బ్రహ్మ, విస్తరించి రచించె నప్పుస్తకంబు
వ్యాసుఁడు పఠించి సారంబుదీసి పిదప, శుకునకై సంగ్రహమ్ముగా బ్రకటపరచె.

క. పదునెన్మిదివేలగు ని, య్యది బ్రహ్మ రచించినట్టి యయ్యది దేవా
స్పదమున బహువిస్తృతము గ, లదు దీని మహత్త్వముం దలమె వర్ణింపఁ. 190

క. పౌరాణికముఖమున నిది, గౌరవమలరార విని తగఁ వ్యాసుఁడుగా
వారసి యాతనికిన్ బూ, జారచనన్ సలుప జననసఫలత గలుగున్. 191

వ. ఆప్పౌరాణికునకు దక్షిణయు, హేమమాలాలంకృతంబగు గోవునుసమర్పించి యేత
దధ్యాయసంఖ్యాపరిమితమ్ముగ బ్రాహ్మణులను నట్లన సువాసినులను గుమారీపటు
సహితమ్ముగ భోజనమ్ములిడి దేవీబుద్ధిచే వస్త్రాలంకారాదులఁ బూజించి యఖండ
ఫలమ్ముల నందవచ్చు; నిప్పురాణంబు దానం బిచ్చువారలకు భూదానంబంతియు
ఫలమ్ము చేకుఱుటయకాక యిహపరసుఖమ్ములు లభించు నిది నిత్యమ్మును విను
వారికి దుర్లభం బుండదు. 192

క. కనుఁ బుత్రు నపుత్రుఁడు, ని, ర్ధనుఁ డందు ధనంబు, విద్య రాఁ గోరెడి వాఁ
డును దాని నంది తన కీ, ర్తిని లోకం బందు నెల్లదెసల న్నించున్. 193

వ. వంధ్యయుఁ గాకవంధ్యయు మృతవంధ్యయు నియ్యది విని తద్దోషముక్త యగు;
నెవ్వనియింట నిది పూజింపబడు నట లక్ష్మీసరస్వతులు వైరంబు విడిచి సంతతంబు
నిలుతురు; పిశాచాది బాధలట లేకుండు; జ్వరపరీతు నొకసరి స్పృశియించి యిది
పఠించిన నలువది దినములకది యెట్టిదియేని నిర్మూలంబగు; మాఱుమాఱులిది
పఠించిన క్షయరోగం బడఁగు. 194

గీ. ప్రతిదినము సంజవార్చి తత్పరత దీని, యందు నొకఁడేని యధ్యాయముం దగుగతిఁ
బఠనచేసెడి వారికిఁ బ్రబల జ్ఞాన, మతిశయించు విరక్తి యున్నతియుఁ గలుగు.

వ. ఇయ్యది శకునమ్ములకును నుపచరించుఁ; జతుర్నవరాత్రమ్ములను సకలమతస్థులిది
పఠించి కోర్కెలు వడయుదురు. స్త్రీ శూద్రులు మాత్రమిది పఠింపక ద్విజముఖ
మ్మున వినుట లగ్గగు; నిది వేదసారమ్మను ముఖ్యమ్మునగు పురాణంబు. 195

గీ. సచ్చిదానందరూపిణి సకలజనని, హ్రీంమయి మహానుభావ లోకేశి యఖిల
శుభవిధాయిని బుద్ధిప్రచోదనకరి, నాశ్రయింతు నుతింతు నే నహరహంబు. 197

క. అవి సూతుఁడు చెప్పిన విని, మును లెల్ల రతని విశేషముగఁ బూజలచేఁ
దనియించి సతులు సల్పియు, వినయం బలరార నిట్లు వినుతించి రొగిన్. 198

క. ధీరుఁడవై సంస్కృతియను, వారిధికిం దెప్పవై శివప్రదుఁడవునై
సారంబగు భాగవతం, బారసి వినుపించితివి కృతార్థత గలిగెన్. 199

క. అను మునుల యాదరమ్మునఁ, దనిసి చనియె సూతుఁ డంబఁ దన హృదయమునం
దనుపదముం దలఁచుచు; నిది, వినినన్ సుఖమబ్బుఁ గడు వివేకము గలుగున్.

## స్కంధాంత పద్యములు.

క. నిరుపమసాహిత్యరసా, భరణా । దోషజ్ఞమౌళివందితచరణా ।
శరణాగతశిష్యజనో, ద్ధరణైకవిలాసశీల । ధార్మికశీలా ।

ఇంద్రవజ్రా. ధీరాగ్రగణ్యార్చితధీవిలాసా ।, వారాశిగంభీర । కృపాప్రవాహా ।
శ్రీరాజితోర్వీధవశీర్షరోచి, ర్నీరాజితాంఘ్రిద్వయ । నిర్వికారా ।

క. అనవృశశర్వాణీపద, కిసలయభసలాయితాత్మ । కిల్బిషహరణ
ప్రసితాసవద్యవర్తన ।, కుసుమితసంతోష । బ్రహ్మగురుపరమేశా ।

## గద్య

ఇది శ్రీ కింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీత్యాది బిరుదాంకితులగు శ్రీ తిరుపతి వేంకటే
శ్వరులచే రచింపబడిన శ్రీ దేవీభాగవతమను మహా
పురాణమ్మునందు ద్వాదశస్కంధము
సర్వమును సమాప్తము.

సమస్త సన్మంగళాని భవంతు.

శ్రీ శ్రీ శ్రీ



# ముఖ్యమైన సవరణలు

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 10 | స్తుల్య | స్తుత్య |
| 14 | 4 | ముద్దుకో | ముద్దులకో |
| 20 | 25 | దావి | దాని |
| 20 | 28 | గొట్టు | గొట్టు |
| 26 | 2 | సక్తక | సక్తత |
| 26 | 6 | లారా | లార |
| 26 | 8 | కార | కారు |
| 28 | 7 | క్షుఁదే | త్తుఁదే |
| 31 | 16 | పఘూ | పఘూ |
| 32 | 9 | య్యుద | య్యువిద |
| 35 | 27 | డింద్రు | డిందు |
| 38 | 26 | జిపిం | జపిం |
| 50 | 18 | మలో | ముతో |
| 55 | 15 | సని | నది |
| 63 | 28 | గాలిని | గానిలి |
| 67 | 19 | వ్యాఁడు | వ్యాసుఁ |
| 72 | 22 | అట్లు | ఇట్లు |
| 98 | 15 | రన్ప | నర్ప |
| 104 | 25 | త్రవ | త్రప |
| 105 | 16 | యయ్యో | యయో |
| 108 | 12 | యథా | యాథా |
| 109 | 25 | విదుర | నిదుర |
| 110 | 15 | బాహు | బహు |
| 111 | 11 | యడగి | యడిగి |
| 115 | 23 | రాలా | లారా |
| 118 | 10 | త్రవిభా | త్రభా |
| 126 | 20 | విష్ఠుం | విష్టుం |
| 126 | 27 | త్వబు | త్వమేబు |
| 133 | 12 | కార్యం | కారం |
| 140 | 8 | సుధా | శుధా |
| 143 | 4 | నగర | నగ |
| 150 | 22 | భయనా | భయదా |
| 151 | 21 | మ్ముశే | మ్మునశే |
| 156 | 26 | మాదిరి | మాది |
| 157 | 22 | రవి | కవి |
| 158 | 9 | పంచచా | పంచిబా |
| 168 | 12 | ణ్యాతు | ణ్యాట్మ |
| 182 | 20 | ములసు | గతుఁ |
| 187 | 14 | గారిజే | కారిజే |
| 193 | 19 | చముల | చనముల |
| 194 | 12 | క్షుప్ర | క్షుఃప్ర |
| 213 | 9 | సిత్వ | న్విత |
| 227 | 20 | శ్రీ | క్రీ |
| 227 | 21 | కా | దా |
| 230 | 20 | గ్రిశు | గిశు |
| 235 | 27 | సుధ | శుధ |
| 243 | 2 | మఱినె | మఱియునె |
| 253 | 18 | సుము | సము |
| 256 | 13 | విష్టు | విష్ఠు |
| 257 | 26 | దాబూతు | దాబూరు |
| 271 | 5 | గర్భియ | గర్భిణీయు |
| 276 | 21 | పఁడే | పఁడే |
| 276 | 28 | దుఁన | దుఁడ |
| 281 | 5 | అంత | అంత |
| 286 | 26 | దుష్ట | దుష్ట |
| 288 | 22 | నౌక్రీ | నౌక్రీ |
| 301 | 8 | స్పేదన | నేర్పన |
| 303 | 12 | మిరిగి | మిగిరి |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 306 | 18 | లని | లన్ని |
| 310 | 16 | వతి | పతి |
| 325 | 5 | కుంజగదంజ | కుజగదంబ |
| 331 | 21 | నిష్ట | యష్ట |
| 352 | 7 | యో | యా |
| 352 | 15 | గిత | గద |
| 354 | 17 | మన | మను |
| 356 | 8 | వటి | వడి |
| 360 | 25 | పోలి | పొలి |
| 371 | 27 | ర్తు ఎ | ర్తునెవ్వ |
| 376 | 25 | దయు | దము |
| 397 | 4 | గౌని | గౌన |
| 398 | 7 | జీన | జీవ |
| 408 | 22 | లదీ | లజ |
| 413 | 17 | యుం | యుల |
| 421 | 11 | మరి | మది |
| 424 | 6 | ష్కార్య | ష్యార్క |
| 433 | 11 | ద్వీప | ద్వీప |
| 433 | 25 | చిత | చిత్ర |
| 434 | 19 | బును | బునను |
| 440 | 25 | సప | సంప |
| 443 | 27 | హీంబ | హీనబ |
| 445 | 26 | రంబు | రంబు |
| 447 | 22 | నతం | నంత |
| 449 | 22 | నృసా | నృపా |
| 450 | 6 | వంతస్ | చింతస్ |
| 452 | 2 | నిరో | నితో |
| 452 | 11 | డదై | దనై |
| 461 | 23 | నిన్మ | విన్మ |
| 467 | 20 | ఫర | ఫల |
| 468 | 5 | బాబు | బాం |
| 469 | 18 | షూన్య | బూన్య |
| 470 | 6 | నయిబ | నయన |
| 472 | 6 | మన్య | మన్క్య |
| 488 | 12 | పగ | పంగ |
| 491 | 18 | ద్రున్జ | ద్రున్దనూజున్జ |
| 493 | 1 | పీ | నీ |
| 500 | 13 | వయ్యో | వయ్యె |
| 501 | 12 | విబు | విదులు |
| 505 | 12 | లారా | లార |
| 512 | 12 | ద్దిత | ద్దత |
| 526 | 3 | బధు | బంధు |
| 529 | 24 | పతి | ప్రతి |
| 546 | 4 | రచి | రని |
| 547 | 12 | యు, యి | యు, జననియి |
| 547 | 14 | కతద | కతన |
| 550 | 19 | టత | తట |
| 553 | 15 | ష్ఠ | ష్ఠ |
| 560 | 9 | తత్ప | త్వత్ప |
| 564 | 2 | ఖము | ఖమ్ము |
| 568 | 18 | టియ | టియు |
| 571 | 20 | నిసం | నివాసం |
| 573 | 8 | రులజ | రులున్ |
| 581 | 27 | నుంటా | న్యుంటా |
| 583 | 13 | నాయ్యా | నయ్యా |
| 590 | 19 | త్రాఁకు | తాఁకు |
| 600 | 19 | ర్పురు | ర్పుచు |
| 606 | 28 | ఘువి | ఘువి |
| 607 | 27 | నిపు | పిప |
| 610 | 18 | బను | బుమ |
| 613 | 23 | అనునా | అనా |
| 617 | 1 | విదుఁడు | విదుఁడు |
| 620 | 18 | దయు | దయ |
| 621 | 4 | సేన్య | సేశ్య |
| 621 | 8 | యుందు | యుందు |
| 626 | 4 | రివి | వివి |

